# మహీపీఠము

అద్దంకి సీతారామశాస్త్రిచే
విరచితము



చెన్నపట్టణం, అడయారునందు వసంతాఇన్‌స్టిట్యూటు వారిచే ప్రచురితము

# మహాపీఠము

అద్దంకి సీతారామశాస్త్రిచే

విరచితము

చెన్నపట్టణం అడయారునందు వసంతా ఇన్‌స్టిట్యూటువారిచే ప్రచురితము

1934

వెల 1-0-0] [తపాలాకూలి వేరు

# అవతారిక

ఆత్మవిచారము అను పుస్తకమును వ్రాసినవెనుక మరికొన్ని విషయములనుగురించి వ్రాయవలయునని పదే పదే తోచుచుండినది. అయినను అవకాశము దొరకలేదు గనుక వ్రాయుట మానుకోవలసి నదిగా నేర్పడినది. దేహారోగ్యముచాలక అనుస్యూతముగా విషయ ములను ఏర్పరిచి వ్రాయుటకు కొన్ని అసందర్భములును బుద్ధికుశల తయు చాలక శ్రమపడుచుంటిని. అయినను చెప్పబోవు సంగతులపైకి కొన్నియైనను కొందరికైనను ఉపయోగించునేమో అను తలంపును ముందిడికొని ధైర్యముతో ఈ పుస్తకమును వ్రాయుటకు పూను కొంటిని. ముందువ్రాసిన ఆత్మవిచారమునందువలెనే ఈ గ్రంథము భాషాశైలి సౌష్ఠవమునందురిత్తవోయి యున్నది. అరవదేశము నందు పుట్టిపెరిగినవాడు వ్రాసినగ్రంథము అని గ్రంథకర్తను చదు వరులు మన్నించి విషయములయొక్క ముఖ్యతను పరిశీలింతురని వేడుచున్నాను.

మహీపీఠము అను పదము యోగవాసిష్ఠమునందు ఉన్నది. ఉన్నను అనేక పండితులు ఆ మాటనైనను వినియున్నారా అను సందేహము నాకు కలిగినది. ఇటీవల పదునైదు సంవత్సరముల కాలము అనేకమంది సాహిత్యపండితులు వేదాంతపండితులు ఇట్టి వారితో నేను విషయములనుగురించి చర్చచేసినపుడు మహీపీఠము అను పేరైనను వారల జ్ఞాపకమునందు లేదని నాకు తెలియవచ్చి నందున ఆ పదమును లోకులకు నొక్కిచెప్పి తెలియపరచవలెనని యీ గ్రంథమునకు మహీపీఠము అని పేరుపెట్టితిని.

జ్ఞానావతరణము, బ్రహ్మాండము, వేదములు మొదలగు విషయ ములనుగురించి మొదటి అధ్యాయమునందు వ్రాసి ఆంతరంగిక పరి పాలకవర్గము అనియు దేవతలయొక్క కార్యములు అను వివరములను గురించియు రెండవ అధ్యాయమును వ్రాసితిని.

జీవాత్మ, మనస్సు మొదలగు నింద్రియములు, వాసనలు, పురుషకారము, అహంకారము, తృష్ణ, సంగము, మనోభావములు మొదలగు విషయములనుగురించి నేను చదివినంతవరకు కొన్నిసల హాలనుగురించి వ్రాసి దానిని మూడవ అధ్యాయముగా చేసితిని.

ప్రవృత్తినివృత్తిమార్గములు అనుపేర నాలుగవ అధ్యాయ మును వ్రాయుచు నేను ఏ త్రోవన నడిచి చదివి చదివి యితరులకు చెప్పగల విషయములను కొన్నిటిని నేర్చుకొంటినో అట్టి దివ్యజ్ఞాన సమాజముయొక్క ఉపయోగమునుగురించియు అందలి బోధలను గురించియు ఇదివరకును తెనుగుభాషయందు క్రోడీకరించి చెప్పి యుండని విషయములను కొన్నిటిని ఎంతమాత్రము లోకులకు తెలియపరచుటకు అర్హమో అన్నిసంగతులను భాషయందు ప్రా వీణ్యత ఉండునంతవరకును కపటములేక వ్రాసితిని.

అయిదవ అధ్యాయమునందు కర్మక్షయమునుగురించి వ్రాసి ఉపసంహారాధ్యాయముగా నాఱవ అధ్యాయము వ్రాయబడినది.

గురువులవారు అనువిషయమునుగురించి పదే పదే నాలుగవ అధ్యాయమునందు వ్రాయుచు గురుదేవులవారు అను పదమును అనేకమార్లు ఉపయోగించియున్నాను. నా ఉద్దేశము గురుదేవుల వారు అనగా జీవన్ముక్తగురువులవారినే గురుదేవులు అనుట. మధ్య వర్తిగురువులను గురువులవారు అని యుపయోగించి యున్నాను. శ్రీ గురువులవారికి అనేకశాస్త్రములయందు అనేకసంజ్ఞావాచక ములు గలవు. గురుః, ఆచార్యః, ఆరాధ్యః, దేశికః, స్వామీ, మహే శ్వరః, శ్రీనాథః అను పేళ్లు అనేక గ్రంథములందు అనేక స్థలముల యందు ఉపయోగించబడియున్నవి. ఈ అడుగున కనపరచియుండు గురుధ్యానశ్లోకములయందు ఆ నామములకు వ్యుత్పత్తి వ్రాయపడి యున్నది.

నమస్తే నాథ భగవన్ శివాయ గురురూపిణే ।
విద్యావతారసంసిద్ధ్యై స్వీకృతానేక విగ్రహ ॥
నారాయణస్వరూపాయ పరమాత్మస్వరూపిణే ।
సర్వాఽజ్ఞానతమోభేదభానవే చిద్ఘనాయ చ ॥
సర్వజ్ఞాయ దయాక్లృప్తవిగ్రహాయ శివాత్మనే ।
పరత్రేహ చ భక్తానాం భవ్యానాం భావదాయినే ॥
పురస్తాత్ పార్శ్వయోః పృష్ఠే నమః కుర్యా ముప ర్యధః ।
సదా సచ్చిత్తరూపేణ విధేహి తవ దాసతాం ॥
గకారః సిద్ధిదః ప్రోక్తో రేఫః పాపస్య దాహకః ।
ఉకారో విష్ణు రిత్యుక్తః త్రితయాత్మా గురుః పరః ॥
గకారో జ్ఞానసంపత్తి రేఫ స్తస్య ప్రకాశకః ।
ఉకార శ్శివతాదాత్మ్యం గురు రిత్యభిధీయతే ॥
గుహ్యాగమార్థ తత్త్వార్థ సంధానాత్ బోధనా దపి ।
రుద్రా ది దేవరూపత్వాత్ గురు రిత్య భిధీయ తే ॥
స్వయ మాచరతే శిష్యాన్ ఆచారే స్థాపయ త్యపి ।
ఆచినోతీ హి శాస్త్రార్థాన్ ఆచార్య స్తేన కథ్యతే ॥
చరాచరసమాసన్న మధ్యాపయతి యః స్వయం ।
యమాదియోగసిద్ధత్వాత్ ఆచార్య ఇతి కథ్యతే ॥
ఆత్మభావప్రదానా త్తు రాగద్వేషాదివర్జనాత్ ।
ధ్యానైక నిష్ఠచిత్తత్వాత్ ఆరాధ్య ఇతి కథ్యతే ॥
దేవతారూపధారిత్వాత్ శిష్యానుగ్రహకారణాత్ ।
కరుణామయమూర్తిత్వా ద్దేశికః కథితః ప్రియే ॥
స్వాంతశ్శాంతి సమున్మీలత్ పరతత్త్వార్థచింతనాత్ ।
మిథ్యాజ్ఞానవిహీనత్వాత్ స్వా మీతి కథితః ప్రియే ॥
మనోదోషాదిదూరత్వాత్ హేతువాదాదివర్జనాత్ ।
శ్వాదిప్రాణిషు సాదృశ్యాత్ రమ్యత్వా చ్చ మహేశ్వరః ॥
శ్రీమోక్షజ్ఞానదాతృత్వాత్ నాదబ్రహ్మాత్మబోధనాత్ ।
స్థగితాజ్ఞాన చిహ్నత్వాత్ శ్రీనాథః కథితః ప్రియే ॥

(కులార్ణవము)

ఇట్లు గురువులవారి ధ్యానమును వారి పర్యాయనామధేయముల వ్యుత్పత్తియు వ్రాయబడినది. శ్రీ కృష్ణాజిగారు గురువులు అవశ్యము లేదు అని బోధించుచున్నట్లు కొందరు వాదించగా వినియున్నాను. శ్రీ శంకరాచార్యులవారుకూడ గురువులు మార్గప్రదర్శకులేగాని వ్యాసంగముచేసి గట్టుకెక్కవలసినది ఉపాసకుడే అని బోధించి యున్నారు. ఒక భూమికవరకును గురువులవారు కావలసియున్నది అని నా అభిప్రాయము. నా ఉపాసనయు అదే. కనుక గురువుల వారినిగురించి అనేకముగా గ్రంథమునందు వ్రాయబడియున్నది. నేను ఉండుపదవికంటె అధికమైనపదవి నెక్కినవారికి ఈ గ్రంథముతో నక్కరలేదు. వారిని ఉద్దేశించి యీ గ్రంథము వ్రాయబడలేదు. నావంటివారికి నాకన్న తక్కువనేర్పరులకే యీ గ్రంథము ఉపయోగించును. కనుక శ్రీ కృష్ణాజిగారి బోధ ఎవరిని ఉద్దేశించి చేయబడినదో నాకు నిష్కర్షగా తెలియదు. అయినను శ్రీ కృష్ణాజిగారు పరమగురుచరణసన్నిధి అను గ్రంథమును వ్రాసినపుడు వారికి గురుదేవులవారితో అక్కరయుండినట్టు వ్యక్తపడుచున్నది. ఆ పదవిని పొందువరకును గురుదేవులవారు అవశ్యము అని గురుదేవులవారు అను అంశము "సుతీర్థాదానీతం" అని అంగీకరించి ప్రేమించి ధ్యానించి ఉపన్యసించుచున్నాను.

ఈ గ్రంథరచనయందు 'కిం వా బహు నోక్తేన' అని నాకు సహాయపరులుగానుండిన నా సహాధ్యాయులు, స్నేహితులు హితులునైన చిట్టమూరు సుబ్బరాయడు పంతులుగారికి నా నమస్కృతులను సమర్పించుచున్నాను.

ధైర్యముచేసి గ్రంథమొకటిని వ్రాయుశక్తిని యిచ్చిన మాతృశ్రీ ఆనిబిసంటమ్మగారికిని వారి సహాధ్యాయులుగానుండిన శ్రీ లెడ్బీటరుగారికిని నా కృతజ్ఞత తెలుపుచు ఈ గ్రంథమును వారలు ఇరువురికిని సమర్పించుకొనుచున్నాను. వారల దీవనలవల్ల ఈ గ్రంథము నుండి లాభముచెందబోవు చదువరులకును నా నమస్కారములు.

అడయారు దివ్యజ్ఞానసమాజము.
శ్రీభవనామ సంవత్సర కార్తిక.
శు. పౌర్ణమి

అ. సీ.

# విషయసూచిక

పుట

## ౧ వ అధ్యాయము





M B

## ౨ వ అధ్యాయము



## ౩ వ అధ్యాయము

## ౪ వ అధ్యాయము

---

బ్రహ్మవిద్యాసభాపతయేనమః

యః పుణ్యైః దేవతానాం సమజని శివయోః శ్లాఘ్యవీర్యైకమత్యాత్ ।
య న్నామ్ని శ్రూయమాణే దితిజభటఘటాః భీతిభారం భజంతే ।
భూయా త్సోఽయం విభూత్యై నిశితశరశిఖాపాటిత క్రౌంచశైలః ।
సంసారాగాధకూపోదరపతితసముత్తారకః తారకారిః ॥

ఓం గురుదేవాయనమః

# మహీపీఠము

ఈ విషయమునుగురించి ఆత్మవిచారము ఉత్తరభాగము, 73 వ పుటయందు అతి సంగ్రహముగా వ్రాయబడియున్నది. అక్కడ వ్రాయబడియుండు సంగతులు అతి సంగ్రహములుగా నున్నందునను మహీపీఠమునుగురించి వివరములు పుష్కలముగా తెలిసికొనవలసినది అవశ్యము అని తోచినందువల్లను మహీపీఠము అనగానేది ఎక్కడినుండి వచ్చినది ఎందువల్ల వచ్చినది ఏ కార్యమును ఉద్దేశించి వచ్చినది అను విషయములనుగురించియు మహీపీఠము తాను అవతరించిన కార్యమును ఏ విధముగా నడిపించుచున్నది అనియు మహనీయుల సమూహముతో వెలయుచున్న మహీపీఠము యొక్క భాగములు ఏ యే భాగము ఏ యే చర్యను ఏ విధముగా నడిపించుచున్నది అనుమొదలుగా గల వివరములను నాకు తెలిసినంతవరకును నాయొక్క భ్రాతృవర్గమైన ఆస్తికుల ఉపయోగమునకుగా ఈ గ్రంథమును వ్రాయుచున్నాను.

## అధ్యాయము—౧

### యోగవాసిష్ఠము

మహీపీఠముఅను ప్రస్తావము యోగవాసిష్ఠము అను గ్రంథము నందు ఉన్నది. యోగవాసిష్ఠమును గురించి కొంత వ్రాయవలయు నని తోచుచున్నది. ఇది శ్రీ వాల్మీకిమహర్షి ప్రణీతంబు. వసిష్ఠ మహామునిచే శ్రీరామచంద్రులవారికి చేయబడిన తత్త్వోపదేశము. ముప్పదిరెండు వేల శ్లోకములుకలది. దీనికి గురుజ్ఞానవాసిష్ఠము అని వేరుపేరుకలదు. అనేక అపూర్వవిషయములను బాలురమనస్సునకు అవగాహన అగునట్లు సులభశైలితో చేయబడిన ఉపదేశము.

దశరథమహారాజు తన కుమారులకు ఉపనయనముచేసి విద్యాగృహము అనగా బ్రహ్మచర్యాశ్రమోచితమైన గురుకులమునందు వసియించి విద్యాభ్యాసము జరుపుటకు తన కుమారులను గురుకుల వాసమునకు పంపెను. నియమము ప్రకారము గురుకులవాసమును ముగించి తమ్ములతోకూడ శ్రీరామచంద్రుడు తన తండ్రియింటికి వచ్చి కొంతకాలము సుఖముగానుండెను. అటుపిమ్మట కొన్ని దినములకు

#### తీర్థయాత్ర

తీర్థాని దేవసదనాని వనా న్యాయతనాని చ ।
ద్రష్టు ముత్కంఠితం తాత మమేదం మానసం ప్రభో ॥
త దేతా మర్థితాం పూర్వాం సఫలం కర్తు మర్హసి ।
న సోఽ స్తి భువనే నాథ త్వయా యోఽర్థీ న మానితః ॥

తీర్థయాత్రగా దేశసంచారము చేయునభిప్రాయమును తన తండ్రి గారగు దశరథమహారాజుతో విజ్ఞాపనచేసికొనెను. దశరథమహారాజు వసిష్ఠమహామునియొక్క అనుజ్ఞనుపొంది శ్రీరామచంద్రుని తమ్ముల తోకూడ తీర్థయాత్రకు పంపెను. తీర్థయాత్ర సందర్భమున

శుభే నక్షత్రదివసే భ్రాతృభ్యాంసహ రాఘవః ।
మంగళాలంకృతవపుః కృత స్వస్త్యయనో ద్విజైః ॥

శుభనక్షత్రముతో కూడిన దినమునందు శ్రీరామచంద్రుడు ఇద్దరు సహోదరులతో సహా తీర్థయాత్ర వెడలెను. శ్రీరామచంద్రులవారికి ౧. లక్ష్మణుడు, ౨. భరతుడు 3. శత్రుఘ్నుడు అని ముగ్గురు సహోదరులు ఉండగా ఇద్దరు సహోదరులు అని ద్వివచన "భ్రాతృభ్యాం" అను పదమును ఉపయోగించియున్నారు. శ్రీరామచంద్రులవారితో కూడ తీర్థయాత్రకు భరతుడు వెళ్లలేదని

రామానుయాయిని తథా శత్రుఘ్నే లక్ష్మణేపి చ ।
భరతే సంస్థితే నిత్యం మాతామహగృహే సుఖం ॥

యోగవాసిష్ఠము వైరాగ్యప్రకరణము అయిదవ అధ్యాయమునందు చెప్పియున్నది.

తీర్థయాత్ర సందర్భమున దేశాటనమొనరించి శ్రీరామచంద్రుడు జనులు అజ్ఞానమునందు మునిగి అనేకకష్టములపాలై దుఃఖము ననుభవించుచుండుటను కనుగొని అందుకు తాను చేయతగిన సహాయ మేమియు లేనందున విచారగ్రస్తుడై నిర్వేదచింతాదుఃఖములను తెలియచేయు కార్శ్యావస్థను పొందియుండెను. దినదినమును లోకులకుగా వగచుచు కృశించుచు సుఖములను ఉపేక్షచేసి దుఃఖించి చింతించి దైన్యముచెందుచుండెను. అపుడు అంతఃపురవాసులు శ్రీరామచంద్రులవారి దుఃఖాక్రాంతస్థితిని క్రమేణ దశరథ మహారాజునకు నివేదించిరి; అపుడు తండ్రియగు చక్రవర్తి సర్వసుఖములతో నిండియుండు అంతఃపురము ఉండగా తన పుత్రునికి ఎందుకు దుఃఖము అని వగచి కుమారుని తన సమీపమునకు పిలిచి తొడపై కూర్చోపెట్టుకొని

కా తే పుత్ర ఘనా చింతేఽత్యేవం రామం పునః పునః ।
అపృచ్ఛత్ స్నిగ్ధయా వాచా నైవాఽకథయ దస్య సః ॥

అయ్యా కుమారా నీకు ఏమో ఘనమైన చింతకలిగియున్నది. అది ఎందుకుగా నను వివరమును నాకు తెలియచేయుము అని మరల మరల బుజ్జగించి వేడుకొన్నను చక్రవర్తిచేత లోకదుఃఖమును పోగొట్టుటకు సాధ్యముకాదని తలచి తన చింతాక్రాంతమనస్సుయొక్క

వివరమును చెప్పకపోయెను. అయితే కార్శ్యము మాత్రము పెరుగుచునే యుండెను.

విశ్వామిత్రమహాముని రాక

ఇట్లుండగా విశ్వామిత్రమహర్షి దశరథమహారాజును చూచుటకుగా అయోధ్యానగరమునకు వచ్చెను. దశరథచక్రవర్తి తపస్సంపన్నుడై జాజ్వల్యమాన తేజస్సుతో ప్రకాశించుచుండు విశ్వామిత్రమహర్షికి ఉచితాసనమును ఇచ్చి సత్కరించి విధ్యుక్త రీత్యా అర్చనముచేసి సంతోషించినవాడై అంజలీబద్ధుడై విశ్వామిత్రునితో ఈ అడుగున కనినవిధముగా పలికెను.

"మునీంద్రా ఆద్యంతములు లేనిదియు నాశరహితమైనదియు అగు బ్రహ్మానందము ఇపుడు తమ దర్శనమువలన నాకు కలిగినది. తమకు ముఖ్యమైనకోరిక ఏది. నేను తమకు ఏమి సత్కారము చేయగలను. సంకల్పము, భయము, క్రోధము, రాగము, వ్యాధి అను కష్టములు ఎరుగని తాము నన్నుగురించి ఇచ్చటికి దయ చేయుట మిక్కిలి ఆశ్చర్యము. తమ కేమిపని ఉద్దేశమో ఎందునుగురించి ఇచ్చటికి విచ్చేసితిరో అ ఉద్దేశము నెరవేరినదనే నమ్ముడు. తాము మిక్కిలి పూజ్యులు గనుక తమ కోరికను నెరవేర్చెదను." అని పలుమారు మనివి చేసుకొనెను.

అందుకు విశ్వామిత్రమహర్షి ఇట్లు పలికెను.

"ఇట్టి ఉదారగుణములును వాక్కులును శ్రేష్ఠమైన వంశమునందుపుట్టిన నీకే తగును. మరియు వసిష్ఠమహామునియొక్క శిక్షయందుండు నీవు వేరువిధముగా పలుకగలవా. పురుషశ్రేష్ఠా వినుము. ఒక కార్యమును ఉద్దేశించి ఆ కార్యము సిద్ధి చెందునట్లు కావలెనని ఆశగొనియున్నాను. నాయొక్క నియమమునకు భయంకరులైన రాక్షసులు విఘాతకర్తలుగా నేర్పడియున్నారు. వారలచేత పీడితుడనై శరణుగోరివచ్చిన నన్ను రక్షించుము. నీకు శ్రీరాముడు అని యొక కుమారుడు కలడు.

అతడు వ్యాఘ్రముయొక్క పరాక్రమమువంటి పరాక్రమము గలవాడు. వీర్యమునందు ఇంద్రునితో సమానుడు. నీ కుమారుడు రాక్షసులను నశింపజేయు శక్తిగలవాడు. వ్యర్థముకాని పరాక్రమము కలవాడు. శూరుడు. అట్టి కుమారుని నాకు నీవు ఇయ్యవలయును. నేను అతని రక్షించగా విఘ్నకారులగు రాక్షసులను అతడు దివ్యమైన తన బలముచే నశింపజేయగలడు. రాజా పుత్రనిమిత్తమైన ప్రేమను వదలుము. ఈ లోకమునందు మహాత్ములకు ఇయ్యదగనివస్తువే లేదు. నీ పుత్రుడు రాక్షసులను గెలుచును అని దృఢముగా నమ్మియున్నాను. మాబోటి జ్ఞానులు సందేహముతో నిండిన కార్యములను చేయుటకు ప్రయత్నపడరు. కమలపత్రాక్షుడగు శ్రీరాముడు మహానుభావుడు అని నేను తెలిసికొనియున్నాను. మహాతేజోవంతుడైన వసిష్ఠమహర్షియు ఇతర దీర్ఘదర్శులును శ్రీరామునియొక్క ప్రభావమును తెలిసికొనియుందువారలే.

నాఽత్యేతి కాలః కాలజ్ఞ యథా ఽయం మమ రాఘవ ।
తథా కురుష్వ భద్రం తే మా చ శోకే మనః కృథాః ॥
కార్య మ ణ్వపి కాలే తు కృత మేత్యు పకారతాం ।
మహ దప్యు పకారోఽ పి రిక్తతా మే త్యకాలతః ॥

ప్రకృతకాలమువలె కాలము మరల రానేరదు. కనుక నా ప్రార్థనను అంగీకరించి అనుగ్రహించవలెను. మనస్సును దుఃఖముపాలు చేసికొనకుము. స్వల్పసహాయమైనను సకాలమునందు చేయబడెనేని అధికఫలము నిచ్చును. పెద్దసహాయమైనను కాలము మీరినపిమ్మట చేయబడెనేని నిష్ఫలమగును. ధర్మము, మహిమ, కీర్తి అనువాటిని పోగొట్టుకొనకూడదని నీవు తలచితివేని నీ ప్రియపుత్రుని నా వెంబడి పంపుదువుగదా” అని చెప్పెను.

ఈ కథాభాగము శ్రీమద్రామాయణకథను విన్నవారికి తెలిసేయున్నది. కనుక ముఖ్యముగా ఈ గ్రంథమునకు సంబంధించిన విధ

మును వ్రాయుచున్నాను. వసిష్ఠమహర్షి దశరథునకు ధైర్యముచెప్పి విశ్వామిత్రమహాముని వెంబడి శ్రీరామచంద్రుని పంపుటకు ఇష్టపడునట్టు చేసెను. లోకవ్యవహారము తెలియని శ్రీరామచంద్రుని లోకవ్యవహారవేత్తగా చేయుటకు విశ్వామిత్రమునీశ్వరునికంటె ఈ లోకమునందు వేరెవ్వరుగలరు, అను మొదలగు ఊరడింపుమాటలను చెప్పి శ్రీరామచంద్రులవారిని రాజసభలోనికి పిలిపించునట్టుచేసెను. ఆ నిమిషమునందే శ్రీరామచంద్రుడు సభలోప్రవేశించి మొట్టమొదట తండ్రికి, మహనీయులైన విశ్వామిత్ర వసిష్ఠులకు పిమ్మట బ్రాహ్మణులు మొదలగువారికి ప్రణామంబులు ఆచరించెను. అపుడు దశరథమహారాజు పుత్రా నా తొడపై కూర్చుండుము అని చెప్పుచుండగా నేలపైపరిచియున్న ఆస్తరణముపై కూర్చుండెను. అపుడు వసిష్ఠులవారు చెప్పినదేమనగా మహాబాహూ శ్రీరామచంద్రా నీవు శూరుడవు. మోహామునకులోపడి దుఃఖించెద వేల అని అడిగెను. అంతట విశ్వామిత్రమహాముని పలికెను. శ్రీరామా నీ మనస్సు ఎందుకుగా వ్యథచెందియున్నది. ఆ వివరము తెలియచేయుము. నీ దుఃఖములను మాన్పు నుపాయమును తెలియచేసెద.

## శ్రీరామచంద్రుని మనోవ్యథ

ఈ మాటలను విని శ్రీరామచంద్రుడు తన గాఢవ్యాకులమునకు కారణములను ఈ క్రిందకనుపరచినట్లు తెలియచెప్పెను.

“ నేను తీర్థయాత్రముగించి యిల్లుచేరితిని. సంసారము ఎట్టి సుఖమును ఇచ్చును. జనము చచ్చుచు పుట్టుచు నుండునుగదా. ఐశ్వర్యము నిచ్చునని తలువబడు అశాశ్వతములైన పదార్థములు అపదలకు కారణము లగుచున్నవి. కనుక నాకు రాజ్యముతో నేమి, భోగముతో నేమి, నేను అనబడువాడు ఎవ్వరు, జగత్తు సత్యమా మిథ్యయా. ఇట్లు విమర్శించు నాకు ఎల్లవిషయములందును నిరుత్సాహము కలిగినది. ఈ సంసారదుఃఖము ఎట్లు ఉపశమించును. అను చింతచే శ్రమపడుచున్నాను. ఈ సంసారమునందు గొప్పగా

నెంచబడు ఐశ్వర్యముకూడ సుఖమును ఈయదు. పండితులును శూరులును తమకు ఒకరుచేసిన మేలును మరువనివారును సమర్థులును మృదువగు స్వభావముగలవారును ఐశ్వర్యము ప్రాప్తించగా కఠినులగుచున్నారు. లోకనిందకు పాలుగాని సంపన్నుడు ఆత్మస్తుతిచేసికొనని శూరుడును సమదృష్టిగల ప్రభువును ఈ ముగ్గురును దొరకరు. అహంకారమువలననే ఆపదలు కలుగును. అహంకారమువలననే మనోవ్యాధులు కలుగును. అహంకారమువలననే కోరికలు కలుగును. మునీంద్రా నేను కనుగొన్నందులో లోక ఆపదలు క్షణములోనే వచ్చును. సంపదలుకూడ క్షణమాత్రములోనే వచ్చును. ఇందువలన నా మనస్సు చాల నొచ్చియున్నది ”

ఇట్లు శ్రీరామచంద్రుడు పలుకుచుండగా సభలోనున్నవారు ఆశ్చర్యముతో వినుచుండిరి. సభలోనుండిన మునిశ్రేష్ఠులు శ్రీరామచంద్రుని వాక్యములను విని ఈ బాలునికి ఇంతటి వైరాగ్యయుక్తమైన పరితాపము ఉన్నదికదా అని ఆశ్చర్యపడిరి.

విశ్వామిత్రమునీశ్వరుడు శ్రీరామచంద్రునితో నిట్లనియె,

జ్ఞానవంతులలో శ్రేష్ఠుడవగు శ్రీరామచంద్రా నీవు తెలిసికొనవలసిన అంశములులేవు. నీవు సూక్ష్మబుద్ధివి. సకలమును ఎఱుంగుదువు. అయినను ,, పూర్వము నాకును జ్ఞానవైరాగ్యసంపన్నుడైన వసిష్ఠమునికిని బ్రహ్మదేవుడు ఏ జ్ఞానోపదేశమును చేసిరో ఆ జ్ఞానమునే వసిష్ఠమహాముని నీకు ఉపదేశముచేయుగాత అని పలికెను ”.

అపుడు సభలోనుండిన వేదవ్యాసులు నారదులు మొదలగు మహర్షులు బ్రహ్మదేవుడు ఉపదేశించిన జ్ఞానమును ఉపదేశించుట సరి సరి యని పలికిరి. ఇంతటితో మొదటిదినము అస్తమించెను.

ఇక జ్ఞానోపదేశము చేయుటకుగా సభ ఏవిధముగాకూడినది అను సంగతి విచారింతము. ఈ సభకూడినది త్రేతాయుగాంతమునందు. ఇప్పటికి ఎనిమిది లేక తొమ్మిది లక్షలసంవత్సరములై యుం

డును కదా. ఆ కాలమందలి విధానములు నేటివరకును భరత ఖండమునందు జరుగుచున్నవి.

సభకూడుట

సభలో వక్తగానుండు వసిష్ఠమహామునిని సభకు పిలుచుకొని వచ్చుట మర్యాద. కనుక

ప్రాతఃస్నానవిధిం కృత్వా సంపాద్య భ్రాతృభిః పునః ।
ప్రహితాల్పపరివారో వసిష్ఠసదనం యయౌ ॥

శ్రీరామచంద్రుడు బ్రాహ్మముహూర్తమున నిద్రలేచి ప్రాతఃస్నానము సంధ్యావందనము మొదలగు అనుష్ఠానములను ముగించుకొని తనకు చాల ఆప్తులతోను సహోదరులతోను స్వల్పపరివారముతో వసిష్ఠమునిగారి బసకు వెళ్లిరి.

సమాధిసంస్థమేకాంతే మునిమాత్మపరాయణం ।
దూర ఏవాఽననామా సౌ రామో వినతకంధరః ॥

ఆవేళకే వసిష్ఠమునిగారు స్నానాద్యనుష్ఠానములను ముగించుకొని సమాధియందుండిరి. కనుక దూరాన నిలపడి శ్రీరామచంద్రుడు తలనుమాత్రము వంచి నమస్కారము (మనసా) చేసి

తం ప్రణమ్యాంగణే తస్థుః తస్మింస్తే వినయాన్వితాః ।
యావత్తమసమాలూనం వ్యక్తం దిఙ్ముఖమండలం ॥

పైనచెప్పిన విధముగా వసిష్ఠమహామునికి నమస్కరించి అచ్చటినుండి ముంగిటిలోకివచ్చి చీకటి వెలుతురుపడి దిక్కులు వ్యక్తముగా తెలియునంతవరకును వినయాన్వితులుగా కాచియుండిరి.

రాజానో రాజపుత్రాశ్చ ఋషయో బ్రాహ్మణాస్తతః ।
ఆయయౌ సదనం మానం బ్రహ్మలోకమివామరాః ॥

అంత రాజులు రాజులపుత్రులు ఋషులు బ్రాహ్మణులు ఒకరొకరుగా అచ్చటికివచ్చి నిశ్శబ్దముగా (మాటలాడి శబ్దముచేయక) కాచియుండిరి.

త ద్వసిష్ఠసదనం బభూవ జనసంకులం ।

ఈ విధముగా వసిష్ఠులవారి బసయందు జనసమూహము కూడెను.

క్షణా ద్వసిష్ఠో భగవాన్ విరరామ సమాధితః ।
ఆచారే ణోపచారేణ జగ్రాహ ప్రణతం జనం ॥

ఆ సమయమునకు వసిష్ఠులవారు సమాధిని చాలించి జనసమూహమునకు దర్శనమిచ్చి జనులందరునుచేసిన నమస్కారములను ప్రియ వచనాది ఉపచారములతో నంగీకరించిరి.

తథాऽనుగమితో మునిభిః విశ్వామిత్రాన్వితో మునిః । ఆరురోహ రథం శ్రీమాన్ సహ సాబ్జ మి వాబ్జజః ॥ వివే శావనతాం తత్ర రమ్యాం దాశరథీం సభాం । హంసయూథానువలితో రాజహంస ఇవాం జనీం ॥ వివిశు స్తత్ర తే సర్వే నృపా ధశరథాదయః । వసిష్ఠాద్యా శ్చ మునయో ఋషయో బ్రాహ్మణా స్తథా ॥ మంత్రిణ శ్చ సుమంతాద్యాః సౌమ్యాద్యా శ్చ విపశ్చితః । రాజపుత్రా శ్చ రామాద్యాః మంత్రిపుత్రాః శుభాదయః ॥ అమాత్యాద్యాః ప్రకృతయః సుహోత్యాద్యా శ్చ నాగరాః । మాలవాద్యా స్తథా భృత్యాః పౌరాద్యా శ్చైవ మాలినః ॥

పిమ్మట ఇతరఋషులు తన వెంబడివచ్చుచుండగా విశ్వామిత్రులతో కలిసి వసిష్ఠులవారు రథమును ఆరోహించి శ్రీరామచంద్రుడు మొదలగు పెద్దపరివారముతో దశరథమహారాజుయొక్క సభాస్థలమునకు వచ్చిరి. సభామందిరము జనులతోనిండియుండెను. వసిష్ఠమహాముని విశ్వామిత్రులవారు దశరథమహారాజు మంత్రులు బ్రాహ్మణులు పురజనులు మొదలుగాగల జనసమూహమంతయు సభగాకూడినది.

దిగ్భ్యః పురా చ్చ గగనా చ్చ వనా చ్చ సిద్ధవిద్యాధరార్యముని విప్రగణే వసిష్ఠం । మానప్రణామ మభితః ప్రవిశ త్యశబ్దం సోపాంశుగౌరవవతా సహ జాతవాక్యే ॥

దిక్కుదిక్కులనుండి సభకు వచ్చినవారును పురజనులును ఆకాశమునుండి గరుడుడు సంపాతిమొదలగువారును వనములనుండి వనచరులైనమునులు సిద్ధపురుషులుమొదలగువారును అనేకులు సభలో

ప్రవేశించుచు వసిష్ఠులవారికి మౌనముతో ప్రణామములుచేసి అనగా మనసా నమస్కరించి చప్పుడుచేయకయే సభలోప్రవేశించి సభికులు ఒకరినొకరు అవశ్యముగా నుండినపుడు గౌరవార్థము కుశలప్రశ్నలు చేసికొనునపుడుకూడ మాటలధ్వని వినపడకయే (ఉపాంశు) పెదవులనుమాత్రముకదిలించి అతిమందస్వరముతో కుశలప్రశ్నలుచేసికొనుచు సభను ప్రవేశించి

అథ తేషూఽ పవిష్టేషు స్వేషు స్వేష్వాసనేషు చ ।
సర్వేష్వే వోపవిష్టేషు వసిష్ఠోన్ముఖదృష్టిషు ॥
సభాకలకలే శాంతే మౌనసంస్థేషు బందిషు ।
వృత్తాసు స్థితివార్తాసు సౌమ్యే తస్మిన్ సభాంతరే ॥

మునులు, రాజులు, మంత్రులు మొదలగు సమ్మాననీయులు ముందుగా వారి వారి నియమితాసనములలో కూర్చున్నపిదప మిగిలినవారందరును వారి వారి స్థలములలో కూర్చుని సభా కలకలధ్వనియు కుశలప్రశ్నములును అణగి అందరును ,, వసిష్ఠోన్ముఖదృష్టిషు " వసిష్ఠులవారినే చూచుచుండిరి.

అగురుతగరధూమే చందనామోదమిశ్రే సరసకుసుమదామోద్దామగంధాంకితాఙ్గే । సరతి సతివితానాంభోరుహామోదలేశై శ్చలకుసుమరజోంకే శబ్దవిజ్ఞాతభృంగం ॥

అగరు తగరు చందనం మొదలగువస్తువులతో నేర్పడిన ధూమద్రవ్యములయొక్క వాసనతోనిండినదియు సభలో అలంకారమునకుగా కట్టబడిన కమలములు మొదలగు సుగంధపుష్పములయొక్క మనోహరమైన వాసనతోనిండినదియునగు సభలో వసిష్ఠమహాముని మాటలాడుటకు ఆరంభించిరి.

సభకూడుటకు శిష్యులును శ్రోతలునైన శ్రీరామచంద్రుడు అతని సహోదరులును వక్తయు గురువును అయిన వసిష్ఠులవారిని విశ్వామిత్రులవారిని సభకు పిలుచుకొని వచ్చుటకుగా స్నానసంధ్యాద్యనుష్ఠానములను ముగించుకొని శ్రీరామచంద్రులవారు వెడలుటయు వారు సమాధియందుండినపుడు దూరమునుండి తలవంచి నమ

స్కరించుటయు వారలందరును సభాస్థలికి వచ్చినపుడు నిశ్శబ్దముగా సభికులందరును సభలో ప్రవేశించి మౌనముతో ప్రతివాదును వసిష్ఠుల వారికి నమస్కారములు మనసా చేయుటయు సభికులు పరస్పరము ఉపాంశువుగా కుశలప్రశ్నలు చేసికొనుటయు సభలో ఏ మాత్రము గాని శబ్దములేక మర్యాదతో అందరును వారి వారి ఆసనముల యందు కూర్చొనుటయు అగరు తగరు చందనము మొదలగు దశాంగధూప సామగ్రితో ధూపమువేసి పిమ్మట సభలో ఉపదేశ మారంభించుటయు ఈ ఆచారములన్నియు మనము ఈ కాలము నందుకూడ కొన్నిసత్సభలయందు కనుగొను మర్యాదలు.

సూర్యాస్తమయవర్ణన.

భానోర్భాసా భూషితై ర్మేఘలేశైః కించి త్కించి త్కుంకుమఛాయ యేవ ।
పాశ్చాత్యోఽద్రిః పీతవాసా స్సమేఘై స్తారాహార శ్రీయుతః ఖం సమేతః ॥

కొంచము కొంచెము కుంకుమ చల్లినట్టువలె విచిత్రమైన సూర్యకిరణ పాతమువల్ల కలిగినమేఘముల చెదిరికతో పచ్చనిరంగులతో పశ్చిమ పర్వతము (పశ్చిమాద్రి) (అస్తాద్రి) నక్షత్రములు అను ముత్యములచేత కూర్చబడిన మాలను ధరించినదా అని తోచినది సాయంకాల సమయము.

సూర్యోదయవర్ణనము.

భానోర్భాసా భూషితై ర్మేఘలేశైః కించి త్కించి త్కుంకుమఛాయ యేవ ।
పూర్వక్ష్మాభృ త్పీతవాసాః సమేఘైః తారాహారః శ్రీయుతః ఖం సమేతః ॥

సూర్యాస్తమనకాలపు చిహ్నములే సూర్యోదయకాలమందును కలవు గనుక ఈ పై శ్లోకమునందు “పాశ్చాత్యాఽద్రిః” అనుటకుబదులు “పూర్వక్ష్మాభృత్” అని ఉపయోగించబడియున్నది. ఇతరమార్పులు ఏమియులేవు.

సూర్యోదయానంతరం పూర్వపుదినమువలెనే సభకూడినది.

సభాం పున రుపాజగ్ముః సభ్యాశ్చరమహీచరాః ।
వ్యస్తనేన క్రమే ణైవ కృతప్రాత స్తనక్రమాః ॥

పూర్వవ త్సన్ని వేశేన వివేశ సకలా సభా ।
భభూవాస్పందితాకారాః వాతము క్తేవ పద్మినీ ॥
అథ ప్రసంగమాసాద్య రామో మధురయా గిరా ।
ఉవాచ మునిశార్దూలం వసిష్ఠం వదతాం వరం ॥

పూర్వదివసమునందువలెనే సభాసదులందరును సభామందిరమును ప్రవేశించి నిశ్శబ్దముగా ముందటిదినమునందువలెనే వారి వారి స్థలముల యందు కూర్చొనిరి. పిమ్మట ఉపదేశము నారంభించుటకు శిష్యుడగు శ్రీరామచంద్రుడు వసిష్ఠులవారిని ప్రశ్న నడిగెను.

అపుడు ఉపదేశకర్త అయిన వసిష్ఠమహాముని

రాఘవ స్వకులై కేందో య న్మయోక్తం మహామతే ।
కచ్చిత్స్మరసి వాక్యార్థం పూర్వాపర విచారితం ॥
చిత్త మేవ నరో నాన్య దితి య త్ప్రతిపాదితం ।
లక్షణాది విచారేణ కచ్చిత్ స్మరసి సాధు తత్ ॥
హ్యస్తనస్య విచారస్య రాత్రౌ హృది నివేశితః ।
భూయః పరామృష్టం హృదయే సునియోజితం ॥

ఓ రాఘవా నేను నిన్నటిదినం తెలియచెప్పిన విషయములను నిన్న రాత్రి మరల నాలోచించి పూర్వాపరవిచారమువల్ల అనగా మననమువల్ల, చింతనవల్ల, మనస్సునందు విషయములను దృఢపరుచుకొన్నావా. చింతనచేయనియెడల పాఠములు దృఢపడవుగదా అని పలికెను. అందుకు శ్రీరామచంద్రుడు,

య దాదిశసి తత్సర్వం త థైవ న తదన్యథా ।
అపాస్తనిద్రేణ మయా వాక్యార్థో హృది చింతితః ॥
* * * *
హ్యః ప్రసాదిత మాహ్లాది వా గ్రశ్మిపటలం ప్రభో ॥
* * * *
రమ్యం పుణ్యం పవిత్రం చ రత్నబృంద మివా న్వితం ॥
హితానుబంధి హృద్యం చ పుణ్య మానందసాధనం ।
శిరసా ధ్రియతే కై ర్నో సిద్ధ స్త్వదనుశాసనం ॥

తాము సెలవిచ్చిన ప్రకారముగా మననముచేసి నిద్రనుకూడ లెక్క పెట్టకయే వాక్యార్థమును హృద్గతముగా చేసికొన్నాని ధన్యుడనైతిని.

అని చెప్పిన శ్రీరామచంద్రునిమాటలను అంగీకరించి సంతసించి వసిష్ఠమహాముని జ్ఞానోపదేశమును చేయుచుండెను. అపుడు సభకూడుట కారంభించిన రెండవనాడు వసిష్ఠులవారు

సుఖదుఃఖక్షయకరం మహానందైక కారణం ।
మోక్షోపాయ మిమం రామ వక్ష్యమాణం మయా శ్రుణు ॥
ఇమాం మోక్షకథాం శ్రుత్వా సహ సర్వైర్వివేకిభిః ।
పరం యాస్యసి నిర్దుఃఖం నాశో యత్ర నవిద్యతే ॥
ఇద ముక్తం పురాకల్పే బ్రహ్మణా పరమేష్టినా ।
సర్వదుఃఖక్షయకరం పర మాశ్వాసనం ధియః ॥

ఓరామా ఇపుడు నేను చెప్పబోవుసంగతులు సుఖదుఃఖములు అను ద్వంద్వములను క్షయింపజేయును. అపరిమితమైన ఆనందమును ఇయ్యగలది. ఇది మోక్షోపాయము. ఈ మోక్షకథను విని వివేకముగల వారెందరున్నను వారలందరితోకూడ దుఃఖరహితమయినదియు నాశరహితమైనదియునగు పరమపదమునకు పోగలవు. బుద్ధికి పరమశాంతిని ఇయ్యగల ఉపదేశము; మోక్షదాయకము. ద్వంద్వములయిన సుఖదుఃఖాదులను క్షీణింపజేయుగలది. ఇట్టి అమోఘమైన సంగతులు పూర్వాకల్పమునందు పరమేష్టిఅయిన బ్రహ్మదేవుడు నాకు ఉపదేశించినవి, అని చెప్పగా శ్రీరామచంద్రుడు ఈదిగువకను పరిచిన ప్రకారము ప్రశ్నచేయుచున్నాడు.

కేనోక్తం కారణే నేదం బ్రహ్మణా పూర్వం స్వయంభువా ।
కథం చ భవతా ప్రాప్తం ఏత త్కథయ మే ప్రభో ॥

బ్రహ్మదేవుడు ఏకారణముచేత పూర్వము ఈ యుపదేశమునుచేసిరి. ఇట్టి ఉపదేశాంశములు తమకు ఏ విధముగా లభించినవి; అట్టి వివరమును నాకు తెలియచెప్పుడు.

ఇక చెప్పబోవు అంశములకు యోగవాసిష్ఠమునందు “జ్ఞానావతరణము” అని పేరుపెట్టినారు.

## జ్ఞానావతరణము

జ్ఞానావతరణము అనగా జ్ఞానబోధలు భూలోకములో ప్రవేశించినవి అని అర్థము. వసిష్ఠులవారు ఈ విధముగా పలికిరి.

దృష్ట్వైవ మాతురం సర్గం సర్గస్య సకలాగతిం ।
భూతభవ్యభవిష్యత్ స్థాం దదర్శ పరమేశ్వరః ॥
స క్రియాక్రమకాలస్య కృతాదేః క్షయ ఆగతే ।
మోహ మాలోచ్య లోకానాం కారుణ్య మగమత్ ప్రభుః ॥
తతో మా మీశ్వరః సృష్ట్వా జ్ఞానే నాయోజ్య చా సకృత్ ।
విససర్జ మహీపీఠం లోకస్యాఽ జ్ఞానశాంతయే ॥
యథాఽ హం ప్రహిత స్తేన తథాఽ న్యే చ మహర్షయః ।
సనత్కుమారప్రముఖా నారదాద్యా శ్చ భూరిశః ॥

సృష్టికార్యమును వహించిన బ్రహ్మదేవుడు తాను సృష్టించిన సృష్టి సమూహానంతయు పరీక్షించెను. ఇంతలో కృతయుగము ముగిసెను. (కృతయుగమునందు మనుష్యులు పూర్వపుయుగములయందు అనుభవములనుపొంది వికసించిన శిష్టులు నడిపినత్రోవలలో పెద్దలుచెప్పిన విధమున బిడ్డలు నడిచినట్టుగా మనుష్యసమూహము వర్తించుచు స్వంతముగాయోచించి నడుచుటకు యోగ్యతలేక పెద్దలు ప్రేరేపించి నట్టు నడుచుచుండిరి. ఇచ్చట శిష్టులుఅను పదమునకు అర్థము విచారించవలయును. శిష్టులు అనగా శేషించినవారు. పూర్వకల్పములకొనన సంభవించిన ప్రళయమునందు పోయినవారు పోను కొందరు మహనీయులు శిలుకు నిలిచియుండిరి. క్రొత్తసృష్టియందు వారలు క్రొత్తమనుష్యులు మొదలగువారికి విద్యావిషయములను తెలుపుటకుగా నిలిచియుండిరి. వారికి శిష్టులు అనిపేరు. వీరలనుగురించి ఇకముందు వ్రాయబడును.) క్రొత్తసృష్టి బాల్యమునుదాటి కౌమారదశకువచ్చెను. అనగా అహంభావము అధికమగుచు వచ్చెను. అపుడు బ్రహ్మదేవుడు తన సృష్టిని పరిశీలించి వారలు ఏమిగా ముదరగలరు అను అంశమును ఊహించి వారలకు అనుభవజ్ఞుల సహాయముకావలెనని బ్రహ్మలోకమునందు ఉండిన నన్ను

సృష్టించి సకలజ్ఞానమును నాలో నిమిడిచి భరతఖండమునందు ప్రబలు చుండిన అజ్ఞానమును నశియింపజేయుటకు నన్ను పంపెను. నన్ను పంపినట్లుగానే ఇతర ఋషులగు నారదాదులనుకూడ ఈ లోకమునకు పంపెను. మాకందరికిని శ్రీ సనత్కుమారులవారిని అగ్రగణ్యులుగా పంపెను. ఇట్లు పంపబడిన ఋషులసంఘమునకు మహీవీరము అని పేరు.

మహీవీరము భూలోకమునకు రాకమునుపు ఒక నాయకుడుగా లేకయే జనులు బహునాయకులుగానుండిరి. యోగవాసిష్ఠమునందు మహీవీరపువారుచేసిన ఏర్పాట్లను ఈదిగువ కనినట్లు వివరముగా చెప్పియున్నది.

క్రియాక్రమేణ పుణ్యేన తథా జ్ఞానక్రమేణ చ ।
మనో మోహామయోన్నద్ధ ముద్ధర్తుం లోక మీరితాః ॥
మహర్షిభి స్తతైస్తైః క్షీణే కృతయుగే పురా ।
క్రమాత్క్రియాక్రమే శుద్ధే పృథివ్యాం తనుతాం గతే ॥
క్రియాక్రమవిధానార్థం మర్యాదానియమాయ చ ।
పృథగ్దేశవిభాగేన భూపాలాః పరికల్పితాః ॥

కర్మయోగమును జ్ఞానయోగమును ఉపదేశించి మోహము అజ్ఞానము మొదలగు మాలిన్యములతో మబ్బుకప్పబడిన మనస్సును ఉద్ధరించుటకు ప్రేరేపించిరి. అయినను క్రియాక్రమము అనగా కర్మయోగముయొక్క ఆచరణక్షీణించగా మహర్షులు దేశమును భాగములుగా విభజించి ఆయాభాగముయొక్క యోగక్షేమార్థము భూపాలురను నియమించిరి. భూపాలుడు అనగా భూమిని, అందు వసియించు ప్రాణులను కాపాడువాడు—అనగా రాజు,

బహూని స్మృతిశాస్త్రాణి యజ్ఞశాస్త్రాణి చా వనౌ ।
ధర్మకామార్థ సిద్ధ్యర్థం కల్పితా న్యుచితా న్యథ ॥
కాలచక్రే వహ త్యస్మి న్తతో విగళితే క్రమే ।
ప్రత్యహం భోజనపరే జనే శాల్యర్జ నోన్ముఖే ॥
ద్వంద్వాని సంప్రవృత్తాని విషయార్థం మహీభుజాం ।
దండ్యతాం సంప్రయాతాని భూతాని భువి భూరిశః ॥

తతో యుద్ధం వినా భూపాః మహీం పాలయితుం క్షమాః ।
న సమర్థాః తదా యాతాః ప్రజాభిః సహ దైన్యతాం ॥
తేషాం దైన్యాఽపనోదనార్థం సమ్యగ్దృష్టిక్రమాయ చ ।
తదా అస్మదాదిభిః ప్రోక్తా మహతో్య జ్ఞానదృష్టయః ॥
అధ్యాత్మవిద్యా తేనేయం పూర్వం రాజసు వర్ణితా ।
తదనుప్రసృతా లోకే రాజవిద్యే త్యుదాహృతా ॥
రాజవిద్యా రాజగుహ్య మధ్యాత్మజ్ఞానముత్తమం ।
జ్ఞాత్వా రాఘవ రాజానః పరాం నిర్దుఃఖతాం గతాః ॥

రాజులను కల్పించినపిమ్మట రాజులకును ప్రజలకును స్వస్వధర్మ నియతికి ఉచితములైన శాస్త్రములను కల్పించిరి. ఈ శాస్త్రములను కాలక్రమమున ప్రజలు మరిచిపోయి భోగపరులుగా నేర్పడిరి. విషయాసక్తులైరిగనుక ద్వంద్వములు వారిని పీడించనారంభించెను. అపుడు రాజులు ప్రజలను దండించవలసివచ్చెను. కొన్నాళ్లు రాజులు క్షమకలిగి ప్రవర్తించినను కాలక్రమమునందు దండించుట కారంభించవలసివచ్చెను. అపుడు ఆ రాజులకు మేము (వసిష్ఠాదిఋషులు) జ్ఞానమార్గమును ఉపదేశించితిమి. ఆ విద్యకు అధ్యాత్మవిద్య అని పేరు. మొట్టమొదట రాజులకు ఉపదేశించబడినది గనుక ఆ విద్యకు రాజవిద్యఅని పేరువచ్చెను. ప్రజాపాలన రహస్యములను ఉపదేశము చేసితిమి గనుక ఈ విద్యకు రాజగుహ్యము అనికూడ పేరు. అధ్యాత్మవిద్య, రాజవిద్య, రాజగుహ్యము అను పేళ్లతో వ్యవహరించబడు విద్య ఒకటే. ఒకటికే ఇన్ని పేళ్లు. ఈ విద్యను తెలిసికొని రాజులు పరమశాంతినిపొంది చక్కగా శాంతముతో రాజ్యమేలుచు వచ్చిరి.

అథ రాజ స్వతీతేషు బహుష్వమలకీర్తిషు ।
అస్మాద్దశరథా ద్రామ జాతోఽద్య త్వ మిహా నఘ ॥
తవ చాతి ప్రసన్నేఽస్మిన్ జాతం మనసి పావనం ।
నిర్నిమిత్త మిదం చారు వైరాగ్య మరిమర్దన ॥

ఇట్టి రాజులు అనేకులు ఒకరివెనుక నొకరు గతించిపోగా శ్రీ దశరథ చక్రవర్తికి మహావైరాగ్యగుణోపేతుడవైన నీవు జన్మించినావు.

నేను నా తండ్రిఅయిన బ్రహ్మదేవుని అభీష్టప్రకారము

జంబూద్వీపస్య కోణేఽస్మిన్ వర్షే భారతనామని ।
*        *        *        *
జన స్త్యైతస్య దుఃఖం త ద్దృష్ట్వా సకలలోకకృత్ ।
జగామ కరుణా మీశః పుత్రదుఃఖా త్పితా యథా ॥
*        *        *        *
సంసారా త్తరణే జంతో రుపాయో జ్ఞాన మేవ హి ।
తపో దానం తథా తీర్థం అనుపాయాః ప్రకీర్తితాః ॥
ఇతి సంచింత్య భగవాన్ బ్రహ్మ కమలసంస్థితః ।
*        *        *        *
తతో విదితవేద్యం మాం నిజాం ప్రకృతి మాస్థితం ।
స ఉవాచ జగత్కర్తా వక్తా సకలకారణం ॥
*        *        *        *
పుత్రా స్య జ్ఞానసారస్య సమ స్తజనసిద్ధయే ॥
గచ్ఛే దానీం మహీపీఠం జంబూద్వీపాంతరస్థితం ।
సాధో భరతవర్షం త్వం లోకానుగ్రహ హేతునా ॥
తత్ర క్రియాకాండపరాః త్వయా పుత్ర మహాధియా ।
ఉపదేశ్యాః క్రియాకాండ క్రమేణ క్రమశాలినా ॥
విరక్తచిత్తా శ్చ తథా మహాప్రాజ్ఞా విచారిణః ।
ఉపదేశ్యా స్త్వయా సాధో జ్ఞానే నానందదాయినా ॥
ఇతి తేన నియుక్తోఽహం పిత్రా కమలయోనినా ।
ఇహ రాఘవ తిష్ఠామి యావత్ భూతపరంపరా ॥
కర్తవ్య మస్తి న మమే హ హి కించి దేవ
స్థాతవ్య మి త్యతిమనా భువి సంస్థితోఽస్మి ।
సంశాంతయా సతతసుప్తధి యేఽహ వృత్త్యా
కార్యం కరోమి న చ కించి దహం కరోమి ॥

జంబూద్వీపముయొక్క ఈ మూలలోనుండు భారతవర్షమునకు ఈ అడుగునవివరించు సందర్భములో వచ్చితిని. ఆ సందర్భము ఏది అనగా—ఇచ్చటి జనులు మూఢులుగానుండిరి. ఈ మూఢులు దుఃఖపడుచున్నారే వీరికి ఏ విధమున దుఃఖనివర్తి కలుగునో అని తండ్రి బిడ్డలవిషయమునందు దుఃఖపడునట్లు దుఃఖపడెను. సంసార

 

ము అను సముద్రమును ఈది దరిజేరుటకు జ్ఞానమేకదా ఉపాయము. కొందరు తపస్సు, దానము, తీర్థయాత్ర ఇవన్నియు ఉపాయములు అని అందురుగాని అవి ఉపాయములుకావు. అని బ్రహ్మదేవుడు చింతించి జ్ఞానవంతుడనైన నన్ను పిలిచి ఈదిగువ వివరించినప్రకారము చెప్పిరి. ఓపుత్రా నీవెటిగియుండుజ్ఞానమును జంబూద్వీపమునందు భరతవర్షమునందు స్థాపించబడియుండు మహీపీఠమునకువెళ్లి లోకానుగ్రహార్థమై అచ్చట కర్మకాండపరులైన జనులకు కర్మయోగమును ఉపదేశించుము. మహాప్రాజ్ఞులై వైరాగ్యవంతులైన వారికి ఆనందదాయకమైన జ్ఞానయోగమును ఉపదేశించుము. ఇట్టి బ్రహ్మదేవుని ఆజ్ఞనుపొంది ఇచ్చటికి వచ్చితిని. లోకమునందు భూతపరంపర వర్ధిల్లుచున్నంతవరకును జ్ఞానదానముచేయుచుండు ఉద్యోగము నాదిగానున్నది. కనుక నాకుగా చేసికొనవలసినపని యేదియు లేకున్నను ఇచ్చట లోకోద్ధారమునకుగా నుండవలసియున్నది. కనుక ఉన్నాను. నేను నియమితకార్యమును పరిపూర్ణముగా శాంతినిచెందినమనస్సుతో (ఎల్లకాలములయందును నిద్రించుచున్నమనస్సుతో, మనస్సు మేలుకొనియుండిన తారుమారుగా మూలమూలకు లాగును. కనుక మనస్సును నిద్రపోగొట్టుట.) చేయుచున్నాను. కాని <u>నేను</u> చేయుచున్నాను అను అహంభావముతో చేయుట లేదు.

> రఘుకులేందో యది చైతే మహామునయో మహర్షయశ్చ విప్రాశ్చ రాజానశ్చ జ్ఞానకవచే నావగుంఠితశరీరాస్తే కథ మదుఃఖక్షమా అపి దుఃఖకరీం తాం తాం వృత్తిపూర్వికాం సంసారకదర్థనాం అనుభవన్తః సతత మేవ ముదితమనస స్తిష్ఠంతి ॥

రఘుకులతిలకా శ్రీరామచంద్రా మహామునులు మహర్షులు మొదలగువారును రాజులును జ్ఞానము అను కవచమును ధరించినవారైనందున దుఃఖమునకు పాలుకానివారయ్యు ఇహలోకమునందు దుఃఖము నియ్యగల వృత్తులను అవలంబించి సంసారదుఃఖమును అనుభవించువారివలె చరించుచున్నా రందువేమో అందుకు సమాధానము: వారు అనుభవములను అనుభవించుచు తాముమాత్రము ఆనంద

సాగరమున తేలుచుందురు. (మునులు = ధ్యానపరులు, ఋషులు = మంత్రజపపరులు, విప్రాః = కర్మపరులు.)

ముందుచెప్పబడిన మహామునులు మహర్షులు విప్రులు రాజులు వీరలస్థితి యెట్టిది అని అడిగెదవేమో విను ము.

> వికౌతుకా విగతవికల్పవిప్లవాః యథా స్థితా హరిహరపద్మజాదయః ।
> నరోత్తమాః సమధిగతాఽత్మదీపకాః తథా స్థితా జగతి విశుద్ధబుద్ధయః ॥

బ్రహ్మదేవుడు, విష్ణుమూర్తి, హరుడు అను త్రిమూర్తులు ఏ విధముగా సృష్టిస్థితిలయములు అను ఉద్యోగములను చేయుచు ఒకరు చేయు కార్యమును మరియొకరు చెడుపుచున్నను అసూయలేక వారి వారి ధర్మము వారు వారు నడుపుచున్నారో ఆ విధముగా కర్తృత్వబుద్ధిని వదలుకొని తాము చేసినకార్యము అనుకూలమైనపుడు సంతోషించక యు తాము చేసినకార్యము క్రమముగా నడువనపుడు వగవకయు న్నారో అట్లు పురుషశ్రేష్ఠులైన మహామునులు, మహర్షులు, విప్రులు, రాజులును మహీపీఠపు ఉద్యోగములను చేయుచు ఆత్మజ్ఞానమును, ఆత్మరతిని మరువకయు ఆత్మజ్యోతిని సదా లక్ష్యమునందుంచుకొని ఈ జగత్తునందు చరించుచున్నారు.

> పరిక్షీణే మోహే విగళతి ఘనేఽజ్ఞానజలదే । పరిజ్ఞాతే తత్త్వే సమధిగతాత్మన్యతితతే । విచార్యార్యైః సార్ధం చలితవపుష్ వై సదృశతో । ధియా దృష్టే తత్త్వే రమణ మటనం జాగత మిదం ॥

శ్రీరామచంద్రా బ్రహ్మాది దేవతలవలె ఈ మునులు, ఋషులు మొదలగువారు పూర్ణకాములే అయినపుడు వీరలకు సంసారములయందు పర్యటన మేల వచ్చెను అని సందేహింతువేమో వినుము. ఆత్మవిచారమునుచేసి జీవన్ముక్తులైనవారు పూర్వము గురువులయొద్ద శ్రవణముచేసి పదార్థపరిశోధనచేసి ఆత్మస్వరూపవిషయమును నిదిధ్యాసనచేసి బుద్ధిని వృద్ధిచేసుకొనగా మోహము క్షీణించును. దానిఫలితార్థముగా (మోహము క్షీణించగా) అజ్ఞానము అను మేఘము తొలగిపోవును. అపుడు తత్త్వము వ్యక్తమగును. అందువలన దుఃఖభూ

యిష్టమైన ఈ లోకమునందు వ్యవహరించుట సులభముగా నుండును. మఱియు నొక రహస్యమున్నది.

ప్రసన్నే చిత్తత్వే హృది శమభవే వల్గతి పరే శమా భోగీభూతా స్వఖిల కలనాదృష్టిషు పురః । సమం యాతి స్వాంతఃకరణఘటనాస్వాదితరసం ధియా దృష్టే తత్త్వే రమణ మటనం జాగత మిదం ॥

నేను చైతన్యమాత్రుడను, మాయాతీతుడను అను అర్థము మనస్సునందు నిశ్చలముగా నిలిచి శాంతస్వభావమునే ఎల్లపుడు మనస్సు లోకమును గ్రహించునపుడు జగత్తునందు వ్యవహారములు జరుపుట మనస్సునకు సంతోషమును కలుగజేయునదిగానే యుండును. ఇవన్నియు మహీపీఠమునకుచేరిన మాకు గల సుఖములు—

ఏవంవిధా వృత్తయః ఆత్మతత్త్వావలోకనా ల్లభ్యంతే నాన్యథా ।

ఇట్టి మనోవృత్తులు ఆత్మతత్త్వావలోకనమువల్లనే కలుగును. ఇతర విధములవల్ల లభించవు.

కనుక

తస్మా ద్విచారేణ ఆత్మైవ అన్వేష్టవ్యః ఉపాసనీయః జ్ఞాతవ్యః యావజ్జీవం పురుషేణ నేతర దితి ।

విచారముచేసి ఆత్మవస్తువునే వెదకవలయును. (వెదకుట అనగా వేదాంతవాక్యములను శ్రవణముచేయుట.) ఉపాసన చేయవలయును (ఉపాసన అనగా నిదిధ్యాసనము). అనుభవమువల్ల తెలిసికొనవలయును. ఎన్నాళ్లు కృషిచేసినా వేరువిధమైన ఉపాయము నాకు గోచరించలేదు.

జ్ఞానకారణములను గురించియు అభ్యాసమును గురించియు శ్రవణమనననిదిధ్యాసనములనుగురించియు ఇక ముందు వ్రాయబడును. ఇచ్చట మహీపీఠము వారు భూలోకమునకువచ్చి ఏమిచేసిరి ఏ విధమున ఆ పనిని తమలో పంచుకొనిరి అను విషయమునుగురించి మరికొంత వ్రాయవలసి యున్నది.

## జగద్యాత్ర

జగద్యాత్ర అనగా లోకమును పాలించుట. దేహయాత్ర అనగా దేహమును పాలించుట. మనుష్యులు దేహమును ఏ విధముగా పెంచి, తగుమైన ఆహారమును ఇచ్చి ఆరోగ్యమును ఇచ్చి పాలింతురో అట్లు జగత్తును జగత్తునందుగల జీవకోటిని పెంచి వృద్ధికి తెచ్చుట. మహీపీఠమునకు చేరినవారు ముగ్గురు అధికారులు జగద్యాత్రకు గలరు. వారలకు దివ్యజ్ఞానసమాజమునందలి ప్రాజ్ఞులు వ్రాసిన పుస్తకములయందు భౌద్ధమతగ్రంథములయందు ఉపయోగించియుండు సంజ్ఞానామములను ఉపయోగించియున్నారు. ఇందుకు కారణములు అనేకములు గలవు. దివ్యజ్ఞానసమాజమునందు మొట్టమొదట గ్రంథములనువ్రాసిన మ్యాడం బ్లావట్స్కీగారు కొన్నిసంవత్సరముల కాలము టిబెట్టు దేశమునందు నివసించి యుండిరనియు ఆ కాలము నందు అచ్చటి గ్రంథములను పఠించిరనియు ఆ గ్రంథములు ఆ దేశపు భాషయందు వ్రాయబడి యున్నందున ఆ భాషయందలి సంజ్ఞావాచకములను నేర్చికొని ఆ సంజ్ఞలనే ఉపయోగించవలసి వచ్చినది గనుక బౌద్ధసంజ్ఞావాచకములను దివ్యజ్ఞాన సమాజపు గ్రంథములయందు ఉపయోగించిరి అనియు చెప్పవలెను. ఏ భాషకుచేరిన సంజ్ఞలను ఉపయోగించినను విషయమేమో మారదు కదా. సత్యము ఒక్కటేమైనను ఆ సత్యమును తెలియజెప్పు సంజ్ఞావాచకములు దేశభాషలు భేదించినట్లు భేదించినను విషయము (సత్యము) మారదు కదా. మ్యాడం బ్లావట్స్కీగారు ఉపయోగించిన పేళ్లు,

1. మనువు—వైవస్వతమనువు.
2. బోధిసత్త్వ—మైత్రేయఋషి.
3. మహాచోహాను—చోహానులు అనగా దేవతలు, మహా చోహాను అనగా దేవతలలో పెద్దవాడు అనగా ఇంద్రుడు. మన గ్రంథములలో ఈ అధికారులను

(1) మనువు—మనుపుత్రులు.
(2) ఋషులు.

(లి) ఇంద్రుడు అని యుపయోగింతురు.

ఈ విషయము శ్రీమద్భాగవతమునందు అష్టమస్కంధము పదునాలుగవ అధ్యాయమునందు చెప్పబడియున్నది.

మన్వంతరేషు భగవన్ యథా మన్వాదయ స్త్విమే ।
యస్మిన్ కర్మణి యే యేన నియుక్తా స్తద్వదస్వ మే ॥

పరీక్షిన్నరేంద్రుడు—ఓ మునీంద్రా "మన్వంతరంబులం దీ మన్వాదులు ఏ యే కర్మంబుల (ఎవ్వరిచేత) నియుక్తు లగుదురు. అద్దానిం జెప్పుమని యడుగ పరీక్షిన్నృపాలునకు శుకయోగి యిట్లనియె".

మనవో మనుపుత్రా శ్చ మునయ శ్చ మహీప తే ।
ఇంద్రాస్సురగణా శ్చైవ సర్వే పురుషశాసనాః ॥

మానవేశ్వరా, మనువులు, మనుపుత్రులు, సప్తర్షులు, ఇంద్రులు, సురలు నందరును హరిశాసనంబును ఆ యా మన్వంతరంబుల యందు నడుపుదురు. (సుర గణములను గురించి ముందు వ్రాయ బడును.)

మన్వాదయో జగద్యాత్రాం నయంత్యాభిః ప్రచోదితాః ।

హరిశాసనంబుచే ప్రేరితులై జగద్యాత్రను సలుపుదురు (జగద్యాత్ర, లోకయాత్ర, శరీరయాత్ర అను సమస్తపదములలో యాత్ర అను పదమును శరీరముగాని జగత్తుగాని వీనిస్థితికిగా జేయుకార్యములు అని ముందు పుటలో చెప్పబడియున్నది.)

చతుర్యుగాంతే కాలేన గ్రస్తాన్ శ్రుతిగణా న్యథా ।
తపసా ఋషయోఽ పశ్యన్ యతో ధర్మ స్సనాతనః ॥
తతో ధర్మం చతుష్పాదం మనవో హరిణోదితాః ।
యుక్తా స్సంచారయం త్యద్ధా స్వేస్వే కాలే మహీం నృప ॥
పాలయంతి ప్రజాపాలా యావ దంతం విభాగశః ।
యజ్ఞభాగభుజో దేవా యే చాన్యేఽ త్రా నుకీర్తితాః ॥
ఇంద్రో భగవతా దత్తాం త్రైలోక్యశ్రియ మూర్జితాం ।
భుంజానః పాతి లోకాం స్త్రీన్ కామం లోకే ప్రవర్షతి ॥

చతుర్యుగాంతమునందు కాలగ్రస్తంబులైన వేదములు మునిగి (దాగి) యుండగా మహర్షులు వాటిని మరల తెచ్చియిత్తురు.

"యుగాంతేఽంతర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః । లేభిరే తపసా పూర్వం అనుజ్ఞాతాః స్వయంభువా ॥" అని చెప్పియున్నది. దాగియుండిన వేదములను తమ తపోనిష్ఠచేత మహర్షులు తెలిసికొని లోకమునకు ఇత్తురు. అట చతుష్పాదయుతంబైన ధర్మమును ముందిడికొని హరియొక్క ఆజ్ఞచొప్పున మనువులు మనువుయొక్క పుత్త్రులు పౌత్రులు వంశపారంపర్యముగా క్షత్త్రియరూపముతో మన్వంతరము ముగియునంతవరకును ప్రజలను ఏలుదురు. భగవంతుడు తన కిచ్చిన త్రైలోక్యరాజ్యమును ఇంద్రుడు అనుభవించును. సిద్ధేశ్వరులు జ్ఞానయోగమును, ఋషులు కర్మయోగమును, లోకమునందు ఉపదేశింతురు. అని యీ విధముగా జగద్యాత్రను జరుపు అధికారులు పనిచేయుచుందురని శ్రీమద్భాగవతమునందు అష్టమస్కంధము పదునాలుగవ అధ్యాయమునందు చెప్పబడియున్నది.

అమ్మగారు 1920 సంవత్సరమున దివ్యజ్ఞానసమాజ వార్షికోత్సవసమయమునందు "లోకముయొక్క ఆంతరంగిక ప్రభుత్వము" అని ఉపన్యాసముల నిచ్చియున్నారు. ఆందులో ఆంతరంగిక ప్రభుత్వము మహీపీఠమే అని అర్థమగునట్టు చెప్పియున్నది. ఆ సంగతులు అవగాహన అగుటకుగా బ్రహ్మాండమునుగురించి సంగ్రహముగా వ్రాయవలయును.

## బ్రహ్మాండము

బ్రహ్మాండము: సృష్టియంతయు అండరూపముగానున్నది. దీనికి బ్రహ్మాండముఅని పేరు. శివవిష్ణుబ్రహ్మలు అను త్రిమూర్తులకు నివాసభూతమైన సూర్యనారాయణమూర్తి తన చుట్టును కొందరు (కొన్ని) గ్రహములనుచేర్చుకొని ఆ యా గ్రహములకును తనకును గల శక్తిని ఉపయోగించి వాటివాటిని వాటి స్థలములయందు ఉంచియుండును. ఇట్టి బ్రహ్మాండములు అనేకకోట్లు ఉన్నవి అని

మహానారాయణోపనిషత్తునందు చెప్పబడియున్నది. అనేక కోట్ల బ్రహ్మాండములు ఉండునట్లైతే అనేకకోట్ల సూర్యులుకూడ నుండవలెను. సూర్యుడు బ్రహ్మాండమునకు అధిపతి. సూర్యుడులేనిదే బ్రహ్మాండములేదు.

పశ్చిమదేశపు ఖగోళశాస్త్రిజ్ఞులు ఒక్కొక బ్రహ్మాండమునకు ఒక్కొక సూర్యుడు ఉన్నాడనియు ఆకాశమునందు మనకు కనబడు నక్షత్రములు అన్నియు సూర్యులు అనియు ఆయా సూర్యులను అనుసరించి వారి బ్రహ్మాండములకుచేరిన గ్రహములుకూడ ఉన్నవనియును అవి మనకు దృష్టిగోచరములు కావనియు చెప్పియున్నారు.

విశాలమైన ఆకాశమునందు కోట్ల సంఖ్యతో బ్రహ్మాండములు ఉండుటకు స్థలముఉన్నది. "దిక్కాలాది" అను శ్లోకమునందు 'దిక్' అనగా స్థలము. ఆ 'దిక్'కు తూర్పుపడమరలుగాని ఎల్లలుగాని లేవు. అపరిమితమైనదియు అవగాహనకు అసాధ్యమును అయిన అతివిశాల ఆకాశమునందు ఒక్కొక బ్రహ్మాండమునకు అధిపతియైన ఈశ్వరుడు—అనగా సూర్యుడు కొంత ఎల్లను ఏర్పరుచుకొని ఇది నాయొక్కనివేశనము అని అనుకొనును. ఆ నివేశనముచుట్టును ఒక గీటు గీచినట్టు అయితే ఆగీటుకులోబడిన స్థలమును మరియొక బ్రహ్మాండపు అధికారికోరదు. మరియొక బ్రహ్మాండపు అధికారి మరియొక నివేశనమును కోరుకొనును. ఇట్టి నివేశనము తూర్పుపడమర ఎల్లలుగాని ఊర్ధ్వము అధస్సుఅను నియమములుగాని లేనందున అవి అన్నియు గోళములుగా నేర్పడును. ఒక గోళమునకును మరియొక గోళమునకును ఆకర్షణ వికర్షణశక్తులున్నవి గనుక ఒకటిని మరియొకటి స్పర్శించదు. సమీపించనూ సమీపించదు.

ఈ ప్రకారము పరిమాణమునుమించిన విస్తీర్ణము గల ("దిక్") పరమాకాశమునందు అనేకకోట్లు అని చెప్పదగినట్లు లెక్క పెట్టుటకు సాధ్యముకానన్ని బ్రహ్మాండములు ఒకటితో నొకటి సంస్పర్శలేనివిగా ఉండవచ్చునుకదా.

సముద్రతీరమందు ఉండు ఇసుకమణులను అనగా ఇసుక పూసలను కావలెనన్న ఏరుచుట సాధ్యముగాని బ్రహ్మాండములను

లెక్కించుట సాధ్యముకాదు అని మహానారాయణోపనిషత్తునందు చెప్పబడియున్నది. ఒక్కొక బ్రహ్మాండమునకును ఈశ్వరుడు సూర్య మండలమునందు త్రిమూర్తిస్వరూపముతో నుండును. ఒక్కొక బ్రహ్మాండమునకును సూర్యుడు ఆధారము. కనుక ఇంగ్లీషుభాష యందు బ్రహ్మాండమునకు (Solar System) సోలరు సిస్టము అని పేరు.

మన బ్రహ్మాండముయొక్క మధ్యప్రదేశమునందు సూర్యుడును సూర్యునిచుట్టు నితరగ్రహములును ఉండును. "అండమధ్యగతః సూర్యః" అని శ్రీమద్భాగవత పురాణమునందు, 5 వ స్కంధము, 20 వ అధ్యా, 42 వ శ్లోకమునందు చెప్పియున్నది. ఇదేవిధముగా ప్రతిబ్రహ్మాండమునకును మధ్యప్రదేశమునందు ఆ యా బ్రహ్మాండ మునకును నాయకుడైన సూర్యుడు ఉండును. ఒక సూర్యుడు అతనిని ఆశ్రయించిన కొన్నిగ్రహములును చేరి ఒక బ్రహ్మాండము అగును.

ప్రతిబ్రహ్మాండమునందును ప్రతిగ్రహమునకును ఆకర్షణ వికర్షణ అను శక్తులుకలవు. సూర్యునికి కల ఆకర్షణశక్తివల్ల తనకుచేరిన గ్రహముల నన్నిటిని తనతట్టుకు లాగికొనుచు వికర్షణశక్తివల్ల తాను నియమించిన దూరమునకంటె సమీపమునకు రానియ్యకయు ఆ గ్రహములను అంతరాళమునందు ఉంచియుండును. ఇదేవిధముగా ప్రతిగ్రహమును ఇతరగ్రహములను ఆకర్షించుచు వికర్షించుచు ఆ యా గ్రహములు ఉండవలసిన స్థలములయందు వాటి వాటిని నిలిపి యుండును. సూర్యుడు గ్రహములపై ఆకర్షణ వికర్షణ శక్తులను ఉప యోగించుట ఒకటి, ప్రతిగ్రహమును ఒకటినొకటి ఆకర్షించుట వికర్షించుట రెండవది. అన్నిగ్రహములునుచేరి సూర్యుని ఆకర్షించుట సూర్యుడు గ్రహములను ఆకర్షించుట వికర్షించుట ఇవన్ని ఆకర్ష ణలు వికర్షణలు తమాషాగా నడుచుచుండును. ఈ ప్రకారము ఒక్కొక బ్రహ్మాండమును తన స్థలమునందుండును. ఇదేప్రకారము ఇతరబ్రహ్మాండములయందుకూడ జరుగును.

అన్నిబ్రహ్మాండములకును మొత్తముగా నధిపతి అయిన పర మేశ్వరుడు తాను అనేక శరీరములను ఉపయోగించి ప్రతిబ్రహ్మాండము

నందును ఆ యా బ్రహ్మాండమునకు అధిపతిగానుండు సూర్యుని యందు ప్రవేశించి త్రిమూర్తులుగా వ్యక్తుడగును. "త్రయీమయా య త్రిగుణాత్మధారిణే విరించి నారాయణ శంకరాత్మనే" అని సూర్యదేవుని వర్ణించియున్నారు. అందువల్ల సూర్యనారాయణ మూర్తి అనుపేరు పుట్టినది. "ధ్యేయస్సదా సవితృమండలమధ్య వర్తీ నారాయణ స్సరసిజాసనసన్నివిష్టః" అనగా సూర్యగ్రహము నందు మధ్యనఉండు నారాయణమూర్తిని ధ్యానించవలయును. "సౌరమండలమధ్యస్థం సాంబం సంసారభేషజం । నీలగ్రీవం విరూపాక్షం నమామి శివమవ్యయం ॥" సూర్యమండలమధ్యనుండు సాంబ మూర్తిని భజించవలయునని అర్థము. ఈ ప్రకారముగా సూర్యమండలముయొక్క మాహాత్మ్యమును తెలిసికొనవలయును. ఇందును గురించి మరలకొంత వ్రాయబడును.

బ్రహ్మాండమున కంతయు

సూర్యేణ హి విభజ్యంతే దిశః ఖం ద్యౌ ర్మహీ భిదా ।
స్వర్గాపవర్గ నరకరసౌకాంసి చ సర్వతః ॥
దేవతిర్యఙ్మనుష్యాణాం సరీసృప్సగవీరుధాం ।
సర్వజీవనికాయానాం సూర్య ఆత్మా దృగీశ్వరః ॥

(శ్రీమద్భాగ. స్కం 5, అధ్యా 20, శ్లో 44, 45)

దిక్కులు, ఆకాశము, దినము, రాత్రి అను వ్యత్యాసములును విభజనులును సూర్యునివల్లనే కలిగినవి. దేవతిర్యఙ్మనుష్య సరీసృపాదులైన చరాచరములకెల్ల సూర్యుడే ఆత్మ. ఆతడే నాయకుడు. అతడే తెలివి. అతడే కన్ను.

అండానాం చ సహస్రాణాం సహస్రాణ్యయుతాని చ ।
ఈదృశానాం తథా తత్ర కోటికోటిశతాని చ ॥ (విష్ణుపురాణము)

బ్రహ్మాండములు కోటి శతకోటి లెక్కలుగలవి. అని విష్ణుపురాణము నందు చెప్పియున్నది. విష్ణుపురాణమునందు ఇందునుగురించి చెప్పి యుండు సంగతులు ఈ దిగువ వ్రాయబడుచున్నవి.

ఈ బ్రహ్మాండమునందు సూర్యుడు రాజుగా త్రిమూర్తులకు వాస స్థలమైయున్నాడు. అతనిచుట్టును (1) శశిమండలము, (2) బుధమండలము. (3) శుక్రమండలము. (4) అంగారకమండలము, (5) బృహస్పతిమండలము, (6) శనిమండలము, (7) భూమండలము అని ఏడు మండలములు ఉన్నవి. సూర్యునితోచేరి యెనిమిది గ్రహములుగలవు.

ఈ మండలములకెల్ల ఆవల సప్తర్షిమండలమును ధృవమండలమును ఉన్నవి. త్రిలోకి అనగా భూలోక భువర్లోక స్వర్గలోకములు ఇదివరకును వ్యాపించియున్నవి. ధృవమండలమునకు వెలుపల మహర్లోకము ఉన్నది. అందుపైన జనలోకము ఉన్నది. సనకసనందనాది బ్రహ్మమానస పుత్రులు జనలోకమునందున్నారు. అందుకుపైన తపోలోకము ఉన్నది. అందుకుపైన సత్యలోకమున్నది.

భూలోక భువర్లోక స్వర్గలోకములు కృతకములు అనబడును. జనలోక తపోలోక సత్యలోకములు అకృతకములు. కృతకములకును అకృతకములను మధ్యన మహర్లోకము ఉన్నది. (ఇదంతయు విష్ణుపురాణమునందు చెప్పియున్న ప్రకారము). కృతకములకును అకృతకములకును మధ్యన లోకాలోకపర్వతము ఉన్నది. దీనిని గురించి యికముందు వ్రాయబడును.

సప్తగ్రహాశోభితమైన బ్రహ్మాండమునకు మధ్యన స్తంభము నాటినట్టు ధృవుడున్నాడు.

## ధృవుడు

ధృవుడు : పురాణములయందు గ్రహములకు అధిపతి ధృవుడు అని చెప్పబడియున్నది. పగ్గములతోబంధించి దూరాన ఉండు గ్రహములను తనతట్టు లాగుకొనుననియు ఉత్తరాయణమునందు సూర్యుని తన సమీపమునకు లాగుకొనుచు దక్షిణాయనమునందు పగ్గములను వదులువిడిచి సూర్యుని ఇచ్ఛవచ్చినట్టు దక్షిణమునకు పోనిచ్చుననియు ఇదేప్రకారము ఇతరగ్రహములనుకూడ నడిపించుననియు చెప్పబడియున్నది. అయితే

ఋషిభ్యస్తు సహస్రాణాం శతా దూర్ధ్వం వ్యవస్థితః ।
మేఢీభూత స్సమ స్తస్య జ్యోతిశ్చక్రస్య వై ధ్రువః ॥
సర్వే ధృవే మహాభాగాః ప్రబద్ధా వాయురశ్మిభిః ।
గ్రహ(ఋ)క్షతారాధిష్ణ్యాని ధృవే బద్ధాన్య శేషతః ॥
భ్రమంత్యుచితచారేణ మైత్రేయాఖిలరశ్మిభిః ।
యావంత్య శ్చ తారాః తావంతో వాతరశ్మయః ॥
సర్వే ధృవే నిబద్ధాస్తే భ్రమంతో భ్రామయంతి తం ॥

సప్తఋషిమండలమునకుపైన, పశువులనుకట్టువాడు ఒక స్తంభమును నాటి ఆ స్తంభమునకు పశువులను కట్టునట్టు ధృవుడు స్తంభమువలె జ్యోతిశ్చక్రముయొక్క మధ్యననుండును అని యర్థము. గ్రహములను ధృవుడు పగ్గములతో కట్టుటకాదు. ‹‹ ధృవగ్రహాంతం వాయుపాశ ప్రసరణఆకర్షణాభ్యాం రవే ర్గతి వైచిత్ర్యం ” అనగా ధృవునియొక్క ఆకర్షణవికర్షణశక్తులవల్ల సూర్యుడు ఉత్తరమునకో దక్షిణమునకో పోవుచుండును అనియర్థము. ‹‹ వాయుపాశము ” అనగా వాయువు అను త్రాడు, అట్లనగా ఆకర్షణ వికర్షణ శక్తులని యర్థము.

అజవీథి, నాకవీథి మొదలగు వీథులు నభోమండలమునం దున్నవని విష్ణుపురాణమునందును వాయుపురాణమునందును చెప్ప బడియున్నవి. వీథులసంగతి ఇకముందు వ్రాయబడును. అదేవిధ ముగా పితృయానము, దేవయానము అను యానములు సంగతియు వ్రాయబడును.

లోకాలోకపర్వతము, భగణము, శింశుమారచక్రము, మాన సోత్తరపర్వతము మొదలగు పేర్లనుగురించి ఇచ్చట వ్రాయదలచుకో లేదు. ఇకముందు దేవయానము పితృయానములను వివరములను వ్రాయునపుడు వ్రాయబడును.

ఒక బ్రహ్మాండము (సోలరు సిస్టము—Solar System) నందు మధ్యన సూర్యుడును ౨౭ వ పుటయందు వివరించినగ్రహములును ఉన్నవి. ఈ బ్రహ్మాండమునందు జీవులు ప్రవేశించినపుడు ఏదోఒక మండలమునందు అనగా శుక్రమండలమో బృహస్పతిమండలమో ఇతర ఏమండలమునో ప్రవేశించి నివాసమునకుగా ప్రయత్నపడు

దురు. ఈ బ్రహ్మాండమునందు మొట్టమొదట శుక్రలోకమునందు ప్రవేశించి ఆలోకమునందు ముదిరి దరిచేరిన శిష్యులు భూలోకమునకు వచ్చి ఇచటనుండిన బాలవయస్కులగు జీవులను త్వరగా ముదురు నట్టుచేసిరి. పరమేశ్వరుని ఆశ్రయించినవారు ఇతరులకు సహాయము చేయుటయే వ్రతముగా కొనియుండువారు.

### శుక్రలోకమును భూలోకమును

శుక్రలోకమునకును భూలోకమునకును సంబంధముకలదు అని పురాణములవల్ల తెలియుచున్నది. మరియు బృహస్పతిలోకము వారికంటె శుక్రలోకమువారు విద్యయందు అధికులు అనియు పురాణములవల్ల తెలియవచ్చుచున్నది. బృహస్పతిలోకమునందు ఉండు వారికి తెలియని విద్య శుక్రలోకమువారికి తెలిసియుండినట్టు పురాణములలో చెప్పియున్నది. మృతసంజీవిని అనువిద్యను బృహస్పతి యొక్క కుమారుడు కచుడు శుక్రలోకమునకుపోయి అచ్చట అనేక సంవత్సరములు ఉండి గురుశుశ్రూషచేసి నేర్చికొని మరల బృహస్పతి లోకమునకు వచ్చినట్టు మత్స్యపురాణము ఇరువదియైదు ఇరువది యారు అధ్యాయములలో చెప్పియున్నది. ఈ కథవల్ల భూలోక ప్రజలకంటె, బృహస్పతిలోకమునందలి ప్రజలకంటెకూడ శుక్రలోక మునందలివారలు మిక్కిలి విద్యావంతులు అని తెలియుచున్నది. చంద్రవంశ చరిత్రమువల్లకూడ పైసంగతి తెలియవచ్చుచున్నది.

### చంద్రవంశచరిత్రము

చంద్రవంశచరిత్రము : బృహస్పతియొక్క భార్యయగు తారయందు చంద్రుడు ఒక కుమారుని కనెను. ఈ కుమారునికి బుధుడు అని పేరు. బుధుడు ఇళాఅనుస్త్రీయందు పురూరవుడుఅను పుత్త్రుని కనెను. ఊర్వశియను దేవలోకపుస్త్రీ పురూరవునికి బిడ్డలగని వంశక్రమమున ఆ వంశమునందు జమదగ్నియు జమదగ్నికి పరశురాముడును ఆ వంశమునందే విశ్వామిత్రుడును పుట్టిరి.

పురూరవుని మరియొకభార్య ఆయుస్సు అనుస్త్రీకి నహుషుడు మొదలగు అయిదుగురు పుట్టిరి. అందులో నహుషునికి ఆరుగురు

పుత్రులు కలిగిరి. అందు యయాతిఅను చక్రవర్తి శుక్రాచార్యుల వారి కుమార్తె దేవయాని అనునామెను పెండ్లియాడెను.

ఈ పెండ్లివల్ల శుక్రలోకమునకును భూలోకమునకును సంబంధముకలదని పురాణములవల్ల తెలియవచ్చుచున్నది. చంద్ర వంశకథనము మత్స్యపురాణము ఇరువదియొకటి మొదలు ఇరువది నాల్గవ అధ్యాయమువరకు చెప్పబడియున్నది. శ్రీమద్భాగవతములో కూడ చంద్రవంశపుకథయు వంశావళియు చెప్పబడియున్నది. శుక్ర లోకమునకును భూలోకమునకును సంబంధము కలదు అని ఊహించ తగియున్నది.

మనుస్మృతి

అంతేకాదు. భూలోకమునందు సృష్టియొక్క ఆదియందు స్వాయంభువమనువు రాజ్యము ప్రారంభించెను. అపుడు స్వాయంభువ మనువు ధర్మశాస్త్రమును ఏర్పరచెను. ఋషులు స్వాయంభువమను వును సమీపించి ధర్మశాస్త్రమును తమకు చెప్పవలయునని ప్రార్థించి నపుడు స్వాయంభువమనువు కొన్నిధర్మములను మాత్రము చెప్పి

ఏతద్వోఽయం భృగుః శాస్త్రం శ్రావయిష్యతి అశేషతః ।
ఏతత్ హి మత్తోఽధిజగే సర్వ మేషోఽఖిలం మునిః ॥ (మనుస్మృతి)

ఈ భృగుమహర్షి నాయొద్దనుండి సకల శాస్త్రములను నేర్చుకొన్నాడు. అతడు మీకు మిగిలిన విషయములనన్నిటిని ఉపదేశించును అని పలికెను. మనుస్మృతి అని మనముచూచుగ్రంథము భృగుమహర్షి ఋషులకు ఉపదేశించిన విషయములను తెలియచేయుచున్నది. పురాణములలో భృగుమహర్షి శుక్రునిజనకుడు అనిచెప్పియున్నది.

ఋషిభ్యః పితరో జాతాః పితృభ్యో దేవమానవాః ।
దేవేభ్యస్తు జగత్సర్వం చరం స్థాణు అనుపూర్వశః ॥
సోమపాస్తు కవేః పుత్రాః హవిష్మన్తః అంగిరః సుతాః ।
పులస్త్యస్య ఆజ్యపాః పుత్రాః వసిష్ఠస్య సుకాలినః ॥
సోమపా నామ విప్రాణాం క్షత్త్రియాణాం హవిర్భుజః ।
వైశ్యానాం ఆజ్యపా నామ శూద్రాణాం తు సుకాలినః ॥
(మనుస్మృతి III. 194—201.)

ఋషులనుండి పితృదేవతలు పుట్టిరి. పితృదేవతలనుండి దేవతలును మనుష్యులును పుట్టిరి. దేవతలవల్ల నిఖిలజగత్తును పుట్టినది. పితృదేవతలలో సోమపాః అనువారు కవియొక్కపుత్త్రులు. అంగిరస్సుయొక్క వంశీకులు హవిష్మంతులు. ఆజ్యపాః అను పితృదేవతలు పులస్త్యునియొక్కపుత్త్రులు. సుకాలులు వసిష్ఠునియొక్కపుత్త్రులు. బ్రాహ్మణశరీరములను ఇచ్చినవారు సోమపాః అనుపితరులు. హవిర్భుక్కులు అను పితరులు క్షత్త్రియులకు శరీరమును ఇచ్చినవారు. వైశ్యశరీరములను ఇచ్చినవారు ఆజ్యపాః అనుపితరులు. 'సుకాలినః' అను పితరులు శూద్రశరీరములను ఇచ్చినవారు. ఈ విధముగా శుక్రలోకములనుండియు ఇతరలోకములనుండియుకూడ భూలోకమునకు జీవులు వచ్చి జనులను పుట్టించి భూలోకమును జనసంకులముగా జేసిరి. ఈ సంగతి అంతయు శుక్రలోకమునుండి భూలోకమునకు మహనీయులువచ్చి ఇచ్చటి లేతతనమునందు ఉండినజీవులకు విద్యలు నేర్పిరి అని సమర్థించి చెప్పుటకుగా వ్రాయబడినది.

## అనేకబ్రహ్మాండములు వాటి వాటి చారములు

సనాతనధర్మశాస్త్రములయందు అనేకబ్రహ్మాండములు ఉన్నవి అని చెప్పబడియున్నది అనియు ఒక్కొకబ్రహ్మాండమునకును ఆ బ్రహ్మాండమునకు మధ్యన సూర్యుడు ఉన్నాడనియు ఆ సూర్యబింబమునందు ఈశ్వరునియొక్క అంశలయిన బ్రహ్మ విష్ణు శంభువులను త్రిమూర్తులు ఉన్నారనియు త్రిమూర్తులకును ఉనికిపట్టయిన సూర్యగ్రహమే జగత్తునకంతయు ఆత్మయనియు ప్రతివస్తువును అనగా చేతనములు అచేతనములును చరములు అచరములును అగు దేవతిర్యఙ్మనుష్యులును సూర్యునియొక్క శక్తివల్లనే బ్రతికియున్నారనియు ఇదివరకే చెప్పబడియున్నది.

ఈ బ్రహ్మాండమునకు అధిపతి అయిన సూర్యునికి ఆకర్షము వికర్షము అనుశక్తులు ఉన్నవనియు ఆ శక్తులవల్లనే బ్రహ్మాండమునందలి గ్రహములనన్నిటిని వాని స్థలములలో సూర్యుడు ఉంచియున్నాడనియు అదేవిధముగా బ్రహ్మాండములోని ప్రతిగ్రహమును ఆకర్ష

వికర్ష అను శక్తులను ఉపయోగించుచున్నవనియు ఇదివరకు చెప్ప బడియున్నది. మరియు "దిక్" అను పరమాకాశమునందు అనేక కోటి బ్రహ్మాండములు సంచరించుచున్నవనియు ఆ యా బ్రహ్మాం డపు అధిపతి అయిన సూర్యుడును తన ఇల్లు అయిన ఒక బ్రహ్మాం డము మరియొక బ్రహ్మాండమును సమీపించి ఢీకొట్టుటకు వీలు లేకుండునటుల ఆకర్ష వికర్ష అను శక్తులను ఉపయోగించుచున్నా డనియు జ్ఞాపకార్థముగా చెప్పబడుచున్నది.

జ్యోతిశ్చక్రము, క్షీరవాహిని మొదలగునవి

చీకటిరాత్రియందు మేఘమండలమువైపున మనము చూ చినయెడల అశ్విని భరణి మొదలగు నక్షత్రములు కలిసి యేర్పడిన మేషము వృషభము అను రాశీసమూహామునకు ఉనికిపట్టుగా నొక జ్యోతిశ్చక్రము ఉన్నదని ఊహించవలసియుండును. జ్యోతిశ్చక్రముపైన అనేకజ్యోతిర్గణములు ఉన్నవని తెలియవచ్చును. జ్యోతిర్గణమునే శ్రీపోతనామాత్యకృత భాగవతమునందు "భగణము" అని వాడి యున్నారు. జ్యోతిశ్చక్రము (Zodiac) మన బ్రహ్మాండమునకు మాత్రము సంబంధించినదికాదు. మరియు క్షీరవాహిని అని యొక పెద్దప్రవాహామువలె ఒకనది ప్రవహించినట్టు అనేకకోట్ల నక్షత్రముల సమూహామున్నది. దీనిలో (Milkyway లో) నుండు ఒక్కొక నక్షత్రమును ఒక సూర్యుడట. సూర్యుడు ఉన్నస్థలము ఒక బ్రహ్మాం డము అని తెలిసికొనియున్నాముగదా. అధికదూరమగుటచేత సూ ర్యునివంటి పెద్దప్రకాశముగల మండలము ఒకచిన్నచుక్కవలె కన బడును. కోట్లలెక్కగల సూర్యులు కలిసియుండి ప్రవాహామువలె నుండుటచే దానిని క్షీర (Milkyway) వాహిని అందురు. మరియు మక్షికమండలము, క్రౌంచమండలము, మయూరమండలము, శరాలి మండలము, మత్స్యరాజమండలము, వలమండలము, సానుమండలము, నృగమండలము, ప్రోష్ఠానష్టకమండలము, సారథిమండలము, వీణా మండలము ఇట్లు అనేకమండలములు కూడ కనబడును.

ఇట్లు లెక్కకుమించిన మండలములు, బ్రహ్మాండములు మొదలగునవి అన్నియు "దిక్" అను పరమాకాశమునందు తేలుచు ఉన్నవి.

### శుక్రలోకమునుండి ఋషులు వచ్చుట

ఇంతటి మహాసముద్రములో ఈదులాడుచుండు బ్రహ్మాండములలో మన బ్రహ్మాండమునందు శుక్రలోకమునుండి కొందరు ఋషులు బ్రహ్మదేవుని యుత్తరవుపొంది శ్రీ సనత్కుమారునియొక్క ఆధిపత్యముక్రింద మహీపీఠము అను పేరుతో మనలోకమునకు వచ్చిరి. మహీస్థలమునందు స్థాపింపబడిన పీఠమునకు మహీపీఠము అనిపేరు. సాధ్యమైతే ఈ గ్రంథముయొక్క అంతమునందు సనత్కుమారులవారినిగురించి ఒక అధ్యాయము వ్రాయనగును.

### పృథుచక్రవర్తి

మహీపీఠము భూలోకమునకు వచ్చినసమయమందు కొందరు రాజులు రాజ్యమేలుచుండిరిగాని వారలు ధర్మమార్గమున నడువలేదు. వారిలో వేనుడు అనువాడొకడు. అతని అధర్మమునకుగా నతడు రాజ్యభ్రష్టుడాయెను. అతనికిపుత్రుడు పృథువు అనువాడు పుట్టెను. అతనికొక భార్య. అప్పటిమునులు పృథుచక్రవర్తిని విష్ణుదేవుని అంశ అనియు అతనిభార్యను శ్రీలక్ష్మీదేవియొక్క అంశఅనియు చెప్పిరి. అతడు రాజులకు ఆదిరాజై లోకరక్షార్థంబుగా నవతరించిన భార్యాభర్తలు అని నమ్మిరి. అతడు మహాతేజోవంతుడు. ధర్మాత్మ అను మొదలగు పేళ్లను వహించియుండెను. కనుక ఆతనికి రాజ్యాభిషేకంబు సేసిరి.

ప్రజకుకావలసిన అన్నమునకుగా భూమిని సిద్ధపరిచెను. గ్రామములను, పురములను, పట్టణములను, జలదుర్గములు, గిరిదుర్గము, వనదుర్గము మున్నగు విధమున దేశమునందు నాగరికము కలుగజేసెను. ధర్మస్థాపనచేసి ప్రజలను పాలించుచుండెను.

 

శ్రీమద్భాగవతపురాణమునుండి

ఇట్లు! ధర్మరాజ్యము జరుగుచుండగా శ్రీ సనత్కుమారుల వారు అచ్చటికి వచ్చిరి.

సూర్యతేజులైన సనకాదులు నలువురు సిద్ధులు లోకములకు పావనత్వంబు కావింప అంతరిక్షము డిగి తనయొద్దకు వచ్చుచున్నంత మహాతేజోమయమయిన అగ్నియొక్క పరమ తేజోవిశేషము నుపలక్షించి పృథు మహీవల్లభుండు తదవలోకనార్థము ...... లేచి ..... సదస్యులుండానును ఎదురేగి వినయ వినమితోత్తమాంగంబున పూజోపకరణముల మోచికొని చని విధియుతంబుగ నమ్మునులఁ పూజించి ..... వారి పాదప్రక్షాళనోదకంబు శిరంబునం బ్రోక్షించుకొని ..... కాంచనాసనంబుల సుఖాసీనులైయున్న ఆ సిద్ధమునుల ..... తో నిట్లనియె.

మంగళాయనులారా ఏ నేమి మంగళ మాచరించితినోగాని యోగులకైన నలభ్యంబైన భవద్దర్శనంబు వడసితి. బ్రాహ్మణులు, శివుడు, విష్ణువు, భాగవతులు నెవ్వనియెడ ప్రసాదింతురో అతనికిక్కడ నక్కడ నెయ్యది దుర్లభంబు. .... మునిశ్రేష్ఠులారా స్వాగతంబ కదా. ముముక్షువులైన మీారు బాలురయ్యు ధీరులై శ్రద్ధతో మహావ్రతముల నాచరింతురు. మీా యాచారంబుచూచి ఇతరులును తత్పథంబున వర్తింతురు. ..... ఆత్మవంతులకాత్ముడై ఆత్మభావనుండైన భగవంతుడు ఆత్మభక్తుల నను గ్రహించువాడై నిక్కంబు యుష్మాదృశ సిద్ధరూపమున జనియించుచుండునని విన్నవిన్నవించె.

అందుకు సనత్కుమారుడిట్లనియె:

మహారాజా నీవు లెస్సఅడిగితివి. ఆత్మేతరంబగు దేహాదులమీాద వైరాగ్యంబును నిర్గుణబ్రహ్మంబుపై నత్యంతరతియు నరులకు పారమార్థికక్షేమంబునకు హేతువని శాస్త్రములందు నిశ్చితంబై యున్నది. అట్టి విరక్తియు బ్రహ్మాభిరతియు యోగేశ్వరోపాసనం

బును రాజసతామసగోష్ఠీపరివర్జనంబును అర్థకామాదుల అపరి గ్రహంబును ఎడబాయని వివిక్తసేవయు ఆత్మసంతోషంబును హింసను వర్జించుటయు శీతోష్ణాది ద్వంద్వసహనంబును భక్తి యోగంబున సిద్ధించును. కర్తృత్వ భోక్తృత్వాదులం బరిగ్ర హించవలయు. తీవ్రమగు సంసారబంధము ద్రెంచగోరువాడు సంగము త్యజించవలయును. కావున రాజా దేహేంద్రియప్రాణ బుద్ధ్యహంకారములచే నావృతంబులైన స్థావరజంగమంబులలో నంతర్యామియై వెలయు ఆత్మ నేనే అని తాదాత్మ్యమునొందుము. ఇట్టి జ్ఞానము అసాధ్యమగునేని భక్తియోగము నభ్యసించవల యును. భక్తియోగము ఎట్టిదనిన ఎవ్వని పాదపంకజవిలాసము మీద యతులును, సాధువులును ఇంద్రియముల నిగ్రహించి భక్తిచేసి భక్తిమార్గమున వాసుదేవునిచెందుట సులభమని తెలిసి కొనిరో అట్టి భక్తిని సలుపుము. భజనీయంబైన భగవత్పాదంబు నావగా నాశ్రయించి దుస్తరంబు (దాటుటకు=తరించుటకు అసాధ్యంబైన) అయిన సంసారసాగరమును తరింపుము.

ఇట్లు ఉపదేశించినకాలమే శుక్రలోకమునుండి సనత్కుమా రులు మొదలగు ఋషులు భూలోకమునకు వచ్చినకాలముగా నెంచుదును. శ్రీ బిసెంటమ్మగారు దివ్యదృష్టితో ఈ సందర్భమును చూచి శుక్రలోకమునుండి అగ్నిజ్వాలాతుల్యములైన విమానములలో వచ్చిరి అనిచెప్పిరి.

> తత్రోపజగ్ముః మునయః చత్వారః సూర్యవర్చసః ।
> తాంస్తు సిద్ధేశ్వరాన్ రాజా వ్యోమ్నోవ తరతోర్చిషా ॥
>
> (శ్రీమద్భాగవతము, చతుర్థస్కంధము)

## మహీపీఠముయొక్క చర్య

1. పూర్వకల్పముయొక్క అంతమునందు జరిగిన ప్రళయము నందు మునిగిపోయిన వేదములను పురాణములను స్మృతులను మహీ పీఠమువారు మరల సంపాదించిరి.

యుగాంతేంతర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః ।
లేభిరే తపసా పూర్వం అనుజ్ఞాతాః స్వయంభువా ॥

### వేదములు

వేదములు అంతర్ధానము చెందియుండినవి అని చెప్పబడినది. శబ్దము చేయలేకయుండినవి అని యర్థము. శబ్దము అను తత్త్వమునకు ఆకాశము తన్మాత్ర. ఆకాశతన్మాత్ర ఉన్నస్థలములలోనే శబ్దము వినబడును. శ్రోత్రేంద్రియమునకును శబ్దమునకు ఆకాశ తన్మాత్రసామాన్యము. పృథివి అప్పు తేజస్సు వాయువు అకాశము అను తత్త్వములు కలవు. ఇవి సృష్టియొక్క ఆదియందు ఒకటితో నొకటి కలియకయుండి పిదప పంచీకృతములు అగును. ఒక్కొక తత్త్వమును మిగిలిన నాలుగుతత్త్వముల భాగములు కొనియుండును. అనగా పృథివీతత్త్వమునందు సగముభాగము పృథివి, మిగిలిన సగమునందు నాలుగు తత్త్వములు, (1) అప్పు, (2) తేజస్సు, (3) వాయువు, (4) ఆకాశము అనునవి, పరకపాలు ఒక్కొకటియు, కలిసి యుండును. కాబట్టి పంచీకృతము అని పేరు. పంచీకృతమైన అప్తత్త్వమునందు సగముభాగము అప్తత్త్వము పరకపాలు తేజస్తత్త్వము, మరియొక పరకపాలు వాయుతత్త్వము, మరియొక పరకపాలు ఆకాశతత్త్వము, మిగిలిన పరకపాలు పృథివీతత్త్వమును ఉండును. ఇదేవిధముగా మిగిలిన అన్ని తత్త్వములును పంచీకృతములు అయి వుండును. దీనినే పంచీకృత తత్త్వములు అందురు. పంచీకృత ఆకాశ తత్త్వమునందు శబ్దతన్మాత్రయొక్క స్పందములు ప్రవేశించినపుడు మన చెవులకు (శ్రోత్రేంద్రియమునకు) శబ్దము వినవచ్చును. ప్రళయ కాలమునందు నిలిచిన తత్త్వములు అపంచీకృతములు కనుక శబ్దము మనకు వినదు. యోగులు వారలశ్రోత్రేంద్రియములను అపంచీకృత తత్త్వముల, తన్మాత్రలనుకూడ గ్రహించునట్లు సిద్ధపరచియుందురు. కనుక వారలు అపంచీకృతతత్త్వములను గ్రహించుచుందురు. ఈ శక్తికి సూక్ష్మశబ్ద గ్రహణశక్తి అని పేరు. ఈ భావమునే పై శ్లోకము నందు “తపసా” అను పదము సూచించుచున్నది.

యోగబలముచే (తపసా) సూక్ష్మశబ్దములను వినుటసాధ్యము. యోగబలముచే తత్త్వముల సూక్ష్మతను జయించి ఇంద్రియములు పనిచేయును. యోగబలముచే జరుగునవి వింతలు అనబడుచుండినవి. అందరును యోగులుకారు. యోగులలోకూడ అనేక తరగతులు గలవు. అట్లు ఉన్నను ఇప్పటి పాశ్చాత్య ప్రకృతిశాస్త్రజ్ఞులు కొందరు, యోగులు చేయవలసిన యమనియమాదులను (యమము నియమము అనుపేళ్లు ఉపయోగించి చేయకపోయినను) వారలధోరణి ప్రకారముగానే మంచి శీలమును వృద్ధిచేసికొని నిరంతరాభ్యాసమువల్ల కొన్నిశక్తులను సంపాదించుకొని ప్రకృతియొక్క వెలుపలి ఆవరణమును ముట్టడించి అందుదాగియున్న కొన్నిసూక్ష్మములను స్వాధీనపరుచుకొనియున్నారు. అందుకు కావలసిన పరికరములగు యంత్రములనుకూడ సిద్ధపరచియున్నారు. అందులో నేత్రేంద్రియశక్తి " ఎక్సు రే " అని యొకటిని ఉపయోగించి శరీరమునందు హృదయసీమయందలి అంగములను శరీరమునుకోసి తెరువకయే ఫోటగ్రాపు ఎత్తుచున్నారు. మరియు అమెరికాలో ఉపన్యాసమిచ్చుచున్న వ్యక్తిని మనము ఇక్కడినుండియే చూచుటకు సాధ్యమగునట్లు యంత్రములను కనిపెట్టియున్నారు.

మరియు శ్రోత్రేంద్రియమునకు (Wireless) వైయరులెస్సు అను ఆకాశవాహినీ శబ్దగ్రహణము సాధ్యము అగునట్టుచేసి యున్నారు. మనము వినునట్టి రేడియోసంగీతములు పాటలు ఇవన్నియు ఆకాశతత్త్వముయొక్క రహస్యమును కనుగొన్న పశ్చిమదేశశాస్త్రజ్ఞులు కనిపెట్టినయుక్తులు. ఇవన్నియు పంచీకృతభూతములకేగాని అపంచీకృతభూతములను సమీపించుటకు సాధ్యముకాదు. ఇదివరకు కాలేదు.

ముండకోపనిషత్తునందు విద్యలు రెండు అనియు వానికి పరా అనియు అపరా అనియు పేళ్లు అని చెప్పియున్నది.

తత్రాఽ పరా ఋగ్వేదో యజుర్వేద స్సామవేదః అధర్వవేదః శిక్షా కల్పోవ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషం ఇతి ॥

"యుగాంతేఽంతర్హితాన్" అని ౩౬ వ పుటయందు చెప్పబడిన శ్లోకమునందు మహర్షులు వేదములను ఇతిహాసములతో సహా కనుకొన్నారని చెప్పియున్నది. ఒకొక్క ఋషియు వేదముయొక్క ఒకొక్కభాగమును కనుకొన్నట్టు చెప్పియున్నారు. కాబట్టి వేదములో "ఋషిదైవతఛందాంసి" అని వాడుకగలదు. వేదములకును వేదాంగములకును కర్తలు గలరు. వీరందరును మహీపీఠముయొక్కసభకు చేరినవారే. ఇకముందు వ్రాయబోవు దేవయానము పితృయానము అను అంశముక్రింద ఈ సంగతి కొంచెముగా చెప్పబడును. ఇచట వేదములయొక్కయు వేదాంగములయొక్కయు వివరము వ్రాయబడును. (1) ఋగ్వేదము, (2) యజుర్వేదము, (3) సామవేదము, (4) అథర్వణవేదము అని వేదములు నాలుగు. ప్రణవవాదము అను ఒక అపూర్వగ్రంథమునందు ఈ ప్రకారము చెప్పియున్నది.

> అథ చతుర్ణాం ఋగ్యజుస్సామాథర్వాణాం వేదానామధిపతయః ॥
> మహావిష్ణువిష్ణుశివబ్రహ్మాణశ్చ విజ్ఞేయా భవంతి ॥

ఇక ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము అను నాలుగు వేదములకు అధిపతులు వీరు వీరు అని తెలిసికొనవలయును. ఋగ్యజుస్సామములకు సమాహారమైన అథర్వణవేదమునకు అధిపతి మహావిష్ణువు.

> మహావిష్ణోశ్చ సంభూతః సమాహారప్రవచనపరోఽథర్వవేదః । విష్ణోస్సకాశాత్ జ్ఞాననిష్ఠశ్చ ఋగ్వేదః । యజుర్వేదః క్రియానిష్ఠశ్చ బ్రహ్మణః శివాచ్చేచ్ఛానిష్ఠః సామవేదః ॥

జ్ఞాననిష్ఠను బోధించు ఋగ్వేదమునకు అధిపతి విష్ణువు. క్రియానిష్ఠనుబోధించు యజుర్వేదమునకు అధిపతి బ్రహ్మ. ఇచ్ఛానిష్ఠను ఉపదేశించు సామవేదమునకు అధిపతి శివుడు.

> జ్ఞాననిష్ఠోఽభవద్విష్ణుః క్రియానిష్ఠః ప్రజాపతిః ।
> ఇచ్ఛానిష్ఠశ్శివస్సాక్షాత్ మహావిష్ణుస్సమాహృతః ॥

జ్ఞానేచ్ఛేచ క్రియాచైవ మహావిష్ణురితీరితం ।
జ్ఞానం విష్ణురితిప్రోక్తం క్రియాబ్రహ్మ సనాతనః ॥
ఇచ్ఛాశివస్సమాఖ్యాతా సర్వేభ్యో విశ్వసంస్థితిః ॥

జ్ఞానశక్తి క్రియాశక్తి ఇచ్ఛాశక్తి అని శక్తులు మూడు. జ్ఞానశక్తి విష్ణువు. క్రియాశక్తి బ్రహ్మ. ఇచ్ఛాశక్తి శివుడు. ఈ మూటి యొక్క అనగా జ్ఞాన ఇచ్ఛా క్రియాశక్తుల సమాహారము మహావిష్ణువు. (మహావిష్ణువునే మహేశ్వరుడు అని శివపురాణములు చెప్పెను.)

వేదాంగములు: (1) శిక్ష, (2) కల్పము, (3) వ్యాకరణము, (4) నిరుక్తము, (5) ఛందస్సు, (6) జ్యోతిషము.

(1) శిక్షఅను వేదాంగము మహేశ్వరునిది. దీనికి నారద మహర్షి భాష్యమును వ్రాసినట్టు తెలియుచున్నది. 90000 గ్రంథము.

(2) కల్పము. దేవీకృతము, 248000 గ్రంథము.

(3) వ్యాకరణము. సూత్రములు మహేశ్వరునివి. భాష్యము నారదులది. 100000 గ్రంథము.

(4) నిరుక్తము. ఇది ఒకవిధమైన అమరకోశమువంటిది. 55000 గ్రంథము.

(5) ఛందస్సు. శ్లోకముల వర్ణగణముల సంఖ్యను, నియతిని తెలుపునది. 172000 గ్రంథము.

(6) జ్యోతిషము. సూర్యసిద్ధాంతము మొదలగునవి. 100000 గ్రంథము.

ఇవిగాక దర్శనములు ఆరు కలవు. వీటికి ఉపాంగములు అని పేరు. (ఉపాంగములు అనుశబ్దము శ్రీమహాభారతము వనపర్వము నలోపాఖ్యానమునందు “సాంగోపాంగములగు నాలుగు వేదములు” అని యున్నది.) (1) వేదాంతము, (2) సాంఖ్యము, (3) న్యాయము, (4) మీమాంస, (5) వైశేషికము, (6) యోగము.

స్మృతులు అనేకములుగలవు. ముఖ్యమైనవి మనుస్మృతి, పరాశరస్మృతి.

ఉపవేదములు : (1) ఆయుర్వేదము, (2) ధనుర్వేదము, (3) గంధర్వవేదము, (4) కారణ్యోపవేదము, (5) కామశాస్త్రము. ఇందు కారణ్యోపవేదము వ్యాపారము, కృషి, పశువులు, వాస్తుశాస్త్రము, శిల్పశాస్త్రము, ధర్మశాస్త్రము, మొదలగువాటినిగురించి చెప్పునది.

వేదాంతదర్శనమునకు చేరినవి ఉపనిషత్తులు.

వేదము, వేదాంగములు, ఉపవేదములు, దర్శనములు ఇవన్నియు ధర్మము, అర్థము, కామము మోక్షము అను పురుషార్థములను గురించి చెప్పునవి.

పురాణములు ఇతిహాసములు ఇవన్నియు పురుషార్థములను ఉదాహరణపూర్వకముగా తెలుపునవి.

> వేదాశ్చత్వారో భవంతి ఋగ్యజుస్సామాథర్వాణశ్చేతి । జ్ఞానప్రవచనపరో ఋగ్వేదః । క్రియాప్రవచనపరో యజుర్వేదః । ఇచ్ఛాప్రవచనపరం సామ । ఏతత్త్రియాణా మేకబీజపరత్వేన సమాహారప్రవచనపరోథర్వవేదః ।

పైనచెప్పినప్రకారము ఋక్, యజుస్సు, సామము, అధర్వణము అని వేదములు నాలుగు. జ్ఞానము ప్రవచనముచేయునది ఋగ్వేదము. కర్మ (క్రియా) ప్రవచనపరము యజుర్వేదము, ఇచ్ఛాప్రవచనపరము సామవేదము. ఈ నాలుగింటి సమాహారము అధర్వణవేదము.

ప్రతివేదమునందును మూడుభాగములు గలవు. అవి మంత్రము, బ్రాహ్మణము, ఉపనిషత్తు.

> త్రైవిధ్యేన మంత్రబ్రాహ్మణోపనిషదాం ప్రవచనం । మంత్రశ్చ జ్ఞానప్రవచనపరం । బ్రాహ్మణస్తు క్రియాప్రవచనపరం । ఉపనిషదశ్చేచ్ఛాప్రవచనపరాః । త్రయాణా మేకబీజత్వేన ప్రవచనపరం తంత్రమితి ప్రతీయతే ॥

మంత్రము జ్ఞానప్రవచనపరము, బ్రాహ్మణము క్రియాప్రవచనపరము, ఉపనిషత్తులు ఇచ్ఛాప్రవచనపరములు, ఈ మూటియొక్క సమా

హారము ఉపవేదమైన తంత్రము (తంత్రములందు సాధారణముగా శక్తిపూజ వివరింపబడియున్నది).

తస్మాత్సర్వేషు వేదేషు ఋగ్యజుస్సామాథర్వసు మంత్రబ్రాహ్మణోప నిషత్తంత్రాణి చ పరిదృశ్యంతే ॥

కనుక ఋగ్యజుస్సామాధర్వణము లను నాలుగువేదములయందును (1) మంత్రములు, (2) బ్రాహ్మణములు, (3) ఉపనిషత్తులు, (4) తంత్రములు కలవు.

మంత్రస్తావత్సంహితారూపః । సంహీయంతే సంక్షీయంతే సర్వమస్మిన్ । ఇతి సంహితా ।

మంత్రములన్నియు సంహితారూపములు. అన్ని విషయములును ఇందులో సంక్షేపించబడియున్నవి గనుక సంహిత.

బ్రహ్మస్వరూపనిర్ణయవిషయాః వేదాంశాః బ్రాహ్మణసంజ్ఞకాః వ్యవస్థితా భవంతి ।

బ్రాహ్మణాని జ్ఞాత్వా బ్రాహ్మణో భవతి ఇత్యుపదేశః ॥

బ్రహ్మస్వరూపమును నిర్ణయించు వేదాంశములు బ్రాహ్మణములు అనబడును.

ఉప సమీపే నిషీదతీతి వ్యుత్పత్త్యా హి ఉపనిషచ్ఛబ్దః ॥

సమీపమునకు తెచ్చునది (సృష్టివైభవమును) గనుక ఉపనిషత్తు అనబడును.

వేదములకు శాఖలు గలవు. సాంగోపాంగ శాఖాసమేత వేదములనుగురించియే సంగ్రహముగా నీ క్రింద వ్రాయబడుచున్నది.

వేదములను అభ్యసించుట అని ఒక ఆచారము కలదు. దీనికి వేదాభ్యాసము అని పేరు.

వేదస్వీకరణం పూర్వం విచారోఽధ్యయనం జపః ।
తద్దానం చైవ శిష్యేభ్యః వేదాభ్యాసో హి పంచధా ॥

అనగా వేదమును స్వీకరించుట అనగా అధ్యయనముచేయుట, ఇతరులకు నేర్పుట, దానిఅర్థవిచారము చేయుట, జపించుట, వీటికన్నిటికిని వేదాభ్యాసము అని పేరు.

వేదమును అధ్యయనము చేయకూడని దినములు కొన్ని ఉన్నవి. ప్రదోషదినము, పాడ్యమి, పర్వదినములు మొదలగునవి అనధ్యయనదినములు.

వేదములకు ఉదాత్తము అనుదాత్తము స్వరితము అని స్వరములు గలవు. స్వరములను తప్పుగా చెప్పినపుడు మంత్రముల యొక్క ఫలము మారిపోవును.

వేదాక్షరములకు దేవతలు గలరు

1. అనిలదేవతయొక్క అక్షరములు: అ ఆ ఏ క చ ట త ప య ష—పది అక్షరములు.
2. అనలదేవత (అగ్ని): ఇ ఈ ఖ ఛ ఠ థ ఫ ర స ణ—పది అక్షరములు.
3. మహీ దేవత: ఉ ఊ ఓ గ జ డ ద బ ల హ—పది అక్షరములు.
4. ఇందుః: ఋ ౠ ఔ ఘ ఝ ఢ ధ భ వ ళ—పది అక్షరములు.
5. అర్కః: ఌ ఙ ఞ ఈ న మ ≈క ≈ప ≈ శ—పది అక్షరములు.

అక్షరములకు జాతులు కలవు

1. బ్రాహ్మణజాతి—అచ్చులు, క చ ట త ప ఖ ఛ ఠ థ ఫ.
2. క్షత్రియజాతి—వర్గతృతీయాక్షరములగు, గ జ డ ద బలు వర్గచతుర్థాక్షరములగు ఘ ఝ ఢ ధ భ.
3. వైశ్యజాతి—ఙ ఞ ణ న మ య ర ల వ.
4. శూద్రజాతి—శ ష స హ ళ ≈క ≈ప ≈.

### వేదములశాఖలు

ఋగ్వేదాది విభాగేన వేదా శ్చత్వార ఈరితాః ।
తేషాం శాఖా హ్యనేకాః స్యుః తా సూపనిషద స్తథా ॥
ఋగ్వేదస్య తు శాఖాః స్యుః ఏకవింశతి సంఖ్యయా ।
నవాధికశతం సంఖ్యా యజుషో మారుతాత్మజ ॥
సహస్రసంఖ్యయా జాతా శ్శాఖాస్సామ్నః పరంతప ।
అథర్వణస్య శాఖాః స్యుః పంచాశద్భేదతో హరే ॥

శ్రుతిస్మృతులలో చెప్పిన బ్రహ్మజ్ఞానమును ఆ జ్ఞానమునకు సాధకములుగానుండు శమదమాది విషయములను ఎవ్వరెవ్వరు ఎట్లు అనుష్ఠించిరి అనుమొదలగు విషయములను తెలుపునట్టివి ఇతిహాసములు పురాణములు.

ఇవన్నియు మహీపీఠపుఋషులు లోకులకు ఇచ్చినవి. పురాణములు పదునెనిమిది గలవు.

| | |
|---|---|
| 1. బ్రాహ్మము. | 2. పాద్మము. |
| 3. వైష్ణవము. | 4. శైవము. |
| 5. భాగవతము. | 6. భవిష్యము. |
| 7. నారదీయము. | 8. మార్కండేయము. |
| 9. ఆగ్నేయము. | 10. బ్రహ్మకైవర్తము. |
| 11. లైంగము. | 12. వారాహము. |
| 13. స్కాందము. | 14. వామనము. |
| 15. కౌర్మము. | 16. మాత్స్యము. |
| 17. గారుడము. | 18. బ్రహ్మాండము. |

ఇట్లు 18 పురాణములు కలవు. ఇట్లే 18 ఉపపురాణములుకూడ కలవు. మరీచిమహర్షి మొదలగువారు పురాణములను సంహితలుగా భాగించిరి. ఇందుకు ఉదాహరణము సూతసంహిత.

సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ ।
వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణం ॥

సృష్టివివరములను రాజులవంశములను వారి చరిత్రలనుగురించి చెప్పునవి పురాణములు.

బ్రహ్మ మరీచ్యాదులకు బోధించిన బ్రహ్మకల్పము మొదలగు వాటినిగురించినది బ్రహ్మపురాణము. ఇది 10000 శ్లోకములుగలది.

పద్మగర్భుడు పాద్మకల్పమునందలి చరిత్రలను చెప్పినది పాద్మపురాణము. 55000 శ్లోకములుగలది.

వారాహకల్పమునందలి చరిత్రములు, విష్ణుమాహాత్మ్యము వీటినిగురించి కృష్ణద్వైపాయనులు బోధించినది విష్ణుపురాణము. 24000 శ్లోకములుగలది.

వాయుదేవుడు ఉపదేశించిన శ్వేతకల్పమునందలి చరిత్రలును శివమాహాత్మ్యవిచారమును గలది శైవపురాణము. 12000 శ్లోకములుగలది.

గాయత్రీదేవి విషయమై పరమపురుషారాధనము, వృత్రాసుర చరిత్రము మొదలగువానింగలిగి కృష్ణలీలావినోదంబైనది శ్రీ భాగవతపురాణము. 18000 శ్లోకములుగలది.

అరుకుడు అనగా సూర్యుని ప్రభావము భవిష్యత్కల్పవిషయములు మొదలగువాటిని సుమంతుడు శతానీకునికి చెప్పినది భవిష్యత్పురాణము. 14000 శ్లోకములుగలది.

నారదుడు ఉపదేశించి బృహత్కల్పధర్మాదులను తెలుపునది నారదీయపురాణము. 25000 శ్లోకములుగలది.

మార్కండేయపురాణము 9000 శ్లోకములుగలది. ఇందులో ధర్మాధర్మవిచారము విస్తారముగా చెప్పబడియున్నది.

అగ్నిపురాణము భృగుమహర్షియొక్క ఉపదేశము. అగ్నిదేవుని ప్రభావము, యజ్ఞములయొక్క ఔన్నత్యము మొదలగు సంగతులు గలది. 15000 శ్లోకములుగలది.

బ్రహ్మకైవర్తమునందు సృష్టియొక్క వివరము సృష్టికర్తయొక్క ప్రభావమును చెప్పియున్నది. వసిష్ఠప్రోక్తము. 18000 శ్లోకములు గలది.

లింగపురాణము నందికేశ్వరప్రోక్తము. ఈశానకల్పమునందలి చరిత్రలను తెలుపునది. 11000 శ్లోకములుగలది.

వారాహపురాణము వరాహరూపిఅయిన నారాయణమూర్తి చే నుపదేశించబడినది. ఇందు మానవకల్పవిచారాదులు గలవు. 24000 శ్లోకములుగలది.

స్కాందపురాణము స్కందుడు ఉపదేశించినది. శివమహాత్మ్యమును శివధర్మమును బోధించునది. 100000 శ్లోకములుగలది.

వామనపురాణము బ్రహ్మప్రోక్తంబు. శ్వేతకల్పసంబంధమును వేదత్రయవిషయమును త్రివిక్రమవిషయములను తెలుపునది. 14000 శ్లోకములుగలది.

కూర్మపురాణము కూర్మరూపమునెత్తిన ఇందిరాపతి ఇంద్రద్యుమ్నునకు సృష్టివిషయమును వర్ణాశ్రమముల విషయంబును శివమాహాత్మ్యమునుగురించియు చెప్పినది. 6000 శ్లోకములుగలవు.

మత్స్యపురాణము మత్స్యావతారంబెత్తిన విష్ణుమూర్తి మనువునకు ఆనతిచ్చినది. సప్తకల్పముల ప్రభావము నృసింహావతారకథ వీనినిగురించి చెప్పినది. 14000 శ్లోకములుగలది.

గరుడపురాణము గరుడోద్భవము, బ్రహ్మాండముయొక్క వివరములుగలది. 19000 శ్లోకములుగలది.

బ్రహ్మాండపురాణము బ్రహ్మచే జెప్పబడినది. 12000 శ్లోకములు గలవు.

పైనవివరించిన అష్టాదశపురాణములుగాక ఉపపురాణములు పదునెనిమిది గలవు. అవియేవి అనగా.

1. సనత్కుమారము.
2. నారసింహము.
3. స్కాందము.
4. శివధర్మము.
5. దౌర్వాసము.
6. నారదీయము.
7. కాపిలము.
8. మానవము.
9. ఔశానసము.
10. బ్రహ్మాండము.
11. వారుణము.
12. కాళికము.
13. మాహేశ్వరము.
14. సామ్యము.
15. సౌరము.
16. పారాశరము.
17. మారీచము.
18. భార్గవము.

ఇవిగాక మరికొన్ని సంగ్రహపురాణములు ఋషిప్రోక్తములు కూడ కలవులని వదంతి.

వేదములలోను పురాణములలోను అనేక భాగములు ఇపుడు కానరావట. వేదములలో అనేకశాఖలు లోపించిపోయినవి. ప్రకృతమునందు దొరకుగ్రంథములను చదువుటకుకూడ మనుష్యులకు అవకాశములేదు. చిత్తవృత్తులు శిథిలములైయున్నది.

దిక్కాలములు

దిక్ + కాలము = దిక్కాలములు (Space and Time) బ్రహ్మాండమునుగురించి వ్రాసినపుడు (౩౨ వ పుటలో) దిక్ అను పదమునకు అర్థము వ్రాయబడియున్నది. అచ్చట కాలమునుగురించి వ్రాయ లేదు. కనుక కాలముయొక్క గణనగురించి పురాణములలో చెప్పియుండు సంగతులు ఇచ్చట సంగ్రహముగా క్రోడీకరించి వ్రాయబడుచున్నవి. "అహోరాత్రవిదోజనాః" అని గీతయందు ఉన్నది.

ఆదౌ నిమేషః తే అష్టాదశకాష్ఠా నామకాలః త్రింశత్ కాష్ఠాః కళా సంజ్ఞకః । త్రింశత్కళాః ముహూర్తః త్రింశత్ ముహూర్తాత్ అహోరాత్రం కాలం విదుః ॥ తృట్యాదేరారభ్య యుగపర్యంతం జ్ఞానాఖ్యానాత్ యుగాత్ కాలసంజ్ఞా హి ఆరభ్యతే ॥

తత్ర చత్వారియుగాని భవంతి । తేషాం ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థత్వ నియమేన క్రమః । ఏకత్వం చ తేషాం వేద్యం భవతి । ప్రథమశ్చ కృతయుగః । తన్మానం మనుష్యమాసాబ్దాభ్యాం విధీయతే । సప్తదశలక్షావధి వర్షేణ షట్త్రింశత్సహస్రేణ కృతయుగః । ఏవం ద్వాదశలక్షవర్షాధికాత్ పంచచత్వారింశత్ సహస్రాత్ త్రేతాయుగవ్యవస్థితిః । అష్టలక్షావధికేన చతుష్షష్టి సహస్రేణ ద్వాపరం యుగం । చతుర్లక్షావధివర్షేణ ద్వాత్రింశత్సహస్రేణ కాలేన కలియుగం వ్యవస్థీయతే ।

చతుర్యుగసహస్రాణి వియుగం విద్ధిసర్వధా । వియుగస్య సహస్రేణ వేదితవ్యం మహాయుగం ॥ మహాయుగసహస్రేణ హ్యేకః కల్పోఽభిధీయతే । సప్తకల్పసమాహారాత్ మహాకల్పో హి జాయతే ॥

చతుర్దశ మహాకల్పం చక్రమేకం ప్రకల్ప్యతే । చక్రాణాం తాదృశీ సంఖ్యానిష్ఠా మేకం వ్యవస్థితం ॥

నిష్ఠానాం తత్సమాహారో మనురిత్యభిధీయతే। చతుర్దశమనోర్యోగే మహామన్వంతరో భవేత్ ॥

యద్యపి సప్తమన్వంతరస్య మహామన్వంతరత్వేన ప్రవచనం తథాఽపి చతుర్దశానాం మనూనాం నిష్ఠ్యంతరయోజనయా తత్సాధనం ॥ అతఏవ

మనుద్వయసమాహారే భవేన్మాన్వంతరీ క్రియా। సప్తమన్వంతరాఖ్యానం మహామన్వంతరం స్మృతం ॥

నిమిషము, కాష్ఠ, కళ, ముహూర్తము, పగలురాత్రికలిసినదినము, ఇవన్నియు నెలలు, సంవత్సరములు, ఇవన్నియు మనకు తెలిసినవే. సంవత్సరములు 1728000 [1] కృతయుగము. 1296000 త్రేతాయుగము.[1] 864000 ద్వాపరయుగము. 432000 కలియుగము. కృత త్రేత ద్వాపర కలియుగములు కలిసి ఒక చతుర్యుగము అనబడును. వేయి చతుర్యుగములు ఒకవియుగము. వేయివియుగములు ఒక మహాయుగము. వేయిమహాయుగములు ఒక కల్పము. ఏడుకల్పములు ఒక మహాకల్పము. పదునాలుగు మహాకల్పములు ఒక చక్రము. పదునాలుగుచక్రములు ఒకనిష్ఠ. పదునాలుగునిష్ఠలు ఒకమనువు. ఇద్దరు మనువులకాలము మన్వంతరము. ఏడుమన్వంతరములు ఒక మహామన్వంతరము.

ఇతరత్ర ఏడుమహామన్వంతరములు ఒక నిత్య, ఏడునిత్యలు ఒక చార్ద్య, ఏడుచార్ద్యలు ఒకదైవము, ఏడుదైవములు ఒక వినిహితము. ఈ ప్రకారము కాలముయొక్క ఆనంత్యము తెలుపబడినది. ఆనంత్యము అనగా అంతములేమి. ఇదేవిధముగా ౩౨ వ పుటలో చెప్పబడిన బ్రహ్మాండముయొక్క వివరములవల్ల దేశముయొక్క ఆనంత్యము తెలుపబడియున్నది. అచట చెప్పిన బ్రహ్మాండమునకంటె అధికమైన బ్రహ్మాండములు ఉన్నవి అని ప్రణవవాదము అను గ్రంథమునందు ఈదిగువ వివరించినరీతిగా చెప్పబడియున్నది: సూర్యుడును ఏడు గ్రహములునుచేరి ఒక బ్రహ్మాండము; ఏడుబ్రహ్మాండములు జగత్తు, సహస్రజగత్తులుకలిసి ఒక విశ్వము, ఒక కోటిన్ని ఏబదిలక్షల విశ్వ

---

1 ఇక్కడిసంఖ్య కొంతవ్యత్యాస పడుచున్నది.

ములు ఒక మహావిశ్వము, రెండుశంఖల సంఖ్యగల మహావిశ్వములు ఒక లోకము, ఒక మహాశంఖము సంఖ్యగల లోకములు ఒక మహా లోకము. నూరుపద్మముల సంఖ్యగల మహాలోకములు ఒక సంసార ము. వీటికన్నిటికిని వేరు పాలకులు ఉన్నారు. ఇట్టి వివరములను గురించి ఆలోచించినపుడు 'దిక్' అను ఆకాశము అనగా బ్రహ్మాండ ములు ఈదులాడుచున్నస్థలము (Inter-Stellar Space) ఎంత విశాలమైనట్టిది అని యోచనచేయవచ్చును. ఈ మననమువల్ల దిక్ అనాద్యనంతము అను జ్ఞానము తేరును.

---

## ౨ వ అధ్యాయము

### ఆంతరంగిక పరిపాలక వర్గము

పురాణములయందు చెప్పినట్టు ఈ గ్రంథము, ౨౧ వ పుట యందు జగద్యాత్రవిషయము చెప్పబడియున్నది. అచ్చట మనువు యొక్క కార్యములు ఏవి ఏవి అని వివరముగా చెప్పలేదు. దివ్యజ్ఞాన సమాజమునందు 1920 వ సంవత్సరమున వార్షికోత్సవకాలమునందు (౨౩ వ పుట చూడుడు) శ్రీ ఆనిబిసంటు అమ్మగారు ఉపన్యసించి నపుడు మనువులు ఋషులు ఇంద్రుడు (మహాచోహాను) వీరల అధికారపద్ధతులను గురించి చెప్పియున్నారు. అది ఎట్లు అనగా:

బ్రహ్మాండమునకు అధిపతియైన ఈశ్వరుడు త్రిమూర్తులుగా మారును అని చెప్పబడియె. త్రిమూర్తులలో సృష్టికర్తకు బ్రహ్మ అని పేరు. బ్రహ్మాండముయొక్క ఆవరణరేఖచే బంధించబడిన పర మాకాశమునందు (దిక్ నందు) అణగియుండు భూతాదియొక్క (భూతాది అనగా మూలప్రకృతి) భాగమును బ్రహ్మ తీసికొని పంచీకరణము గావించి అణువులు అను స్థితికి తెచ్చును. ఈ పని ఎడతెగక జరుగుచుండును. ఇది ప్రథమ ప్రవాహము అనుకొందము. ఈ ప్రవాహము నిరంతరము ప్రవహించుచునే యుండును. బ్రహ్మ యొక్క కార్యమునకు అంతమే లేదు.

ఇట్లుండగా మరియొక ప్రవాహము ఆరంభించును. ఆ ప్రవా హమునకు నిర్మాణకర్తప్రవాహము అని పేరు. ఇది రెండవది. ఈ ప్రవాహము కొంతమట్టుకు పరిణామము అనదగును. "అవస్థాం తరతాఽవత్తిరేకస్య పరిణామితా" అనగా ముందు అణువులుగా నుండిన ప్రకృతియే అణువులయొక్క సమ్మేళనమువల్ల రూపములుగా

నైనవి. నిర్మాణకర్త ముఖ్యముగా విష్ణువు అనదగును. ముఖ్య నిర్మాణకర్త చేతిక్రింద లెక్కపెట్టుటకు అసాధ్యమైనందరు సహాయ కర్తలు ఉందురు. వీరలసంగతి "ఇంద్రుడు" అను విషయ మునుగురించి వ్రాయునపుడు వివరించబడును. ఈ సహాయకర్తలు తపస్సునందుముదిరి ముఖ్యనిర్మాణకర్తయొక్క సైన్యమునందు పూర్వకల్పములయందుచేరి పనిచేయుచుండినవారు. ఈ సైన్యమును చేరినవారు ఎడతెగకయే రూపములను కట్టుచు లోకములను, లోకులదేహములను కలుగజేయుచుందురు. ఇదివరకును రెండు ప్రవాహములను మాత్రము చెప్పితిమి. మొదటి ప్రవాహమునందు అణువులు ఏర్పడినవి. రెండవ ప్రవాహమునందు అణువుకు అణు వుకును బంధముకలిగి అనేక అణువులుకలిసి రూపములైనవి. (1) అణువులను సిద్ధపరుచుటయందు ఈశ్వరునియొక్క క్రియా శక్తియొక్క వ్యక్తిఅయిన బ్రహ్మ అపరాప్రకృతిని ఉపయోగించి పంచీకృత అణువులను సిద్ధపరుచును. (2) రూపములను కట్టుట యందు ఈశ్వరునియొక్క జ్ఞానశక్తియొక్క వ్యక్తిఅయిన విష్ణువు సృష్టియందు తనయొక్క నిర్మాణసైన్యముతో పనిచేయును. ఈ పై వివరించబడిన మొదటి ప్రవాహము రెండవప్రవాహము, ఈ రెంటికిని శ్రీ భగవద్గీతయందు పదునైదవ అధ్యాయమునందు "జీవలోకము" అని చెప్పియున్నది. (3) మూడవ ప్రవాహము ఒకటి కలదు. అది ఈశ్వరునియొక్క ఇచ్ఛాశక్తిని వ్యక్తీకరించిన శివుడు. ఈశ్వరునియొక్క "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" అంశ అయిన జీవాత్మను ఈ రూపములలో అనగా జీవాత్మవాస మునకు తగిన యోగ్యతచెందిన రూపములలో ప్రవేశపెట్టును. ఇది మూడవ ప్రవాహము. ఇక మనలోకమునందు మనకు సమీపము నందు పనిచేయుచున్న ఆంతరంగిక పరిపాలకవర్గము అను నపర నామధేయముగల రాజాంగమును గురించి విచారించుట కారంభిం తము. ఆంతరంగిక రాజాంగము అనగా ఈశ్వరాంశమునుచెందిన అధిపతియు వారి వెంబడివచ్చి వారిని సేవించుచున్న అధి కారులు. ఈ అధికారులలో రాజ్యమేలువారు, విద్యలనేర్పువారు,

శక్తిధరులు, ఈ మూడు భాగములుగల అధికారులును ఈశ్వరుని యొక్క మూడు విధములైన శక్తులను సూచించుచుందురు. త్రయీమయమైన ఈశ్వరశక్తిని ఎల్లస్థలములయందును కనుగొనవచ్చును. ఈ త్రయీమయ స్వభావము మనలలోకూడనున్నది. ఇచ్ఛా, జ్ఞానము, క్రియ అను అంతర్భాగములు కలది ఈ త్రయీమయశక్తి. మనలో నందరిలోను "సంవిత్" అనునది యొకటి యున్నది. దీనికి ఇంగ్లీషుభాషలో Consciousness (కాన్షస్‌నెస్సు) అని పేరు. ఈ శక్తివల్ల మన మొక్కొకరును బహిఃప్రపంచము ఉన్నది అని తెలుసుకొందుము. ఇది జ్ఞానశక్తి అనబడును. రెండవది ఇచ్ఛ అనునది. మనకందరకును ఇచ్ఛ అను శక్తికలదు. నేను అను జ్ఞానముతో ఇచ్ఛ అనుశక్తి కలిసినపుడు క్రియ అను చర్యకు కారణము అగును.

పరబ్రహ్మమునందు ఈ గుణములు కలవు. ఈ గుణములకు సచ్చిదానందము అనిపేరు. సచ్చిదానందము సత్ + చిత్ + ఆనందము బ్రహ్మము. ఇదే బ్రహ్మము వ్యక్తిచెంది ఈశ్వరుడైనపుడు ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తిమంతుడగును.

శ్రీమద్భాగవతమునందుచెప్పిన ఆంతరంగిక రాజాంగము, అనగా మనువు ఋషులు ఇంద్రుడు ఇందరికిని అధిపతి సనత్కుమారులవారు. జనాంగముయొక్క రూపము, వేషము, భాష, దార్ఢ్యము, స్నిగ్ధత, విద్య, చేష్టలుమొదలగునవి అన్నియు జనాంగముయొక్క వాసస్థలములైన జంబూప్లక్ష క్రౌంచశాల్మల్యాదిద్వీపముల ప్రళయము మొదలగునవి అన్నియు జనాంగముయొక్క ఆంతరంగిక ప్రభుత్వముయొక్క కార్యములు. (౧౫, ౧౬ పుటలు చూడుడు.)

### మనువు

మనువుయొక్క ఉద్యోగము—జాతులు (Nations) ఎట్లు వృద్ధికి రావలయును, ఏ యే స్థలములయందు, అనగా ఏ యే ఖండములయందు ఎవ్వరు జన్మించవలయును, ఏ ఉపమనువులు, ఏ మనుపుత్రులు ఏ యే జనాంగమునకు స్వాత్మలోకములయందు ప్రభు

వుగా నుండవలెను, ఏ యే మనుపుత్రుడో, ఉపమనువో ఏ యే జనాంగమునకు భూలోకమునందు తండ్రిగానుండవలయును, ఏ యే వ్యక్తులు భూలోకమునందు ఏ యే జనాంగమునకు రాజు, చక్రవర్తి పరిపాలకుడుగా నుండవలయును, ఏ యే జనాంగము ఏ విధముగా విద్యనేర్చుకొనవలయును, ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తులలో దేనిని బల పరుచుకొనవలయును, సత్ చిత్ ఆనందములలో దేనిని స్థిరపరుచు కొనవలయును, ఏ విధముగా సత్ చిత్ ఆనందములు వికసించి చిద్ఘన, సద్ఘన ఆనందఘనస్థితిని సమీపించుటకు అర్హతసంపా దించుకొనవలయును అను అంశములను బాగుగ చింతించి ఏర్పాటు చేయుట. ఏ యే జాతియొక్క వృద్ధికిగా ఏ క్రొత్త దేశములను సము ద్రాంతరమునుండి బయటికి తేవలయును. ఏ యే దేశములయందు భూకంపము మొదలగు విపత్తులను కలుగజేసి ఏ యే దేశములను నశింపజేయవలయును. ఎక్కడ సముద్రముగా, జలార్ణవముగా నుండు స్థలమును ఎండగొట్టి దేశములుగా జేయవలయును; ఏ యే దేశ ములకు యుద్ధములు మారీఉపద్రవములు మొదలగు వినాశకారణ ములను కలుగజేసి ఏ యే దేశములను ఏ యే జాతులను నశింపజేయ వలయును; నశించిన స్థలములలో ఏ యే క్రొత్తజాతులను తెచ్చి చేర్చి వారియొక్క వృద్ధికితగిన అనుకూలములను కలుగజేయవల యును అను అంశములను నిర్ణయించుట. ఇట్టి వన్నియు మనువు మనుపుత్రులు ఉపమనువులు మొదలగువారల పనులు.

ఒక్కజాతి ప్రబలి ఉన్నతస్థితిలో నుండునపుడే వారిలోకొం దరిని చీలదీసి వేరొక దూరదేశమునకు నడిపించుకొనిపోయి అచ్చట వారల జన్మపునర్జన్మాదులను ఏర్పాటుచేసి వారి శరీరములను క్రొత్త క్రొత్త తరహాగా సాముద్రికలక్షణములను పొందునటుల వృద్ధిపరిచి వానియందు నివసించపోవు జీవాత్మలయొక్క వికాసమునకు కావల సినతీరున ఇంద్రియగోళములను తీర్చి క్రొత్తవిధముగానుండు శరీర ములను నిర్మించుటయు మనువుయొక్క పనియే. చీనాదేశపువారి కండ్లు బాదాంగింజవలె గుండ్రముగా నుండును. జపానుదేశమువారును కొంతమట్టుకు చీనాదేశమువారివలెనే యుందురు. హిందూదేశము

నందలి జనులశరీర అంగనిర్మాణము చీనాజపాను దేశములవారి శరీర అంగనిర్మాణమునకు వ్యత్యాసముగా నుండును. సాముద్రికలక్షణములు దేశ దేశ శరీరములలో మారుపడియుండును. ఈ మార్పులన్నియు మనువువల్లనే కలిగించబడినవి. మంటిబొమ్మలనుచేసి ఆ బొమ్మలు తాను అనుకొన్నతీరున రూపముకొనక వ్యత్యాసమున్న యెడల ఆ బొమ్మలను కుమ్మరి పగలగొట్టి వేరుబొమ్మలను చేసినట్టు ఏ యే జాతియొక్క శరీరములు భౌతికమునందు ఏ యే విధముగా కనపడవలెనో ఆరూపు వచ్చునంతవరకును తనచే నేర్పరుచబడిన శరీరముల భౌతికరూపములను మార్చుచుండుట మనువుయొక్క కార్యము. క్షత్త్రియులధర్మము రాజ్యమేలుట అని చెప్పబడియున్నది. రాజ్యమేలుట అన్న ఒకమాటలో ఎన్నో అభిప్రాయములు మునిగియున్నవి. ఆ యభిప్రాయములన్నియు మనువుయొక్క మానసిక సీమయందు ప్రచ్ఛన్నములుగానుండును. ప్రచ్ఛన్నములుగానుండువాటిని వ్యక్తతకుతెచ్చి తన యిచ్ఛప్రకారము రూపములు ఏర్పరిచి దేశములను కల్పించి అచ్చటచ్చట ఆ యారూపములను కాపురము చేర్చుట మనువుయొక్క కార్యము. ఒకజాతివారి పురుషులకు మరియొకజాతివారి స్త్రీలకును సమాగమముకలుగజేసి ఆరీతిన క్రొత్తతరహా దేహకాంతి దేహదార్ఢ్యము మొదలగువాటిని కలిగించుట మనువుయొక్క పనియే. శుక్రలోకపు దేవయానకును భూలోకపు యయాతికి సంబంధము కలిగినట్లు మనము అనుకొని దాంపత్యములను కలుగజేయుటయు మనువుయొక్క కార్యమే. కలియుగమునందు ఉండవలసిన పరిస్థితులను కలుగజేయుటకు ద్వాపరయుగముయొక్క మధ్యకాలములోనే తనయొక్క దీర్ఘదర్శిత్వమును ఉపయోగించి ఆపరిస్థితులు కలుగుటకు ప్రయత్నము చేయుటకూడ మనువుయొక్క కార్యమే.

మనువుయొక్క అనుమతిలేకనే ఒక దేశమువారు మరియొక దేశమువారితో సంబంధా సంబంధములు కలుగజేసికొనరు. ఒక దేశీయులు మరియొక దేశస్థులతో వ్యాపారములు వర్తకములు కలుగజేసికొని ఒకరితో నొకరికి మైత్రికలిగి అందువల్ల ఒకరి సద్గుణములు

సత్సంప్రదాయములు మరియొకరు నేర్చికొని జాతికిని జాతికిని దేశమునకును దేశమునకును మైత్రికలిగి ఆమైత్రిని ఆ వ్యాపారమును ఆధారముగా జేసికొని ఆ పరదేశమువారు ఒక దేశమునందే నిలుచి క్రమేణ వ్యాపారములను వదిలి దేశమునందు యుద్ధములలో పాల్గొని వారలను ఓడించి రాజ్యమును పొందుట మొదలగు విధముగా జనాంగసమ్మేళనము కావించుటయు మనువుయొక్క ఉద్దేశపూర్వకముగానే జరుగుకార్యములే.

ఆంతరంగిక పరిపాలకవర్గమునందలి ఉన్నత అధికారులు ఒకపుడు మనవలె సంసారములలో ఈదుచు సుఖదుఃఖముల ననుభవించుచు క్రమేణ నివృత్తిమార్గయాత్ర నారంభించి ఆ మార్గమునందు పైకెక్కి జీవన్ముక్తులై బ్రహ్మవేత్తలైనవారు. వారలకు మనవంటి వారలు పడుకష్టములన్నియు అనుభవమే. సర్వజీవాత్మైక్యభావమునందు స్థిరపడిన ఆధికారికవర్గమునకు చేరినవారు. అధికారులలో నొక్కటేయుద్దేశము రాజిల్లుచుండును. అందువలన మనువు జీవాత్మలవిషయమై చేయుకార్యములకు అనుకూలముగా ఇంద్రుడును అతనిచేతిక్రింద ఉద్యోగస్థులందరును కావలసినన్ని విధములుగా నడుచుకొని ఆ జీవాత్మలసమూహములకు కాలానుగుణ్యముగా కావలసిన మతములను ధర్మములను ఉపదేశించుచు తగుపరిస్థితులను ఋషులు అమర్తురు. కనుక మనువు, ఋషులు, ఇంద్రుడు ముగ్గురును ఏకగ్రీవముగా పని చేయుచు తమకు సనత్కుమారులవారు ఇచ్చిన కార్యమును జరుపుచుందురు. ఈ సమయమునందు అనగా వర్తమానకాలమందు ఋషులకందరకును వ్యాసమహర్షి అగ్రగణ్యులుగా నున్నను వాస్తవముగా మతప్రచారమును జరుపువారు మైత్రేయమహర్షిగారు.

### లోకగురువు

లోకగురువు అను అధికారమును వహించియుండువారు మైత్రేయమహర్షి. పరిపాలకవర్గమునందు సకలమతములను స్థాపించిన ఆచార్యులు చేరియున్నారు. లోకమునందు ఇపుడు ఉండుముఖ్యమైన మతములు: 1. సనాతనధర్మమతము. ఇది వేదవేదాంగములు, ధర్మ

శాస్త్రములు, గృహ్యాసూత్రములు మొదలగువానివల్ల వ్యక్తపడు చున్నది. పురాణములు ఇతిహాసములును సహాయభూతములు. వేద వ్యాసులు ఆదిగా చిల్లరఋషులవరకును ఈ మతబోధకవర్గము ఏర్పడియున్నది. శ్రీ కృష్ణులవారిని జగద్గురువు అని పురాణములు నిరూపించినవి. "కృష్ణం వందే జగద్గురుం" అని స్తోత్రములు ఉన్నవి.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య తదా ఆత్మానం సృజామ్యహం ॥

ద్వాపర యుగాంతమునందు ధర్మము క్షీణించి అధర్మము బలపడి యున్నపుడు అవతరించి శ్రీ కృష్ణమూర్తి అనుపేర కురుక్షేత్రము నందు జరిగిన యుద్ధములో యుద్ధరంగముయొక్క మధ్య శ్రీమద్భగ వద్గీతను ఉపదేశించిరి. సర్వోపనిషత్తులను క్రోడీకరించి సకలధర్మ శాస్త్రములను పిండీకరించి భక్తిజ్ఞానకర్మయోగములను బిడాయించి వానియందుగల సకల ఉన్నతతత్త్వములను శ్రీమద్భగవద్గీతగా నుపదేశించిరి కదా. తనశిష్యుడగు ఉద్ధవునకు కలిగినసందేహ ములను తీర్చువ్యాజముతో శ్రీమద్భాగవతము పదునొకొండవ స్కం ధమునందు లోకగురువైన శ్రీ కృష్ణమూర్తి ఉపదేశములను చేసి యున్నారుకదా. ఇట్టి జగద్గురువులవారు తాను భౌతికశరీరము వదులుకొనవలసిన సమయమువచ్చినపుడు శ్రీ కృష్ణమూర్తియొక్క ప్రియశిష్యుడైన ఉద్ధవుడు శ్రీ కృష్ణదర్శనార్థమై వారికడకు వెళ్లెను. అ సందర్భమును శ్రీపోతనామాత్యుడు ఈ ప్రకారము వ్రాసి యున్నాడు.

కం॥ ఒక వృక్షమూలతలమున । సకలంకగుణాభిరాము డాసీనుండై ।
యకుటిలమతి బదరీవని । కిక నీ వరుగు మని మొఱగియేగిన నేనున్ ॥

కం॥ క్రమమున నిజకుల సంహా । రము సేయగడంగు టెఱిగి రమణీయశ్రీ ।
రమణు చరణాబ్జయుగవిర । హమునకు మదినోర్వలేక యనుగమనుడనై ॥

కం॥ హరినరయుచుఁజని చనియొక । తరుమూలతలంబునందుఁ దన దేహరుచుల్ ।
పరఁగఁగ నున్న మహాత్మునిఁ । బరునిఁ బ్రపన్నార్తిహరుని భక్తవిధేయున్ ॥

సీ॥ అస్మత్ప్రియస్వామి నచ్యుతుఁ బరు సత్త్వగుణగరిష్ఠుని రజోగుణవిహీను।
సురుచిరద్వారకాపురసమాశ్రయు ననాశ్రయు నీలనీరదశ్యామవర్ణు।
దళదరవిందసుందరపత్త్రినేత్రు లక్ష్మీయుతుఁ బీతకౌశేయవాసు।
విలసిత వామాంకవిన్యస్త దక్షిణచరణారవిందు శశ్వత్ప్రకాశు।

తే॥ ఘనచతుర్బాహు సుందరాకారు ధీరుఁ। జెన్నుగల లేతరావిపై వెన్ను మోపి।
యున్న వీరాసనాసీను నన్నుఁ గన్న। తండ్రి నానందపరిపూర్ణు దనుజహరుని॥

మత్తకోకిల:
కంటిఁ గంటి భవాబ్ధిదాఁటగఁ గంటి నాశ్రితరక్షకుం।
గంటియోగిజనంబుడెందముఁ గంటిఁ జుట్టముఁ గంటి ము।
క్కంటికిం గనరాని యొక్కటిఁ గంటిఁ దామరకంటిఁ జే।
కొంటి ముక్తివిధానముం దలకొంటి సౌఖ్యములం దఁగన్॥

ఉద్ధవుడు శ్రీకృష్ణమూర్తి సమీపమునకు వెళ్లి నిలిచినసందర్భము నందే అయ్యవసరంబునం బరమభాగవతోత్తముండును మునిజనసత్తముండును ద్వైపాయన సఖుండును పరమతపోధనుండును నఘశూన్యుండును నఖిలజనమాన్యుండును బుధజనవిధేయుండును నగు మైత్రేయుండు తీర్థాచరణంబు సేయుచుంజనిచని

మ॥ కనియెం దాపసపుంగవుం డఖిలలోకఖ్యాతవర్ధిష్ణు శో।
భనభాస్వత్పరిపూర్ణయౌవనకళాభ్రాజిష్ణు యోగీంద్రహృ।
ద్వనజాతైకచరిష్ణుఁ గౌస్తుభముఖోద్యద్భూషణాలంకరి।
ష్ణు నిలింపాహితజిష్ణు విష్ణుఁ బ్రభవిష్ణుం గృష్ణు రోచిష్ణునిన్॥

పరమభాగవతోత్తముండును మునిజనమునకు మేటియు కృష్ణద్వైపాయనవేదవ్యాసులవారికి స్నేహితుండును తపస్సుబాగుగ చేయుచుండు వాడును పాపరహితుడును ఎల్లరిచేతను మర్యాద పొందువాడును పండితులు తనను అనుకరించువాడును అగు మైత్రేయమహర్షి శ్రీకృష్ణమూర్తిని చూచుటకై ఏతెంచెను.

దేహత్యాగముచేయుటకై వీరాసనాసీనుండైయున్న శ్రీకృష్ణమూర్తిని ఉద్ధవుడు సమీపించి బ్రహ్మజ్ఞానమును నాకెరింగింపుము

అని వేడగా నాతనికి బ్రహ్మజ్ఞానమును శ్రీ కృష్ణమూర్తి ఉపదేశించెను. ఉపదేశించి నే నీ లోకంబు వదలినపిదప అధికారులకు బ్రహ్మజ్ఞానము నుపదేశించుటకు ఉద్ధవుడే అర్హుడుగావున ఉద్ధవా నీవు బదరికాశ్రమంబున కరుగుము అని ఉత్తరువుచేసెను.

ఉద్ధవుడు జగద్గురువైన శ్రీ కృష్ణమూర్తిని సమీపించిన సమయమందే అచ్చటికి పరమభాగవతుండును కృష్ణద్వైపాయుని సఖుడును పరమసిద్ధుడునగు మైత్రేయమునీంద్రుడు యదృచ్ఛగా జనుదెంచె. నిత్యభక్తుడైన మైత్రేయమునితో శ్రీ కృష్ణమూర్తి సంభాషించి ఉద్ధవుని సమక్షమమందే విదురునికి భాగవతనామకంబైన బ్రహ్మజ్ఞానమును ఉపదేశింపుము అని మైత్రేయమహామునికి నాజ్ఞచేసె. జగద్గురువగు శ్రీ కృష్ణమూర్తి తనకుబదులుగా మైత్రేయ మహామునిని నిర్దేశించినట్టు ఇందువలన వ్యక్తమగుచున్నది. మైత్రేయులవారు ప్రకృతకాలమునందు మహీపీఠమునందు అధికారము వహించి మతసంబంధమైన సకలకార్యములను జరుపుచుందురు. సనాతనధర్మమతము ఒక్కటిమాత్రముకాదు. అన్నిమతములును వారి విచారణకు లోబడియేయుండును. ఏ జనాంగమునకు ఎపుడు ఏవిద్య అవశ్యమో ఆవిద్యను మతము అను వ్యాజముతో నుపదేశింతురు. మైత్రేయులవారే క్రీస్తుమతమును స్థాపించినట్టు దివ్యజ్ఞాన సమాజమునందు ప్రముఖులుగా నుండినవారు చెప్పుచుండిరి.

మతస్థాపనకు వారు స్థూలశరీరమును ధరించి ఏజనాంగమునకుగా క్రొత్తమతమును స్థాపించవలెనో ఆ జనాంగముయొక్క శరీరధారిని ఆశ్రయించి అతనిశరీరమునందు ప్రవేశించి మతస్థాపనాచార్యుని క్రమము జరుపవచ్చును. లేక ఆ శరీరధారిసమీపమునందు తాను (మైత్రేయులవారు) నిలిచియుండి ఆ శరీరధారి ఉపన్యాసము లిచ్చుచుండగా మైత్రేయులవారు తమ అభిప్రాయములను వారి మనస్సునందు ప్రవేశపెట్టితే ఆ అభిప్రాయములను శరీరధారిగానుండు వక్త తన పలుకులతో నితరులకు వక్కాణింతురు. లేక మతస్థాపకుడుగా బైటికికానవచ్చునతనిచే తన స్థూలశరీరమును ఖాళీచేయించి మైత్రే

యులవారే ఆ శరీరమునందు ప్రవేశించి ఆ సమయమునకు తానే ఆ శరీరమును ధరించినవారివలె ఆ శరీరమునందలి అవయవములను ఉపయోగించి తన అభిప్రాయములను తన శైలితోనే ఉపన్యాసము లియ్యవచ్చును. సంభాషణ జరుపవచ్చును. పరకాయప్రవేశము అని యొకవిద్యకలదు. ఆత్మవిచారము ఉత్తరభాగము ౧౯౩ వ పుట యందు పరకాయప్రవేశము, స్వకాయరిక్తీకరణము మొదలగు విషయ ములను గురించి వ్రాయబడియున్నది.

"నిహితాస్సప్త సప్త" అను వచనప్రకారము లోకరాజ్య మునందు అనగా ఆంతరంగికపరిపాలకవర్గమునందు ఏడు రేఖలు గలవు అనియు ప్రతిరేఖకును రేఖాచార్యులవారు ఉన్నారనియు ఆత్మవిచారము ఉత్తరభాగము ౭౬ వ పుటయందు చెప్పబడియున్న ది. ప్రతిరేఖకును అధికారి ఒక జీవన్ముక్తులు విచారణకర్తగా నున్నారు. మొదటిరేఖ క్షాత్రధర్మమునుగురించినది. అట్టి మొదటి రేఖకు మోర్యామహర్షిగారు రేఖాచార్యులవారు. రెండవరేఖ బ్రాహ్మధర్మరేఖ. అదియే మతసంబంధమైనరేఖ. రఘుకులమునందు రాజు శ్రీరామచంద్రుడు క్షాత్రధర్మమునకు అధికారి. అది మొదటి రేఖ అనబడును. రెండవరేఖ పౌరోహిత్యరేఖ, అనగా మతసం బంధి. రెండవరేఖకు అధిపతి శ్రీ వసిష్ఠమహామునిగారు. మొదటి రేఖకు క్షత్రియుడును రెండవరేఖకు బ్రాహ్మణుడును అధికారులు. ప్రకృతకాలమునందు మహీపీఠపుఅధికారి మొదటిరేఖకు మోర్యా ఋషి అని యిదివరకేచెప్పబడెను. వీరుక్షత్రియులు. రెండవరేఖ విద్యారేఖ. ఈ రేఖకు ప్రకృతకాలమునందు బ్రాహ్మణశరీరధారి అయిన కుతుహూమిఅను కాశ్మీరబ్రాహ్మణనామధేయమును వహించి యుండునట్టి దేవాపిమహర్షి.

ఏడు రేఖలపైకి మొదటిరేఖయు రెండవరేఖయు చాలప్రధాన ములు గనుక మొదటిరేఖకు ఆచార్యులయిన మోర్యామహర్షికి సహాయముగా మనువును, రెండవరేఖకు ఆచార్యులవారైన దేవాపి మహర్షికి సహాయముగా మైత్రేయమహర్షియు, అములు జరుపుటకు కారకులుగా నుందురు.

మూడవ, నాలుగవ, ఐదవ, ఆరవ, ఏడవ రేఖలకు అధిపతులు వేఱ్వేర అయిదుగురు అధిపతులు (రేఖాచార్యులు) ఉన్నారు. ఈ అయిదుగురు రేఖాచార్యులకును పైన విచారణకర్తగా మహాచోహాను అను పట్టమువహించిన జీవన్ముక్తులు ఉన్నారు. మహాచోహానుగారు ఇంద్రుడుచేయు పనులను చేయువారు.

రేఖాచార్యు లందరును వారిపై విచారణకర్తలగు మనువు మైత్రేయులువారు, మహాచోహానుగారును అందరును ఏకగ్రీవముగా పరిపాలనచేయుచు ప్రథమరేఖ అములు జరువునపుడు రెండవరేఖ వారివల్లగాని మూడుమొదలు ఏడుసంఖ్యవరకునుగల రేఖాచార్యుల వల్లగాని కావలసిన తోడ్పాటును అడుగకయే ఇచ్చుచు ఏకగ్రీవముగా నాంతరంగిక పరిపాలనము జరుపుచుండును. మైత్రేయులవారు ఇపుడు పొందియుండు అధికారమును వీరి సహాధ్యాయి అయిన గౌతములు వీరికి ముందు జరుపుచుండిరి. గౌతములును మైత్రేయులవారును జగద్వ్యాపారమును జరుపుచురాగా తీవ్రతపోబలముచే గౌతములవారు "తథాగతులైరి". "తథా" 'అథ' అను పదములకు వేదాంతములయందు కొన్నిముఖ్యార్థములుగలవు. తథా అనగా బ్రహ్మమును నిర్దేశించును. అనగా బ్రహ్మీభూతులయిరి అని అర్థము. ఆ స్థితికి బుద్ధులు అనియు సంబుద్ధులు అనియు సమ్యక్ బుద్ధులు అనియును అపరనామధేయములు. తథాగతులు అన్నను బుద్ధులవారు అన్నను సమ్యక్ సంబుద్ధులు అన్నను సంబుద్ధులవారు అన్నను గౌతమబుద్ధులవారినే ఉద్దేశించి పలుకుట అని అర్థము.

తథాగతులు మతసంబంధమైన రేఖాధికారిగా నున్నపుడు, జొరోస్ట్రియను మతమును స్థాపించిరి. ఈ ప్రకారముగా మనదేశమునందు అలరారు (1) సనాతనధర్మమతము, (2) జొరోస్ట్రియను మతము, (3) జూడేమతము, (4) బౌద్ధమతము అను మతములును, (5) క్రీస్తుమతమును, (6) ఇస్లాము (మహమ్మదీయ) మతమును, (7) సీక్కుమతమును స్థాపింపబడినవి.

"అధీతమానానాం ఛందసాం వీర్యవత్తార్థం పునరధ్యయనాధికారార్థం" అన్నట్టు "సకాలేనే హ మహతా యోగో నష్టః పరం

తప" అన్నట్టును కాలక్రమమున ధర్మచ్యుతి కలిగినపుడును మూఢాభి ప్రాయములు ముదిరి అముఖ్యాంశములు ముఖ్యాంశములుగా నవలంబించబడినపుడును రెండవ రేఖకు ఆచార్యులుగానుండువారును వారిపై అధికారియైన మైత్రేయులవారును అన్నిమతములును వారివే గనుక మతసామరస్యము జరుపుటకు ప్రయత్నములు చేయుచుందురు. ద్వితీయ రేఖయొక్క కార్యము ఆత్మ (అంతరాత్మ) వికాసమును గమనించుట. మొదటి రేఖయొక్క కార్యము శరీరసౌష్ఠవము, దేశసౌష్ఠవము మొదలుకార్యములను గమనించుట. మైత్రేయమహర్షికిముందు ద్వితీయ రేఖకు విచారణకర్తగా నుండినవారు గౌతమబుద్ధులు అని చెప్పబడియున్నది. వారికి సర్వజ్ఞః, సుగతః, బుద్ధః, ధర్మరాజః, తథాగతః అను నామములును వ్యాసులు అనియు పేళ్లుగలవు. వేదముల విభజన, పురాణముల శీలన, ఇవన్నియు వ్యాసులవారి కార్యము. ఆదియందు రఘుకులమునకు పౌరోహిత్యము జరిపినవారు వసిష్ఠుల వారు అని చెప్పబడియె. పురోహితులు వంశగురువులు, మతగురువులు. యోగవాసిష్ఠము అనుపేర వారు శ్రీరామచంద్రునికిని, లోకమునకును మతోపదేశమును జ్ఞానోపదేశమును చేసిరి అని యీ గ్రంథముయొక్క మొదటి అధ్యాయమునందు చెప్పబడియున్నది. పరాశరులవారు వసిష్ఠమహామునియొక్క మనుమడు. మైత్రేయఋషికి విష్ణుపురాణమును ఉపదేశించినవారు. పరాశరులపుత్రుడు వేదవ్యాసులు. వారిపుత్రులు శుకమహర్షి. వసిష్ఠులవారి వంశము ద్వితీయ రేఖయొక్క వంశము. వేదవ్యాసులవారి కుమారుడు శుకమహర్షి పరీక్షున్నరేంద్రునకు వారి మూలముగా లోకమునకును శ్రీమద్భాగవతమును ఉపదేశించిరి.

మైత్రేయమహర్షి శ్రీ కృష్ణమూర్తి అనుజ్ఞనుపొంది ఒక భరత ఖండము మాత్రముకాదు, లోకమం దెక్కడెక్కడ అవశ్యమో అక్కడనెల్ల అవతరించి ఆ యా కాలమునకు ఆ యా జాతికిని ఉచితమైన జ్ఞానమును మతములు అను పేర నుపదేశించుచున్నారు. జ్ఞానమార్గమునందు మృదితకషాయులైనవారికి జ్ఞానోపదేశముచేసి తారకదీక్ష నిచ్చువారు సనత్కుమారులవారు అని ఛాందోగ్యోప

నిషత్తునందు చెప్పియున్నది. ఉపాసకులను మృదితకషాయులుగా జేయుపనిని తరగతివారిగా హంసపరమహంసాది పదవులలో నుండు వారును మహీపీఠమునకుచేరిన జీవన్ముక్తులును కైగొనియున్నారు. ఎవ్వరు మతోపదేశము జ్ఞానోపదేశము చేసినను వారు శ్రీ మైత్రేయులవారి శిష్యజాలములోచేరినవారే అనుటకు ఏమాత్రమైనను సందియములేదు. ఈ ప్రకారము రెండవ రేఖయొక్క కార్యము జరుగుచున్నది. ఇక 3. ౪. ౫. ౬. ౭ రేఖల కార్యములను జరుపు వారినిగురించి వ్రాయబడును.

## ఇంద్రుడు

దేవతలకు అధిపతి ఇంద్రుడు అని ఇదివరకును చదివియున్నాము. ఆంతరంగిక పరిపాలకవర్గమునందు దేవతలకు అనేకవిధములైన అధికారములు కలవు. ఈ గ్రంథము ౨౨ వ పుటయందు చెప్పి యుండు శ్రీమద్భాగవత శ్లోకమునందు చెప్పినవిధముగా దేవతల అధికారముయొక్క వివరమునుగురించియు వారు ఏ విధముగా లోకమును పాలింతురు అను మొదలగు విషయములను గురించియు వ్రాయబడుచున్నది.

తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః సాధ్యామనుష్యాః పశవోవయాంసి।
(ముండకోపనిషత్తు)

ఆ ఈశ్వరునుండియే బహువిధములుగా దేవతలు, సాధ్యులు, మనుష్యులు అందరును ఉత్భవించిరి. భూలోకము మొదలు ఏడులోకములును ఒకటితోనొకటి పెనవేయబడియున్నది అనియు ఈ లోకములన్నియు "ఓతం ప్రోతం" అనియు అందువలన లోకముల సూక్ష్మతగాని స్థూల్యముగాని ప్రకృతియొక్క పరిణామము వల్లనే నిర్ధారించబడుచున్నదనియు మనము భూలోకమునందు నిలిచి యుండు స్థలమునందే భూలోకము మొదలు సత్యలోకమువరకును గల సకలలోకములయొక్క అనుభవమును అనుభవించవచ్చును అనియు ఒకలోకము విడిచి మరియొకలోకమునకు పోవలెనంటే స్థల

మువిడిచి స్థలమునకు పోవలసిన అవశ్యము లేదనియు ఆత్మవిచారము నందు జైగీషవ్య ఉపాఖ్యాన సందర్భమున చెప్పబడియున్నది.

కనుక లోకములు అనగా ప్రకృతియొక్క (పంచీకృత పంచ భూతములయొక్క) సూక్ష్మత, స్థౌల్యము అను స్థితులేగాని వేరుకావు. సత్యలోకము, తపోలోకము, జనలోకము, మహర్లోకము, స్వర్గలోకము, భువర్లోకము, భూలోకము అను నీ యేడులోకములును వరుసన పంచీకృతభూతములయొక్క సూక్ష్మస్థితి క్రమముగా స్థూలావస్థను పొందినవి అని యెరుగవలయును.

త్రిమూర్తులైన శంభువు, విష్ణువు, బ్రహ్మ అనువారు "దేవతలు" అను తరగతికి మించినవారు. సృష్టి స్థితి లయ కర్తలు త్రిమూర్తులు. "తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః" అను ఉపనిషద్వాక్యమునందు ఉండునట్టి "తస్మాత్" అను పదమునకు త్రిమూర్తులకు కారణభూతుడైన ఈశ్వరుడు అను పురుషుడు అని అర్థము.

కాబట్టి త్రిమూర్తులకు క్రిందితరగతియందు ఉండు లోకాధికారులకు దేవతలు అను పేరు అన్వయించును.

దేవతలకు శరీరములు ఉన్నవి. వారిని "విగ్రహవంతః" అని పురాణములు పలుకుచున్నవి. విగ్రహవంతః అనగా విగ్రహము (శరీరము అవయవములు) కలవారు. కేనోపనిషత్తునందు దేవతలకు జయముకలిగినందున వారు గర్వించిరి అనియు అగ్ని, వాయువు, ఇంద్రుడు వీరలు వరుసన మహాయక్షరూపములోనుండిన వ్యక్తియొక్క యెదుట కనబడి ఒక తృణమును కాల్చలేకయు కదిలించలేకయు తమయొక్క అశక్తతను తెలిపించిరి అనియు చెప్పియున్నది.

పైన చెప్పబడిన ఏడులోకములయందును దేవతలు వసియించుచుందురు. ఆ యా లోకమునందు వసియించు దేవతలకు ఆ యా లోకముయొక్క ప్రకృతితత్త్వములో శరీరములు ఏర్పడియుండును. ఆ ప్రకృతితత్త్వము మన స్థూలశరీరముల ప్రకృతితత్త్వముకంటె సూక్ష్మావస్థయందు ఉండును. కనుక మన స్థూలదృష్టికి కానరారు.

దేవతలకు వారి వారి ఉద్యోగములను అనుసరించి పేళ్లు గలవు. అనగా మనుష్యులలో జాతులు ఉండునట్టు వారలలోకూడ జాతులు కలవు. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, ప్రజాపతులు జన లోకము, తపోలోకము అను ఉత్తమలోకములయం దుండువారు; వీరలకు పైన లోకపాలకులు గలరు. అశ్వినులు, మరుత్తులు, గంధర్వయక్షాసురసిద్ధసంఘములు, భూతప్రేతపిశాచములు, కిన్నరులు, విద్యాధరులు, సిద్ధులు, చారణులు, ఉత్కలులు, వైకలలు, అప్సరసులు, ఉరగులు మొదలయిన జాతులుకలవు. వీరందరును దేవతలు, దేవయోనులు అను రెండు జాతులకు చేరినవారు. విష్ణుపురాణము ప్రథమాంశము ద్వాదశాధ్యాయమునందు "యామా నామ తదా దేవాః" అనియు "కూశ్మాండావివి ధైరూపైః" అనియు చెప్పియున్నది. కనుక యాములు కూశ్మాండులు అను జాతులుకూడ దేవతలయందు కలవు.

పురాణములయందును ఉపనిషత్తులయందును దేవతలను గురించి చెప్పునపుడు (1) దేవతలు, (2) దేవయోనులు అని రెండు విధములుగా భాగించియున్నారు. దేవయోనులు అనుజాతికిచేరిన దేవతలు ఎనిమిది విధములుగానున్నారు. 1. యక్షులు, 2. రాక్షసులు, 3. గంధర్వులు, 4. కిన్నరులు, 5. అప్సరసలు, 6. పిశాచములు, 7. గుహ్యకులు, 8. విద్యాధరులు అని యెనిమిదివిధములు. దేవయోనులు అను దేవతలకు పైతరగతివారు ఆదిత్యులు, రుద్రులు, వసువులు, సిద్ధులు, ప్రజాపతులు మొదలగువారు. వీరలు సృష్టిస్థితిలయములు అను కార్యములను చేయుచుండు వ్యూహములు. ఈ దేవతలకంటె ఉన్నతమున లోకపాలురు, లిపికులు, మొదలగువారు ఉన్నారు.

ముప్పదిమూడుకోట్ల దేవతలు ఉన్నారని విందుము. ఈ సంఖ్య చాలతక్కువైయున్నది. బృహదారణ్యకోపనిషత్తునందు యాజ్ఞవల్క్యులవారికిని శాకల్యులకును దేవతలనుగురించి వాదము జరిగినట్టు చెప్పియున్నది. అందులో ముప్పది ముగ్గురు దేవతలు ఉన్నారనియు వారలు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, ఇంద్రుడు ప్రజాపతియు కలిసి ముప్పదిముగ్గురుఅని చెప్పబడియున్నది.

పురాణములయందు పంచభూతములగు, 1. ఆకాశము, 2. వాయువు, 3. అగ్ని, 4. అప్పు, 5. పృథివి అను తత్త్వములకు వరుసను 1. ఇంద్రుడు, 2. వాయుదేవుడు, 3. అగ్ని, 4. వరుణుడు, 5. కుబేరుడు అధిపతులులని చెప్పబడియున్నది.

ఛాందోగ్యోపనిషత్తునందు దేవతలలో పరిపాలకవర్గమును గురించి చెప్పియున్నది. భూలోకమునందు హెచ్చుతరగతి తగ్గుతరగతి పరిపాలకులు ఉండునట్టుగానే దేవతలలోకూడ తరగతులున్నవని తెలియుచున్నది.

దేవతలకు రూపములున్నవా అను ప్రశ్నకు ఆ యాలోకములయందు ఉండుదేవతలకు ఆ యా లోకముయొక్క ప్రకృతితో కట్టబడినశరీరము ఉన్నదిఅని ముందేచెప్పబడియున్నది. వేదాంతసూత్రముల భాష్యమునందు "ఇంద్రనామా కశ్చిత్ విగ్రహవాన్ దేవః" అని చెప్పబడియున్నది. (విగ్రహవాన్=శరీరముగలవాడు)

సూత్ర భాష్యములో దేవతలు అనేకరూపములతో వ్యక్తమగుదురు అనియు అవశ్యమున్నపుడు అప్పటికి కావలసినరూపమును సృష్టించుకొందురు అనియు, ఒకటే సమయమందు "కాయవ్యూహ"ము అనగా అనేక శరీరములను సృష్టించుకొందురు అనియు చెప్పియున్నది. "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" అను వచనమునకు అర్థము ఇదిఅని తోచుచున్నది. "మంత్రాత్మకా దేవతాః" అని మీమాంసకుల అభిప్రాయము. ఈ విషయము మంత్రములనుగురించి వ్రాయునపుడు ఇకముందు అనువదించబడును.

ముప్పదిమూడుఅను పదము సామాన్యముగా సంజ్ఞావాచకము. ముప్పదిమూడుకోట్లమంది దేవతలు ఉన్నారు అనగా లెక్కలేనందరు ఉన్నారు అనుకోవచ్చును. లోకమునందు జనసంఖ్య ఎంత ఉన్నదో అంతకంటె అధికమైన సంఖ్యగల దేవతలు ఉన్నారు. ఈ సంగతినిగురించి ఇకముందు మరికొంతవ్రాయబడును.

దేవతలలో వారివారి తరగతికొలది బుద్ధికుశలత వైరాగ్య సంపత్తి మొదలగు గుణములు మనుష్యకోటికంటె తక్కువగానో అధికముగానో సమానముగానో ఉండును. దేవత ఏతరగతి వాడై

నను సాధారణముగా సూక్ష్మప్రకృతితో కట్టబడిన శరీరమునే ఉప యోగించును. సత్యలోకవాసిఅయిన దేవత ఎప్పుడైనను మహర్లోక మునందు పనిచేయవలసివస్తే తాను పనిచేయవలసిన మహర్లోకమునకు సంబంధించిన ప్రకృతితో దేహము ఒకటిని కల్పించుకొని మహర్లోక మునందు సంచరించి పనిచేయును. దీనికి కారణము సత్యలోకపు ప్రకృతి మహర్లోకప్రకృతికంటె సూక్ష్మము. అట్టి సూక్ష్మప్రకృతితో కట్టబడిన శరీరము మహర్లోకవాసులకు కానరాదు. ఉద్దేశించినకార్య ము జరుపుటకు అనుకూలముండదు. కార్యము ముగియగానే క్రొత్త గా కల్పించుకొన్న మహర్లోకశరీరమును పగులకొట్టి తన సత్యలోక శరీరమునే మరల ఉపయోగించుకొనును. ఈ ప్రకారము ఏ యే లోకములలో కార్యముఉండునో ఆ యా లోకప్రకృతితో శరీరములను కలుగచేసికొనును.

ఒకవేళ అట్టి సత్యలోకవాసి భూలోకమునందు ఇతరులకు తెలియునట్లు భూలోకవాసులతో కలిసిమెలిసి పనిచేయవలసివచ్చిన యెడల భూలోకప్రకృతితో మన శరీరములవలెనే శరీరమును నిర్మించు కొని ఆ కార్యము ముగిసినపిదప ఆ శరీరమును తునకలుగా జేయును.

ఈ ప్రకారముగా ఏ యేలోకవాసిదేవత సాధారణ ఉపయోగ మునకు ఆ యా లోకప్రకృతితోకట్టబడిన శరీరమును ఉపయోగించి నను ఇతరలోకములయందు ఆ లోకవాసులతో కలిసిమెలిసి పని చేయవలసినవుడు ఆ యా లోకపు ప్రకృతితోచేసిన శరీరము ఒకటిని ఆ సమయమునకు సిద్ధపరుచుకొని కార్యము ముగియగానే ఆ శరీర మును త్యజించును.

శ్రీమహాభారతము ఆరణ్యపర్వమునందు దమయంతియొక్క స్వయంవరసమయమున ఇంద్రుడు, అగ్ని, యముడు, వరుణుడు అను లోకపాలురు వచ్చియుండిరనియు వారలందరును నలమహారాజు యొక్క రూపమునేధరించి స్వయంవరమందిరమున విచ్చేసియుండి రనియు నపుడు అయిదుగురు పురుషులు నలునిరూపముతో నుండిరని యు వారలలో నలచక్రవర్తిని వీడదీసి వరించుట అసాధ్యమైనందున

ఆ॥ అనుచు సంశయాకులాత్ములై సురలార । నలు నెఱుంగవిధము నాకు
జేయు । డాత్మరూపధరుల రగుడని పరిదేవ । నంబు సేసె దన
మనంబులోన ॥

అని ప్రార్థించగానే పైచెప్పిన దేవతలు నలచక్రవర్తిరూపమును విడిచి నిలిచిరని చెప్పియున్నది. అవశ్యముకలిగినపుడు మనుష్యశరీరమును ధరించుటకును అవశ్యముతీరగానే ఆ శరీరమును విడుచుటకును ఈ కథాభాగము ఉదాహరణముగానున్నది.

## సృష్టిఆదియందు దేవతలకార్యము

సృష్టి ప్రళయము అను శబ్దములు బహువిధముల వ్యక్తస్థితికిని అవ్యక్తస్థికిని అన్వయించును. ప్రళయములు, అవాంతరప్రళయము, దైనందినప్రళయము మహాప్రళయము అని వేరు వేరుగా నుండును. అవాంతరప్రళయము అనగా భూరాదిత్రిలోకములలో ఏదో ఒక భాగము సముద్రములో మునిగిపోవుట, దైనందినప్రళయము అనగా

సహస్రయుగపర్యంతం అహర్యద్బ్రహ్మణోవిదుః ।
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహో రాత్ర విదోజనాః ॥
అవ్యక్తా ద్వ్యక్తయస్సర్వాః ప్రభవంత్యహ రాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవాఽవ్యక్త సంజ్ఞకే ॥
భూతగ్రామస్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే ।
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవంత్య హరాగమే ॥

(శ్రీమద్భగవద్గీత)

ఈ ప్రకారము ప్రళయమును సృష్టియు ఒకటి పిమ్మట మరియొకటి మారి మారి జరుగుచుండును. ప్రళయములోనుండి భూతములను సృష్టికి తేవలసినపని బ్రహ్మదేవునిది; బ్రహ్మదేవునిచేతిక్రింద లెక్క లేనందురు దేవతలు ఉందురు. సృష్టికాలము సమీపించినపుడు ఆ దేవతలు అందరును ఏ యేవస్తువులను ఏ ప్రకారముగా సృష్టించ వలయునో ఏ విధముగా గుణత్రివృత్కరణముచేసి ప్రకృతియొక్క అణువులను సిద్ధపరచవలయునో ఆపని ఒక జాతి దేవతలు చేయ

వలసినది. ఇదియే ౪౯ వ పుటయందు చెప్పిన మొదటిప్రవాహము యొక్కపని.

భూతముల పంచీకరణమును జరుపు దేవతలుకొందరు పంచీకృతభూతములను చేర్చి రూపములనుకట్టుట పరాప్రకృతియొక్క కార్యము. ఈ కార్యము అనేకకోట్లదేవతలు నడుపువారు.

ఆత్మవిచారము పూర్వభాగము మొదటికూర్పు 23 వ పుటయందు చెప్పిన

1. అభ్యాత్మవర్గము,
2. సౌరాత్మవర్గము,
3. చంద్రాత్మవర్గము,
4. ధాతువర్గము,
5. తరుగుల్మలతాదివర్గము,
6. మృగవర్గము,
7. మనుష్యవర్గము.

అను ఈ యేడువర్గములలో మొదటి మూడును దేవతలగుంపులుగాని వేరేమియుకాదు. ఇదంతయు ౪౯ వ పుటయందుచెప్పిన రెండవ ప్రవాహము. ఇట్లు రూపములనుకట్టి దేవతలు జీవాత్మలకు సమర్పించితే ఈ రూపములు మాకు ఉపయోగములు కావు; అని నిరాకరించిరి అను మొదలగు సంగతులు ఆత్మవిచారము పూర్వభాగము మొదటికూర్పు ౬౯ వ పుటయందు వివరముగా చెప్పబడియున్నది. మానవశరీరమును దేవతలు కట్టుచుండగా పూర్వప్రళయమునందు శరీరములు పోగొట్టుకొని సత్యలోకమునకు పైలోకమునందు నివసించుచు మానవదేహముయొక్క కట్టుటను ఎదురుచూచుచు తురీయాత్మలు కాచియుందురు అని ఆత్మవిచారమునందు ప్రస్తావించబడియున్నది. సిద్ధమైన మానవశరీరములయందు జీవాత్మలను ప్రవేశపెట్టునట్టి దేవతలసంఘము ఒకటి కలదు. ఇది మూడవప్రవాహమునకు సంబంధించినది. శరీరములయందు ప్రవేశించినపిమ్మట జీవాత్మను అనుసరించి వాని ప్రారబ్ధకర్మను జవదాటక నడిపించుటకుగా ఒక్కొక

మనుష్యునికి ఒక్కొక దేవత ఉన్నాడని ఆత్మవిచారమునందు చెప్ప బడియుండు దేవతాసంఘము ఎన్నోకోట్లలెక్కగలది మరియొకటి.

కర్మయొక్క రికార్డు అంతయు చూచి పరిశీలించి ఒక్కొక జీవాత్మకును జన్మకాలమునందు ప్రారబ్ధకర్మను పంచియిచ్చు దేవతల సంఘము ఒక్కటి.

ఇవన్నియు ఇంద్రుని ఆధిపత్యముక్రిందనుండు దేవతలసంఘము. ఇవిగాక అనేక దేవసంఘములు ఇంద్రునిక్రింద ఉన్నవి. ప్రవృత్తి మార్గమునందు మనుష్యులు చరించుచుండగా వారల వృద్ధికికావలసిన సదుపాయములను సంపాదించి వారియెదుటపెట్టు దేవతలు కొన్ని సంఘములు. ఇష్టాపూర్తము మొదలగు నిత్యనైమిత్తిక కర్మలను చేయు వారు మరణముచెందినపుడు వారలను ధూమాదిమార్గమునందో అర్చిరాదిమార్గమునందో తీసుకొనివెళ్లి వారికర్మలయొక్క ఫలమును వారలకు అందింపజేయు అతివాహకులు అను దేవతల సంఘములు కొన్ని. "తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి" అని స్వర్గలోకమునందు సుఖముల ననుభవించు వారికాలమును గమనించి కాచియుండి ఆ కాలముసమీపించగానే అనగా ముగియగానే వారలను స్వర్గలోకమునుండి మనుష్యలోక మునకు కొనివచ్చువారు కొందరు.

స్వర్గలోకమునందలి సుఖానుభవము ముగియగానే ఏ దేశము నందు ఏ తల్లిగర్భమునందు ప్రవేశించవలయునో ఆ ఏర్పాట్లుచేయు దేవతల సంఘములు వేరు. మనువుయొక్క ఉద్దేశప్రకారము ఏ దేశమునందు వర్షములధికముగా కురిసి ప్రవాహములతో ఏ యే దేశములభాగములు సముద్రములపాలు కావలెనో, లేక భూకంప ములు మొదలగువాటిని కలుగజేసి దేశమును రూపుమాపుటను జరుపు దేవతలు కొందరు. ఇట్టి దురవస్థసమయమునందు జనులు పశువులు మొదలగువానియొక్క సంఘాతమరణము జరుగుచుండగా ఎవ్వనికర్మ ఎంతమాత్రము సంబంధపడినదో ఆ ప్రకారము భూకంప ములు ప్రవాహములు మొదలగునవి జరుగుచున్న స్థలములకు ఆ సంఘాతమరణములయందు చేరకూడదని కర్మయందు ఉద్దేశింప

బడినవారిని అచ్చటికి పోనీయక ప్రత్యవాయములను కలుగజేసి వారి ప్రయాణములను నిలుపుదేవతలు కొందరు. ఏ జనాంగమునకు ఏ మనుష్యకోటికి ఏ ఒక వ్యక్తివల్ల ఏ విధముగా మేలుకలుగునో ఆ వ్యక్తిని ఆ జనాంగమునకు చేర్చి ఆ విధముగా ఫలము అందచేయునట్లు జరిపించు దేవతలసంఘములు కొన్ని. ఈ ప్రకారము అపరిమితమైన లెక్కగల దేవతలసమూహములు ఇంద్రుని ఆధిపత్యము క్రింద లోకవ్యవహారములను జరుపుచువత్తురు. భగవత్సంకల్పము సృష్టి స్థితి లయముల విషయమై ఏ విధముగా నున్నదని తెలిసికొని ఆ సంకల్పమును అణుమాత్రమైనను వదలకయు మారకయు జరుపుటకు కావలసినన్ని యుక్తులను పన్ని ఆ సంకల్పమును పూర్తిచేయుట దేవతలకార్యము. ఇది సంగ్రహముగా చెప్పుట. ఇదే భగవదిచ్ఛ.

భగవత్సంకల్పము ఒక విధముగానున్నను ఆ విధమును మార్చుట మనుష్యులకు కొంతమట్టుకు సాధ్యము. మనుష్యులు అనగా జీవాత్మలు పరమాత్మయొక్క అంశలు. అయినందువలన పరమాత్మయొక్కశక్తి జీవాత్మయందుకూడ ప్రతిఫలించియున్నందున భగవత్సంకల్పము ఇట్టిది అని తెలియకనే తమ శక్తితో మనుష్యులు ఈషన్మాత్రము ఆ భగవత్సంకల్పమునకు విరోధముగా తమ ఇష్ట ప్రకారము కార్యమును సాధించుకొనవచ్చును. అట్టిసమయమునందు భగవత్సంకల్పమును నడిపించుటకుగా నియమించబడియుండు దేవతలు మనుష్యులకార్యములలో ప్రవేశించి వారు భగవత్సంకల్పమునందు కలుగజేసిన మార్పును సరిదిద్దరు. ఇందుకు ఉదాహరణములు పురాణములలోగలవు. నలమహారాజు రాజ్యభ్రష్టుడై దమయంతియు దానును నగరమునకు వెలపలనుండగా పక్షులుకొన్ని ఆకాశమునందు కనబడినట్టును వానిని పట్టవలెనని నలమహారాజు తన ఉత్తరీయమును వాటిపై వేయపోగా ఆ వస్త్రమును పక్షులు పట్టుకొని వెళ్లినవనియు అందువల్ల నలదమయంతులు ఏకవస్త్రులైరి అనియు చదివియున్నాము. భగవత్సంకల్పమును జరుపుటకుగా పక్షిరూపమున దేవతలు వచ్చిరి.

పిమ్మట నలదమయంతులు వేరుపడి నలుడు ఏకాకిగా చరించుచుండగా అతని రాజలక్ష్మిగలరూపముతో చరించినయెడల నతనికి

జీవనోపాయము కలుగజాలదనియు అతనికి యునికిస్థలము బహిరంగ మగుననియు కర్కోటకుడు నలుని సంధించిన విషయమును దాని యొక్క ప్రయోజనమును ఈ అడుగున కనియుండు పద్యములవల్ల తెలియవచ్చును.

చ॥ అవిరళవిస్ఫులింగనివహంబుల నభ్రపథంబు నంటుచున్ ।
దవదహనం బుదగ్రతరుదాహము సేయుచున్నఁ జూచి మా ।
నవపతి దాని యంతరమునన్ వినియెన్ నరనాథ నన్నుఁగా ।
రవమునఁ గావవేగ యిట రమ్మను నార్తమహానినాదమున్ ॥

అంతట నలుడు కరుణాపూరితచిత్తుండై దావాగ్నిమధ్యంబునకు వెళ్లి ఒక నాగకుమారునిచూచెను. ఆ నాగకుమారుడు

క॥ నాలుగుదిశలను దావ జ్వాలావళిగవిసె గ్రమ్మందిచానోప మహీ ।
పాలకన న్నొకక సరసీ కూలము జేరంగనెత్తికొని పొమ్మదయన్ ॥

కొనిపోవుచుండగా నప్పాముచేత దష్టుండై తనరూపంబు విడిచి వికృతరూపంబుతో నలుడు నిలిచె. అపుడు ఆపాము తన నిజరూపంబు చూపి అయ్యా నీవు నాచేత విషపీడితుండవైతివని దుఃఖంపవలదు. నీ మేలుకుగానే నీ నిజరూపు మార్చితిని అని కర్కోటకుడు పలికెను.

మరియు ద్రౌపదీవస్త్రాపహరణ సమయమునందును పాండవుల వనవాససమయమునందు అక్షయపాత్రను ఉపయోగించినపుడును ఎందరుపిల్ల దేవతలు పనిచేయుచుండి యుందురో దీనినికూడ గమనించ వలయును. శ్రీకృష్ణమూర్తి ద్రౌపదివస్త్రములు అక్షయములు కానిమ్మని కోరినపుడు ఆ కోరిక ఎందరు దేవతలను గుమిచేర్చి ఆ చీరలను తెచ్చి చేర్చినవో యెందరు దేవతలు ఆ చీరలను ఒకటిపై నొకటిగా ద్రౌపదియొక్క దేహమును ఆవేష్టింపచేసినవో ఆను సం గతినిగురించి మననముచేసినయెడల దేవతలు ఎందరు ఏ మేమిపనిని చేయుదురు అనియు తెలియును.

మరియు ఒకదేహము శిథిలమై మరణము చెందునపుడు దేవతయే శరీరముయొక్క పటుత్వమును పోగొట్టునది. ఒకశిశువు పుట్టినపుడు

ఎందరు దేవతలు ఆ చిన్న శరీరమును గర్భకోశమునందు అణువెంబడి అణువుగా చేర్చి శరీరమునుగా జేసియుందురో యోచించవలయును. కండ్లు చెవులు ముక్కు మొదలగు ఇంద్రియగోళములను ఆ యా ఇంద్రియములయొక్క అభిమానిదేవతలు కట్టుదురు. ఒక్క దేవతమాత్రము కాదు. ఒకతావున భూకంపము మొదలగు శ్రమలుకలిగినపుడు ఎందరు దేవతలు ఆ శ్రమను జరుపుదురో ఎంతవిస్తారమునకు ఆ శ్రమ పోవలయునో అట్లుచేయుట దేవతలయొక్కపని. అనాథలుగా నుండు వారిని ధర్మాత్ముని సాన్నిధ్యమునకు నడిపించి వారికి ద్రవ్యము వస్త్రము అన్నము వీటిని యిప్పించిన దేవతలు ఎందరు ఉందురో యోచించవలయును. అన్ని స్థలములయందును దేవతలు ప్రచ్ఛన్నులుగా పనిచేయుచుందురు.

దేవతలకు మరియొక ముఖ్యమైన ఉద్యోగముకలదు. మానవ జాతియందు ప్రవృత్తిమార్గమునందు కొంతమట్టుకు విరక్తిచెంది లోక సుఖములయందు అభిలాష పోయి నివృత్తిమార్గము నవలంబించుటకు కోరునట్టి కాలమునందు అట్టిజీవాత్మలకు సదుపాయములను సమకూర్చి తగినగురువుల సామీప్యమును చెందుటకు కావలసిన సందర్భములను కలుగజేయుచుందురు. ఈ విధమున సహాయముచేసి ఉపాసకునికి మెట్టుమెట్టుగా నివృత్తిమార్గమునందు ఎక్కుటకుతోడ్పడి కొంత మట్టుకు నివృత్తిమార్గమునందు స్థైర్యమును చెందిన ఉపాసకుని యందు ఏదైననొక్క దైవీసంపద్గుణము దృఢపడకుండినయెడల ఆ గుణమును బలకట్టుటకుగా పరీక్షించి పరీక్షించి ఆ గుణమును దృఢపరుతురు. తపస్సుచేసి కామమును జయించినాను అని నమ్మిన వానికియెదుట రంభ ఊర్వశి మొదలగుస్త్రీలను నిలుపుచుండిరి కదా. అది పురాణకథ. ఇప్పటికిని నివృత్తిమార్గమునందు చరించు వారికి ఇటువంటి పరీక్షలు కలుగుచునేయుండును. ఇది ఇప్పటికిని అనేకమంది ఉపాసకులయొక్క అనుభవము.

ధనకాంక్షను జయించినాను అనుకొని కొంతమట్టుకు సంతోషించుచుండు ఉపాసకునికి పరధనమునుచేయాడు వ్యవహారములో భాగమునిత్తురు. ఉపాసకుడు నిజముగా కొంతమట్టుకు ధనపిశాచమును

గెలిచినవాడే. అట్టివాడు కొన్ని దినములు, కొన్ని సంవత్సరములు పర ధనమును ఆశించకయే అర్జవముతో వ్యవహారము జరుపుచువచ్చును. ధనముతో సహవాసము చేయుచుండగా లోకులు అద్దిర వీడే ధన మును ఆశించక వ్యవహారమును జరుపువాడు అని విస్మయమందు చుందురు. ఉపాసకుడును తాను ఇతరులకంటె నేను యోగ్యుడను. ధనము అనగా నా కేమియు రుచియే లేదు. ఆశ అను పిశాచమును అవమానము చేసినవాడను. ధనాశ ఇతరులను మోసపుచ్చినట్లు నన్ను మోసపుచ్చుట అసాధ్యము అని స్వప్రాశ స్త్యమును తన మన స్సులో అంగీకరించుకొనుచుండును. అపుడును పరీక్షచేయు దేవత ప్రచ్ఛిన్నవృత్తియందే కాచియుండును. ఉపాసకుడు తన కార్యముల యొక్క సమీచీనతను పొగడుకొనుచు పరధనమునుండి మొదట ధర్మకార్యములకు చందాలు ఇచ్చి ఇది పరధనముకదా స్వంతదారుని యొక్క అనుమతిలేక నేను ఆ ధనమును నా యిష్టమువచ్చిన కార్య మునకు ఉపయోగించితిని. ఇది ఒకవిధమైన దొంగతనమే. అయి నను నేను స్వప్రయోజనార్థము ధనమును ఉపయోగించలేదుకదా అని ఒకవిధమైన సమాధానమును కలుగజేసికొని వ్యవహారము మా మూలుప్రకారము జరుపుచుండును. అపుడపుడు ఉపాసకుని మన స్సున కొంతతాపము కలుగును. ధనము తనదికాదు. తన యజ మానునిది. యజమానుడును ధర్మబుద్ధిగలవాడే. అతని ఉత్తరువు పొంది ధర్మకార్యార్థమైనను అతనిద్రవ్యమును సెలవుచేసియుండ వచ్చును. అట్లు చేయకపోతినే అని తాపముకలుగును. కాని తాను ధర్మార్థమేకదా సెలవుచేసితిని ఆ ధర్మము యజమానునిదే అగును; నాదికాదు అని సమాధానమును కల్పించుకొని సంతోషపడును. కొంతకాలమునకు మనస్సుగట్టిపడి యజమానుని ద్రవ్యమును తాను ఇష్టమువచ్చినట్టు సెలవుచేయుట వాడుకపడిపోవును. ఇదంతయు పరీక్ష చేయు దేవత గమనించి ఉపాసకుని ఖాతాలో అప్పులలెక్కను వ్రాయు చుండును. ఇందుకు పెద్దఉదాహరణము రామదాసుగారి చరిత్రము.

రామదాసుగారివంటి మహానుభావుడు యజమానుని ధనమును యజమానుని అనుమతిలేకయే సెలవుచేసినను ధర్మకార్యములను

చేసెనేగాని స్వప్రయోజనమునకుగా సెలవుచేయలేదు. అయినను తానుచేసినకార్యము తప్పుగనుక రామదాసులను ఉపాసకుడు చేసిన తప్పుకు తగిన దండన అనుభవించవలసివచ్చెను. దండనవల్ల పర ద్రవ్యమును తన యిష్టప్రకారము సెలవుచేసిన దోషముకొట్టబడినది. పరద్రవ్యముతోనైనను ధర్మకైంకర్యము చేసినందుకు ప్రతిఫలముగా దైవానుగ్రహమును అనుభవించెను.

రామదాసుకంటె ధర్మబుద్ధియందు తక్కువపదవియందు ఉండువారలు న్యాయముగా స్వార్థపరిత్యాగముతో తాము పరిపాలించవలసిన ధనమును స్వంతదారుల అనుమతిలేకయే సెలవుచేసి అట్లు సెలవుచేయుట వాడుకపడినపుడు తనకుకూడ తెలియకయే యజమానుని ధనమును స్వప్రయోజనమునకుగా సెలవుచేయుటకు ఆరంభింతురు. ఇట్లు మెట్టుమెట్టుగా పతనము ప్రారంభించును. ఈ సమయమునందు పరీక్షచేయు దేవత ఊరక దూరాననుండి గమనించుచుండును.

పరద్రవ్యమును అపహరించుట అను దుర్గుణము స్థిరముగా నేర్పడును. అపుడు పరిక్షచేయు దేవత ఉపాసకునికి వచ్చిన దురవస్థకు తగుమైనశిక్షను విధించునట్లుచేసి శిక్షానుభవమువల్ల ఋజుబుద్ధిని కల్పించి శిష్యుడు నివృత్తిమార్గమునందు నడుచుటకు కావలసిన సహాయము చేయును.

ఎందుకుగా ఈ ప్రకారము పరిక్షచేయవలయును అనగా దోషములను జయించి స్వచ్ఛుడైన ఉపాసకుడేకదా నివృత్తిమార్గము యొక్క పరమావధిని చేరగలడు. అందుకుగా ఉపాసకునికి దేవతలు సహాయభూతులు అగుదురు. వారల సహాయము అనునది మొదట ప్రతికూలముగా తోచినను క్రమేణ సహాయమే అగును. సృష్టి కార్యమును నడిపించుటయందు, పరిపాలనయందు, అదేవిధముగా లయమునందును దేవతలు ఇంద్రుని యాజ్ఞానుసారముగా నడుచుచు త్రిమూర్తులకు తోడుపడుదురు. ఆ సమయమునకు విరోధముగా పనిచేసినట్లు కనబడినను వారలవల్ల ప్రయోజనము నిజమే. ధృవుడు తపస్సుచేసినప్పుడు దేవతలు ఆ పిల్లవానికి చాలభయము కలుగజేసిరట.

యామా నామ తదా దేవాః మైత్రేయ పరమాకులాః।
ఇంద్రేణ సహ సంమంత్య్రి ధ్యానభంగం ప్రచక్రముః॥
కూశ్మాండాః వివిధై రూపైః సహేంద్రేణ మహామునే।
సమాధిభంగం అత్యర్థ మారబ్ధాః కర్తు మాతురాః॥

(విష్ణుపురాణము)

యామాః అనెడి తెగ దేవతలు సమాధిభంగముచేయుటకు ప్రయత్నించిరి. కూశ్మాండాః అను తెగ దేవతలు నా నావిధభయంకర రూపములతో బాలుని బెదిరించుటకు ఆరంభించిరి. ఎన్ని విధముల బెదిరించినది, ఎందరు బెదిరించిరి అను ఆశ్చర్యమును విష్ణుపురాణము, ప్రథమాంశము, ద్వాదశాధ్యాయమునందు చదువవలయును.

ఈ బెదిరింపులను లక్ష్యపెట్టక తపస్సు జరిగినది. ఫలము కలిగినది. బెదిరింపులవల్ల మనోదార్ఢ్యము కలిగినదిగాని కార్యహాని కలుగలేదు. మనోదార్ఢ్యము కలుగుటకుగానే దేవతలు బెదిరించిరిగాని అన్యముకాదు అని తలవవచ్చును.

నివృత్తిమార్గమునందు చరించువానిని ఎందుకుగా ఇంతగా పరీక్షించవలెను అని సందేహము కలుగును. నివృత్తిమార్గమున చరించువాడు క్రమక్రమముగా మెట్టు మెట్టుగా పైకెక్కి జీవన్ముక్తుడు కాగలవాడు. మరియు ముదరను ముదరను ఆధికారిక పురుషుడు కాగలవాడు. ముందు మన్వంతరములలో మనువో ఇంద్రుడో ఇట్టి అధికారములను పొందుటకు అర్హుడుకాగలవాడు. కనుక నివృత్తిమార్గమునందు మొదటిమెట్టునుండి పరిశుద్ధగుణములతో స్వచ్ఛమైన స్వభావముతో పెరిగితేనే బాగు. లోకక్షేమమునుకోరి జీవాత్మలను మంచిస్థితికి తెచ్చి క్రమేణ తమ ప్రకృతపదవి అయిన మనువు ఉద్యోగము ఋషుల ఉద్యోగము ఇంద్ర ఉద్యోగము ఇట్టి ఉద్యోగములను క్రొత్తగా నివృత్తిమార్గమునందు చరించుచు సిద్ధమగుచున్న జీవాత్మలకిచ్చి తాము ఇతర బ్రహ్మాండములలోనో లేక మన బ్రహ్మాండమునకుచేరిన ఇతర లోకములపైకి ప్రజానివాసము గల అంగారకలోకము బుధలోకము మొదలగు లోకములలోనో ఆధికారికపురుషులుగా పోయి ఈశ్వరకైంకర్యము చేయదలచినవారు

నివృత్తిమార్గమునందు చరించుజీవులను తగినంత పరీక్షలుచేసియే కదా ఉద్యోగములకుగా సిద్ధపరుచవలయును. మనము ఒకత్రాటిని పట్టుకొని వ్రేలాడి ఉయ్యాలలూగవలెనని ఆశగొన్నయెడల ఆ త్రాటిని ముందుగా పరీక్షింతుము. మన భారమంతయు ఆ త్రాటి పైన వేశినపుడు ఆత్రాడు తెగి మనము నేలపడకూడదు కదా. అందువల్ల మరల మరల ఆత్రాటిని పరీక్షింతుము. మన శరీరము నూరు రతులభారమున్నయెడల ఇన్నూరు రతుల భారమును ఆ త్రాటికికట్టి వ్రేలవిడిచి అప్పటికిని ఆత్రాడు తెగకుండి నపుడే ఆ త్రాటిని నమ్మి మనశరీరభారమునంతయు ఆ త్రాటికి కట్టుదుము. ఆ విధముగా ఉపాసకుడు నివృత్తిమార్గమున చరించు చుండగా ఆంతరంగిక పరిపాలకవర్గమువారు ఉపాసకుని పరీక్షించు చుందురు. ఈ యుద్యోగమును జరుపువారు అనేక దేవతలు

## మంత్రాత్మికా దేవతా

జైమినిఋషి పూర్వమీమాంస శాస్త్రమునకు కర్త. జైమిని యొక్క అభిప్రాయము మంత్రము అను శరీరమునుకలది దేవత అని. మంత్రములయొక్క ఉచ్చారణవల్ల దేవతయొక్క రూపము కట్టబడును అని పైకనుపరిచిన సూత్రమునందు చెప్పబడియున్నది. మంత్రముల యొక్కశక్తిని వానియొక్క నిర్మాణము అను వివరములనుగురించి యికముందు వ్రాయబడును. ఇచ్చట అతిసంగ్రహముగానే ప్రస్తావన చేయవలయు. మంత్రములు అక్షరములతో కట్టబడును. అక్షర ములకు దేవతలు జాతులు మొదలగునవి కలవు అని యిదివరకును వేదములనుగురించి వ్రాసినపుడు చెప్పబడియున్నది. ఏ యే అక్షర మును ఏ యే స్వరముతో అనగా ఉదాత్తము అనుదాత్తము స్వరి తము అనుస్వరములతో చెప్పితే ఏమి ఫలము కలుగును అను నిబం ధనలు కలవు. ఏ అక్షరముపక్కలో ఏ అక్షరమువచ్చినపుడు ఏ తీరున దేవతయొక్క రూపము కట్టబడును అని మంత్రజ్ఞులుగా నుండు మహర్షులకు తెలిసియే మంత్రములను కట్టినట్టు తెలియవచ్చు చున్నది. “అగ్నిమీళే పురోహితం” అని ఋగ్వేదమంత్రము

ఉన్నది. అగ్ని అను పదమునకు వహ్ని లేక అనలము అను పదములను అర్థముగా చెప్పవచ్చును. ‘అగ్నిమీళే పురోహితం’ అనుటకు బదులుగా ‘వహ్నిమీళే పురోహితం’ అనినను ‘వహ్నిం పురోహితం ఈళే’ అన్నను ‘అనల మీళే పురోహితం’ అన్నను అర్థమేమో ఒక్కటే. అయినను ‘అగ్నిమీళే పురోహితం’ అనినపుడు ఏర్పడు అగ్నియొక్క రూపమునకును ‘వహ్ని’ అనినపుడు ఏర్పడు రూపమునకును ‘అనలము’ అనునపుడు ఏర్పడినరూపమునకును వ్యత్యాసమును, ప్రయోజనములును, సూక్ష్మదృష్టిగలిగి మంత్రములను చెప్పిన ఋషులకు తెలిసియుండును. కనుక ఏ పదమును ఏ స్థలమునందు ఉపయోగించవలసినదియు వారలకు తెలిసియే ఉపయోగించియుందురు. ఈ మంత్రము అను విషయమునుగురించి ఇకముందు వ్రాయవలసియున్నది గనుక ఇచ్చట ఇంతమాత్రము చాలును. అయితే ప్రస్తావవశమున ఛందశ్శాస్త్ర విధానముగా కవిత్వమును కట్టువారు తెలిసియో తెలియకయో తప్పుటక్షరములతో గణములను కట్టితే మ య ర స త జ భ నలగ అయినగణములు శాస్త్ర విధానముగా కట్టబడినను విషగణములగునని వినియున్నాము కదా. అట్టి విషగణసమేతములైన కవిత్వములు యజమానునికిగాని కవికిగాని జాడ్యమునో మరణమునో కలుగజేసినవి అనియు వినియున్నాము. ఆ విధముగానే

హస్తహీనస్తు యోఽధీతే స్వరవర్ణవివర్జితః ।
ఋగ్యజుస్సామభిర్దగ్ధో వియోనిమధిగచ్ఛతి ॥
మంత్రో హీనః స్వరతో వర్ణతో వా ।
మిథ్యాప్రయుక్తో న తమర్థమాహ ॥
సవాగ్వజ్రో యజమానం హినస్తి ।
యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్ ॥
ఉదాత్తో బ్రహ్మజాతిః స్యాత్ । నీచో రాజన్య ఉచ్యతే ॥
స్వరితో వైశ్యజాతిః స్యాత్ । ప్రచయ శ్శూద్ర ఈరితః ॥
యత్ జాతిస్ఖలనం తేషాం । తజ్జాతిహననం విదుః ॥

అనగా స్వరవ్యత్యాసమువల్లనైనను వర్ణలోపమువల్లనైనను చెప్పబడిన మంత్రము యజమానుని కొట్టును అని అర్థము.

దేవతల కార్యములను క్రోడీకరించి చెప్పుటకొంత సౌకర్యము.

౧. దేవతలు అమృతపానముచేసి దేవలోకమందు సోమరులుగానుండువారు కారు.

౨. అణువులను సృష్టించి, వానిని అపంచీకృతస్థితినుండి పంచీకృతస్థితికి తెచ్చు ఉద్యోగమునువహించిన బ్రహ్మదేవునికి సేవ చేయువారు.

౩. పంచీకృతఅణువులను కలిపి రూపములుగాజేయు కార్యమును వహించిన విష్ణువునకు సహాయముగా పనిచేయు సేవక సంఘము.

౪. విష్ణువుకట్టిన శరీరములలో జీవాత్మలను ప్రవేశపెట్టు అధికారమును వహించిన శివునికి తోడ్పడువారు.

౫. మహేశ్వరుని సంకల్పప్రకారము లోకమును జవదాటక ఋతమార్గమునందు నడుపువారు.

౬. అధ్యాత్మవర్గము, సౌరాత్మవర్గము, చంద్రాత్మవర్గము, ధాతువర్గము, తరుగుల్మలతాదివర్గము, మృగవర్గము ఇన్నివర్గముల యందు ఉపాధులను పరస్పరవైషమ్యమునుండి కాపాడుచు మహాసంకల్పము ప్రకారము వికాసమును జరుపుట.

౭. అధర్మము ప్రబలి ధర్మము హీనస్థితికివచ్చినపుడు శ్రీ విష్ణుమూర్తి ధర్మసంస్థాపనార్థము భూలోకమునందు శ్రీరామమూర్తివలె అవతరించునపుడు వారికి సహాయముగా భూలోకమునందు దేవతలుకూడ కపీశ్వరులవలె పుట్టినట్టు అవతారములకు సహాయపడుట.

శ్రీ కృష్ణావతారమునందుకూడ వసువులలో నొకడు భీష్మాచార్యులుగాపుట్టెను. సోముడు అభిమన్యుడుగా పుట్టెను. ఇట్లే పంచ పాండవులును కర్ణుడును కూడ. విదురుడుగా యముడు పుట్టెను. అపాంతరతముడు కృష్ణద్వైపాయనుడుగా పుట్టెను.

౮. ప్రవృత్తిమార్గమునందు చరించువారికి ,, దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః ” అనినట్టు కర్మమార్గమునందు కర్మలఫలములను జీవాత్మల కందచేయుట.

౯. పితృకర్మలయందు

దేవలోకస్థితజీవస్య ఫలప్రాప్త్యర్థం అగ్నౌకరణం ।
స్వర్గస్థస్య నిమంత్రిత బ్రాహ్మణభోజనం ।
యమలోకస్థితస్య పిండప్రదానం నరకలోకస్థితస్య వికిరం ।
మనుష్యలోకప్రవిష్టస్య భోక్తృదక్షిణాదానం ।
అసురలోకప్రాప్తస్య భూరిభోజనం ।
ఇత్యేతాని కర్తవ్యతయా విధ్యుక్తాని ।
అగ్నౌకృతేన దేవస్థా స్స్వర్గస్థా విప్రభోజనాత్ ।
యమస్థాః పిండదానేన వికిరా న్నరకస్థితాః ॥
దక్షిణా మర్త్యలోకస్థాః అసురా భూరిభోజనాత్ ।
పితర స్తృప్తి మాయాంతి షడంగం పైతృకం తతః ॥

కారికావృత్తిః.

న చ లోకాంతరస్థితస్య మృతస్య జీవస్య పిత శ్శ్రాద్ధఫలలాభః । సర్వజ్ఞత్వాది సామర్థ్యవిశిష్టవస్వాది దేవతాః శ్రాద్ధకర్మణి కర్తృభిః పుత్రాదిభిః పిత్రాది అధిష్ఠాతృరూపేణ ఆరాధితాః సంతః స్వాశ్రితాన్ పిత్రాదీన్ యత్ర కుత్రస్థితానపి శ్రాద్ధఫలేన సంయోజయంతీతి ఉపపత్తేః । కించ కర్తౄన్ పుత్రాదీన్ అపి ఫలేన ఘటయంతి । యథామాతా గర్భపోషణాయ అన్యదత్త దోహదాన్నపానాదినా స్వయముపభుక్తే సా తృప్తాసతి స్వజఠరగత మపత్యం తర్పయతి । దోహదాన్నప్రదాయిన శ్చ ప్రత్యుపకారఫలేన సంయోజయతి తథైవ అత్రాపి । తస్మాత్ నైమిత్తికాని అపి అవశ్యం కర్తవ్యాని ఏవ శ్రేయఃకామిభిః ఇతి సిద్ధం ॥

ఆచారకాండ.

౧౦. నివృత్తిమార్గమునందు చరించువారికి వారిని పరీక్షలు చేసి వారి బలహీనములను పోగొట్టి వారికి స్వచ్ఛత నిచ్చుట.

౧౧. ఇంద్రియములకు అధిష్ఠానదేవతలుగానుండుట. మనుష్య దేహము లెక్కలేనన్ని దేవతలకు ఉనికిపట్టు.

౧౨. తపస్సుచేయువారికి జ్ఞానోపదేశముచేయుట, దేవతల యొక్క ప్రేరేపణపై ఋషులు జ్ఞానోపదేశముచేయుట. విష్ణుపురాణము ప్రథమాంశము ఏకాదశాధ్యాయమునందు మరీచి, అంగిరస్సు,

అత్రి, పులహుడు, క్రతువు, పులస్త్యుడు, వసిష్ఠుడు అను ఋషులు ధ్యానముయొక్క క్రమమును ధృవునికి ఉపదేశించిరి అని చెప్పియున్నది.

జాబాలుడు అనుబాలుడు అగ్నివల్ల జ్ఞానోపదేశమును పొందెను అని ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పియున్నది. నచికేతుడు యమునివల్ల జ్ఞానోపదేశముచెందెనని కఠోపనిషత్తునందు చెప్పియున్నది.

ధృవుడు అను బాలుడు తపస్సుచేయుచున్నపుడు నారదులవారు (దేవర్షి) ఉపదేశముచేసిరట.

౧౩. ప్రారబ్ధకర్మఫలమును మనుష్యులకు అందజేయుట.

మరియు ననేకవిధముల దేవతలు పరమేశ్వరుని మహాసంకల్పమును ప్రతి నిమిషమును జరుపుచుందురు. కనుక

దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః ।
పరస్పరం భావయంత శ్రేయః పర మవాప్స్యథ ॥

---

## ౮. వ అధ్యాయము

### జీవాత్మ—అతని స్వభావము

జీవాత్మనుగురించి ఆత్మవిచారము అను గ్రంథమునందు వివరముగా వ్రాయబడియున్నది. ఇచ్చట అతిసంగ్రహముగా జీవాత్మ అను వారెవ్వరుఅను సంగతి చెప్పబడుచున్నది.

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః ।
మన ష్షష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥
శరీరం య దవాప్నోతి య చ్చాప్యుత్క్రామ తీశ్వరః ।
గృహీ త్వైతాని సంయాతి వాయు ర్గంధా నివాశయాత్ ॥
శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవ చ ।
అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపసేవతే ॥
ఉత్క్రామంతం స్థితం వా పి భుంజానం వా గుణాన్వితం ।
విమూఢా నా నుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః ॥
యతంతో యోగిన శ్చైనం పశ్యం త్యాత్మ న్యవస్థితం ।
యతంతో ప్యకృతాత్మానో నైనం పశ్యం త్యచేతసః ॥

(శ్రీమద్భగవద్గీత, ౧౫. అధ్యాయము)

అనాదియైనదియు నాయొక్క (పరమాత్మయొక్క) అంశము (భాగము, రేఖ, కిరణము)ను అయినది జననమరణరూపకమైన సంసారమునందు (జీవలోకము అనుటకు 50 వ పుటచూడుడు) ప్రవేశించి త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణాంతఃకరణరూపములగు నింద్రియములనెడి అవిద్యాజన్యోపాధులతోడ సంపర్కము కలిగించుకొని ఆ దేహేంద్రియాది సంఘాతమునకు స్వామియైన నా

అంశ (జీవుడు) ఒకపుడు శరీరమునుండి వెడలుచున్నాడు. ఒకప్పుడు శ్రోత్రశరీరమును సంపాదించుకొనుచున్నాడు. అట్లు వెడలునపుడు ఏవిధముగానైతే పరిమళముగల పుష్పములునిండిన పుష్పవనము నందు ప్రవేశించి వెలుపలికిపోవు వాయు ఆ పుష్పముల వాసనను తనయందు దిమిడుచుకొని వెళ్లునో అట్లు జీవుడు మనస్సు ఇంద్రియ ములు అను వానిగుండా తాను సంపాదించిన అనుభవములను తన వెంబడితీసికొని వెళ్లును. జీవుడు దేహమందుండునపుడు శ్రోత్రము, చక్షుస్సు, స్పర్శనము, రసనము, ఘ్రాణము అను ఇంద్రియములు, ఈ యింద్రియములకు అంతరింద్రియమైన మనస్సు అనువాటిని ఆశ్రయించి శబ్దాదివిషయములను అనుభవించుచుండును. శరీరమునం దుండినను, ఒక శరీరము వదిలి మరియొకశరీరమునందు ప్రవేశించి నను అచ్చట శబ్దము, స్పర్శ, రూపము, రసము, ఘ్రాణము అను విషయములను అనుభవించుచున్నను ఈ జీవాత్మను ఇహపరలోక ములయందలి తుచ్ఛములైన భోగములచే నాకర్షించబడిన మనస్సు గల ఆత్మానాత్మజ్ఞానములేని అజ్ఞానులు తెలిసికొనజాలరు. ఇహ లోకభోగములచేతను పరలోకసుఖములచేతను ఆకర్షింపబడని మనస్సుగలవారును, అందులో గురూపదేశశాస్త్రజ్ఞానముల వలన కలిగిన ఆత్మానాత్మజ్ఞానముగలవారు తెలిసికొనగలరు. ధ్యానము మొదలగు అనుష్ఠానములచే ప్రయత్నముచేయుచు చిత్తసమాధాన మును సంపాదించిన యోగులు తన యందు ఉన్న ఆత్మను స్వాను భవముచే తెలిసికొందురు. కేవల శాస్త్రాభ్యాసముచే మాత్రము ఆత్మదర్శనము కావలెననికోరుచు చిత్తశుద్ధికిగా చేయవలసిన ప్ర యత్నములలో ముఖ్యములైన దుర్వ్యాపారములనుండి మరలుట, ఇంద్రియనిగ్రహము, గురూపదేశము, మొదలగు సాధనములను సంపా దించకయు నుండువారు ఈ ఆత్మను తెలిసికొనలేరు.

పరమేశ్వరునియొక్క అంశఅనునది జీవలోకమునందు ప్రవే శించి మనస్సు ఆదిగా ఆరుఇంద్రియములను గ్రహించును. అని అర్థము. జీవాత్మమగవాడుకాడు. స్త్రీయునుకాదు. అట్లే నపుంసక మునుకాదు. శ్వేతాశ్వతరోపనిషత్తునందు చెప్పినదేమనగా

త్వం స్త్రీ త్వం పుమా నసిత్వం కుమార ఉత వా కుమారీ ॥

నై వ స్త్రీ న పుమా నేషః నై వ చాయం నపుంసకః ।
య ద్య చ్ఛరీర మాద త్తే తేన తేన తథో చ్యతే ॥

పరమాత్మయొక్క అంశమైన జీవాత్మకు పురుషుడు స్త్రీ అను లింగ భేదములులేవు. ఏ యే జన్మమునందు ఏ యే స్త్రీగానో పురుషుడు గానో ఉండునట్టి శరీరమును ధరించినపుడు స్త్రీత్వపురుషత్వాదిలింగ భేదములు వ్యవహారమునకు ఏర్పడును. కొన్ని గుణములు స్త్రీస్వభావ మునకు నైజములు. కొన్ని ధైర్యశౌర్యాదిగుణములు పురుషస్వ భావమునకు నైజములు. పురుషగుణములును స్త్రీగుణములును జీ వాత్మయందు పెరుగుచు వృద్ధికివచ్చినపుడే జీవాత్మకు పరిపూర్ణమైన వికాసముకలిగినది అని చెప్పవచ్చును. ఒక్కొక జన్మమునందును కొన్నిగుణములను బలపరుచుకొనవలయును గనుక స్త్రీజన్మములు కొన్నియు పురుషజన్మములుకొన్నియు జీవాత్మ ఎత్తి స్త్రీగుణ ములను పురుషగుణములనుకూడ సంపాదించి ఊర్జితపరుచుకొనవలసి యుండును.

జీవాత్మలందరును ఒకరితో నొకరు సమానులేమైనను అవి నివసించుక్షేత్రములయొక్క గుణములను స్వభావములను వ్యక్తపరుచు చుండును.

పృథుచక్రవర్తి తండ్రికి ప్రజయందుగల వాత్సల్యతను చూపెను.
పురూరవుడు సొగసుగాడు.
నహుషుడు గర్వి.
భరతుడు మహనీయుడు.
ఋషభుడు అద్భుతచరిత్రగలవాడు.
కార్తవీర్యార్జునుడు వీరుడు, శూరుడు.
విశ్వామిత్రుడు పట్టినపట్టు వదలనివాడు.
వసిష్ఠుడు బుద్ధిమంతుడు.
పరశురాముడు దండనీతిప్రవీణుడు.

మాంధాత బాహుబలశాలి.
శిపి భూతానుకంపగలవాడు.
దధీచి ఆత్మనివేదనముచేయువాడు.
దూర్వాసస్సు ఆగ్రహప్రకృతి.
హరిశ్చంద్రుడు సత్యసంధుడు.
నృగుడు ఉదారి.
హిరణ్యాక్షుడు భీకరమూర్తి.
హిరణ్యకశిపు కాఠిన్యస్వభావము.
బలి ఔదార్యము గలవాడు.
శంబరుడు మాయావి.
రావణుడు ప్రాణులను పీడించువాడు.
శ్రీరామచంద్రుడు పరిపూర్ణుడు.
నలమహారాజు సొగసుగాడు.
యుధిష్ఠిరుడు ధర్మాత్మ.

పై వివరించిన అందరియందునుగల అన్నిసుగుణములును ఒక్కని యందు ఇమిడియుండవలయును. జీవాత్మ లందరును రెండు జాతులుగా భాగించబడియుందురు. శ్రీమద్భగవద్గీతయందు వీరిని దైవీసంపద్యుక్తులనియు ఆసురసంపద్యుక్తులనియు భాగించియున్నారు. శ్రీమద్భగవద్గీత పదునారవ అధ్యాయమునందు దైవీసంపద్గుణములు వివరముగా చెప్పబడియున్నవి. అదేవిధముగా ఆసురసంపద్గుణములు కూడ చెప్పబడియున్నవి. అంతేకాదు ఆసురసంపద్గుణములు బంధమును కలుగజేయుననియు దైవీసంపద్గుణములు మోక్షమును కలుగజేయుననియు చెప్పబడియున్నది.

జీవాత్మవిషయమై ఆత్మవిచారము అను గ్రంథమునందు వ్రాసినపుడు ప్రజ్ఞానాంశువు అను అపరనామధేయముగల తురీయాత్మయే నిజమైన జీవాత్మ అని వ్రాయబడియున్నది. సత్యలోకమునందు ప్రవేశించి ఈ పాంచభౌతిక ప్రపంచమునందు అనుభవసంపాదనార్థము తనయొక్క అంశను ఒకటిని క్రిందిలోకములకు పంపెననియు ఆ అంశ సత్యలోకము తపోలోకము జనలోకమువరకును వ్యవహరించుననియు

ఆ అంశకు ఆత్మబుద్ధిమనస్కుడు లేక ప్రాజ్ఞాత్మ అని పేరు అనియు ప్రాజ్ఞాత్మ రెండవవాడు అనియు (ఇంగ్లీషుభాషయందు ఇతనిని "Ego" ఏగో అందురు) ఇతనికి ఒక ప్రతిబింబము ఉన్నదనియు ఆ ప్రతిబింబమునకు మహర్లోకము, స్వర్గలోకము, భువర్లోకము, భూలోకము అను లోకములు అనుభవసంపాదనార్థముగా నేర్పడిన క్రీడారంగము అనియు చెప్పబడియున్నది. ఆత్మవిచారము అను గ్రంథమునందు ఈ భాగమును మరల ఒకతూరి పఠించినయెడల ఈ విషయము సులభముగా నవగాహనయగును.

'ప్రజ్ఞానం బ్రహ్మ' అని చెప్పబడు సంవిత్, అనవచ్ఛిన్నం, అతీతం, పరాసంవిత్, జ్ఞానం, జ్ఞానఘనం, చిద్ఘనం, సద్ఘనం, ఆనంద ఘనం, పరం, అనిర్దేశ్యం, ఏకాకారం, అనవరతం, నిర్విశేషం, అఖండం, నిష్క్రియం, కాలాతీతం, దేశాతీతం, నిర్వికారం, సమం, సామ్యం, శాంతం, నీరూపం, నిరంజనం అను మొదలగు పేళ్లతో సూచింపబడు పరమప్రకాశమైన ప్రజ్ఞానము పరబ్రహ్మము. ఆ వస్తువుయొక్క అంశువు=కిరణము ప్రజ్ఞానాంశువు. దీనినే మాండూక్యోపనిషత్తునందు "తురీయ" అని వాడియున్నారు. ప్రజ్ఞానాంశువు=తురీయ=తురీయాత్మ సత్యలోకము, తపోలోకము, జనలోకము అను ముల్లోకములయందును (తురీయాత్మ) ఏర్పరుచుకొన్న ప్రతినిధికి ఆత్మవిచారమునందును ఈ గ్రంథమునందును ప్రాజ్ఞాత్మ అను సంజ్ఞానామధేయము. మాండూక్యోపనిషత్తునందు ప్రాజ్ఞశబ్ద వాచ్యుడు ఇతడే. ప్రాజ్ఞాత్మయు ప్రతిబింబించెను. మహర్లోకమునందు దిగువభాగము, స్వర్గలోకము, భువర్లోకము, భూలోకములలో అనుభవసంపాదనార్థముగా నేర్పడి ప్రతిబింబముయొక్క ప్రతిబింబమై జాగ్రదవస్థయందు ఉండు మనమందరమును అహంప్రత్యయలంబనులైన తైజసవైశ్వానరులు.

భూరాది మూడు ఉపరిలోకములయందు అనుభవమును సంపాదించి ఆ యనుభవముయొక్క సారాంశమును తన మూలపురుషుడైన ప్రాజ్ఞాత్మకు జన్మజన్మమునందును సమర్పించుకొనువాడు తైజసవైశ్వానరుడు.

జనలోకము మొదలు సత్యలోకమువరకును గల పాంచభౌతిక ప్రపంచమును వాసస్థలముగాచేసికొని తైజసవైశ్వానరునుండి అనుభవసారములను గ్రహించి తన మూలపురుషుడైన తురీయాత్మకు సమర్పించుకొను ప్రతిబింబము ప్రాజ్ఞాత్మ అని వ్యవహరించబడును.

ప్రజ్ఞానముయొక్క అంశువు=కిరణము తురీయాత్మ. తురీయాత్మయొక్క ప్రతిబింబము ప్రాజ్ఞాత్మ. ప్రాజ్ఞాత్మయొక్క ప్రతిబింబము తైజసవైశ్వానరుడు. తైజసవైశ్వానరుడే భూరాదిస్వర్గలోకములను అహం అను ప్రత్యయముచేత సూచించబడువాడు. ఈ విషయము దృఢముగా మనస్సున నుంచుకొనవలయును. మరియు అనేకజన్మములెత్తి అనుభవము సంపాదించుకొను నంతవరకును ప్రాజ్ఞాత్మ ఒక్కడు ఉన్నాడనియైనను తైజసవైశ్వానరునకు నమ్మకము పుట్టదు.

## ప్రకృతిస్థాని కర్షతి

అపరాప్రకృతియనియు పరాప్రకృతియనియు ప్రకృతియొక్క భాగములను శ్రీమద్భగవద్గీతయందు చదివియున్నాము. ఈ రెండును మూలప్రకృతియొక్క పరిణామములు. మూలప్రకృతికి శాస్త్రములయందు వేరు వేరు పేళ్లను అన్వయించియున్నారు. ఆత్మానాత్మ విభాగమునందు మూలప్రకృతిని 'అనాత్మ' అనియున్నారు. చిత్తు అచిత్తు అను సందర్భమునందు మూలప్రకృతికి 'అచిత్తు' అని పేరు ఇచ్చినారు. 'అనృతము' అని మరియొక పేరు. తానుగా కదలుటకు యోగ్యతలేనిది గనుక 'జడము' అని యొక పేరు. 'ఏకమేవాద్వితీయం' అను వాక్యము పరబ్రహ్మమునకు అన్వయించును. మూలప్రకృతికి 'నా నా' అనిపేరు. జ్ఞాతృజ్ఞేయ విభాగమునందు మూలప్రకృతికి 'జ్ఞేయము' అనిపేరు. జ్ఞానమును ఉపయోగించి తెలిసికొనతగినది గనుక 'విషయము' అని యొకపేరు. 'నేహ నానాస్తి కించ న' అను సందర్భమునందు అభేదస్థితిని సూచించినపుడు భేదమునకంతయు మూలముగనుక 'భేదమూలము' అని యొక పేరు. మహత్తత్త్వము మొదలగుతత్త్వముల కన్నిటికిని శ్రేష్ఠము

గనుక 'ప్రధానము' అనియొక పేరు. వ్యక్తముఅను స్థితికిమించినది 'అవ్యక్తము' అనియొక పేరు. ఇంతేకాక 'మాత్ర' అనియు నొక పేరు. "మాత్రాస్పర్శాస్తు కౌంతేయ" అను స్థలమునందు "మాత్రాయాః స్పర్శాః" అని ఒక ఆధునిక పండితుడు అర్థము చేసియున్నాడు. భాష్యమునందు ఈ ప్రకారము సమాసమునకు విగ్రహము వ్రాసియుండలేదు. ఇవి కొన్ని పేళ్లు.

ప్రకృతిఅను పదమునకు దైవీభాగవతము తొమ్మిదవ స్కంధమునందు ప్రథమ అధ్యాయమునందు అడుగునవ్రాసిన ప్రకారము వ్యుత్పత్తిని తెలియపరిచియున్నది.

ప్రకృష్టవాచకః ప్ర శ్చ కృతిశ్చ సృష్టివాచకః ।
సృష్టౌ ప్రకృష్టా యా దేవీ ప్రకృతిః సా ప్రకీర్తితా ॥

ప్రకృతి అనుపదమును రెండుగా విభజించినపుడు ప్రఅను అర్థమునకు శ్రేష్ఠముఅను అర్థమును కృతిఅను సగమునకు సృష్టిఅనియు అర్థము. సృష్టికార్యమునందు శ్రేష్ఠురాలు గనుక ప్రకృతి అనబడును. "తత్సాన్నిధ్యా న్మయా సృష్టం తస్మి న్నారోప్యతే బుధైః" అని అధ్యాత్మరామాయణమునందు ఉన్నది.

మరియు ప్రకృతి త్రిగుణాత్మకము అనునపుడు వ్యుత్పత్తి

గుణే సత్త్వే ప్రకృష్టే చ ప్రశబ్దో వర్తతే శ్రుతః ।
మధ్యమే రజసి కృ శ్చ తిశబ్ద స్తమసి స్మృతః ॥
త్రిగుణాత్మస్వరూపా యా సా చ శక్తిసమన్వితా ।
ప్రధానా సృష్టికరణే ప్రకృతి స్తేన కథ్యతే ॥

(దైవీభాగవతము—నవమస్కంధము, ౧ అధ్యా.)

సత్త్వగుణమును ప్ర అను శబ్దమును రజోగుణమును కృ అను శబ్దమును తమోగుణమును తి అను శబ్దభాగమును సూచించును. సృష్టికార్యమునందు ముఖ్యురాలు గనుక ప్రకృతి అనబడును. చదువరులు దైవీభాగవతమునందు ఈ భాగమును చదువునెడల మరియు ననేక సంగతులు ప్రకృతినిగురించి తెలియవచ్చును.

ప్రకృతికి ముఖ్యమైన గుణము నానాత్వము. ఆత్మానాత్మల పైకి ఆత్మ "ఏకం" అనాత్మ అను ప్రకృతి 'నానా'. అనాత్మ (ప్రకృతి) ఆత్మ (పురుష) తో అనేకవిధములయందు విరుద్ధభావము కొనియుండును. ఆత్మకును అనాత్మకును గల ఇతరేతర (పరస్పర) విరుద్ధభావమువల్లనే జీవాత్మయొక్క వికాసమునందు కానవచ్చు కష్టములన్నియు కలుగుచున్నవి. ఇందువల్లనే సర్వ ద్వంద్వభావములును కలుగుచున్నవి.

అనాత్మ (ప్రకృతి) త్రిగుణాత్మిక. ఆ గుణములు సత్త్వము రజస్సు తమస్సు అని మూడు. ప్రకృతికి మూడుగుణములు ఉన్నట్టుగానే ఆత్మకు (ప్రత్యగాత్మకు) కూడ మూడు స్వభావములు కలవు. సత్తు-చిత్తు-ఆనందము అనునవి త్రివిధమైన స్వభావము. ఇందులో (1) 'సత్తు' అనునది ప్రత్యగాత్మయందు క్రియాభావమును చూపును. ఇది ప్రకృతియొక్క 'రజస్సు' అను గుణముతో పోల్చవచ్చును. రజోగుణమే ప్రకృతిని కార్యమునకు ప్రేరేపించును. (2) 'చిత్తు' అనునది ప్రత్యగాత్మయందు ఎఱుక, లేక, సంవిద్భావమును తెలుపును. ప్రకృతియందు ఈ స్వభావము (సంవిత్స్వభావము) 'సత్త్వ' గుణము వలన తెలిసికొనబడును. (3) ఆత్మయందు 'ఆనందము' అను స్వభావము సాధారణముగా అనుభవసంతోషమును తెలియచేయును. సంతోషమునకు కోరుట అనునది యొక గుఱుతు. ప్రకృతియందు 'తమోగుణము' శాంతతను (కోరుటను) తెలియపరుచును. కనుక ప్రకృతియొక్క మూడుగుణముల పైకి రజోగుణము ప్రత్యగాత్మయొక్క సత్ అను స్వభావముతో నన్వయించును. సత్త్వగుణము అను ప్రకృతియొక్కగుణము ప్రత్యగాత్మయొక్క చిత్ అను స్వభావముతో నన్వయించును. ప్రకృతియొక్క తమోగుణము ప్రత్యగాత్మయొక్క ఆనందము అను స్వభావముతో నన్వయించును.

ప్రకృతి—రజోగుణము.

ప్రత్యగాత్మ—సత్.

ప్రకృతి—సత్త్వగుణము.

ప్రత్యగాత్మ—చిత్.
ప్రకృతి—తమోగుణము.
ప్రత్యగాత్మ—ఆనందము.

సత్త్వాదిగుణములు మూడును అన్నిటియందును కనుగొన వచ్చును. శ్రీమద్భగవద్గీతయందు పదునెనిమిదవ అధ్యాయము నందు గుణత్రయమును గురించి చెప్పబడియున్నది. అచ్చట

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం య దేభిః స్యాత్ త్రిభి ర్గుణైః ॥

ప్రకృతియొక్క గుణములైన సత్త్వరజస్తమోగుణములకు లోబడని వారు స్వర్గాదిలోకములందుగాని మనుష్యలోకమునందుగాని ఏ వ్యక్తియు గానరాదు.

అవ్యక్తముగానుండు స్థితినిమించి వ్యక్తస్థితికి వచ్చునప్పటికి "ఆబ్రహ్మస్తంబపర్యంతం" అని బ్రహ్మ విష్ణువు శివుడుకూడ త్రిగుణములకు లోపడినవారలే. మూడు గుణములును త్రివృత్కరణము అయినందువల్ల ప్రతివ్యక్తియందును మూడుగుణములపైకి ఒక గుణము అధికముగాను మిగిలిన రెండు గుణములును కొంచెముగాను కనబడును. ఇదే అర్థమును ఈ క్రింది శ్లోకములు తెలుపుచున్నవి.

ముఖ్య స్తమోగుణ స్తేస్తు గౌణౌ సత్త్వరజోగుణౌ ।
సర్వథా త్రిగుణా య్యాయం సృష్టిస్థిత్యంత కారకాః ॥
ఏభి ర్విహీనం సంసారే వస్తునైవాత్ర కుత్రచిత్ ।
దృశ్యం చ నిర్గుణం లోకే న భూతం న భవిష్యతి ॥

(దేవీభాగవతం 3 స్కం. 6 అధ్యా.)

సత్త్వరజస్తమోగుణములచే బంధింపబడని వ్యక్తియే లేదు. గుణముల త్రివృత్కరణమువల్లనే సృష్టియంతయు కలిగినది. ఒక్కొక వ్యక్తియందును ఒకగుణము ముఖ్యము. మిగిలిన రెండు గుణములును గౌణములు.

రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।
రజ స్సత్త్వం తమ శ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా ॥
(శ్రీమద్భగవద్గీత—అధ్యా. 14, శ్లో. 10)

సత్త్వం న కేవలం క్వాపి న రజో న తమ స్తథా ।
మిళితా శ్చ సదా సర్వే తేనా న్యోన్యా శ్రయాః స్మృతాః ॥
(దేవీభాగవతము, 8 అధ్యా.)

సత్త్వం తు కేవలం నైవ కుత్రా పి పరిలక్ష్యతే ।
మిశ్రీభావా త్తు తేషాం వై మిశ్రత్వం ప్రతిభాతి వై ॥
ఏకం సత్త్వం న భవతి రజ శ్చైకం తమ స్తథా ।
స దైవాశ్రిత్య వర్తంతే గుణా మిథునధర్మిణః ॥
(దేవీభాగవతం, 9 అధ్యా.)

ఒక గుణమునుమాత్రము ప్రత్యేకముగా కనుగొనుట అసాధ్యము. దీనికే గుణముల త్రివృత్కరణస్థితి అనిపేరు.

మూడేసిగా శాస్త్రములయందు చెప్పబడియుండునవి కొన్ని గలవు. వీటికంతటికిని పరస్పరసంబంధమును తెలియచేయుటకై ఈ దిగువ మూడేసి లెక్కగలవాటిని వాని వానియొక్క పరస్పర సంబంధపువరుసను వ్రాయబడును.

| | | |
|---|---|---|
| సత్త్వ | రజస్ | తమస్ |
| చిత్ | సత్ | ఆనంద |
| జ్ఞాన | క్రియా | ఇచ్ఛ |
| గుణ | కర్మ | ద్రవ్య |

కాలాగ్నిరుద్రోపనిషత్తునందు ఈ క్రింది శ్లోకములు ఉన్నవి.

అస్య ప్రథమారేఖా . . . . . క్రియాశక్తిః । అస్య ద్వితీయారేఖా . . . సా ఇచ్ఛాశక్తిః । అస్య తృతీయారేఖా సా . . . . . జ్ఞానశక్తిః ॥

ఈ విధముగా శక్తులను వివరించియున్నది.

శివపురాణమునందు వాయుసంహితయందు

స్థిరం చరం చ య ద్విశ్వం సృజ తీతి వినిశ్చయః ।
జ్ఞానక్రియా చికీర్షాభిః తిసృభిః స్వాత్మశక్తిభిః ॥

ఇచ్ఛాశక్తి ర్మహేశస్య నిత్యా కార్యనియామికా ।
జ్ఞానశక్తిస్తు తత్కార్యం కారణం కరణం తథా ॥
ప్రయోజనం చ తత్త్వేన బుద్ధిరూపాఽధ్యవస్యతి ।
యథేప్సితం క్రియాశక్తిః యథాఽధ్యవసితం జగత్ ।
కల్పయ త్యఖిలం కార్యం క్షణాత్సంకల్పరూపిణీ ॥

ఈ శక్తులు త్రిమూర్తులలో ఎవ్వరెవ్వరికి ఏయే శక్తి సంబంధించినది అని ఈ అడుగున రాబోవు శ్లోకమునందు వివరించియున్నది.

ఇచ్ఛా క్రియా తథా జ్ఞానం గౌరీ బ్రాహ్మీ తు వైష్ణవీ ।
త్రిధా శక్తిః స్థితా యత్ర తత్పరం జ్యోతిరో మితి ॥

శక్తులకును వైఖర్యాది వాక్కులకును సంబంధము కలదు.

ఏకస్యా ఏవ శక్తేః ఇచ్ఛా జ్ఞాన క్రియావ్యపదేశః । సేయమేవ వైఖరీ క్రియాశక్తిః । . . . . మధ్యమా వాక్ ఇచ్ఛాశక్తిః । పశ్యంతీ జ్ఞానశక్తిః ॥

(స్పందకారికావృత్తి)

తత్త్వా నా మాదిభూతం సచ్చిదానందవిగ్రహం ।
సర్వకర్మ ఘనీభూతం ఇచ్ఛాజ్ఞానక్రియాశ్రయం ॥

(దేవీభాగవతము—స్కంధ. ౭, అ ౩౨)

ప్రకృతియే శరీరధారులకు ముఖ్యసేవ్యము. ప్రకృతియే శక్తి అనబడును. శరీరమును ఎంతెంత ఉపయోగకారిగా చేయవలెనన్నను ప్రకృతియే శక్తి నీయవలయును. బలహీనుడు "నేను బ్రహ్మహీను" డని గాని "నేను విష్ణుహీను" డనిగాని "నేను శివహీను" డనిగాని చెప్పడు, అయితే "నేను శక్తిహీను" డను అని చెప్పుకొనును. స్థూలసూక్ష్మకారణ శరీరములు శక్తివల్లనే (ప్రకృతివల్లనే) నిలిచియున్నవి.

విశ్వం శరీర మి త్యుక్తం పంచభూతాత్మకం నగ ।
చంద్రసూర్యాగ్ని తేజోభిః జీవబ్రహ్మైక్యరూపకం ॥
తిస్రః కోట్యః తదర్ధేన శరీరే నాడయో మతాః ।
తాసు ముఖ్యా దశ ప్రోక్తాః తాభ్యః తిస్రో వ్యవస్థితాః ॥

ప్రధానా మేరుదండే త్ర చంద్రసూర్యాగ్ని రూపిణీ ।
ఇడా వామేస్థితా నాడీ శుభ్రా తు చంద్రరూపిణీ ॥
శక్తిరూపా తు సా నాడీ సాక్షా దమృతవిగ్రహా ।
దక్షిణే యా పింగళాఖ్యా పుంరూపా సూర్యవిగ్రహా ॥
సర్వతేజోమయీ సా తు సుషుమ్నా వహ్నిరూపిణీ ।
తస్యా మధ్యే విచిత్రాఖ్యే ఇచ్ఛాజ్ఞాన క్రియాత్మకం ॥

(దేవీభాగవతము—7 స్కం, 35 అధ్యా.)

దేహమునందు మూడు కోట్లున్నరనాడులు ఉన్నవి. వాని అన్నిటిలో పదినాడులు ముఖ్యమైనవి. అందుపైకి మూడు నాడులు శ్రేష్ఠములు. అవి మూడును ఏకమై మేరుదండము అని యోగశాస్త్రమునందు వాడబడువెన్నెముకలో చంద్రసూర్యాగ్ని రూపముతో ప్రవహించుచుండును. చంద్రరూపిణియై ఇడా అనునాడి వెన్నెముకకు ఎడమపార్శ్వమునందు చరించును. ఇది శక్తిరూపమైన నాడి. అనగా స్త్రీరూపముగలది. వెన్నెముకకు కుడిప్రక్కన పింగళయనునాడి సూర్యరూపముతో ప్రవహించియుండును. ఈ రెంటికిని నడుమ సుషుమ్నానాడి అగ్నిరూపము విచిత్రము అను దారియందు ఇచ్ఛాజ్ఞానక్రియాత్మకముగా ప్రవహించును. ఇందును గురించి కొన్ని విషయములు ఇకముందు ఉపాసనాభాగమునందు వ్రాయబడును.

౮౯ వ పుటయందు అచ్చుపడియుండు త్రికములలో త్రివిధశక్తులు కాలాగ్నిరుద్రోపనిషత్తునందు చెప్పబడియున్నవి. ఇతర ఆకరములుకూడ ఇయ్యబడియున్నవి. శక్తి త్రితయమునకును మధ్యమా, పశ్యంతీ, వైఖరీ అను వాక్కులకును సంబంధము ఉన్నదని స్పందకారికయందు చెప్పియున్నదని ఆ ఆకరముకూడ ఇయ్యబడియున్నది. సచ్చిదానందములు అను స్వభావత్రితయమునకును ఇచ్ఛాదిశక్తి త్రితయమునకును గల సంబంధమును దేవీభాగవతము ఏడవ స్కంధము ముప్పదిరెండవ అధ్యాయమునందు చెప్పియున్నది. పైచెప్పబడిన త్రికములకును ఇడాపింగళాసుషుమ్నా నాడులకును సోమసూర్యాగ్నులకును గల సంబంధమును దేవిభాగవతము సప్తమ

స్కంధము ముప్పదియైదవ అధ్యాయమునందలి శ్లోకములు తెలియ చేయుచున్నవి.

శ్రీమద్భగవద్గీత పదునైదవ అధ్యాయమునందు “యదా దిత్యగతం తేజః య చ్చంద్రమసి య చ్చాగ్నౌ త త్తేజో విద్ధి మా మకం” అను స్థలమునందును “తిస్ర ఏవ దేవతాః అగ్నిః పృథివీ స్థానో వాయు ర్వా ఇంద్రో వా అంతరిక్షస్థానః సూర్యో ద్యుస్థానః” అను నిరుక్తము శాస్త్రమునందలి వాక్యమువల్ల దేవతాత్రికము తెలియవచ్చుచున్నది.

ఆదిశక్తి యనునది గుణాతీతము

నిర్గుణా యా సదా నిత్యా వ్యాకృతాఽవికృతా శివా ।
యోగ గమ్యాఽఖిలాధారా తురీయా యా చ సంస్థితా ॥
తస్యాః తు సాత్త్వికీ శక్తిః రాజసీ తామసీ తథా ।
మహాలక్ష్మీః సరస్వతీ మహాకాళీ తి తాః స్త్రియః ॥

(దేవీభాగవతము—స్కం. 1, అధ్యా. 2)

గుణాతీతము అనగా నిర్గుణము. అఖిలాధారము, యోగగమ్యము నైన ఆ వస్తువు (ఆదిశక్తి)యొక్క సాత్త్వికశక్తి మహాలక్ష్మి అనబడును; రాజసశక్తి సరస్వతి అనబడును; తామసశక్తి మహాకాళి అనబడును.

విష్ణౌ చ సాత్త్వికీ శక్తిః తయా హీనో హ్య కర్మకృత్ ।
ద్రుహిణే రాజసీ శక్తి యయా హీనో హ్యసృష్టికృత్ ।
శివే చ తామసీ శక్తిః తయా సంహారకారకః ॥

(దేవీభాగవతము—స్కం. 1, అధ్యా. 2)

శక్తియనునది సాత్త్వికగుణాధికస్థితియందు మహాలక్ష్మియను పేర విష్ణువుయొక్క స్త్రీ. రాజసప్రధానమై సరస్వతీ నామధేయముతో బ్రహ్మకు పత్ని. తామసగుణప్రధానమై మహాకాళియను పేర శివునికి యిల్లాలు.

జ్ఞానశక్తి ఇచ్ఛాశక్తి క్రియాశక్తి అను శక్తులు వ్యవహరించునపుడు

జ్ఞానజన్యా భవే దిచ్ఛా ఇచ్ఛాజన్యా భవే త్కృతిః ।
కృతిజన్యా భవే చ్చేష్టా చేష్టాజన్యా భవే త్క్రియా ॥

(శాండిల్య)

జ్ఞానశక్తి పనిచేసి వస్తువులయొక్క ఉనికిపట్టులను తెలిసికొనినపిమ్మట ఆవస్తువును సంపాదించవలయునను ఇచ్ఛ పుట్టును. ఇచ్ఛనుండి ప్రయత్నము పుట్టును. ప్రయత్నము అనునదికూడ మనస్సునందే సూక్ష్మభావముతో రూపుగొన్నపుడు చేతులుచాచి పనిచేయుదురు. తరువాతనే కార్యసిద్ధియో ఏదోఒకటి కలుగును.

జ్ఞానపూర్వోద్భవా లిప్సా లిప్సాపూర్వాఽభిసంధితా ।
అభిసంధిపూర్వకం కర్మ కర్మమూలం తతః ఫలం ॥

(శాంతిపర్వము—అధ్యా. 254)

మొట్టమొదట ఒకానొక వస్తువు కలదు అను జ్ఞానము. పిమ్మట ఆ వస్తువును పొందవలెను అను అభిలాష పుట్టును. అభిలాష ముదిరి అభిసంధిపుట్టును. అభిసంధి అనగా ఉద్దేశపూరిత ప్రయత్నము. పిమ్మట కార్యము, పిమ్మట ఫలము.

న్యాయశాస్త్రమునందు 'జానాతి', 'ఇచ్ఛతే', 'యతతే' అని మెట్లను వాడుదురు.

ఈ పై శ్లోకములతో అంతఃకరణభాగమునకు వచ్చియున్నాము కనుక మనస్సునుగురించి వ్రాయవలయును.

## మనష్షష్ఠానీంద్రియాణి

మనస్సు అంతరింద్రియము అనబడును. మనస్సుయొక్క సహాయములేకనే ఇంద్రియములు ఏమిపనిచేసినను ఆత్మను అందదు. "మనష్షష్ఠానీంద్రియాణి" అను వాక్యమునందు మనస్సును ఒక ఇంద్రియముగా భావించియున్నారు.

దేహమును రథముగాపోల్చి రథమునకు అధికారి ఆత్మ అని పోల్చినపుడు రథమునకు సారథిగా బుద్ధినిచెప్పి సారథిచేతి పగ్గములు మనస్సు అని చెప్పిరి. ఇంద్రియములు గుఱ్ఱములుగాపోల్చబడినవి.

ఈ అభిప్రాయమునందు ఇంద్రియములకును సారథికిని సంబంధము మనస్సు అని తెలియవచ్చుచున్నది. కనుక మనస్సును అంతరింద్రియము అందురు.

మనస్సునే పరబ్రహ్మము అని కొన్నిస్థలములయందు చెప్పియున్నారు. మనస్సే మనుష్యుడు అని కొన్నిస్థలములయందు చెప్పబడియున్నది.

మాయాశబళమైన బ్రహ్మమునకు వేదాంతములయందు ఈశ్వరుడు అనిపేరు. ఈశ్వరుడు సచ్చిదానందరూపుడు. సత్తు, చిత్తు, ఆనందములు అనునవి ఈశ్వరుని స్వభావములు.

సకల సృష్టికిని కారణమైన ఈశ్వరునియందు సకలశక్తులును దాగియున్నవి. ప్రకృతి వికృతి రూపముగా సృష్టి ఆరంభింపబడినది. మూలప్రకృతినుండి మహత్తు పుట్టినది. ఇచ్చట మూలప్రకృతి ప్రకృతి, మహత్తత్త్వము వికృతి, మరల మహత్తత్త్వము ప్రకృతి, దానియొక్క వికృతి అహంకారతత్త్వము. ఇట్లు మునుపటితత్త్వము వెనుకటితత్త్వమునకు కారణము అని సాంఖ్యశాస్త్రములయందు చెప్పబడియున్నది. ఈ తత్త్వములన్నియు ఈశ్వరునియందు ఇమిడియుండు శక్తులు.

చిచ్ఛక్తిః బ్రహ్మణో రామ శరీరే ష్వుపలభ్యతే ।
స్పందశక్తి శ్చ వాతేషు దార్ఢ్యశక్తి స్తథోపలే ॥
శూన్యశక్తి స్తథాఽకాశే నాశశక్తి ర్వినాశిని ।
ఫలపుష్పలతాపత్ర శాఖావిటపమూలవాన్ ।
వృక్షబీజే యథా వృక్ష స్తథేదం బ్రహ్మణి స్థితం ।
క్వచి త్కశ్చిత్కదాచి చ్చ తస్మాదుద్యంతి శక్తయః ।
దేశకాలవిచిత్రత్వాత్ క్ష్మాతలా దివ శాలయః ॥

వృక్షముయొక్క బీజమునందు చెట్టంతయు నిమిడియుండురీతిగా బ్రహ్మమునందు సకలశక్తులును ఇమిడియుండును. ఎపుడు ఏ శక్తిని ఉపయోగించవలయునని ఈశ్వరుడు కోరునో అపుడు ఆ శక్తిని ఉపయోగించును.

అనంతస్యాఽ త్మత త్త్వస్య సర్వశక్తే ర్మహాత్మనః ।
సంకల్పశ క్తికలితం తద్రూపం య న్మనో విదుః ॥

(చిత్తోపాఖ్యానం—జ్ఞానవాసిష్ఠం, ఉత్పత్తిప్రకరణం.)

ఈశ్వరునియొక్క సంకల్పశక్తికి మనస్సు అనిపేరు.

భావ స్సదసదో ర్మధ్యే నృణాం చలతి యశ్చలః ।
కల్పనోన్ముఖతాయాతః తద్రూపం మనసో విదుః ॥

సత్తుఅయిన ఈశ్వరునికిని అసత్తుఅయిన ప్రకృతియొక్క పరిణామములైన తత్త్వములకును (అయిన చేతనాచేతనములకు) సంబంధము మనస్సు అనబడును.

మరియు శిఖిధ్వజోపాఖ్యానమునందు శిఖిధ్వజుడు అడుగున కనిన ప్రశ్న చేయుచున్నాడు—

కే నాయం చాల్యతే దేహం కిం బీజం జన్మకర్మణాం ।
కస్మిం స్త్యక్తే పరిత్యక్తం సర్వో భవతి సుందరం ॥

ఈ నా దేహము దేనివల్ల చలించబడుచున్నది. జన్మములకు కారణము ఏది. దేనిని వదులుకొన్నపుడు సకలమును సుందరముగా కనబడుచున్నది.

ఇందుకు ప్రత్యుత్తరము.

సాధో సర్వగతాకారం జీవప్రాణాదినామకం ।
న జడం నాఽజడం భ్రాంతం చిత్తం సర్వ మితి స్మృతం ॥

సర్వగతాకారముగలదియై జీవము ప్రాణము అను పేళ్లతో వ్యవహరింపబడునదియు జడముకానిదియు మరియు అజడమును కానిదియు నగు చిత్తమే సకలముగా కనబడుచున్నది.

చిత్తం విద్ధి జగజ్జాలం బంధః చిత్త మజీర్యతే ।
తస్మిన్ సాధో పరిత్యక్తే సర్వత్యాగో భవే దిహ ॥
జన్మనాం కర్మణాం వాఽపి చిత్తం బీజ ముదాహృతం ।
పాదపః పవనే నేవ దేహ శ్చిత్తేన చాల్యతే ॥

(జ్ఞానవాసిష్ఠము—శిఖిధ్వజోపాఖ్యానము.)

చిత్తము మనస్సు అనుశబ్దములు సమానవాచకములుగా నుపయోగించబడియున్నవి. మనస్సే జగత్తునంతయు కట్టియుండు వల. వలలో చిక్కుకొన్న జంతువులు బంధింపబడినట్లు చిత్తము (మనస్సు) అను వలలో చిక్కుకొనియుండు జగత్తు స్వతంత్రములేనిదై యున్నది. ఆస్వభావముగల మనస్సును జయించినయెడల సకలమును జయించినట్టు భావించవచ్చును. జన్మములకు కర్మలకును మనస్సే కారణము. ఏ విధముగానైతే గాలికొట్టినపుడు చెట్లుకదులుచున్నవో ఆ విధముగా మనస్సుయొక్క వేగముతో దేహమంతయు కదులుచున్నది అని యోగవాసిష్ఠము శిఖిధ్వజోపాఖ్యానమునందు చెప్పియున్నది. ఈ చిత్తమునకు మూలము అహంకారతత్త్వము.

ఒకవిధముగా సృష్టిక్రమమును సూక్ష్మముగా ఉపనిషత్తులు చెప్పుచున్నవి.

అవిద్యాకారణమున క్షేత్రజ్ఞుడు కలుగుచున్నాడు. వాసనా బలముచే దేశకాలక్రియాచేష్టలు కలుగుచున్నవి.

చితో రూప మిదం బ్రహ్మన్ క్షేత్రజ్ఞ ఇతి కథ్యతే ।
వాసనాః కల్పయన్ సో పి యా త్యహంకారతాం పునః ॥
అహంకారో వినిర్ణేతా కళంకీ బుద్ధి రి త్యుచ్యతే ।
బుద్ధిః సంకల్పితాకారా ప్రయాతి మన సాస్పదం ॥
మనో ఘనవికల్పం తు గచ్ఛ తీంద్రియతాం శనైః ।
పాణిపాదమయం దేహం ఇంద్రియాణి విదు ర్బుధాః ॥
ఏవం జీవో హి సంకల్పవాసనారజ్జు వేష్టితః ।
దుఃఖజాలపరీతాత్మా క్రమా దాయాతి నీచతాం ॥

(మహోపనిషత్తు)

జీవాత్మగా నేర్పడి అహంకారము బుద్ధి మనస్సు అను తత్త్వములను సంపాదించి వాసనాబలముతో పరివేష్టింపబడుచున్నాడు.

అఖండవృత్తియం దుండిన జీవాత్మ ఖండవృత్తి ననుభవించుచున్నాడు. 'త్వత్తా హంతా త్మతా పరతా' నీవు, నేను, అను భేదములను మనస్సు కలుగజేయుచున్నది.

ఇతి శక్తిమయం చేతో ఘనాహంకారతాం గతం ।
కోశకారక్రిమి రివ స్వేచ్ఛయా యాతి బంధనం ॥
స్వసంకల్పిత తన్మాత్ర జాలాభ్యంతరవర్తి చ ।
పరాం వివశతా మేతి శృంఖలాబద్ధసింహవత్ ॥
క్వచి న్మనః క్వచి ద్బుద్ధిః క్వచిత్ జ్ఞానం క్వచిత్ క్రియా ।
క్వచి దేత దహంకారః క్వచి చ్చిత్త మితి స్మృతం ॥
క్వచి త్ప్రకృతి రి త్యుక్తం క్వచి న్మా యేతికల్పితం ।
క్వచి న్మల మితి ప్రోక్తం క్వచి త్క ర్మేతిసంస్మృతం ॥
(మహోపనిషత్తు)

మనస్సునే అనేకవిధములైన పేళ్లతో వ్యవహరించుచున్నారు.

చంచలత్వము మనస్సుయొక్క స్వభావము.

ఛిన్నాభ్రమండలం వ్యోమ్ని యథా శరది ధూయతే ।
వాతే నాకల్పనే నైవ తథాం త ర్ధూయతే మనః ॥
(జ్ఞానవాసిష్ఠము)

శరత్కాలమునందు మేఘమండలము గాలిచేత కదిలింపబడి మేఘములు మూలమూలకు తరమకొట్టబడును. అట్లు చంచలస్వభావము గల మనస్సు జీవాత్మకు అశాంతిని కలుగజేయుచుండును.

న హి చంచలతాహీనం మనః క్వ చన విద్యతే ।
చంచలత్వం మనోధర్మో వహ్నిధర్మో యథో ష్ణతా ॥
(జ్ఞానవాసిష్ఠము)

చంచలస్వభావములేని మనస్సు ఎక్కడయు కానరాదు. అగ్నికి ఉష్ణము ఏ విధముగా స్వభావమో ఆ విధముగా మనస్సునకు చంచలత్వము స్వభావము.

యై షా హి స్పందశక్తి శ్చిత్తత్వసంస్థితా ।
తాం విద్ధి మానసీం శక్తిం జగదాడంబరాత్మికాం ॥
(జ్ఞానవాసిష్ఠము)

చిత్తము అనుపేరు పొందినట్టి ఈ స్పందశక్తియే (చంచలత్వమే) జగత్తు అను నానాత్వమునకు కారణము. ఈ చంచలత్వముయొక్క ఫలముగా

అయం సోఽ హ మిదం త న్మే ఏతావ న్మాత్రకం మనః ।

 

వీడు, వాడు, నేను, ఇది, అది, నాకు, నీకు, వానికి, దానికి ఇట్టి అహంకార మమకారములే మనస్సు. జగత్తంతయు అహంకార మమకారరూపములుగానే యున్నది. మనస్సు చంచలస్వభావమును నిరాటంకముగా నుపయోగించుటచేత ఒకపుడు ఉత్తమ విషయములను ఆకర్షించును. ఒకపుడు నీచములైన విషయములను ఆకర్షించును.

యత్తత్సదసతోర్మధ్యం యన్మధ్యం చిత్తజాడ్యయోః ।
తన్మనః ప్రోచ్యతే రామ ద్వయోర్డోలాయతాకృతిః ॥

(మహోపనిషత్)

సత్ అనగా బాధకులోబడని బ్రహ్మము. అసత్ అనగా బాధకులో బడిన జగత్తు. ఉభయసంఘట్టమై ఒకపుడు ఊర్ధ్వదృష్టికలదియు మరియొకపుడు అధోదృష్టికలదియునైన మనస్సు ద్వివిధస్వభావము కలదిగానుండును. కనుకనే బంధము కలుగజేయుటయు మోక్షమును సంపాదించియిచ్చుటయు మనస్సునకే సాధ్యము.

తస్య చంచలతా యైషా త్వవిద్యా రామ సోఽచ్యతే ।
వాసనాపరనామ్నీం తాం విచారేణ వినాశయ ॥

(యోగవాసిష్ఠము)

మనస్సుయొక్క చంచలస్వభావమునకే అవిద్య అనిపేరు. ఆ మనస్సే వాసనారూపముగా ఆనుభవించబడును. వాసనలనుగురించి ముందు వ్రాయబడును.

'చిత్తమేవ నరః' అని యోగవాసిష్ఠమునందు వసిష్ఠులు శ్రీ రామచంద్రునికి ఉపదేశముచేసియున్నారు. అనగా చిత్తమే, మనస్సే, నరుడు అని అర్థము. 'విరించి రూపాన్మనసః' అని మనస్సునకు బ్రహ్మయొక్క సామ్యము మహోపనిషత్తునందు చెప్పబడియున్నది. జగత్సృష్టి బ్రహ్మచేత కలుగుచున్నది. అట్టి జగత్తును మనుష్యుల మనస్సుకూడ సృష్టించుచున్నది. చతుర్ముఖబ్రహ్మకు మానసధ్యాని అని హరివంశమునందు ఒకపేరు కలదు. కనుక మనస్సుయొక్క

ప్రభావము చాలమెండు. సర్వార్థసాధకత్వశక్తి మనస్సునకు కలదు.

భృత్యో౽భిమతకర్తృత్వాత్ మంత్రీః సర్వార్థకారణాత్ ।
సామంత శ్చేంద్రియాక్రాంతే ర్మనో మన్యే వివేకినః ॥
లాలనాత్ స్నిగ్ధలలనా పాలనాత్ పాలకః పితా ।
సుహృ దుత్తమవిన్యాసాత్ మనో మన్యే మనీషిణః ॥ (మహోపనిషత్తు)

జీవాత్మ సంకల్పించి తన మనస్సుతో తన మనస్సునే నిగ్రహించి యుంచినయెడల జీవాత్మ కిష్టములైన కార్యములను మనస్సు చేయును. అందువల్ల జీవాత్మకు మనస్సు భృత్యుడు అనదగును. సర్వప్రయోజనముల యొక్కయు సిద్ధికికారణము గనుక జీవాత్మ అను రాజునకు మనస్సు మంత్రివంటిది. ఇదే మనస్సు ఇంద్రియజాలమును స్వాధీనముచేసి కొనినపుడు ఆ ఇంద్రియముల చేష్టలను నియమించుటవలన మండలాధిపతిగాను జీవాత్మకార్యములకు అనుకూలమై జీవాత్మను లాలించునపుడు ప్రేమగల భార్యవంటిదిగాను జీవాత్మకు తగినయుక్తులనుచెప్పి పాలించుటవలన తండ్రితో సమానముగాను శ్రేష్ఠములైన సుఖములను ఇచ్చుటవలన స్నేహితుడుగాను ఎంచబడుచున్నది.

మనస్సు తండ్రితో పోల్చబడియున్నది. ఏలాగైతే లోకమునందు బిడ్డకు, పుత్రునికి తండ్రి అన్నివిధములచేతను తన సొత్తునిచ్చునట్లు మనస్సు అను తండ్రి శాస్త్రాభ్యాసముచేతను తనయొక్క ఉర్ధ్వభాగమైన బుద్ధిచేతను విమర్శించి తన కనిష్టభావమైన మలిన వాసనాయుతమైన మనస్సును జయించినయెడల జీవాత్మను కాపాడునట్టి తండ్రియే అగును అని యీ క్రింది శ్లోకము మహోపనిషత్తునం దున్నది.

స్వా౽లోకత శ్శాస్త్రదృష్ట్యా చ స్వబుద్ధ్యా స్వానుభావితః ।
ప్రయచ్ఛతి పరాం సిద్ధిం త్యక్త్వా౽త్మానం మనఃపితా ॥

ఇటువంటి మనస్సు పరిశుద్ధమై స్వచ్ఛమై

సుదృష్ట స్సుదృఢః స్వచ్ఛః సుక్రాంతః సుప్రబోధితః ।
స్వగుణే నోర్జితో భాతి హృది హృద్యో మనోమణిః ॥ (యోగవాసిష్ఠము)

గట్టిపడిన మనస్సును 'మనోమణి' అందురు.

ఏవం మనోమణిం బ్రహ్మన్ బహుపంకకళంకితం ।
వివేకవారిణా సిద్ధ్యై ప్రక్షాళ్యా లోకవాన్ భవ ॥

(మహోపనిషత్)

పైన చెప్పినంత ప్రభావముగల మనస్సు అను మణి అడుసులోబడిన మణివలె భేదదృష్టి అను అడుసులో పడియున్నది. అడుసులోపడి మురికిచెందినమణిని నీళ్లతోకడిగి శుద్ధిచేసినరీతిగా వివేకము అను నీటిచేత మనస్సును పరిశుద్ధిచేయవలెను.

మనస్సుకు యజమానుడైన జీవాత్మ వాసనాబలమువల్ల అనగా పూర్వజన్మములయందలి అనుభవముల జ్ఞాపకమువల్ల ఆ అనుభవముల పైననే జ్ఞాపకము నిలిపియు అట్టి అనుభవములలో సంతోషకరము లైనవాటిని మరల అనుభవించవలయునని కోరుచు దుఃఖమునిచ్చిన వాటిని కోరకయు ఇట్టి వ్యవహారములను చేయుచు

వాసనాః కల్పయన్ సోఽపి యాత్యహంకారతాం పునః ।
అహంకారో వినిర్ణేతా కళంకీ బుద్ధి రుచ్యతే ॥
బుద్ధి స్సంకల్పితాకారా ప్రయాతి మననాఽ స్పదం ।
మనోఘన వికల్పంతు గచ్ఛతీంద్రియతాం శనైః ।
పాణిపాదమయం దేహమింద్రియాణి విదుర్బుధాః ।
ఏవం జీవో హి సంకల్పవాసనా రజ్జువేష్టితః ।
దుఃఖజాల పరీతాత్మా క్షమా దాయాతి నీచతాం ।
ఇతి శక్తిమయం చేతో ఘనాహంకారతాం గతం ॥
కోశకార క్రిమి రివ స్వేచ్ఛయా యాతి బంధనం ।
స్వసంకల్పితతన్మాత్రజాలాభ్యంతరవర్తిచ ।
పరాం వివశతా మేతి శృంఖలాబద్ధసింహవత్ ॥
క్వచిన్ మనః క్వచిత్ బుద్ధిః క్వచిత్ జ్ఞానం క్వచిత్క్రియా ।
క్వచి దేతదహంకారః క్వచి చ్చిత్త మితి స్మృతం ॥
క్వచిత్ ప్రకృతి రిత్యుక్తం క్వచి న్మాయేతి కల్పితం ।
క్వచి న్మల మితి ప్రోక్తం క్వచిత్ కర్మేతి సంస్కృతం ॥
క్వచిత్ బంధ ఇతి ఖ్యాతం క్వచిత్ పుర్యష్టకం స్మృతం ॥
ఇమం సంసార మఖిలం ఆశాపాశవిధాయకం ।
దధ దంతర్హితైః పీనరపటభాసా వటం యథా ॥

చింతానలశిఖాదగ్ధం కోపాజగరచర్వితం ।
కామాబ్ధికల్లోల రహితం విస్మృతాత్మ పితామహం ॥
సముద్ధర మనో బ్రహ్మన్ మాతంగ మివ కర్దమాత్ ।

(మహోపనిషత్)

మనస్సునకు యజమానుడైన జీవాత్మ వాసనలను కల్పించుకొనుచు అహంకారము అను పదవినిచెందును. అభిమానము అందువల్ల కలుగును. అభిమానరూపియైన అహంకారము విషయములను విమర్శించుచు కళంకములపాలై అంతఃకరణము లేక బుద్ధి అనిపించుకొనును. అంతఃకరణము సంకల్పములు కలదియై మనస్సగును. మనస్సే అనేక వికల్పములను పొంది కాలానుసారముగా ఇంద్రియత్వమును చెందును; అనగా లోకమును అనుభవించుటకు కావలసిన జ్ఞానేంద్రియములుగాను కర్మేంద్రియములుగాను మారును. కాళ్లుచేతులు మొదలగు అవయవములు గల దేహమును తత్త్వవేత్తలు ఇంద్రియ సమూహము అందురు. ఈ ప్రకారముగా జీవాత్మ వాసనాజాలముచే ప్రేరితుడై దుఃఖపుంజములచే చుట్టబడినవాడై క్రమముగా కాలేన నీచతనుచెందును. చిత్తము ఎంతశక్తిమంతముగా నుండినను అభిమానమైన అహంకారముచే ప్రేరేపింపబడి పట్టుపురుగు తనచుట్టును పట్టుత్రాటిని చుట్టుకొని తానుగా గలుగజేసికొనిన త్రాటిగూటియందు చిక్కి వెలుపలికి రాలేకపోయినట్టు బంధములలో చిక్కును. (పట్టుపురుగు తాను కల్పించిన దారములచేతనే తానుగానే గూటిని కట్టుకొని ఆ గూటియందు కారాగృహమునందువలె చిక్కి సమసిపోవును). ఆ విధముగానే చిత్తమును మనస్సును అహంకారమును వీట్లను తనకు కరణములుగా నుపయోగించి వానికంతయు నొకపుడు అధిపతియైయుండిన జీవాత్మ శరీరాభిమానము, జాతినీతికుల గోత్రముల అభిమానము మరియు ననేకవిధములైన అభిమానములచే బంధించబడి అందుచిక్కుకొని విడిపించుకోలేక తన అధికారమును పోగొట్టుకొని సంసారమునందు క్లేశము ననుభవించుచుండును. తన సంకల్పములే తనను బంధించగా సింహము మృగేంద్రముగా నున్నను గొలుసులచే కట్టబడినట్లు జీవుడు తన సంకల్పములచేతనే

కట్టబడును. ఒకపుడు సంకల్పరూపమైన మనస్సు అనబడును. ఒక పుడు నిశ్చయాత్మకమైన బుద్ధి అనబడును. మరియొకపుడు జ్ఞానము అనబడును. చిత్తము సమయానికితగినట్టు పేళ్లను చెందును. మనస్సని బుద్ధియని జ్ఞానమని క్రియయని అహంకారమని ప్రకృతియని మాయయని మలమని కర్మమని బంధమని అవిద్యయని ఇచ్ఛయని ఇన్ని పేళ్లు వ్యవహారమునందు గలవు.

ఈ సమస్తసంసారమును ఆశ అను త్రాళ్లచే గట్టబడినది. సంకల్పబీజములు మఱ్ఱిచెట్టుయొక్క విత్తనమువలె సన్నవియైనను మఱ్ఱివృక్షము విత్తనములో నణగియున్నట్టుగా మహాగొప్పవిగా పరిణమించి వాటిని సృజించిన జీవాత్మ అను యజమానునికే శ్రమ లను కలుగజేయును. విచారములు, చింతలు, అను అగ్నిజ్వాలల చేత తగలపెట్టబడినదియు, కోపము, తాపము అను కొండపాముల చేత భక్షింపబడుచున్నదియు, కామములను అలలయందు (సముద్ర ములోని అలలు) ఇష్టముగలదియు, తానెవ్వరు అను ఆభిజాత్యమును (అనగా పరబ్రహ్మముయొక్క అంశఅయిన తాను పరబ్రహ్మమేకదా అను తన పితృ పితృపితామహుల పెద్దతనమును) మరిచియు, చీకాకుపడుచుండు మనస్సును ఉద్ధరింపుమయ్యా అని అర్థము.

ఇట్లు క్షేత్రజ్ఞుడు ప్రకృతియందు ప్రవేశించి లోకమందు చరిం చుచుండును. ప్రకృతియందు మరియును అధికముగా ప్రవేశించుటకు కారణము తృష్ణ.

తృష్ణ అనగా ఆశ. తృష్ణనే బౌద్ధమతగ్రంథములయందు "తణ్హ" అందురు. తృష్ణ అను పదమునకు దాహము అని అర్థము. వేసవికాలమందు దాహము విశేషముగానుండును. దాహము చేత పీడింపబడువాడు మొట్టమొదట శుద్ధజలముతోనే దాహశాం తినిపొందవలెనని ఇచ్ఛయించినను దాహము శాంతతచెందక మరి మరి దాహశాంతికి నీరు కావలెనని కోరినపుడు శుద్ధజలమే కావలె నని ఆశించినను ఉప్పులుగానుండు నీరైనను చాలును అని ఉప్పునీటిని ఆతురతతో కోరును. మనము ఇపుడు విచారించుచున్న తృష్ణ అనునది దరిదాపులేని ఆశ.

ధీరో౽ ప్యతి బహుజ్ఞో౽ పి కులజో౽ పి మహా నపి ।
తృష్ణయా బధ్యతే జంతుః సింహ శ్శృంఖలయా యథా ॥

బుద్ధిమంతుడైనను మిక్కిలిగా అన్నివిషయములయందును జ్ఞానము కలవాడైనను మంచికులమునందు పుట్టినవాడైనను గొప్పసామర్థ్యము కలవాడైనను ఎన్ని శ్రేష్ఠగుణములు గలవాడైనను సింహము గొలుసులచే కట్టబడి ఖైదులో నిలిచినట్లు తృష్ణ అను సంకిలిచేత కట్టబడును.

మనస్సునుండి ఇంద్రియములు పుట్టును.

దిక్కాలా ద్యనవచ్ఛిన్న మాత్మతత్త్వం స్వశక్తితః ।
లీల యైవ యదా దత్తే దిక్కాలకలితం వపుః ॥
త దైవ జీవపర్యాయవాసనావేశతః పరం ।
మన స్సమ్పద్యతే లోలం కలనా కలనోన్ముఖం ॥

(మహోపనిషత్తు)

దిక్కు కాలము అను ఉపాధిశూన్యమగు ఆత్మతత్త్వము తనయందు ఉండు శక్తివలన దిక్కు కాలము అను వ్యవస్థలుగల శరీరమును స్వీకరించును. అతనియందు మనశ్శక్తి పుట్టును.

కలయంతీ మనశ్శక్తిః ఆదౌ భావయతి క్షణాత్ ।
ఆకాశభావనా మచ్ఛాం శబ్దబీజరసోన్ముఖీం ॥

(మహోపనిషత్తు)

మనశ్శక్తినుండి ఒక నిమిషకాలములో శబ్దమును గుణముగాగల సూక్ష్మమైన స్వచ్ఛమైన ఆకాశము అను భావము పుట్టుచున్నది.

తత స్తత్ ఘనతాం యాతం ఘనస్పందక్రమాత్ మనః ।
భావయత్యనిలస్పందం స్పర్శబీజరసోన్ముఖం ॥

(మహోపనిషత్తు)

సూక్ష్మమైనదియు స్వచ్ఛమైనదియునైన ఆ ఆకాశమునందలి సూక్ష్మస్పందములు ఘనములై స్పర్శతన్మాత్రస్వభావముగల వాయుతత్త్వము జనియింపించును.

తాభ్యా మాకాశవాతాభ్యాం దృఢాభ్యాసవశాత్ తతః ।
శబ్దస్పర్శరూపాభ్యాం సంఘర్షాత్ జన్యతే౽ నలః ॥ (మహోపనిషత్తు)

పిమ్మట దృఢమైన స్పందములవల్లను శబ్దస్పర్శస్వరూపములైన ఆకాశ వాయుతత్త్వములనుండి తేజస్తత్త్వము పుట్టును.

రూపతన్మాత్రసహితం త్రిభి స్తైః సహ సమ్మితం ।
మన స్తాదృక్ గుణగతం రసతన్మాత్రవేదనం ।
క్షణాత్ చేత త్యప్తాం శైత్యం జలసంవి త్తతో భవేత్ ॥
(మహోపనిషత్తు)

తేజస్తత్త్వము రూపతన్మాత్ర సహితము. ఆ తేజస్తత్త్వము ఆకాశ వాయుతన్మాత్రలతోకూడుకొని రసతన్మాత్ర వేదనముగల అప్తత్త్వ మును పుట్టించును.

తత స్తస్మా త్తాదృగ్గుణగతం మనో భావయతి క్షణాత్ ।
గంధతన్మాత్ర మేతస్మాత్ భూమిసంవి త్తతో భవేత్ ॥
(మహోపనిషత్తు)

రసగుణమును పొందినమనస్సు అటుతర్వాత రసతన్మాత్ర స్వభావము గల ఆప్తత్త్వమునుండి గంధతన్మాత్రను పుట్టించి అందునుండి పృథివీ తత్త్వమును పుట్టించును.

అథే త్థంభూత తన్మాత్రవేష్టితం తనుతాం జహత్ ।
వపుః వహ్నికణాకారం స్ఫురితం వ్యోమ్ని పశ్యతి ॥
(మహోపనిషత్తు)

పిమ్మట ఈ విధమున శబ్దస్పర్శరూపరసతన్మాత్రలను కారణముగా గలిగి సూక్ష్మావస్థను వదలి భూతములు అను పేర పంచభూతములగు పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశములుగా పరిణమించును.

ఇంతటికిని కారణభూతమైన మనస్సునకు మలినము ఒక స్వభావముగా నున్నది.

తండులస్య యథా చర్మ తామ్రస్య యథా కాళిమా ।
నశ్యతి క్రియయా విప్ర పురుషస్య తథా మలం ॥
జీవస్య తండుల స్యేవ మలం సహజ మప్యలం ।
నశ్య త్యేవ న సందేహః తస్మా దుద్యోగవాన్ భవ ॥
(మహోపనిషత్తు)

బియ్యమునకు ఊక అను మాలిన్యము ఏ విధముగా నున్న దో ఎట్లు రాగికి చిలుము ఉన్నదో అయితే ఆ మాలిన్యములు ప్రయత్నము చేత నశించుచున్నవో అదేవిధముగా మనస్సుయొక్క మాలిన్యము కూడ నశించవచ్చును. తండులమువలెనే జీవునియొక్క మాలిన్యము కూడ పోవును. మాలిన్యము పోయినపుడు మోక్షము కలుగును.

ఇక వాసనలనుగురించి విచారించవలయును.

## వాసనలు

యోగవాసిష్ఠము ఉపశమప్రకరణములో కడపటిభాగము నందు మోక్షమునకు మూడు ఉపాయములున్నవని చెప్పియున్నారు.

వాసనాక్షయ విజ్ఞాన మనోనాశా మహామతే ।
సమకాలం చిరాభ్యస్తా భవంతి ఫలదా ఇమే ॥

వాసనాక్షయము తత్త్వజ్ఞానము మనోనాశము ఈ మూటిని ఏక కాలమందు దీర్ఘకాలము అభ్యసించవలయును. దీర్ఘకాలము అభ్య సించితేనే మోక్షముపొందుట సాధ్యము అని చెప్పబడియున్నది.

త్రయ ఏతే సమం యావన్న స్వభ్యస్తా ముహుర్ముహుః ।
తావన్న పదసంప్రాప్తిః భవత్యపి సమాశతైః ॥

పై చెప్పబడిన వాసనాక్షయము తత్త్వజ్ఞానము మనోనాశము అను మూడు సాధనములను ఏకకాలమునందే మాటి మాటికి చక్కగా నభ్యసించనియెడల నూరు సంవత్సరములకైనను మోక్షము కలుగ నేరదు.

ఇట్లు చెప్పియున్నది గనుగ వాసన అనగా నేమి అని విచారించ వలయును.

దృఢభావనయా త్యక్త్వా పూర్వాపరవిచారణం ।
యదాదానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా ॥
(యోగవాసిష్ఠము)

అనేకజన్మములయందు భావింపబడియున్నందున గట్టిబడినదిగనుక వెనుకముందు ఆలోచించక మంచిచెడ్డలను విమర్శించక ఒక

 

కార్యమును ఒక విధముగా చేయుటకు ఉద్యుక్తుడగునట్టు సాహసము నిచ్చునట్టి మనస్సుయొక్క స్థితికి వాసన అనిపేరు.

భావితం తీవ్రవేగాదాత్మనా యత్తదేవ సః ।
భవత్యాశు మహాబాహో విగతేతరసంస్మృతిః ॥
(యోగవాసిష్ఠము)

ఇతరవిషయములు అనగా లాభాలాభములను గురించి చింతించక పురుషుడైనవాడు ఏ యే వస్తువులను దృఢమైన మనస్సుతో చింతించునో ఆ పురుషుడు ఆ వస్తువే అగును.

తాదృగ్రూపో హి పురుషో వాసనా వివశీకృతః ।
సంపశ్యతి యదేవైతత్ సద్వస్త్వితి విముహ్యతి ॥
(యోగవాసిష్ఠము)

తాను భావించిన వస్తువుయొక్క రూపమును చెందిన పురుషుడు వాసనాపరవశుడై చెడ్డవస్తువును చూచినను దానివలనచెడుపు కలుగును అని వినియుండినను ఆ వస్తువు మంచివస్తువు అనియే తలచును. అందువలన పదార్థములయొక్క నిజమైన స్వభావము తెలియరాదు.

వాసనావేగవైవశ్యాత్ స్వరూపం ప్రజహాతి తత్ ।
భ్రాంతం పశ్యతి దుర్దృష్టిః సర్వం మదవశాదివ ॥
(యోగవాసిష్ఠము)

వాసనాబలమువల్ల కలిగినవేగముచేత మనశ్శాంతిని కోలుపోయిన తనయొక్క వాస్తవమైన స్వరూపమునే తాను తెలిసికొనలేక మద్యముచే మనస్సుభ్రమించినవాడు సకలవస్తువులు గిరగిర తిరుగుచున్నవని అనుకొనునట్టు అతనికండ్లకు సర్వపదార్థములును విపరీతములుగానే కనబడును.

వాసనలు సముదాయముగా మొదట రెండువిధములుగా నుండును.

వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధా చ మలినా తథా ।
మలినా జన్మహేతుః స్యాత్ శుద్ధా జన్మవినాశినీ ॥
(యోగవాసిష్ఠము)

శుద్ధము మలినము అని వాసనలు రెండు విధములు. శుద్ధవాసనలు మోక్షమునకు సాధనములు, మలిన వాసనలు పునర్జన్మమునకు కారణములు. బంధము, మోక్షము అని రెండుస్థితులు కలవు. అందులో

బంధో హి వాసనాబంధః మోక్షః స్యాత్ వాసనాక్షయః ।

(యోగవాసిష్ఠము)

వాసనలచే ప్రేరితమైన మనస్సును ఇష్టప్రకారము వ్యవహరించునట్లు సమ్మతించుటయే బంధము.

పూర్వజన్మములయందు మనస్సుమొదలగు మూడు కరణములచే చేసినకార్యములు ఆ యా కరణములకు అలవాటును కలుగజేసినవి. ఇందులో కొన్ని శుభఫలము నిచ్చునట్టివి, కొన్ని అశుభఫలము నిచ్చునట్టివి. వీనినే శుభవాసనలు అనియు అశుభవాసనలు అనియు చెప్పుదురు.

వాసనలు కామక్రోధాదిరూపముగా మనలను అంటియుండును. మనచేత సృష్టింపబడిన వాసనలు మననే బంధించును. వీనికే దివ్యజ్ఞానసమాజ గ్రంథములలో థాటు ఫారములు అందురు. ఏ మనస్సు-వాక్కు-శరీరము అను త్రికరణములచే మనము వాసనలను కలుగజేసికొంటిమో ఆ వాసనలపైకి ఏవి మన అభ్యుదయమునకు అడ్డములో ఆ వాసనలను మనమే మన మనస్సుతో ఇప్పటినుండి చక్కపెట్టుకోవలెను. వాసనలును త్యజించుట చాలకష్టము. అది నిజమే. అయినను దీర్ఘకాలాభ్యాసమువల్ల వాసనలను మార్చుట సాధ్యము అని దృఢముగా చెప్పవచ్చును.

అజ్ఞానసుఘనాకారా ఘనాహంకారశాలినీ ।
పునర్జన్మకరీ ప్రోక్తా మలినా వాసనా బుధైః ॥

(జీవన్ముక్తివివేకము)

అజ్ఞానము అనగా పంచకోశములకు వ్యతిరిక్తుడైన ఆత్మను పంచకోశములే ఆత్మ అని నమ్మియుండుట. ఇట్టి అజ్ఞానముచే వాసనలు గడ్డకట్టిపోవును. అనగా ఘనములు—చాల బలముగలవిగా నగును. వాసనలు కొన్ని ప్రబలమైన అహంకారముతో కలిసియుండును.

ఇట్టివి పునర్జన్మమునకు కారణము లగును. కనుక మలినవాసనలను శుద్ధవాసనలతో పడగొట్టవలయును. ముఖ్యముగా మనస్సుయొక్క వాసనలు చాల బలముగలవి.

మానసీ ర్వాసనాః పూర్వం త్యక్త్వా విషయవాసనాః |
మైత్ర్యాది వాసనా నామ్నీః గృహాణా మలవాసనాః ||

(జీవన్ముక్తివివేకము)

వాసనలు స్థూలముగా రెండు విధములు. మానసవాసనలు ఒకటి. విషయవాసనలు రెండవది. మరల మానసవాసనలు మూడువిధములు. లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన అని. మనస్సును సంబంధించిన వాసనలు మనస్సుయొక్క గుణములుగా కనబడును.

కామస్సంకల్పో వి చికిత్సా శ్రద్ధా గృతి రధృతిః హ్రీః ధీః ఇతి ఏతత్ సర్వం మన ఏవ ||

(బృహదారణ్యకము)

అనగా కామము, సంకల్పము, విచారేచ్ఛ, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, లజ్జ, జ్ఞానము, భయము మొదలగునవి మనస్సుయొక్క రూపములు. ఈ విషయములయందు పూర్వాపర విచారములేక మనస్సునందు కలుగు తీర్మానములు మానసవాసనలు.

విషయవాసనలు అనగా దంభము, దర్పము, అహంకారము మొదలైన గుణములు. ఇవి శ్రీమద్భగవద్గీత పదునారవ అధ్యాయమునందు ఆసురసంపత్తిగా వర్ణింపబడియున్నవి. వాసనలు స్థూలముగా బంధములు అయినను లోకవాసన శాస్త్రవాసన దేహవాసన అనునవి మృదుబంధములు. విషయవాసనలగు దంభము మొదలగునవి తీవ్రబంధములు.

ఈ మానసవాసనలు విషయవాసనలు వీటినిగురించి మరి ఎన్నోవాదములు కలవు. అవి మన కార్యమునకు అవశ్యములుకావు. ముఖ్యముగా లోకవ్యవహారమందుగాని పారమార్థికమునందుగాని జనులకు మానహానిని కలుగుజేయునవి దంభము, దర్పము, అహంకారము మొదలగు అసురసంపద్గుణములు. ఈ గుణములను మూల

ఛేదనరూపముగా పోగొట్టుకొనవలయును. ఈ ఆసురసంపద్గుణము లను “గర్వాకారిన్యాదిదుర్గుణాన్ తత్తద్విరోధి సుగుణావష్ఠంభేన క్షాళనం” ఆ యా దుర్గుణమునకు విరోధమైన సుగుణమును అనుష్ఠాన ముచేసి సుగుణములను గట్టిపరుచుకోవలయును. సుగుణములు ఇవి అని పాతంజలసూత్రములయందు చెప్పియున్నది.

మైత్రీ కరుణా ముదితా ఉపేక్షాణాం సుఖదుఃఖ పుణ్యాపుణ్య విషయా నాం భావనాతః చిత్తప్రసాదనం ॥

(పాతంజలము)

మనయొక్క మనస్సుకు మలినములు కలవు. రాగము, ద్వేషము, సుఖము, దుఃఖము మొదలగునవి మలినములు. ‘సూఖానుశాయీ రాగః’ అనియు ‘దుఃఖానుశాయీ ద్వేషః’ అనియు చెప్పబడి యున్నది. ఒక సుఖమును అనుభవించుచుండగా ఇట్టి సుఖము మనకు విడువక కలుగుచుండవలయునని కోరుచుండుట రాగము. ఒక దుఃఖ మును అనుభవించుచుండగా ఇట్టి దుఃఖములు నాకు ఎప్పటికిని రా కూడదు అని విసికికొనుట ద్వేషము. తనకు ప్రకృతకాలమునందు సుఖములు కలుగలేదే అని వ్యాకులముచెందు పురుషుడు ఇతరులు సుఖములను అనుభవించుచుండగా చూచి విసుగుకొనకయే వీరం దరును నాకు స్నేహితులే వేరుకాదు. వారు అనుభవించు సుఖము కూడ నేను అనుభవించుచున్నాను అనుకొనుటకు మైత్రి అనిపేరు.

ఈ విధముగా “మైత్రీ కరుణా ముదితా” అని పైన చెప్ప బడిన యోగసూత్రమునకు అనేక వ్యాఖ్యానములను చదివి వాటిని మనకు అన్వయించుకొనవలయును.

ప్రాణా యథా ఆత్మనః అభీష్టాః భూతానా మపి తే తథా ।
ఆత్మౌపమ్యేన భూతానాం దయాం కుర్వంతి సాధవః ॥

ప్రాణములు నాకు ఎట్లు ఇష్టములైనవస్తువులో నావలెనే ఇతరులకును ప్రాణములు ఇష్టములు అని వివేకవంతులు సకలభూతములను తనతో సమానములుగా నెంచి వాటిని భాధించరు. మరియు వాటియందు కరుణకలిగి యుందురు. ఇంతేకాదు.

సర్వే అత్ర సుఖినః సంతు సర్వే సంతు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చిత్ దుఃఖ మాప్నుయాత్ ॥

లోకమునందు అందరును సుఖము కలిగియుండవలయును. అందరును రోగములుమొదలగు ఉపద్రవములు లేనివారుగా నుండవలయును. సమస్తజనులు శుభమునే పొందుచుండవలయును. ఎవ్వరికిని దుఃఖము రావద్దు అని సదా కోరుచు సంతోషపడుచుండుట 'ముదితా' అనుగుణము.

ఈ ప్రకారమొక్కొక మలినవాసనను ఆ వాసనకు విరుద్ధమైన శుద్ధవాసనను అభ్యసించుటచేత పోగొట్టుకొనవలయును. ఈ విషయమునందు "శీలము" అను అంశముక్రింద ఆత్మవిచారమునందు వ్రాసియున్నాము.

వాసనలసంగతి విపులముగా తెలిసికొని వాసనలను పోగొట్టుకొను ప్రయత్నము చేయవలయును.

వాసనాసంపరిత్యాగే యది యత్నం కరోష్యలం ।
తాస్తే శిథిలతాం యాంతి సర్వాధివ్యాధయః క్షణాత్ ॥

(యోగవాసిష్ఠము)

శ్రీరామా నీవు మలినవాసనలను నివర్తింపజేయుటయందు విశేషముగా ప్రయత్నముచేసినయెడల నీ మనస్సునందుండు తాపములన్నియు క్షణకాలములోనే నశించిపోవును అని వసిష్ఠమహాముని చెప్పెను.

పౌరుషేణ ప్రయత్నేన బలా త్సంత్యజ్య వాసనాః ।
స్థితిం బధ్నాసి చేత్ తర్హి పద మాపాదయ స్యలం ॥

(యోగవాసిష్ఠము)

పురుషకారముచేత మలినవాసనల నన్నిటిని తరిమి స్థిరమైన స్థితిని పొందితివేని జీవన్ముక్తిని సంపాదించగలవు.

తస్మా ద్వాసనయా బద్ధం ముక్తం నిర్వాసనం మనః ।
రామ నిర్వాసనీభావం ఆహ రాశు వివేకతః ॥

(యోగవాసిష్ఠము)

కనుక ఓరామా మనస్సు వాసనలతో నిండియుండినపుడు బద్ధము అనబడును. వాసనలు లేనపుడు నిర్వాసనము అనబడును. కనుక వివేకమును ఉపయోగించి మనస్సును ముక్తముగా జేసికొనుటకు శీఘ్రముగా ప్రయత్నపడుము.

సమ్యగాలోచనాత్ సత్యాత్ వాసనా ప్రవిలీయతే ।
వాసనావిలయే చేతః శమ మాయాతి దీపవత్ ॥

(యోగవాసిష్ఠము)

పదార్థములయొక్క వాస్తవమైన స్థితిని తెలిసికొనినపుడు వాసనలు క్షీణించును. వాసనలు లయింపగానే మనస్సుకూడ శమమును పొందును. ఇచ్చట పురుషకారము ముఖ్యసాధనము.

## పురుషకారము

దైవము పురుషకారము అను రెండుఅంశములు గలవు. దైవము అనగా ప్రారబ్ధకర్మతో నేను ప్రేరేపింపబడి కార్యములనుచేయుచున్నానేగాని నేను స్వతంత్రుడనుగాను అని ప్రారబ్ధముపై భారమును మోపి సహాయహీనుడను నేను అని యుండుస్థితికి దైవము అని పేరు.

ప్రారబ్ధము అనునది నేను పూర్వజన్మములయందు చేసిన కార్యములయొక్క ఫలము. ఆ జన్మములయందు నేను మనస్సుతోనేకదా కార్యములను చేసితిని. ఇపుడును అదే మనస్సుతో ప్రయత్నపూర్వకముగా ఈ ప్రారబ్ధమును తెగగొట్టుటకు ప్రయత్నముచేయుచున్నాను అని జీవాత్మ తన శక్తిని ఉపయోగించుటకు పురుషకారము అనిపేరు.

వాసనా సంపరిత్యాగే యది యత్నం కరోష్యలం ।
తాస్తే శిథిలతాం యాంతి సర్వాధివ్యాధయః క్షణాత్ ॥
పౌరుషేణ ప్రయత్నేన బలాత్ సంత్యజ్య వాసనాః ।
స్థితిం బధ్నాసి చేత్ తర్హి పదమాపాదయస్యలం ॥

(యోగవాసిష్ఠము)

మలినవాసనలను నివర్తింపజేయుటయందు విశేషముగా ప్రయత్న ముచేసితివా నీ మనస్సునందుండు తాపములన్నియు నిమిష ములో నశించిపోవును. పురుషులకు (జీవాత్మలకు) సాధ్యమైన ప్ర యత్నముచే మలినవాసనలను బలాత్కారముగా వెడలతరిమి నీవు స్థిరముగా, మరల మలినవాసనలకు లోబడకయుంటివేని శ్రీ రామచంద్రా జీవన్ముక్తి అను పదవినిచెందగలవు అని వసిష్ఠులవారు చెప్పిరి. కనుక పురుషకారమును ఉపయోగించవలయును.

ఇది భగవద్గీతయందు

యతతో హ్యాపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥
ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి ॥

వివేకజ్ఞానముగల పురుషుడు వివేకమును ఉపయోగించి కార్యములు చేయుచున్నప్పటికిని ఇంద్రియములు చాల బలముకలవి గనుక ప్రమాదమును కలుగజేసి మనస్సును తమ తమ త్రోవలకు లాగికొనిపోవును. ఇంద్రియములు విషయములయందు చరించు చుండగా మనస్సు ఇంద్రియముల వెంబడి విషయములలో ప్రవే శించును. ఈ విధముగా విషయములయందు చరించు నభ్యాసము గల మనస్సు ఇంద్రియముల వెంబడిపోవుచు సముద్రమునందు చరించు నావ వాయువుచే గొట్టబడినట్టు చెదరి నశించును. కనుక

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

(శ్రీమద్భగవద్గీత)

యోగమును అభ్యసించుటకు ప్రయత్నముచేయువాడు తనయొక్క జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను అన్నిటిని నిరోధించి విషయముల వెంబడి పరుగెత్తనీయక నిర్బంధపెట్టి భగవంతునియందు నిలకడ చెందునట్లు చేయవలెను.

తస్మా ద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః ।
ఇంద్రియాణీం ద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥
(శ్రీమద్భగవద్గీత)

కనుక ఓ అర్జునా ఏ పురుషునికి ఇంద్రియములు స్వాధీనములో అనగా ఉత్తరవు పొందక యే విషయములయందు ప్రవేశించవో ఆ పురుషుడే స్థిరమైన తత్త్వజ్ఞానము గలవాడు

శుభాఽశుభాభ్యాం మార్గాభ్యాం వహంతీ వాసనాసరిత్ ।
పౌరుషేణ ప్రయత్నేన యోజనీయాశుభే పథి ॥
అశుభేషు సమావిష్టాం శుభే ష్వేవావ తారయేత్ ।
స్వమనః పురుషార్థేన బలేన బలినాం వర ॥
అథ చే దశుభో భావః స్త్వాం యోజయతి సంకటే ।
ప్రాక్త న స్తదసౌ యత్నాత్ జేతవ్యో భవతా స్వయం ॥
అశుభా చ్చాలితం యాతి శుభం తస్మాదపీతరత్ ।
జంతోశ్చిత్తం తు శిశువత్ తస్మాత్త చ్చాలయేద్బలాత్ ॥
సందిగ్ధాయా మపి భృశం శుభా మేవ సమాహర ।
శుభాయాం వాసనా వృద్ధా తాత దోషో న కశ్చన ॥
(యోగవాసిష్ఠము)

వాసనలు అను నదికి రెండుగట్లు కలవు. శుభము అనునది యొక గట్టు. అశుభము అనునది మరియొకగట్టు. నదియందలి జలము సందర్భానుసారము ఎడమగట్టునుచూచియో ఒకపుడు కుడితట్టు గట్టును చూచియో ప్రవహించును. అట్లుప్రవహించునీటిని మనకు ఏ గట్టు పార్శ్వమునకు త్రిప్పుకొనవలయునని ఇచ్ఛకలుగునో ఆ గట్టు పార్శ్వముగా అనకట్టుమొదలగు ఉపాయములతో త్రిప్పుకొనుదుముగదా. ఆప్రకారము అశుభస్వభావముగల వాసనలను మనయొక్క ప్రయత్నముతో శుభమునకు త్రిప్పవలయును.

అశుభములైన వాసనలయందు మనస్సు ప్రవర్తించెనేని ఆ మనస్సును తనయొక్క ఉత్తమస్వభావముగల మనస్సుతో బలవంతముగా త్రిప్పుకొనవలయును. ఒకవేళ అశుభవాసనలే ప్రబలముగా నిన్ను ప్రేరేపించుచున్న పక్షమందు అట్టి అశుభవాసనలు పూర్వ

జన్మములయందు చేసిన కార్యములయొక్క ప్రయోజనములు అని తెలిసికొని దృఢప్రయత్నముచేత మంచివాసనలుగా మార్చుకొనవలయును. చిన్నబిడ్డలను తప్పుత్రోవలనుండి మంచిత్రోవలకు త్రిప్పినట్లు అశుభవాసనలనుండి మనస్సును శుభవాసనలకు త్రిప్పుట చాల సులభము. మనస్సు లేతబిడ్డవంటిది. చపలమైన మనస్సును సమత్వమును బోధించుటచేత క్రమక్రమముగా మంచివాసనలకు త్రిప్పవచ్చును. ఇందుకు పురుషప్రయత్నము ముఖ్యము. పురుషప్రయత్నము అనగా ఏ విధముగానైనా ఈ కార్యమును సాధించవలెను అను ఉత్సాహము. పదార్థములయందు ఉండు గుణదోషములను విచారించి విమర్శించుటకు వివేకము అని పేరు. జీవాత్మ అయిన ఉపాసకుడు వివేకమును ఉపయోగించి దుష్టవాసనలను గెలుచుటకొఱకు చేయునట్టి ప్రయత్నమునకు పురుషకారము అని పేరు.

స్వపౌరుషైక సాధ్యే స్వేప్సితత్యాగరూపిణా ।
మనఃప్రశమమాత్రేణ వినా నాస్తి శుభా గతిః ॥

తాను చేయుటకు శక్తిగలదియైన, అనగా తన శక్తికిలోబడిన పురుషప్రయత్నముచేత ముఖ్యముగా మనస్సును, వాసనలను జయించుట సాధ్యము. వాసనలచేత ప్రేరేపింపబడిన భోగములను స్వప్రయత్నముచేత విడుచుట మనశ్శాంతికి కారణము. ఇది ఉపాసకుడు ఇష్టపడిన యెడల చేయుటకు సాధ్యమైన పని.

పరం పౌరుష మాశ్రిత్య నీత్వా చిత్త మచిత్తతాం ।
ధ్యానతో హృదయాకాశే చితి చిచ్చక్రధారయా ॥
మనోమారయ నిశ్శంకం త్వాం ప్రబధ్నంతి నా రయః ।

(మహోపనిషత్తు)

కనుక శ్రేష్ఠమైన పురుషప్రయత్నముచేత మనస్సునందు అశుభవాసనలు ఉద్భవించకుండునట్లు తెలివి అను ఆయుధమును ఉపయోగించి ! వాసనలను (చిత్తమును) గెలిచితివేని పిమ్మట నీకు శత్రువులే లేరు.

మన ఏవ సమర్థం హి మనసో దృఢనిగ్రహే ।

(మహోపనిషత్తు)

మనస్సును దృఢముగా నిగ్రహించుటకు మనస్సునకే శక్తికలదు.

మన సైవ మనః ఛిత్వా పాశం పరమబంధనం ।
భవా దుత్తార యాత్మానం నాఽసౌ పన్యేన తార్యతే ॥

(మహోపనిషత్తు)

శుద్ధమనస్సును ఉపయోగించి వాసనలు అను పేరుగలదియు బంధములలో కెల్ల బలవంతమైనదియును అయిన మలినమనస్సును ఛేదించి, మోక్షమునకు ప్రయత్నము చేయము.

ఈ ప్రకారముగా స్వప్రయత్నముచేత వాసనలను గెలువవలయును.

చిత్తమును జయించుటకు ప్రయత్నముచేయు ఉపాసకుడు అనుష్ఠానమును చేయుచుండినపుడు ఏ విధముగా నడుచుకొనెను అను వివరము వాసిష్ఠరామాయణమునందు ఉద్దాలకుని చరిత్రయందు చెప్పియున్నది.

కదాఽహం త్యక్తమననే పదే పరమపావనే ।
చిరం విశ్రాంతి మేష్యామి మేరుశృంగ ఇ వాంబుదః ॥

(యోగవాసిష్ఠము)

నేను నిర్విచారముగా మనస్సును ఏ విధముచేత స్థిరముగా నుంచుకొనగలను

ఇతి చింతా పరవశో బలా దుద్దాలకో ద్విజః ।
పునః పునస్తూ పవిశ్య ధ్యానాభ్యాసం చకార హ ॥

(యోగవాసిష్ఠము)

ధ్యానమునుండి విరమించి ఊరక లోకవ్యవహారమం దుండునపుడే కదా మనస్సు తన యిచ్ఛవచ్చినట్లు పరుగులిడుచున్నది. కనుక అధికముగా మనస్సును లోకవ్యవహారములో ప్రవేశించనీయక మరల మరల ధ్యానమునందే నిలిచి ఉండును అని ధ్యానముయొక్క అభ్యాసమునందు అధికకాలమును గడుపుచుండెను.

విషయై ర్నీయమానే తు చిత్తే మర్కటచంచలే ।
న స లేభే సమాధాన ప్రతిష్ఠాం ప్రీతిదాయినీం ॥

(యోగవాసిష్ఠము)

కోతివలె గంతులువేయుచు విషయములచేత అపహరింపబడి పరుగులు పారుచున్న మనస్సును చూచి ఉద్దాలకుడు సమాధానమును పొందకపోయెను.

కదాచి ద్బాహ్యసంస్పర్శ పరిత్యాగా దనంతరం ।
తస్యాఽఽగచ్ఛత్ చిత్తకపి రాంతరస్పర్శసంచయాన్ ॥

(యోగవాసిష్ఠము)

బాహ్యప్రపంచమునందలి శబ్దాదివిషయములచే ఆకర్షింపబడకయే మనస్సును దృఢప్రయత్నముచే నిరోధించినపుడు వాని మనస్సు బాహ్యమైన ప్రపంచవిషయగ్రహణమునకుగా పరుగెత్తలేదుగాని ఆంతరమునందుండు విషయముల జ్ఞాపకముచే చంచలమును పొందుచుండెను. ఆంతరవిషయము లనగా పూర్వము ఎన్నడో మనము విషయములను ఎట్లు అనుభవించితిమి అను జ్ఞాపకము. ఆ జ్ఞాపకమును స్మరించుచుండును.

కదా చిత్ ఆంతరస్పర్శాత్ బాహ్యం విషయ మాదదే ।
తస్యోడ్డీయ మనో యాతి కుత్రా పి త్రస్తపక్షివత్ ॥

ఉద్దాలకుడు తన మనస్సును కట్టిపెట్టి యున్నానని కొంత ఏమరినపుడు మరల బాహ్యవిషయములకు వాని మనస్సు పరుగెత్తుచుండును.

ఈ ప్రకారముగా వాసనలవలన కలిగిన మనశ్చాంచల్యమును కొంత కొంతగా జయించుచు రాగా నిద్ర మోహము మొదలగు దోషములచే మలినముకాని స్థితిని ఉద్దాలకుని మనస్సు చెందెను. మనస్సు "ప్రతిక్షణ పరిణామి నో హి భావాః ఋతే చితిశక్తేః" అను న్యాయసూత్రప్రకారము చిత్తమునకు వాసనల ప్రేరణవలన విచిత్రరూపములైన పరిణామములు కల్గునని చెప్పబడుచున్నను సంతతము

అభ్యసించుటచేత మనస్సు నిలకడచెంది వాసనలను గమనించకయే యుండును. ఇందుకు సంతత అభ్యాసము ముఖ్యసాధనము.

వాసనలను గురించి సాధ్యమైనంతవరకును సంగ్రహముగా వ్రాయబడియున్నది. అయినను కొంత అక్కరతో వాసనలను జయించ కోరువారల ఉపయోగార్థముగా యోగవాసిష్ఠము అను ఉత్తమ గ్రంథమునుండి కొన్ని శ్లోకములు ఈక్రింద కనపరుచబడియున్నవి. ఇష్టమున్నయెడల యోగవాసిష్ఠమందు ఈ భాగములను చదివి చదువరులు లాభమును పొందుదురుగాక. యోగవాసిష్ఠము, ఆకాశ గత్యభావోపాఖ్యానమునందు :

ద్వే బీజే రామ చిత్తస్య ప్రాణస్పందన వాసనే ।
ఏకస్మిం శ్చ తయోః క్షీణే క్షిప్రం ద్వే అపి నశ్యతః ॥
వాసనావశతః ప్రాణః స్పందతి యేన చ వాసనాః ।
జాయతే చిత్తబీజస్య తేన బీజాంకుర క్రమః ॥
వాసనాప్రాణపవనస్పందయోః అనయోః ద్వయోః ।
సంవేద్యం బీజమి త్యుక్తం స్ఫురతః తౌ యత స్తతః ॥
సంవేద్య సంపరిత్యాగాత్ ప్రాణస్పందన వాసనే ।
సమూలం నశ్యతః క్షిప్రం మూలఛేదా దివ ద్రుమః ॥
సంవిదం విద్ధి సంవేద్య బీజం ధీర తయా వినా ।
న సంభవతి సంవేద్యం తైల హీనస్థితో యథా ॥

---

వాసనా సంపరిత్యాగే యది యత్నం కరోషి వా ।
తత్తే శిథిలతాం యాంతి సర్వాఽఽధివ్యాధయః క్షణాత్ ॥
యావ ద్విలీనం మనః న తావ ద్వాసనా క్షయః ।
న క్షీణా యావ త్తావత్ చిత్తం న శామ్యతి ॥
యావ న్న తత్త్వవిజ్ఞానం తావ చ్చిత్తశమః కుతః ।
యావ న్న చిత్తోపశమో న తావ త్తత్త్వవేదనం ॥
యావత్ న వాసనానాశః తావ త్తత్త్వాగమః కుతః ।
యావ న్న తత్త్వసంప్రాప్తిః న తావత్ వాసనాక్షయః ॥
తత్త్వజ్ఞానం మనోనాశో వాసనాక్షయ ఏవ చ ।
మిథః కారణతాం గత్వా దుస్సాధ్యాని స్థితాన్యతః ॥

తస్మాద్రాఘవ యత్నేన పౌరుషేణ వివేకినా ।
భోగేచ్ఛాం దూరతః త్యక్త్వా త్రయ మేత త్సమాశ్రయేత్ ॥
ఏకైకశో నిషేవ్యంతే యత్ ఏతే చిరమప్యలం ।
తన్న సిద్ధిం ప్రయచ్ఛంతి మంత్రా స్సంకలితా ఇవ ॥
త్రయ ఏతే సమం యావత్ నతు అభ్యస్తా ముహుర్ముహుః ।
తావ న్న పదసంప్రాప్తిః భవతి అపి సమాశతైః ॥
వాసనాక్షయవిజ్ఞానమనోనాశా మహామతే ।
సమకాలం చిరాభ్యస్తా భవంతి ఫలదాయినః ॥
త్రిభి రేభిః సమాభ్యస్తైః హృదయగ్రంథయో దృఢాః ।
నిశ్శేష మేవ తృట్యంతే బిసచ్ఛేదాత్ గుణాః ఇవ ॥
జన్మాంతర శతాభ్యస్తాః రామ సంసార సంస్థితిః ।
సా చిరాభ్యాసయోగేన వినాఽపి క్షీయతే క్వచిత్ ॥

---

వాసనా సంపరిత్యాగ సమం ప్రాణనిరోధనం ।
విదుః తత్త్వవిదః తస్మాత్ త ద ప్యేవం సమాచరేత్ ॥
వాసనా సంపరిత్యాగాత్ చిత్తం గచ్ఛతి అచిత్తతాం ।
ప్రాణస్పంద నిరోధా చ్చ యథేచ్ఛసి తథా కురు ॥
ప్రాణాయామదృఢాభ్యాసైః యుక్త్యా చ గురుదత్తయా ।
ఆసనాశనయోగేన ప్రాణస్పందో నిరుధ్యతే ॥
నిస్సంగవ్యవహారిత్వాత్ భవభావనవర్జనాత్ ।
శరీరనాశ నిశ్చిత్యా వాసనా న ప్రవర్తతే ॥
వాసనావిభవే నష్టే న చిత్తం సంప్రవర్తతే ।
న శాంతే పవనస్పందే యథా హంసో నభఃస్థలే ॥
యః ప్రాణస్పందః చిత్తస్పందః స ఏవ హి ।
ప్రాణస్పందక్షయే యత్నః కర్తవ్యో ధీమతో చ్చకైః ॥
ఉపవిశ్యోపవిశ్య ఏవ చిత్తైక్యేన ముహుర్ముహుః ।
న శక్యతే మనో జేతుం వినా యుక్తి మనిందితాం ॥

యోగవాసిష్ఠమునందు ఆకాశగత్యభావోపాఖ్యానము అను భాగము ఉపశమప్రకరణమునందు ఉన్నది. ఇచ్చటనే పుణ్యాపావనో

పాఖ్యానముకూడ ఉన్నది. ఈ భాగము నిజముగా ఈ విషయ మునకు ఉపయోగకారి. దీనిని చదివినయెడల చిత్తజయమునకును వాసనలను గెలుచుటకునుకూడ అనేక ఉపాయములు తెలియవచ్చును.

మనస్సునుగెలుచుట అనగా అహంకారమును వశపరిచి కొనుట. యోగవాసిష్ఠమునందు అహంకారము నాలుగువిధములు అని చెప్పియున్నది.

అహంకారము

ఆపాదమస్తక మహం మాతాపితృవినిర్మితః ।
ఇత్యేకో నిశ్చయో రామ బంధాయాఽసద్విలోకనాత్ ॥
అతీత స్సర్వభావేభ్యో వాలాగ్రా దహం తనుః ।
ఇతి నిశ్చయో మోక్షాయ ద్వితీయో జాయతే సతాం ॥
అహం జగద్వా సకలం శూన్యం వ్యోమసమ స్సదా ।
తృతీయో నిశ్చయ శ్చేత్థం మోక్షా యైవ రఘూత్తమ ॥
జగజ్జాలపదార్థాత్మా సర్వ ఏవాఽహ మక్షయః ।
అహంకార శ్చతుర్థో పి నిశ్చయో మోక్షసిద్ధయే ॥

నేను నాతల్లితండ్రులిచ్చిన స్థూలశరీరము అను దేహాత్మభావమైన అహంకారము చాలనీచమైనది. బంధమును కలుగజేయునది. మిగిలిన మూడువిధములైన అహంకారములును నీచములుగావు. నీచమై దేహాత్మరూపమైన అహంకారముగాక నేను ఆత్మను, వాలాగ్రముకన్న (వెంట్రుకదారముయొక్క కొనకన్న) సూక్ష్మడను అను నిశ్చయముకూడ అహంకారమె. ఐనను మొదటచెప్పబడిన దేహాత్మభావమునకన్న మేలు. అందుకూడ తాను వేరు అను పృథగ్భావము ఉన్నది.

మూడవదియైన "అహం జగద్వా సకలం" నేనేకదా సకల లోకము అను నహంకారమునందు ప్రత్యేకభావముపోయి సర్వాత్మైక భావము ఉన్నందున ఈ మూడవదియైన అహంకారము మోక్ష సాధనము.

నాలుగవదియైన జగజ్జాలమంతయు నేనే అను అహంకారము మోక్షసిద్ధినే ఇచ్చును.

ఈ పైనచెప్పబడిన అహంకార చతుష్టయమునందు

ఏతేషాం ప్రథమః ప్రోక్తః తృష్ణయా బంధయోగ్యయా ।
శుద్ధతృష్ణా స్త్రయః స్వచ్ఛాః జీవన్ముక్తవిలాసినః ॥
సర్వమాత్మా హ మేతి నిశ్చయో యో మహామతే ।
ప్రమోదాయ విషాదాయ న భూయో యాతి తే మతిః ॥

ఆపాదమస్తకముగానుండు శరీరమే నేనుఅను అహంకారము తృష్ణచే నిండినది. మిగిలినవి మలినమైన తృష్ణతో సంబంధపడలేదు. పాణి పాదాదిమాత్రుడ నేనుఅను

వర్జ్య ఏవ దురాత్మాఽసౌ కంద స్సంసారదుస్తరోః ।
అనేనాఽభిహతో జంతుః అధోధః పరిధావతి ॥

(మహోపనిషత్తు)

మలినాహంకారము విడువదగినది. అది సంసారవృక్షమునకు బీజము, దుర్వృత్తిగలది. దీనిని అనుసరించిన నరుడు అధోగతి మరియునంత కంటె నధోగతికిని పోవును.

అనయా దురహంకృత్యా భావా త్సంత్యక్తయా చిరం ।
శిష్టాహంకారవాన్ జంతుః శమవాన్ యాతి ముక్తతాం ॥

ఈ పైనచెప్పిన దురహంకారమును వదులుకొని పైనవివరింపబడిన సదహంకారముగలవాడు శమము మొదలగు సద్గుణములను అభ్య సించి వృద్ధికిరాగలడు.

అహంకారగ్రహాత్ ముక్తః స్వరూప ముపపద్యతే ।
చంద్రవ ద్విమలః పూర్ణః సదానందః స్వయంప్రభః ॥

అహంకారముఅనునది చెడ్డది. చంద్రగ్రహమును రాహువు కబళించి నపుడు చంద్రుడు రూపమును పోగొట్టుకొన్నట్లు జీవాత్మయు యీ దురహంకారమునకు లోబడినపుడు తనయొక్క ఔన్నత్యము (సత్ స్వభావము) ను పోగొట్టుకొని లోకవాసన, శాస్త్రవాసన, దేహ వాసన మొదలగు ఇబ్బందుల పాలగును.

అహంకారము రెండు విధములు. మొట్టమొదట జీవాత్మ అను మిణుగురు తాను నేను ఉన్నానని ప్రత్యేకభావమును చెందినది. ఆ స్థితికి ఉన్నత అహంకారము అని పేరు. ఇది ఎల్లప్పుడును అనగా జీవన్ముక్తియందుకూడ ఉండును. జీవాత్మ క్రమక్రమముగా ఉన్నత లోకములను వదిలి క్రిందిలోకములకు దిగినపుడు అనుభవసంపాదన మునకుగా నీచమైన అహంకారము అంకురించి ప్రత్యేకభావము అధికమై అంతఃకరణములు శరీరములు వీటియందు ప్రవేశించి ఒక అంతఃకరణము మరియొక అంతఃకరణముతో పోటీచేసికొని ప్రవృత్తి మార్గమునందు వృద్ధిచెంది నివృత్తిమార్గమునందు ప్రవేశించుటకు తగినంతశక్తిని సంపాదించుకొనును. ఇదివరకును నీచాహంకారము ఉపయోగకారియే. నీచాహంకారముయొక్క గురుతులైన ఆసుర సంపద్గుణములవల్ల అవశ్యాత్తుగా నీచాహంకారము వృద్ధిచెంది లోక వ్యవహారములయందు ఒక వ్యక్తిగా నగును. ఇంతటితో నీచాహం కారముయొక్క ప్రయోజనము ముగిసినది కనుక నీచాహంకారమును వదులుకొని క్రమేణ నివృత్తిమార్గమునందు అభిలాషజనించి వృద్ధి పొందుచు జీవాత్మ తాను ఇతరులకంటె ప్రత్యేకుడను అనుభావ మును పోగొట్టుకొనవలయును. అహంకారము (నీచాహంకారము) తగ్గగా

లోకానువర్తనం త్యక్త్వా త్యక్త్వా దేహానువర్తనం ।
శాస్త్రానువర్తనం త్యక్త్వా స్వాధ్యాసాఽపనయం కురు ॥

(అధ్యాత్మోపనిషత్)

లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసన అను బంధములు తగ్గుట కును నశించుటకును వీలగును.

సర్వత్ర వాసనాత్యాగో రామ రాజీవలోచన ।
ద్వివిధః కథ్యతే తజ్జ్ఞైః ధ్యేయో జ్ఞేయ శ్చ నామతః ॥

(యోగవాసిష్ఠము)

శ్రీరామా వాసనాత్యాగము రెండు విధములు. ధ్యేయము అను నది యొకజాతి. జ్ఞేయము అనునది యొకజాతి.

### ధ్యేయ (వాసనా) త్యాగము

అహం తేషాం పదార్థానాం ఏతే చ మమ జీవితం ।
నాహ మేభి ర్వినా కశ్చిత్ న మయైతే వినా కిల ॥
ఇత్యంతర్నిశ్చయం త్యక్త్వా విచార్య మనసా సహ ।
నాహం పదార్థస్య న మే పదార్థ ఇతి భావితే ॥
అంతశ్శీతలయా బుద్ధ్యా కుర్వతో లీలయా క్రియాం ।
యో నూనం వాసనాత్యాగో ధ్యేయోనామ కీర్తితః ॥

(యోగవాసిష్ఠము)

నేను ఈ పదార్థములకు ప్రాణతుల్యుడను, నాకు ఇవి ప్రాణతుల్యములుకదా అను అంతఃకరణభావమును వదిలి మనస్సుతో చక్కగా నివృత్తిపాత్రముగా విచారించి నేను ఈ పదార్థములకు సంబంధించినవాడను కాను; నాకును ఈ పదార్థములు సంబంధించినవి కావు అని అంతఃకరణమునందు భావముకలుగకయే లీలతో వదులుకొనుటకు ధ్యేయత్యాగము అని పేరు. అహంకారము మొదలు దేహమువరకును ఈ ధ్యేయత్యాగము అన్వయించును.

### జ్ఞేయ (వాసనా) త్యాగము

ఇక జ్ఞేయవాసనాత్యాగమును గురించి చెప్పునది ఏమనగా

సర్వం సమతయా బుద్ధ్యా యః కృత్వా వాసనాక్షయం ।
జహాతి నిర్మమో దేహం జ్ఞేయోఽసౌ వాసనాక్షయః ॥

(యోగవాసిష్ఠము)

పరిశీలించి అహంకారమమకారములను విడిచి స్థూల సూక్ష్మ కారణ దేహములయందలి అభిమానమును వదలి నిశ్చలుడుగా దేహమును వదలుకొని యుండుటకు జ్ఞేయవాసనాత్యాగము అని పేరు.

వాసనాబంధమునకు ముఖ్యకారణము తృష్ణ. ఇంతకుముందు తృష్ణనుగురించి కొద్దిగా వ్రాయబడియున్నది. అయినను మరల కొంత వ్రాయవలయును.

## తృష్ణ

అనగా దాహము అని చెప్పబడినది. వాసనకు తృష్ణ (లేక బౌద్ధగ్రంథములయందు "తన్హా") అనబడునదే కారణము. తృష్ణ వల్ల వాసన, వాసనవలన తృష్ణ: ఈ ప్రకారము అన్యోన్యాశ్రయము ఏర్పడియున్నది. తృష్ణను దివ్యజ్ఞానసమాజపు పుస్తకములలో 'డిజైరు ఎలిమెంటలు' (Desire Elemental) అందురు.

> యాం యాం అహం మునిశ్రేష్ఠ సంశ్రయామి గుణశ్రియం ।
> తాం తాం కృంతతి మే తృష్ణా తంత్రీ మివ కుమూషికా ॥
>
> (మహోపనిషత్తు)

మంచిగుణములలో ఏ యే గుణమును నేను అభ్యసించుటకు ప్రయత్నముచేసినను నూలిపోగులను ఎలుకలు కత్రించినరీతిగా తృష్ణ అనునది ఆ ప్రయత్నములనెల్ల కొనసాగనీయదు.

> పదం కరోత్యలంఘ్యేఽపి తృప్తాఽపి ఫలమీహతే ।
> చిరం తిష్ఠతి నైకత్ర తృష్ణా చపలమర్కటీ ॥
> సర్వసంసార దుఃఖానాం తృష్ణైకా దీర్ఘదుఃఖదా ।
>
> *　　*　　*　　*
>
> బలాత్కామ పిశాచేన వివశః పరిభూయతే ॥
>
> (మహోపనిషత్తు)

ఒక చాటుదాటి పట్టుకొనుటకు సాధ్యముకాదు అని తెలిసినప్పటికిని తాను కోరినట్టివస్తువులను పట్టుటకు ముందంజవేయుచున్నది తృష్ణ. తృప్తిచెందియున్నను మరల అదే విషయముయొక్క ఫలమును కోరుచున్నది. కోతి గంతులువేసినట్లు ఈ తృష్ణ ఒక స్థలమున కొంతసేపు నిలువదు. సంసారమందు కల దుఃఖములలోనెల్ల తృష్ణ బహుకాలము జీవించియుండు దుఃఖము. కామము అనుపిశాచమును ఉపయోగించి జీవాత్మను వివశునిగా (చేతకానివానిగా) చేయుచున్నది. వస్తువులయందు రక్తికలిగియుండువరకును వాటిని తాను పొందవలెనను ఆశ పుట్టుచునే యుండును. కనుక రక్తిని పోగొట్టుకొనవలయును.

,, తృష్ణా సంగసముద్భవః " అని శ్రీమద్భగవద్గీతయందు 14 వ అధ్యాయమునందు చెప్పబడియున్నది. అట్టి సంగమును చక్కపెట్టు కొనవలయును. ,, సంగాత్సంజాయతే కామః " అనియు శ్రీమద్భగవద్గీతయందు వినుచున్నాము.

సంగము

యోగవాసిష్ఠమునందు జీవన్ముక్తునికి ఆకాశగమనాభావము అను అంశమునందు శ్రీరాములవారు సంగమనగా నేది అని ప్రశ్న చేసిరి. అందుకు వసిష్ఠులవారి జవాబు.

భావాభావే పదార్థానాం హర్షామర్ష వికారదా ।
మలినా వాసనా యైషా సా సంగ ఇతి కథ్యతే ॥

పదార్థములు కొన్నిటియందు స్వభావతః ఇష్టముకలుగుట కొన్నిటి యందు అసూయకలుగుట, ఇష్టమైన పదార్థములను పొందవలెనని కోరుట, ఇష్టముకాని పదార్థములను తొలగించుకొనుటకు కోరుట ఇట్టి రాగద్వేషచేష్టలకు కారణభూతమైన మనస్సుయొక్క స్థితికి సంగము అనిపేరు.

సంగః కారణ మర్థానాం సంగ స్సంసృతికారణం ।
సంగః కారణ మాశానాం సంగః కారణ మాపదాం ॥
సంగత్యాగం విదుః మోక్షం సంగత్యాగా దజన్మతా ।
సంగం త్యజ త్వం భావానాం జీవన్ముక్తో భవాఽనఘ ॥

సంగమే ఇష్టప్రాప్తికి కారణము. సంగమే సంసారమునకు అనగా జననమరణములకు మూలము. సంగమే ఆశలకు పుట్టినిల్లు, సంగమే ఆపదలకు బీజము. సంగమును వదులుకొనుటకే మోక్షము అని పేరు. కనుక సంగమును వదులుకొనుము అని అర్థము.

శ్రీమద్భగవద్గీతయందు ,, సంగస్తేషూపజాయతే " ,, సంగంత్యక్త్వా కరోతి యః " ,, సంగం త్యక్త్వాఽత్మశుద్ధయే " ,, సంగం త్యక్త్వా ధనంజయ " ,, సంగం త్యక్త్వా ఫలంచైవ " ,, సంగం త్యక్త్వా ఫలాని చ " ,, సంగాత్సంజాయతే కామః " అను మొదలగు

స్థలములయందు సంగము అను పదమునకు అనేక అర్థములు చెప్ప బడియున్నవి.

'సంగాత్సంజాయతే కామః' అని రెండవ అధ్యాయము 62 వ శ్లోకమునందు చెప్పియుండు స్థలమునందు కామమునకు సంగము కారణము అనియు ఉత్తరోత్తర అనర్థములు అనేకములుగా కలిగినవి అనియు చెప్పబడియున్నది. శ్రీమద్భగవద్గీత పదునాలుగవ అధ్యాయమునందు 7 వ శ్లోకమునందు "తృష్ణా సంగసముద్భవం" అని చెప్పినపుడు సంగమునుండి తృష్ణపుట్టినదనియు చెప్పబడియున్నది. కనుక అనర్థములకెల్ల సంగము జన్మభూమి అని తెలియుచున్నది. కాబట్టి సంగమును వదులుకొనుటకు ప్రయత్నము చేయవలయును.

సంగత్యాగమును గురించి శ్రీ యోగవాసిష్ఠమునందు అనేక కథలు ఉన్నవి. అందులో ఉపశమప్రకరణమునందు భాసవిలాస సంవాదము అను ప్రకరణము ఒకటియున్నది. భాసుండు అనువాడు తన సహోదరుడైన విలాసుని యింటికివచ్చెను. అతనికి విలాసుడు స్వాగతమొనర్చి కుశలప్రశ్నలు చేసెను. అందుకు భాసుడు ఈ క్రింది వాక్యములను చెప్పెను.

సాధో స్వాగతతా ద్వైవ దిష్ట్యా దృష్టోసి మానవ ।
కుశలం తు కుతోఽ స్మాకం సంసారే తిష్ఠతా మిహ ॥
యావ న్నాధిగతం జ్ఞేయం యావత్ క్షీణా న చిత్తభూః ।
యావత్ తీర్ణో న సంసారః తావ న్మే కుశలం కుతః ॥
ఆశాః యావ దశేషేణ న లూనా శ్చిత్తసంభవాః ।
వీరుధో దాత్రకేణేవ తావ న్నః కుశలం కుతః ॥
యావత్ న అధిగతం జ్ఞానం యావత్ న సమతోఽదితా ।
యావత్ న అభ్యుదితో బోధః తావ న్నః కుశలం కుతః ॥
ఆత్మలాభం వినా సాధో వినా జ్ఞాన మహౌషధం ।
ఉదేతి పునరే వేయం దుఃసంసృతి విషూచికా ॥

ఓ సాధూ, అదృష్టముచేత నీవు నాకు కనబడితివి. కుశలమా యని అడిగితివి. సంసారమందున్న మనకు కుశల మెట్లు కలుగును. ఓ మిత్రమా ఎదివరకును మనుష్యులుగా జననమెత్తినవారు

తెలిసికొనవలసిన బ్రహ్మవస్తువును తెలిసికొనలేమో ఎదివరకును మనము చిత్తమును జయించకపోతిమో ఎదివరకును సంసారము అను సముద్రమును దాటకపోతిమో అదివరకును మనకు కుశల మెటుల కలుగును. చిత్తమునందు పుట్టిన ఆశలను ఎంతవరకును నిశ్శేషముగా తెగగొట్టకపోతిమో అదివరకును మనకు కుశల మెట్లు కలుగును. ఆత్మజ్ఞానము అను స్థితి మనకు లభించకుండినంతవరకును ఎదివరకును సర్వభూతములయందును సమత్వజ్ఞానము పుట్టదో ఎది వరకును నపరోక్షజ్ఞానము కలుగదో అదివరకును మనకు కుశల మెట్లు కలుగును. ఓ సాధువా అత్మజ్ఞానము కలుగునంతవరకును జ్ఞానముఅను మహౌషధమును సేవించువరకును ఈ సంసారము అను విషూచికాజాడ్యము పుట్టుచునే యుండును. ఇట్లు సహోదరులు మననము చేసిరి. ఇట్లు చిత్తవిశ్రాంతినిగురించి తలపోసికొనిరి. చిత్త విశ్రాంతికి ముఖ్యకారణమైన సంగమును గురించి

అతోవచ్మి మహాబాహో యథా జ్ఞానేతరాగతిః ।
నాస్తి సంసారతరణే సంగబద్ధస్య చేతసః ॥

శ్రీ రామచంద్రా సంగముచేత కట్టబడిన చిత్తము సంసారసముద్రము నుండి తరించుటకు ముఖ్యకారణము అయిన జ్ఞాననిష్ఠను సంపాదించు కొనుట యొకటియే మార్గముగా నేర్పడుచున్నది.

అసక్తం నిర్మలం చిత్తం ముక్తం సంసార్యపి స్ఫుటం ।
సక్తంతు దీర్ఘతపసా యుక్తమప్యతిబంధవత్ ॥

సంగమునకు లోబడని నిర్మలమగు చిత్తము సంసారమునందు చరించు చుండినను సంగవిముక్తమయినదనే చెప్పవలయును. సంగముచే బంధింపబడిన చిత్తము దీర్ఘకాలము తపస్సులోనుండినను మిగుల బంధముకలదియనియే చెప్పవలయును.

అతస్సంసక్తి నిర్ముక్తో జీవో మధురవృత్తిమాన్ ।
బహిః కుర్వన్న కుర్వన్వా కర్తా భోక్తా న హి క్వచిత్ ॥

సంగమును వదులుకొనిన జీవుడు మధుకరవృత్తిగలవాడగును. మధుకరము అనగా తుమ్మెద. తుమ్మెద తేనెను కూడబెట్టుటకుగా

పుష్పములపైన వ్రాలి ఎంతమాత్రము మధువుదొరుకునో అంతటితో సంతోషించి సంగమునొందక సుఖముగా విహరించునో దానికి మధుకరవృత్తియని పేరు. కావున మధుకరవృత్తిగలవాడు పైకి కర్మచేయుచున్నట్టుగా నున్నను చేయనివాడుగా నున్నను కర్తగాని భోక్తగాని కానేరడు.

ఇట్టి వాసనలు, సంగము, తృష్ణ మొదలగునవి అన్నియు మనస్సుయొక్క చేష్టలుగాని వేరుగావు.

మనస్సును నశింపజేసికొనుట అను చర్యకు మనోనాశము అని పేరు. మనస్సు ఈశ్వరునియొక్క చిత్స్వభావమునుండి పుట్టినది అని యిదివరకును చెప్పబడియున్నది. మనస్సే జీవుడు అనియు చెప్పబడియున్నది. కాబట్టి మనస్సునశింపజేయుట సాధ్యముకాదు. మనోనాశము అనగా

> అస్య సంసారవృక్షస్య సర్వోపద్రవదాయినః ।
> ఉపాయ ఏక ఏవాస్తి మనసః స్వస్య నిగ్రహః ॥
> మనసోభ్యుదయో నాశః మనోనాశో మహోదయః ।
> జ్ఞోమనో నాశ మభ్యేతి మనోఽజ్ఞస్య శృంఖలా ॥

సమస్తమైన ఉపద్రవములను కలుగజేయుసంసారము అను నీ వృక్షమును నశింపజేయుటకు తనయొక్క మనస్సును నిగ్రహించుటయే ఉపాయము. మనస్సును వృద్ధిపొందించుటయే మనోనాశము. అనగా మనస్సు విషయములయందు వ్యాపించి ఉత్తరోత్తర అభివృద్ధి పొందుచుండగా చెడిపోవును గనుక మనస్సును ఉపాయముతో మనోభావములనుండి మరలించవలయును. జ్ఞానియొక్కమనస్సు నశించినమనస్సు అనబడును. అజ్ఞానియొక్కమనస్సు వానికి సంకెలవలె బంధము అని చెప్పవలయును.

## మనోభావములు

మనోభావములు అను పదమునకు మనస్సునందు జనించు మార్పులు అని అర్థము. ద్వంద్వములకు మనస్సు లోబడియుండును.

ఈ విషయము "ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం" అని శ్రీమద్భగవద్గీతయందు చెప్పబడియున్నది. కాబట్టి మనస్సుయొక్క భావములు కూడ ఆకర్షణవికర్షణ శక్తులకు లోబడియుండును. జగన్మనోమయ కోశము ఒక్కటిగలదు. మనుష్యుల మనోమయకోశము జగత్తు మనోమయకోశముయొక్క అంశ. కనుక ఒక జీవాత్మ ఏమి తలంచినను ఆ తలంపు వాని సమీపమునం దుండువారల మనస్సులనుకూడ అందును.

మనస్సు చాల బలవంతమైనది. ఇందునుగురించి శ్రీయోగవాసిష్ఠమునందు ఐందవోపాఖ్యానము అను నొకకథను సంగ్రహముగా చెప్పవలయునని తోచుచున్నది. ఈ ఆఖ్యానము ఉత్పత్తిప్రకరణమునం దున్నది.

పూర్వ మొకపుడు మగధదేశమునకు ఇంద్రద్యుమ్నుడు అను పేర నొక రాజు ఉండెను. అతనికి బహురూపవతియగు నొక భార్యయుండెను. ఆమెపేరు అహల్య. ఆ పట్టణమునందు ఇంద్రుడు అను పేర నొక విటపురుషు డుండెను. అపుడు రాజభార్య అయిన అహల్య పురాణకథలో పూర్వము అహల్య ఇంద్రునితో వ్యభిచారముచేసినదని పురాణకథను విని ఆ పట్టణమునందు ఇంద్రుడు అను పేరు కలిగియున్న విటపురుషునియందు అనురాగము చూపుచుండెను. దాదుల సహాయముతో ఇంద్రుడు అని పేరుగల విటపురుషునితో రమించుచు క్రమేణ బహిరంగముగా ప్రేమాలాపములను చెప్పుకొనుచుండెను. పురజనులకందరకును ఈ సమాచారము తెలిసి అహల్యయొక్క పెనిమిటి అయిన రాజునకును తెలియవచ్చెను. అంత రాజు వారలను పిలిపించి అనేకవిధములైన దండనలను విధించెను. అప్పటికిని వారు తమ దుర్మార్గచర్యను వదులుకొనలేదు.

అంత రాజు ఆ విటపురుషుని పిలిపించి సభయందు ఓరీ దుర్మార్గా నిన్ను ఎన్నివిధముల కష్టపెట్టినను నీయొక్క దుర్నడతను వదులుకొనవేమి యని అడిగెను. ఆ సభలో అహల్యకూడ ఉండెను. అందుకు వాడు చెప్పిన దేమనగా:

తా వూచుః మహీపాలం జలాశయసముద్ధతా ॥
సంస్మృత్యావాం అన్యోన్యముఖకాంతి మనిందితాం ।
ఆత్మానం న విజానీ వో రూఢభావం పరస్పరం ॥
న శాతనాని దుఃఖాని బాధంతే కించి దేవ మే ।
అస్యాశ్చైవ జగ ద్రాజన్ సర్వం మన్మయ మేవచ ॥
తేనా న్యశాసనా దుఃఖం కించి దేవ న విద్యతే ।
మనోమాత్ర మహంరాజన్ మనోహి పురుషః స్మృతః ॥
భావాభావాః శరీరస్థాః నృప శక్తాః న బాధితుం ।
భావితం తీవ్రవేగేన మనసా య న్మహీప తే ॥
త దేవ పశ్య త్యచలం న శరీర విచేష్టితం ।
న కాశ్చన క్రియాః రాజన్ వరశాపాదికా అపి ॥
తీవ్రవేగేన సంపన్నం శక్తాః చాలయితుం మనః ।
తీవ్రవేగేన సంయుక్తం పురుషా హ్యభివాంఛితాత్ ॥
మన శ్చాలయితుం శక్యాః న మహాద్రిం మృగా ఇవ ।
మ మేయం అసితాపాంగీ మనఃకోశే ప్రతిష్ఠితా ॥
ముఖ్యాంకురం సుభగ విద్ధి మనో హి పుంసో
దేహాః తతః ప్రవిసృతాః తరుపల్లవాభాః ।
నష్టేఽంకురే పున రుదేతి న పల్లవశ్రీః
నైవాంకురః క్షయముపైతి దళక్షయేషు ॥
దేహే క్షతే వివిధదేహగణం కరోతి
స్వప్నావ నావివ నవం నవమాశు చేతః ।
చిత్తే క్షతే తు న కరోతి హి కించిదేవ
దేహ స్తతః సమనుపాలయ చిత్తరత్నం ॥
స్వాంతం హి న హి కేనాఽపి శక్యతే నాశితుం క్వచిత్ ।
సూక్ష్మత్వా చ్చిన్మయత్వా చ్చ దుర్లక్ష్యత్వా చ్చ విధినా ॥
తావద్వ్యాపి హి తేనైవ మోహాసంస్కారహేతునా ।
యత్ర యత్ర ప్రజాయేతే భవతః తత్ర దంపతీ ॥

“అహల్యయు నేనును ఒకరిముఖమును మరియొకరు దృఢముగా స్మరించుకొనుచుండినందున మీరు పెట్టినబాధ లన్నియు మమ్ములను అంద లేదు. నా లోకమెల్ల అహల్యగా నున్నది. అహల్యయొక్క లోకమంతయు నేనుగా నున్నందున తమరు ఇచ్చినదండనలు

మాకు తెలియరాలేదు. నేను అనగా మనస్సే. మనస్సే పురుషుడు అని చెప్పబడియున్నది. శరీరమునకు సంబంధించిన బాధలు మేము తీవ్రవేగముతో నొకరి నొకరిని వినాగా ఏ తలఁపును లేకుండినందున మమ్ములను అందవు. మాయొక్క మనస్సులు ఏకమై ఏకాగ్రముగా నుండినందున తాము ఇచ్చునట్టి వరములుగాని శాపములుగాని మమ్ములను బాధించలేదు.

తీవ్రవేగముతో నొకటియైన మనస్సు బలవంతమైన పర్వతము వలె అచలముగా నుండును. అచలమైన పర్వతమును మృగములు చలింపచేయ లేనట్టు అచలమైన మనస్సులను ఎవరును చలింపచేయ లేరు. ఈ స్త్రీ నాయొక్క మనఃకోశమునందు ఐక్యమైయున్నది. నా అభివాంఛితమైన వస్తువునుండి తీవ్రవేగముగల నా మనస్సును ఎవరును చలింపజేయుటకు సాధ్యముకాదు. మనుష్యులకు మనస్సు ముఖ్యమైన అంకురము (మొలక). ఆ మనస్సునుండియే దేహాదులు కలుగును (మొలకలోనుండి మ్రాను ఆకులు శాఖలు బయలుపడిన రీతిగా). మనస్సు అయినది దేహములు పోయినపుడు క్రొత్త క్రొత్తగా దేహములను కలుగజేసికొనును. గుంపులు గుంపులుగా దేహములను కలుగజేసికొనును. మనస్సు నశించినపుడు దేహములు కలుగలేవు. కనుక చిత్తరత్నమును కాపాడుకొనుము. ఎవ్వడైనను ఎక్కడనైనను మనస్సును చంపుటకు సాధ్యముకాదు. ఎందుకంటే మనస్సు సూక్ష్మమైనది. చిన్మయమైనది. గురికి దొరకనిది".

ఈ అహల్యయు ఇంద్రుడును "తావద్యాపి హి తేనైవ మోహసంస్కార హేతునా" వారల మోహసంస్కారబలముచే ఇద్దరు జంటగానే జన్మించి దంపతులుగానే యుండుచున్నారు.

ఈ ఉపాఖ్యానమువల్ల మనస్సుయొక్క అపారమైన శక్తి తెలియవచ్చుచున్నది. కావున రాగద్వేషములు మనస్సునందు నెలకొనునట్టు ఒప్పుకొనకూడదు. రాగద్వేష ప్రేరితములైన భావములను ప్రయత్నపూర్వకముగా మార్చవలయును.

భావములు స్థాయీభావములనియును సంచారీభావములనియు వ్యభిచారీభావములనియు [illegible] ప్రాజ్ఞులు విభజించియున్నారు.

ఇచ్చట ఆకర్షణ వికర్షణ రూపకములైన భావములను వానియొక్క సాంఘికవ్యక్తులనుగురించియు వ్రాయబడును.

మొట్టమొదట అరిషడ్వర్గమైన కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అను దుర్గుణములను వివరించుచున్నాను.

అరిషడ్వర్గము

కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు అరిషడ్వర్గము అని వినియున్నాము.

త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః ।
కామః క్రోధః తథా లోభః తస్మా దేవత్ త్రయం త్యజేత్ ॥

(శ్రీమద్భగవద్గీత—అ. 16, శ్లో, 21.)

కామము, క్రోధము, లోభము అను చెడ్డగుణములు నరకమునకు ద్వారములు అని యర్థము. కాబట్టి నివృత్తిమార్గమునందు ప్రవేశించుటకు ఇచ్ఛయించినవాడు ఈ మూడు (గుణముల) శత్రువులను త్యజించవలయును.

ఏతై ర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభి ర్నరః ।
ఆచర త్యాత్మనః శ్రేయః తతో యాతి పరాం గతిం ॥

(శ్రీమద్భగవద్గీత—అ, 16. శ్లో. 22.)

ఈ నరకద్వారములనుండి తప్పించుకొనినవాడు ఆత్మశ్రేయస్సును గమనించినవాడు అనబడును. ఈ మూడు శత్రువులను విడిచినపుడు పరాగతికిపోవుట సులభము. కనుక ఈ మూడు నరకద్వారములను ఉపాయముతో జయించవలయును.

కామక్రోధలోభములు ఏవిధముగా పరిణమించును అను వివరము మనుస్మృతియందు వివరించబడియున్నది.

మృగయాక్షో దివాస్వప్నః పరివాదః స్త్రియో మదః ।
తౌర్యత్రికం వృథాధ్యా చ కామజో దశకోగుణః ॥

(మనువు—ఏడవ అధ్యా. శ్లో. 47)

మత్తువస్తువులను సేవించుట (మద్యపానము మొదలగునవి), వేటకు పోవుట, పగటిలోనిద్రించుట, ఇతరుల తప్పులనుగురించి గప్పాలు కొట్టుట, మొదలగునవి కామముయొక్క చేష్టలు.

పైశున్యం సాహసం ద్రోహః ఈర్ష్యా అసూయా ర్థదూషణం ।
వాగ్దండజం చ పారుష్యం క్రోధజో ఽపి గణో ఽష్టకః ॥ (మనువు)

ఇతరుల తప్పులను ఎత్తిచూపుట, ఇతరులను తొందరపెట్టుట, రహస్యముగా ఇతరులను నొప్పించుట, అసూయచూపుట, ఇతరులకు ద్రవ్యనష్టము కలుగజేయుట మొదలగునవి క్రోధముయొక్క పరిణామములు.

ద్వయో ర ప్యేతయో ర్మూలం యం సర్వే కవయో విదుః ॥
తం యత్నేన జయే ల్లోభం తజ్జా వేతా వుభౌ గుణౌ ॥ (మనువు)

కామము క్రోధము రెండును లోభమువల్ల కలిగినవి. ఈ రెంటికిని మూలము లోభము గనుక ప్రయత్నముతో లోభమును వదలుకొనవలయును. కామక్రోధలోభములు ఈ మూడును దోషములు.

తథా దోషాః తత్ త్రైరాశ్యం రాగద్వేషమోహార్థాంతరభావాత్.
రాగపక్షః కామోమత్సరః స్పృహా తృష్ణా లోభ ఇతి.
ద్వేషపక్షః మిథ్యాజ్ఞానం విచికిత్సా మానః ప్రమాద ఇతి.

రాగము ఎట్లుకనబడును అనగా

కామము (స్త్రీపురుష ఆకర్షణము). మత్సరము అనగా కడుపుమంట. ఓర్వలేమి. స్పృహ అనగా తనదిగాని వస్తువును తాను సంపాదించుకోవలెనను ఇచ్ఛ. తృష్ణ, స్పృహ ఊర్జితమైనపుడు తృష్ణ (దాహము) అగును. లోభము ఇతరుల సొత్తులను అన్యాయముగా స్వాధీనముచేసికొమ్మని ప్రేరేపించును.

ద్వేషము ఎట్లుకనబడును అనగా

క్రోధము. కోపము. దీనివలన దేహమునందు ఇంద్రియములయందు, అంగములయందు వేగము పుట్టును.

ఈర్ష్య—పదిమందికి సామాన్యముగా చేరిన సొత్తును తాను ఒకడే పొందవలెనను ఇచ్ఛ. దీనినే మత్సరముఅనికూడ కొందరు ఉపయోగింతురు.

అసూయ—ఇతరులయొక్క సుగుణములను ఒకరు వర్ణించుచుండగా వినుటకు ఇష్టములేమి.

ద్రోహము—బలహీనుడు బలవంతునికి నష్టముకలుగజేయవలయునని చేయు దొంగప్రయత్నము.

అమర్షము—దీర్ఘక్రోధము. తప్పుచేసినవానిని ఎన్నటికైనను క్షమించుటకు ఇష్టములేమి.

మోహమువల్ల ఉన్నది ఉన్నట్టు కనుకోక పోవుట. తప్పు అభిప్రాయమును విచికిత్సయు మోహముతో చేరినది. విచికిత్స అనగా సందేహము. ఇదమిత్థము తెలిసికొనలేకపోవుట. ఇందులో చేరినదే "మానము" అనునది. మానము అనగా ఇతరులకులేని ఈ యీ వస్తువులు ఈ యీ గుణములు నాకు ఉన్నవి, గనుక నేను అధికుడను. ఆ గుణము ఉన్నదనుట నిజముగా నుండవచ్చును; లేక ఉన్నది అనుకొని మోసపోయి ఉండవచ్చును. ప్రమాదముకూడ ఇందులో చేరినదే. "మోహపక్షః మిథ్యాజ్ఞానం విచికిత్సా మానః ప్రమాద ఇతి".

ప్రమాదము అనునది మృత్యువు అని చెప్పబడినది. ప్రమాదము అనగా అశ్రద్ధ అజాగ్రత. దక్షతతో పనిచేయలేక పోవుట.

ధర్మాతురతగల పురుషుడు సంపాదించవలసిన గుణములు శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధము ఇరువదియైదవ అధ్యాయమునందు చెప్పబడియున్నవి. మహాభారతము ఆనుశాసనిక పర్వము 162 వ అధ్యాయమునందును, శాంతిపర్వము 33 వ అధ్యాయమునందునుకూడ చెప్పబడియున్నవి. వీనినే ఆత్మవిచారమునందును వివరించియున్నది.

తామస రాజస గుణములను పోగొట్టుకొని సాత్త్విక గుణములను స్థిరపరుచుకోవలయును. ఏ విధముగా అభ్యాసము చేయవలయు

నను సంగతి ఆత్మవిచారమునందు విపులముగా చెప్పబడియున్నది. అయినను ఇచ్చట వానిని సంగ్రహముగా చెప్పుచున్నాము.

సాత్త్వికగుణములు :

సత్త్వ మానంద ఉద్రేకః ప్రీతిః ప్రాకామ్య మేవ చ ।
సుఖం శుద్ధత్వం ఆరోగ్యం సంతోషః శ్రద్దధానతా ॥
అకార్పణ్య మసంరంభః క్షమా ధృతి రహింసతా ।
సమతా సత్య మానృణ్యం ఆర్జవం హ్రీ రచాపలం ॥
శౌచం మార్దవ మాచారం అలౌల్యం హృద్యసంభ్రమః ।
ఇష్టానిష్టవియోగానాం కృతానా మవికత్థనం ॥
దానేన చాత్మగ్రహణం అస్పృహత్వం పరార్థతా ।
సర్వభూతదయా చైవ సత్త్వ స్యైతే గుణాః స్మృతాః ॥

రాజసగుణములు :

రజోగుణానాం సంఘాతో రూప మైశ్వర్య విగ్రహౌ ।
అత్యాగిత్వ మకారుణ్యం సుఖదుఃఖోపసేవనం ॥
అహంకార స్త్వ సత్కారః చింతావైరోపసేవనం ।
పరితాపోఽభిహరణం హ్రీనాశోఽ నార్జవం తదా ॥
పరాపవాదేషు రతిః వివాదానాం చ సేవనం ।
భేదః పరుషతా చైవ కామక్రోధా మద స్తథా ॥
దర్పో ద్వేషోఽతి మానశ్చ ఏతే ప్రోక్తా రజోగుణాః ॥

తమోగుణమునకు చేరినగుణములు :

తామసానాం తు సంఘాతాన్ ప్రవక్ష్యామ్య వధార్యతాం ।
మోహోఽప్రకాశస్తా మిస్రం అంధతామిస్రసంజ్ఞితం ॥
మరణం చాంధతామిస్రం తామిస్రం క్రోధఉచ్యతే ।
తమసో లక్షణా నీహ భక్షణా ద్యభిరోచనం ॥
భోజనా నామ పర్యాప్తిః తథా పేయేష్వతృప్తతా ।
గంధవాసో విహారేషు శయనేష్వా సనేషు చ ॥
దివాస్వప్నే వివాదేచ ప్రమాదేషు చ వై రతిః ।
నృత్యవాదిత్ర గీతానా మజ్ఞానాచ్ఛ్రద్దధానతా ।
ద్వేషో ధర్మవిశేషాణా మేతేవై తామసాగుణాః ॥
(శాంతిపర్వము—318 అధ్యా.)

ఈ గుణములను గమనించి తామసగుణములను పరిపూర్ణముగా పోగొట్టుకొని రాజసగుణములను అభ్యాసము చేయురీత్యా అణగద్రొక్కి సాత్త్వికగుణములను వృద్ధిచేసుకొనవలయును.

ఏదైనను ఒక విషయమునుగురించి చర్చచేయునపుడు ఆ విషయమును వివరముగా అర్థము చేసికొనవలెనంటే

వక్తా శ్రోతా చ వాక్యం చ యదా త్వ వికలం నృప ।
సమ మేతి వివక్షాయాం తదా సోఽర్థః ప్రకాశతే ॥
వక్తవ్యే తు యదా వక్తా శ్రోతార మవమన్యతే ।
స్వార్థ మాహ పరార్థం తత్ తదా వాక్యం నరోహతి ॥
అథ యః స్వార్థముత్సృజ్య పరార్థం ప్రాహ మానవః ।
విశంకా జాయతే తస్మిన్ వాక్యే త దపి దోషవత్ ॥
యస్తు వక్తా ద్వయో రర్థం అవిరుద్ధం ప్రభాషతే ।
శ్రోతు శ్చైవాఽత్మన శ్చైవ స వక్తా నేతరో నృప ॥
కామాత్ క్రోధాత్ భయాల్లోభాత్ దైన్యా చ్చా నార్యకాత్త థా ।
హ్రీతోఽనుక్రోశతో మానా న్న వక్ష్యామి కథం చ న ॥

(మహాభారతము—శాంతి. 325 అధ్యా)

జనకమహారాజుతో సులభ అను సన్యాసిని వాదించుటకు ప్రారంభించినపుడు జనకునియందు కానవచ్చిన చిత్తక్షోభనుచూచి సులభ చెప్పిన వాక్యములు ఇవి.

ఓ రాజా వక్తయు శ్రోతయు ఒక విషయమును సమచిత్తముతో ఆగ్రహములేక తాను అధికుడు అను అహంభావములేక సమానమైన విచారముతో వాదించునపుడే విషయముయొక్క అర్థము ప్రకాశించును. అటుగాక వక్త శ్రోతను అవమానపరిచి కించిత్తు గర్వముతో వాదించితే తానే తన ఆధిక్యమును ప్రకటించుకొనుచు శ్రోతను లెక్కపెట్టకపోతే వక్తయొక్క వాక్యములు శ్రోతయొక్క మనస్సులో ప్రవేశించవు. ఆ రీత్యా నిష్ఫలములు అగును. లేక వక్త శ్రోతయొక్క ఇష్టము ఎట్లున్నదో ఆ విధముగా వాదించి శ్రోతను సంతోషపెట్టుటకు ప్రయత్నపడితే అప్పటికికూడ శ్రోతయొక్క మనస్సులో సందేహము పుట్టును. కనుక తాను వాదించు

విషయము సమగ్రముగా నిస్సందేహముగా శ్రోతకు నిష్పక్షపాతముగా తెలియవలయునంటే వక్త ఆగ్రహముమాని సౌమ్యభావముతో తనకు ఆ విషయమునుగురించి స్ఫురించినదానిని స్ఫురించినట్టే మాటలాడవలయును. కనుక నేను వాదించునపుడు కామము క్రోధము భయము లోభము దైన్యము అనర్థము సిగ్గు కోపము అభిమానము అహంభావము మొదలగు చెడ్డగుణములులేక వాదించుచున్నాను.

ఇందుల ముఖ్యతాత్పర్య మేమనగా ఏ విషయమునైనను సరిగా తెలిసికొనవలెనంటే చిత్తము ప్రసన్నముగా నుండవలయును. రాగద్వేషాదులచే బాధించబడుచున్న చిత్తమునకు చర్చలోనుండు విషయము అవగాహనకాదు. "ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే" అని శ్రీమద్భగవద్గీత, రెండవ అధ్యా., 65 వ శ్లోకమునందు చెప్పబడియున్నది. కనుక చిత్తప్రసాదము ఉపాసకుడు (నివృత్తిమార్గయాత్రను కోరువాడు) సంపాదించుకోవలసిన విషయము. చిత్తప్రసాదమును సంపాదించుటకు ఇతర ఉపాయములు కూడ కలవు.

మనస్సమాధానము, లేక మనఃప్రసాదము,
లేక చిత్తప్రసాదము

శ్రుత్యుక్త కార్యావగాహాయ విదుషా జ్ఞేయవస్తుని ।
చిత్తస్య సమ్యగాధానే సమాధాన మితీర్యతే ॥
చిత్తస్య సాధ్యైకపరత్వ మేవ పుమర్థసిద్ధే ర్నియమేన కారణం ।
నై వాన్యథా సిద్ధ్యతి కార్య మీషత్ మనఃప్రమాదే విఫలః ప్రయత్నః ॥
చిత్తం చ దృష్టిం కరణం తథాఽ న్యత్ ఏకత్ర బధ్నాతి హి లక్ష్యభేత్తా ।
కించిత్ ప్రమాదే సతి లక్ష్యభేత్తుః బాణప్రయోగో విఫలో యథా తథా ॥
సిద్ధే శ్చిత్త సమాధానం అసాధారణకారణం ।
యత స్తతో ముముక్షూణాం భవితవ్యం సదాఽ మునా ॥
యస్య చిత్తం నిర్విషయం హృదయం యస్య శీతలం ।
తస్య మిత్రం జగ త్సర్వం తస్య ముక్తిః కరస్థితా ॥
చిత్తప్రసాదేన వినావగంతుం బంధం నశక్నోతి పరాత్మతత్త్వం ।
తత్త్వ[illegible] చిత్తే [illegible] సిద్ధ్యతి [illegible] కోటిషు ॥

మనోఽప్రసాదః పురుషస్య బంధః మనః ప్రసాదో భవబంధముక్తిః ।
మనఃప్రసాదాధిగమాయ తస్మాత్ మనోనిరాసం విదధీత విద్వాన్ ॥

శిష్యుడు తెలిసికొనవలెనని కోరునట్టి విషయముపైన మనస్సును (చిత్తమును) చక్కగా నిలుపుట అనుచర్యకు సమాధానము అని పేరు. తాను చేయుప్రయత్నమునకు ప్రయోజనము కావలెనంటే తాను సాధించుటకుగా ప్రయత్నము చేయువస్తువుయొక్క రూపమును చిత్తమును ఇముడునట్టుగా దృఢముగా ఏకాగ్రముగా చింతించవలయును. అటుగాక చిత్తప్రమాదము అనగా చిత్తమును అశ్రద్ధపాలు చేయగా తాను చేయుప్రయత్నము విఫలమే అవునుగదా. వేటకు పోవువాడు తాను కొట్టవలయునని తలచినవస్తువు, చిత్తము, బాణము, ఈ మూడును ఒకటిగా ఐక్యమగునట్టుగా చేయును. కొంచెము మాత్రము ప్రమాదము కలిగినను బాణమును ప్రయోగించితే ఉపయోగయులేదు. కాబట్టి నివృత్తిమార్గమునందు సిద్ధిచెందగోరువాడు చిత్తసమాధానము అలక్ష్యము చేయదగిన సాధనముకాదు. కాబట్టి ముముక్షువుగా నుండువాడు చిత్తసమాధానమును ముందుగా సంపాదించవలయును. ఏ ఉపాసకుని చిత్తము విషయములవెంట పరుగెత్తదో ఏ శిష్యునియొక్క హృదయము దయతో శీతలతను చెందియుండునో ఏ ముముక్షువునకు జగత్తంతయు స్నేహము కలిగియుండునో అటువంటివానికి సిద్ధి చేతిలోచిక్కిన పండుగానుండును. పరమాత్మతత్త్వమును తెలిసికొనుటకు ప్రతిబంధములుగానుండు బంధములను చిత్తప్రసాదము అను ఆయుధములేకయే సాధించుట కష్టము. పరమాత్మతత్త్వము తెలిసితేనేగాని ముక్తిసిద్ధించదు. మనోప్రసాదము (అనగా మనస్సునందు ప్రమాదముగాని అజాగ్రతగాని ఉండుట) ఉండినయెడల ఉపాసకునికి బంధములే గట్టిపడును. కనుక బుద్ధిమంతుడైన ఉపాసకుడు మనఃప్రసాదమును పొందుటకుగా మనస్సును జయించవలయును.

సిద్ధేశ్చ చిత్తసమాధానం అసాధారణకారణం ।
యత స్తతో ముముక్షూణాం భవితవ్యం సదాఽమునా ॥

అత్యంతతీవ్రవైరాగ్యం ఫలలిప్సా మహత్తరా ।
త దేత దుభయం విద్యాత్ సమాధానస్య కారణం ॥
బహిరంగం శ్రుతిః ప్రాహ బ్రహ్మచర్యాది ముక్తయే ।
శమాదిషట్కమే వైతత్ అంతరంగం విదుర్బుధాః ॥

సిద్ధిచెందుటకు చిత్తసమాధానము ముఖ్యమైనకారణము. కనుక ఉపాసకుడు చిత్తసమాధానమును సంపాదించియే తీరవలయును. అత్యంతతీవ్రమైన వైరాగ్యమును కర్మయొక్క ఫలమును పరిపూర్ణముగా వదులుకొనుటయు ఈ రెండును చిత్తసమాధానమును సంపాదించి యిచ్చును.

మనః ప్రసాదసిద్ధ్యర్థం సాధనం శ్రూయతాం బుధైః ।
మనః ప్రసాదో యత్స త్వే యదభావే న సిద్ధ్యతి ॥

మనఃప్రసాదము లభించుటకు కొన్ని ఉపాయములున్నవి. ఈ ఉపాయములను అభ్యసించినగాని మనఃప్రసాదము సాధ్యముకాదు.

బ్రహ్మచర్య మహింసా చ దయా భూతే ష్వవక్రతా ।
విషయే ష్వతివైతృష్ణ్యం శౌచం దంభవివర్జనం ॥
సత్యం నిర్మమతా స్థైర్యం అభిమానవివర్జనం ।
ఈశ్వరధ్యానపరతా బ్రహ్మవిద్భి స్సహస్థితిః ॥
జ్ఞానశాస్త్రైకపరతా సమతా సుఖదుఃఖయోః ।
మాననాఽసక్తి రేకాంతశీలతా చ ముముక్షుతా ॥
య స్యైతత్ విద్యతే సర్వం తస్య చిత్తం ప్రసీదతి ।
న త్వే తద్ధర్మ శూన్యస్య ప్రకారాంతరకోటిభిః ॥

బ్రహ్మచర్యము, అహింస, దయ, ఋజుమార్గప్రవర్తనము, విషయములను అనుభవించవలెను అను నాశలేకుండుట, శౌచము, దంభము లేకుండుట, సత్యమును అభ్యసించుట, నేను నాది అను తలంపు మానుట, స్థైర్యము, అభిమానములేకుండుట, ఈశ్వరధ్యానమునందు ఇచ్ఛకలిగియుండుట, బ్రహ్మవేత్తలసహవాసము, జ్ఞానశాస్త్రములను చదువుటయందనురక్తి, ఇట్టి అభ్యాసములు చిత్తప్రసాదమును కలుగజేయును. ఇందులో ముఖ్యముగా

బ్రహ్మచర్యము

దీనిని మొదటిదానినిగా చెప్పియున్నారు. నివృత్తిమార్గమునందు ప్రవేశించువారందరును వివాహముచేసుకోనివారుగా నుండుట సాధ్యమా? వివాహము చేసుకోనివారందరును బ్రహ్మచర్యవ్రతమును అనుష్ఠించువారేనా? ఈ రెండుప్రశ్నలను మనసా చింతించి ఉపాసకుడు సారాంశమును గ్రహించవలయును. కామోద్రేకమువల్ల దేహమునందు కంపముకలుగును. దేహకంపమువల్ల మనస్సమాధానము చెడును. కనుక కామోద్రేకమునకు చికిత్స సంగమము అనవచ్చును. అట్టి సంగమము స్వక్షేత్రమునందే ఉండవలెను. స్వక్షేత్రసంగమమునందు మితిమీరుట సాధారణముగా అసాధ్యము. శరీరమునందు పటుత్వమునకు కారణములు అనేకములు కలవు. ఆహారమునందు రజస్తమోగుణములను వృద్ధిచేయుపదార్థములను వదలుకొనుటవల్ల శరీరమునందు రజోగుణస్పందములు కలుగుటతగ్గును. జీవాత్మకు తెలియకయే జీవాత్మయొక్క అనుమతి లేకయే శరీరమునందు రజోగుణోద్రేకముకలిగి ఆ ఉద్రేకము జీవాత్మయొక్క శాంతతను పోగొట్టును. ఇది ఆహారముయొక్క ఫలితార్థముగా మనస్సునందు కలుగు క్షోభ. “ధ్యాయతో విషయాన్ పుంసః సంగః తేషు ఉపజాయతే” అనిన ప్రకారము పూర్వము తాననుభవించిన సుఖమును తలచుకొని దానియొక్కరుచిని జ్ఞాపకపరిచికొనుటవల్లకూడ శరీరమునందు ఉద్రేకముకలిగి ఆద్వారా మనస్సుయొక్క శాంతతకు తొందరకలుగును. ఇట్టి అశాంతతకు కారణములు స్మరణము, దర్శనము, గుణములను కర్మలనుగురించి మాటలాడుట, సహవాసము, సంసర్గము. ఇట్టికారణములకు ఆస్పదమియ్యకయే మనస్సును మనము అంకుశమువేసి పెట్టుకొనినట్లు ఉండవలయును. నివృత్తిమార్గమును త్రొక్కుటకు ప్రయత్నముచేయువాడు ఇతరులతృప్తికిగా వ్యవహారముచేయువాడుకాడు. తనయొక్క నడతను తనయొక్క ప్రయోజనమునకుగానే తానే సరిచేసికొనవలసినవాడు. “ఆత్మైవ హి ఆత్మనో బంధుః ఆత్మైవ రిపుః ఆత్మనః” అను వచనము

ఇచ్చట అన్వయించును గనుక తనను తాను మోసపుచ్చుకొని తనయొక్క ప్రయత్నములను తానే నాశముచేసికొనకూడదు.

### అహింస

హింసఅనునది ఇతర శరీరములకుమాత్రము ఒకడు కలుగజేయుబాధకాదు. వాతలు దేహమును నొప్పించి మానిపోవును. మాటలు ఆప్రకారముగా మానవు. దేహమునకు కలుగజేయుబాధ కించిత్కాలముండును. పరులను దూషించినను వారికి తెలియకనే వారి దౌర్బల్యములనుగురించి ఇతరులతో మాటలాడినను వారల మనస్సులకు వ్యథకలుగును. ఆ వ్యథవల్ల వారలకు మనశ్శాంతి చెడును. అంతేకాక " అభ్యాసాత్ రమతే యత్ర " (శ్రీమద్భగవద్గీత అధ్యా 18., శ్లోకము 36.) పరదూషణను అభ్యసించుట అను అభ్యాసము ఒక్కటి మనయందు వృద్ధియగుచు వచ్చి మనకును మనచే దూషించబడినవారలకును అశాంతిని కలుగజేయుచు వచ్చును. కనుక దూషణవాక్యములను పలుకకయు దూషణలను స్మరించకయు నున్నయెడల మనకును ఇతరులకును మనశ్శాంతి కలుగును.

### దయ

ప్రతివస్తువునకును ప్రతివ్యక్తికిని అనగా ప్రతిమనుష్యునకును ఆకర్షము అనియు వికర్షము అనియు రెండుశక్తులు గలవు. ఆకర్షము అనగా ఇతరులను తనతట్టునకు లాగుట. వికర్షము అనగా తనతట్టుగా నుండువారిని దూరమునకు తోలుట—తరమగొట్టుట. ఇంతేకాదు, ఈ సృష్టియందు ప్రతివ్యక్తికిని (1) సమానులు, (2) అధికులు, (3) తగ్గినవారును కలరు.

ఆకర్షము అనుశక్తిని (1) సమానులయెడల చూపితే అది స్నేహముగా నగును. దీనినే " మైత్రి " అందురు. మిత్రునియొక్క లక్షణమును ఒక గ్రంథమునందు ఈ విధముగా వర్ణించియున్నది.

> భుఙ్క్తే భోజయతే చైవ గుహ్యం వక్తి శృణోతి చ ।
> దదాతి ప్రతిగృహ్ణాతి షడ్విధం మైత్రలక్షణం ॥

స్నేహితుడు విందులుపెట్టును, పెట్టినపుడు అనుభవించును. ఇచ్చును పుచ్చుకొనును. తన రహస్యములను చెప్పును. స్నేహితుని రహస్య ములను వినును. ఇట్టి ఆరుగుణములుగలవి మైత్రి. ఈ కార్యముల యందు ఆకర్షణశక్తి సమానులయందు కనబడుచున్నది.

ఆకర్షణశక్తి (2) అధికులయెడ చూపబడినపుడు మర్యాదయు భక్తియు నగును. మర్యాదయు భక్తియు ముదరగా ఆత్మనివేదనముగా మారును. తనకంటె నధికునియొద్దనుండి తాను అనుగ్రహము పొంద వలయు ననియుకూడ తోచును.

ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్ ధన మిచ్ఛేత్ హుతాశనాత్ ।
జ్ఞానం మహేశ్వరా దిచ్ఛేత్ మోక్ష మిచ్ఛేత్ జనార్దనాత్ ॥

అని యొక ఉక్తికలదు. నిజమైన భక్తియందు అధికునితో మనము సమానభావము కోరినయెడల

స త్యపి భేదాపగమే నాథ త వాఽహం న మామకీన స్త్వం ।
సాముద్రో హి తరంగః క్వ చ న సముద్రో న తారంగః ॥

(శ్రీ శంకరాచార్యులవారు)

స్వామీ నాకును తమకును సకలభేదములును రాలిపోయినను నేను తమవాడనేగాని తాము నావారు కారు. దీనికి ఉదా హరణము సముద్రములోనివే అలలుగాని అలలలోనిది సము ద్రము కాదు.

ఆకర్షణశక్తి (3) మనకంటె తగ్గినవారియందు చూపబడి నపుడు దయ అనబడును. సాధారణముగా మనయందు ఒకనికి దయ యున్నది అని తెలిసికొనుటకు మొదటి చిహ్నము చిరునవ్వు. మనకంటె అధికుని సమీపమునకు మనము పోవునపుడు అధికుడు మనలను చిరునవ్వు ముఖముతో పిలిచితే అతనివల్ల మనకు మేలు కలుగును అను సూచన కనబడును. చిరునవ్వుకు అర్థము, నాయనా నావల్ల ఏమి సహాయము కోరివచ్చితివో ఆ సహాయమును ఇయ్యగలను, నీవు భయపడవద్దు అని అభయమును ఇచ్చినట్టు అర్థము.

చిరునవ్వు

దీనికి అనేక అర్థములు కలవు. దయార్ద్రచిత్తమును చూపు చిరునగవులును హాస్యమునుచూపు చిరునగవులును గలవు. ఈవిని పుచ్చుకొన్నవాడు చిరునగవును కనుపరుచును. ఈవిని పుచ్చుకోకమునుపు ఆ చిరునగవు కనబడితే తనకు ఇయ్యబోతారు కదా అను నిశ్చయజ్ఞానమునకు గుర్తు. ఈవిని పుచ్చుకొన్నపిమ్మట అయితే కృతజ్ఞతను చూపును. దాతయును చిరునగవును కనుపరుచును. ఈవిని ఇచ్చుటకుముందు నవ్వితే అతనిమనస్సునందు మనమీదనుండు ప్రేమకు సూచన. ఇచ్చినపిమ్మట నవ్వితే దాతకును ప్రతిగ్రహీతకును ఐక్యభావమును చూపును.

చిరునగవు గాంభీర్యమును చూపునట్టే దైన్యతనుకూడ చూపును. « అదీనలీలాహాసితేక్షణోల్లసత్ భ్రూభంగసంసూచితభూర్యనుగ్రహం " అని శ్రీమద్భాగవతమునందు ఉపయోగించబడియున్నది. అనగా దైన్యతతోగాక ఔదార్యముతో కలిసిన లీలాహాసము అనుగ్రహమును సూచించును. అటుగాక బిచ్చగాడు బిచ్చమును అడిగినపుడు బిచ్చము లేదుపొమ్మను మాటలను ధూర్తితో నొకడు ఉపయోగించగా బిచ్చగానికి కోపము దుఃఖము ఆక్రోశము అన్నియు సమకాలమునందు కలిగినపుడు ఆ మనోభావము చిరునగవుగా వ్యక్తమగును. ఇది దైన్యమువల్ల కలిగిన సహనకు గురుతు.

కనుక మనము దయను చూపుటకు గురుతుగా చిరునవ్వు నవ్వినయెడల ముఖవిలాసమందు స్నేహమును ఔదార్యమును చూపబడును. దయారసమునందు ఆత్మైక్యభావము ఉన్నది. దయ చూపువాడును దయను పుచ్చుకొనువాడునుకూడ దయవల్ల లాభము పొందుదురు. అసహ్యముగానుండు రూపముగల మనుష్యులుగూడ మనయందు దయ అనుగుణము వృద్ధిచెందినపుడు సుందరము, రుచిరము, చారు, శోభనము, మనోరమము, రుచ్యము, రమ్యము, మనోజ్ఞము, మంజు, మంజులము అను విశేషణములకు పాత్రులవుదురు. ఇట్టి

సద్భావరసములను మనయందు దయారసము కలుగజేయునందువలన దయవల్ల మనకు లాభమును పైచెప్పిన విశేషణములకు పాత్రుడై నందున దయయొక్క ఫలమును పొందినవానికికూడయు మంచిదే.

దయ అను భావము దట్టముగా నేర్పడినపుడు ఆ దయారసమునకు కృప అనిపేరు. కృపయందు అనుకంపారసము కలిసియున్నది. ఇంకను అధికుడు సహాయము చేయవలె నన్నను కూడ దీనునికి ఆ సహాయముతో ప్రయోజనము కనబడదని పశ్చాత్తాపముకూడ కలిసియుండును. అనుకంప అనగా తనకంటె తగ్గినవాడు అనుభవించు కష్టములను తానే అనుభవించునట్టు అధికుడు అనుకొని ఆ కష్టములను నివారణచేయుటకు అధికుడు చేయునట్టి ప్రయత్నము. ఆ ప్రయత్నమును ప్రేరేపించునట్టి మనోభావమునకు అనుకంప అని పేరు.

అనుకంప—(కృప)

భగవద్గీత, మొదటి అధ్యాయము, 28 వ శ్లోకమునందు "కృపయా పరయాఽఽవిష్టో విషీద న్నిద మబ్రవీత్" కృపఅను పదమునకు అనుకంప అని అర్థము. అనుకంపకు అర్థము: భయము దుఃఖము అను భావములు అనుభవించువాని మనస్సునందు కలిగి దౌర్బల్యమువల్ల దేహమందు కంపముకలుగును. ఆ కంపము మనస్సునందుకూడ కలుగును. తక్కువైనవానికి కలిగిన కంపమును అనుసరించి అధికునికికూడ అట్టి కంపముకలిగినట్టుగా అధికునికి కలుగు మనోభావము అనుకంప. అనుసరించి కంపించుట అని అర్థము. దయయు అనుకంపయు ఉపాసకునికి చిత్తప్రసాదమును కలుగజేయును.

అవక్రత

అవక్రత అనగా వంకరమానియుండుట. దీనినే ఆర్జవము అందురు. మనకందరకును మూడుకరణములుగలవు. వానికి త్రికరణము అనిపేరు. ఏ కార్యముచేసినను త్రికరణశుద్ధితో చేయవలయును అని చెప్పుట మనము వినుచున్నాము. ఈ మూడుకరణములు మనస్సు, వాక్కు, కార్యము అనునవి. మొట్టమొదట మనస్సునందు తలంపు కలుగును. ఆ తలంపు వాక్కువల్ల వ్యక్తదశకువచ్చును. ఆ తలంపును

ఆ వాక్కును ఎట్లున్నవో అట్లు కార్యము ఉండవలయును. ఈ మూడు కరణములు ఏకరీత్యా కార్యముచేయుటకు అవక్రత అని పేరు.

> మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం ।
> మన స్యన్యం వచ స్యన్యం కర్మ ణ్యన్యం దురాత్మనాం ॥

మంచివారలస్వభావము మనస్సులో తలంచుకొన్న రీతిగానే మాటలు, మాటప్రకారముగానే కార్యము. దురాత్ములస్వభావము మనస్సులో నొకతలంపు, ఆ తలంపుకు అనుగుణ్యముగా కాని మాటలు, మాటలకు సంబంధములేని కార్యము. ఈ ప్రకారముగానుండుట లోకమునందు చూచుచున్నాము. పేదవారలయందు దయకలిగి వారలకు సహాయముచేయవలెనని మనస్సులో తోచును. ఆ తలంపును అనుసరించియే కదా మాట ఉండవలెను. ఆ మాటను అనుసరించియే కదా కార్యము ఉండవలయును. లోకమునందు ఈ ప్రకారముగా త్రికరణములును ఏకీభవించినడుచు మహాత్ములున్నారు. అందుకు విరోధముగా నడుచువారుకూడ ఉన్నారు. నివృత్తిమార్గమునకు చేరిన వారికి ఆర్జవము అనగా త్రికరణఅనుచరణ ఉండవలయును. అప్పటికే మనశ్శాంతికలుగును. „అశాంతస్య కుతస్సుఖం" శాంతిలేనివానికి సుఖమెట్లుకలుగును.

విషయేష్వతివైతృష్ణ్యం

అనగా విషయానుభవమునందు ఎంతమాత్రమైనను అనగా తుత్రాగా దాహములేకుండుట. ఇంద్రియములకు విషయములు అనుకూలములుగా దొరికినపుడు మనస్సునకు సుఖముకలుగును. అటుగాక ఇంద్రియములకు విషయములు ప్రతికూలములుగా దొరికినపుడు దుఃఖముకలుగును. „విషయాణా మానుకూల్యేన సుఖీ దుఃఖీ విపర్యయే" కనుక సుఖమునకుగాని దుఃఖమునకుగాని కారణములు విషయములే గనుక సుఖమును ఈయదగిన విషయములను కోరుట మనస్సునకు స్వభావము. సుఖము వచ్చినపుడు దుఃఖము సిద్ధముగా కాచియేయుండును. సుఖములు నిత్యములుకావు; సుఖ

మనుకలుగజేయు విషయములును నిత్యములుగావు. సుఖమును అనుభవించుచుండగాకూడ సుఖమునకు అంత్యముకలుగునే అను దుఃఖముకలదు. కొన్నివిషయములే సుఖములను ఇచ్చునవి. అవియును నశ్వరములు కనుక విషయములను అనుభవించవలయును అను తృష్ణ (దాహము) లేకుండవలయును. ఏది ఏకాలమునకు సంభవించునో ఆ విషయమును దానియందు రుచిగాని పట్టుదలగాని ఆశగాని లేక అనుభవించి ఆ అనుభవమును మరువవలయును. విషయములనుగురించియే చింతించుచుండుటను లోకమునందు చూచుచున్నాము. ఇట్టి చింతించుటవల్ల మనశ్శాంతికి హానియేగాని లాభములేదు. ఏ విధముచేతనైనను సర్వప్రయత్నములనుచేసి మనశ్శాంతిని సంపాదించవలయును. దానికి ఒక ఉపాయము విషయవైతృష్ణ్యము. పూర్వము జీవాత్మ ఎత్తిన అనేకజన్మములందును ప్రవృత్తిమార్గమును అవలంబించి అందుల ఫలముగా విషయసుఖములను అనుభవించవలెనను ఆశ మిక్కుటముగా పెరుగుచువచ్చినది. ప్రవృత్తిమార్గమునందు పెరిగి పెరిగి ఆ మార్గముయొక్క అంత్యస్థితులలో విషయానుభవమును కోరుట తనకు వృద్ధికి సహాయముకాదు అని తెలిసికొన్నను అనుభవము హేయము అని వదులుకొనుట విధాయకముగా నంగీకరించలేదు. నివృత్తిమార్గముయొక్క మొదటి స్థితులును (మెట్లును) ప్రవృత్తిమార్గముయొక్క అంత్యస్థితులును (మెట్లును) కొంచము హెచ్చుతక్కువ తుల్యములుగానుండును. ప్రవృత్తిమార్గముయొక్క అంత్యస్థితులలోనే (మెట్లలోనే) విషయాశా మహాపాశమును త్రెంచుటకు జీవాత్మ నేర్చుకొనుచుండును. తృష్ణ (అనగా దాహము) ఈ విషయానుభవము అను ఆశకు కారణము. విషయానుభవమువల్లకలుగు తృప్తి జీవునికి (ప్రాజ్ఞాత్మకు)[1] ఉపయోగములేదు.

---

[1] ఆత్మవిచారము, పూర్వభాగమునందు జీవాత్మ మూడువిధములుగా నుండునని చెప్పబడియున్నది. (1) తురీయాత్మ, (2) ప్రాజ్ఞాత్మ, (3) తైజసవైశ్వానరుడు అని మూడు అవస్థలు. (1) తురీయాత్మ సత్యలోకము మొదలు పైలోకములలో నుండువాడు (2) ప్రాజ్ఞాత్మ తపోలోకము, జనలోకము, మహర్లోకములయందుండువాడు. తైజసవైశ్వానరుడు భూలోకము, భువర్లోకము, స్వర్గలోకములయందు అనుభవగ్రాహి.

అదంతయు తైజసవైశ్వానరుడే అనుభవించువాడు. తైజసవైశ్వానరుడు అనుభవించుఫలముల సారాంశమును మాత్రము ప్రాజ్ఞాత్మ తీసికొనును. తృష్ణ తైజసవైశ్వానరునికి సంతోషమును కలుగజేయును. కనుక మరల మరల అదేసంతోషముకావలెనని తైజసవైశ్వానరుడు కోరును. ప్రాజ్ఞాత్మకు ఇట్టి హేయములైన సంతోషములతో లాభములేదు. జీవాత్మ తైజసవైశ్వానరుడుగా మారుటకు ఉద్దేశము పై చెప్పబడిన విషయానుభవము అను తక్కువ దర్జాసంతోషమును అనుభవించుటకొరకుగా ననే ఎఱుగవలయును. తైజసవైశ్వానరుడు అనేక జన్మములవరకును హేయమైన విషయసుఖములయందే ఆహ్లాదముకలవాడుగా నుండును.

భూలోకమునందు జాగ్రదవస్థలో స్థూలశరీరముతోను స్థూల ఇంద్రియములతోను (ఇంద్రియగోళములతోనును) అనుభవించుటకు సాధ్యమైన ఇంద్రియసుఖములు సూక్ష్మశరీరము అనగా కామమయ శరీరముతో అనుభవించుటకు సాధ్యమైన ఇంద్రియసుఖములతో పోల్చుటకు సాధ్యమేకాదు. సూక్ష్మసుఖములు అమితములైన శక్తులు గలవి. స్ఫుటములైనవి. కనుక మనకు జాగ్రదవస్థలో తెలిసిన తీవ్ర వైరాగ్యము సూక్ష్మలోకపు సుఖములను గురించినపుడు చాలినంత తీవ్రముగా కనబడదు.

హిందూశాస్త్రములయందు చెప్పిన యజ్ఞయాగాదు లన్నియు భూలోకము ఇయ్యగల సుఖములు తగినంత ఋచివంతములును దీర్ఘ కాలీనములును కావు అనుకొనినవారు రంభాసంభోగము మొదలయిన సూక్ష్మలోక సుఖములను సాధించుటకుగా చేయు యుక్తులే. స్థూల లోకమునందు స్థూలశరీరముతో ననుభవించు స్త్రీసుఖాదులు స్థూల శరీరము పటుత్వము కలిగియుండునంతవరకే సంతోష దాయకములు. స్థూలశరీరమునందు నేత్రేంద్రియగోళము అగు కన్ను వయస్సు ముదిరినపుడు చూపు సరిగా చూడలేకపోవును. శ్రోత్రియగోళమగు చెవికూడ ముసలితనము వచ్చినపుడు సరిగా వినదు. సంగీతమునందు నిశితస్వరములను వినలేకపోవును. స్థూలశరీరమునందు మనస్సునకు గోళము అయిన మెదడు బలహీనమగుకొలదిని సరిగా చింతించ

లేక ఇంద్రియములు విషయములను ఆకర్షించుటకు కావలసినంత శక్తిని ఇంద్రియములకు ఇయ్యలేకపోవును.

ఇదంతయు "స్థూలస్య సంభవ జరామరణాది దుఃఖాః" స్థూల శరీరమునకువచ్చుచున్న ముదుసలితనముయొక్క చేష్టలు కనుక సూక్ష్మశరీరముతో సూక్ష్మలోకమునందు ముసలితనముయొక్క తొందరలేకయే దీర్ఘకాలము అనుభవించవచ్చును అను ఆశతో చేయబడునవి సకామములైన యజ్ఞయాగాది కర్మలు.

ఇట్లున్నదిగాన నివృత్తిమార్గమును గోరు ఉపాసకుడు విషయ వైతృష్ణ్యమును అనుష్ఠించుచున్నాను అనుకొనునప్పుడు "విషయా విని వర్తంతే నిరాహారస్య దేహినః । రసవర్జం రసోఽపి అస్య పరం దృష్ట్వా నివర్తతే" అను గీతావాక్యమునందు చెప్పినట్టు విషయానుభవరసమునుకూడ (అనగా కోరికనుకూడ) విడువవలయును.

కించిత్కాలముమాత్రము ఉండగల భూలోకసుఖములను ఇచ్ఛయించినపుడును ఇచ్ఛ అనునది ఉన్నది; దీర్ఘకాలము ఉండగల స్వర్గసుఖములను ఇచ్ఛయించినపుడును ఇచ్ఛ అనునది ఉన్నది. విషయసుఖములను ఇచ్ఛయించినామనే అర్థము. సంకెలలను ఇనుముతో చేసినవాటిని తగిలించుకొన్నను సంకెలలే, బంగారు సంకెలలను తగిలించుకొన్నను సంకెలలే కనుక వైతృష్ణ్యము అను గుణమును సంపాదించవలయును. విషయసుఖములను తానే అనుభవించకున్నను అనుభవించిన వారికథలనువిన్నపుడు ఒక విధమైన ఋుచికలుగును. ఇది జ్ఞానాభావమునకు గురుతు.

> రాగో లింగ మబోధస్య విషయవ్యాయామభూమిషు ।
> కుతః శాద్వలతా తస్య యస్యాఽగ్నిః కోటరే తరోః ॥

అనగా ౹మానియొక్క తొఱ్ఱలో నిప్పు ఉండగా చెట్టునకు పచ్చియెక్కడిది. అదేవిధముగా విషయచింతనయందు రుచిగలవారికి జ్ఞానముజనియించునా అని అర్థము. ఇట్టి రుచియుకూడ నిర్మూలముగా తెగగొట్టవలయును.

శౌచం

అజ్ఞానదూరీకరణం మానసం శౌచ మాంతరం ।
అంతశ్శౌచే స్థితే సమ్యక్ బాహ్యం నాఽవశ్యకం నృణాం ॥

బాహ్యశౌచము ముఖ్యము. కాని ఆంతరమైన శౌచము చాల ముఖ్యము. ఆంతరశౌచము అనగా మనశ్శుద్ధి. పరధనము మొదలగు వాటిని తాను పొందవలెను అను దుష్టగుణములు లేకుండుటయు పరులకు సహాయముచేయుటయందు స్వపరభేదము లేకుండుటయు అంతశ్శౌచము అనబడును. స్వపరభేదము అనగా తాను ఇతరులకన్న వేరు అను అభిప్రాయము. దీనినే పృథగ్భావము అందురు. సర్వాత్మైకత్వజ్ఞానము కలిగి ఆ జ్ఞానమును ఇదివరకు సంపూర్ణముగా అనుభవించను వీలులేకున్నను శాస్త్రములలో చెప్పియున్నదానిని నమ్మితే మనము వేరు, ఇతరులు వేరు, అను జ్ఞానము క్రమేణ నశించును. సర్వ ఆత్మైక్యభావమును అనుష్ఠించవలయును.

దంభవివర్జనం

దీనినే అదంభిత్వము అందురు[1]

సత్యం

అను గుణమును అనుష్ఠించనియెడల సత్యం అనువస్తువు మనకు లభించదు. "సత్య మనంతం బ్రహ్మ" అను వచనమునందు బ్రహ్మ సత్యము అని తెలియుచున్నది. సత్యవంతులే సత్యమును తెలిసికొనగలరు. జ్ఞాతయందును జ్ఞేయమునందును సామాన్యధర్మము సత్యము. ఆ సామాన్యధర్మ మున్నపుడే జ్ఞాత జ్ఞేయమును తెలిసికొనుటకు వీలుండును. కనుక నివృత్తిమార్గగామికి సత్యము ముఖ్యమైన సాధనము.

సత్యమును మాత్రమే మాటలాడవలయును, కనుక మాటలాడుటకుమునుపు చక్కగా యోచించి పరీక్షించి అసత్యముతో

---

[1] ఆత్మవిచారమునందు అదంభిత్వము మొదలగు గుణములను గురించి విశేషముగా వ్రాయబడియున్నది. కనుక ఇచ్చట వ్రాయలేదు.

కలియనిమాటలే ఆడవలయును. తాను చెప్పుటకు ఉద్దేశించిన విషయమునకు ఎన్నిమాటలు న్యాయముగా కావలయునో అన్ని మాటలే మాటాడవలయును. నివృత్తిమార్గమును అనుష్ఠించకోరు వానికి ఇది చాలముఖ్యము. సాధారణమైన జనుడు మాటలాడు నపుడు అసత్యపుమాట లాడుచున్నానా అని గమనించుటలేదు. ఉన్నసంగతి ఉన్నట్టుచెప్పక తాను చెప్పుచున్న సంగతియందు వినువారికి హర్షముకలుగవలయునని అసత్యములను అతిశయోక్తులను ప్రయోగించుట చూచుచున్నాము. అరీతిగా మాటలాడితే అన్నిమాటలును సత్యముగానుండుట అరుదు. అతిమాటల వాడు తనమాటలలో తనకు తెలియకనే అసత్యములను కలుపుకొనును. కాబట్టి అతిమాటలాడునట్టి వాడుకను నిలుపుకొనవలయును.

జనసామాన్యమునకు తాము మంచి చమత్కారముతో మాటలాడువారు అని ఇతరులు తమను పొగడవలయును అను ఆశకలదని మనము ఇదివరకే తెలిసికొనియున్నాము. చమత్కారముతో మాటలాడునపుడు సత్యమునే మాటలాడుటయు అసత్యమును ఏ మాత్రమైనను మాటలాడకుండుటయు సంభవించదు. జనుల పొగడ్తనుకోరువారు నివృత్తిమార్గమును కలలోనైనను తెలిసికోలేరు అనవలయును. జీవన్ముక్తులనుచూచి గుర్తించుటకు మనకు జాగ్రదవస్థయందు సాధ్యముకాదు. కాకపోవచ్చునుగాని జీవన్ముక్తికి సమీపస్థితిలోనుండువారు ఎంతప్రకాశవంతులుగా నుందురో దానిని తెలిసికొనుట సాధ్యము. తన్నుతాను చక్కపెట్టుకొనుటకు కోరువాడు సత్యభాషణమును అభ్యసించి ఆప్రకాశములో సహస్రాంశమైనను ప్రయత్నపూర్వకముగా సంపాదించవలయును. ప్రకాశము అనగా పొగడ్తకు అర్హములైన గుణములుకలిగియుండుట. అట్టివారు పొగడ్తనుకోరరు. జనులు మనలను పొగడుచుండుటను వినవలయునను అభిలాష నివృత్తిమార్గమునకు అతిదూరము. పొగడ్తను కోరినపుడు అతని మాటలయందు అతిశయోక్తి కలియును. అతిశయోక్తి అసత్యము.

మూఢాచారములు

ఇవి మొదట ఒకపుడు సత్యములుగా నుండినవి. సత్యము ఇది, మిథ్య ఇది అను వివేకజ్ఞానము చాలనందువల్ల అచారములలో మిథ్య అధికమై సత్యము తగ్గుచువచ్చెను. 'పరమగురుచరణ సన్నిధి' యందు పరమగురువులవారు ఖండితముగా చెప్పినది సత్యమును మిథ్యను విమర్శించుశక్తి శిష్యునికి అవశ్యము అన్నారు. మనస్సునందు వాక్కునందు కార్యములందునుకూడ ఎల్లకాలముల యందును సత్యమునే అభ్యసించవలెను అని ఉపదేశించియున్నారు. మొట్టమొదట మనస్సునందు సత్యముండవలయును. అయితే అది సులభముకాదు. ఎందువలననగా లోకమునందు అసత్యపుతలంపులు అధికముగానున్నవి. అంధపరంపరలు మెండుగానున్నవి. అసత్యములు మూఢాభిప్రాయములు ఎవ్వనియందు నెలగొనియున్నవో వాడు వృద్ధికిరాడు. ప్రవృత్తిమార్గమునందుకూడ సత్యవాక్కు చాల ముఖ్యము. వర్తకనాణ్యములని ఒకటికలదు. వర్తకవ్యాపారములందు చెప్పినమాట తప్పకనడుచుట చాలముఖ్యము. నాణ్యముతప్పిన వర్తకుని వాని తోటివారు నమ్మరు. న్యాయస్థలములయందు ప్రకృత కాలమునందు యుక్తులను ఉపయోగించి తమ వాదములను బలకట్టు న్యాయవాదులుకూడ సత్యమునవలంబించినపుడు వారి వాదములు సఫలములుగానుండును. వేదములయందును స్మృతులయందును చెప్పబడియుండు విధినిషేధవాక్యములు సత్యములే. అయినను ఉపాసకుడు స్వధాగాచింతించి యుక్తినుపయోగించి ఆ వాక్యముల యొక్క సత్యతను విమర్శించి తెలిసికొనువరకును ఉపాసకునికి అవి సత్యములుగా నమ్మతగినవికావు. తనకంటె నధికులుచెప్పిన న్యాయములు నమ్మతగినవేగాని ఆ న్యాయముల సత్యతను విమర్శించిన పిమ్మటనే వానిని అనుష్ఠించుటయందు ప్రయోజనముండును. ప్రవృత్తిమార్గమునందు చరించువారు నమ్మకములను గౌరవించవచ్చును. ఇతరుల వాక్కులు, స్మృతియందుచెప్పిన విధినిషేధవాక్యములు ఇవి అన్నియు ప్రవృత్తిమార్గమునందుండువారు నమ్మవలసి

నవే. అయితే నివృత్తిమార్గమును త్రొక్కుటకారంభించినవారు ఆ విధినిషేధవాక్యముల తత్త్వమును విచారించి అంగీకరించవలయును. అపుడే నమ్మకము నిజమైన నమ్మకము అగును. స్మృతులయందు "న పలాండుం భక్షయేత్" అను నిషేధవాక్యము ఉన్నది. ఉల్లిగడ్డలను తినకూడదని అర్థము. కొందరు స్మృతివాక్యమును మర్యాద చేయకయే పలాండువును భక్షింతురు. కొందరు భక్షించవలెనని ఆశయుండినను శాస్త్రవిరుద్ధము అని వదులుకొందురు. ఇదంతయు ప్రవృత్తిమార్గమునం దుండువారి యవస్థ. నివృత్తిమార్గమునందుండువారో పలాండువుయొక్క దోషములు ఏవి, గుణములు ఏవి, ఆ దోషములు తమకు ఏ విధముగా ప్రత్యవాయములు, గుణములు ఏ విధముగా అనావశ్యకములు అని విమర్శించి వాదించి నిరసనము చేయుదురు. విమర్శించక నిరసనముచేయుచున్నంతవరకును మూఢాభిప్రాయములు. విమర్శించిన పిమ్మట చేయబడునిరసనము నమ్మకము అని తెలిసికొనవలయును.

తథాగతులు (గౌతమబుద్ధులు) మన దేశమునందు సంచరించుచుండగా కొందరు వారిని సమీపించి స్వామీ అనేకులు ఉపదేశకర్తలు వివిధములైన శాస్త్రములను మాకు చెప్పుచున్నారు. మేము దేనిని నమ్మవలయును అని అడిగిరి. అందుకు వారు చెప్పిన జవాబు ఏమనగా.

ఒకరు చెప్పగానే మనము నమ్మకూడదు. గ్రంథములలో చెప్పియున్నవి గనుక నమ్మవలెను అనికూడ నమ్మకూడదు. ఆనుపూర్వికముగా ఆచారములో నున్నదన్ననుకూడ నమ్మకూడదు. దేవతలు మాకు తెలియచేసినారు అన్ననుకూడ నమ్మకూడదు. అయితే ఏమిచేయవలెననగా పరిశుద్ధమైన మనస్సుతో చర్చించినపుడు సరియనితోచితే అపుడు నమ్మవచ్చును. నేను ఉపదేశము చేసిన మాత్రముననే నమ్మకుడు. మీరుగా విమర్శించి నమ్ముడు.

అప్పుడపుడు మనమే మనలను పరీక్షించుకొని ఏమాత్రము మననమ్మకములు యుక్తియుక్తములు అని తెలిసికొనవలయును.

యుక్తియుక్తములైన నమ్మకములే సత్యములు. మూఢాచారములు కానివి.

మూఢాభిప్రాయములు

మన దేశమునందు వర్ణవిభజనలు మాత్రమేకాక అంతర్భాగములు అనేకములుగలవు. పరిశ్రామికవిషయములయందు ఈ విభజనలు చాల సూక్ష్మముగాకూడ విభజించవచ్చును. బ్రాహ్మణ వర్ణపువారు ధర్మశాస్త్రములలో బ్రాహ్మణులకు ఉండవలసినది అని ఏర్పడిన గుణములు, కర్మలు, ఆచారములు ఏవైనను అణుమాత్రమైనను లేకున్నను జననీజనకులు బ్రాహ్మణులుగా నుండినయెడల వారల ప్రజకూడ బ్రాహ్మణులే. ఉపనయనమువల్ల కావలసిన సంస్కారము ఏమాత్రమైనను అనుష్ఠించుట లేకున్నను ఆశ్రమధర్మము కొంతమట్టుకైనను నడిపించకపోయినను ఉపనయనము తపోలింగముగా నుండవలసియున్నను అట్లు ఉండుటలేదు. అయితే ఉపనయన మహోత్సవము అను పండుగవైభవము నడువవలసినదే. ద్విజులు ఇట్లు తమకు తెలిసి శాస్త్రములను ధిక్కరించినను మేము వర్ణాశ్రమ ధర్మరతులము అని చాటించుకొనుటయందు ఏమాత్రమైనను అశ్రద్ధ కానరాదు.

'అగ్నిః దేవో ద్విజాతీనాం' అని యున్నను అగ్నికార్యము ఔపాసనము, దర్శపౌర్ణమాస్యల స్థాలీపాకములు ఇష్టి వైశ్వదేవము మొదలగు యజ్ఞములుగాని చేయువారలెవ్వరు. ఇందునుగురించి ధర్మశాస్త్రములు, విధినిషేధవాక్యములు మొదలగునవన్నియు నిరాకరింపబడినవే. అయినను బ్రాహ్మణులేమో బ్రాహ్మణులే. జాతి బ్రాహ్మణులే కాని గౌణబ్రాహ్మణులనుట సాధ్యమగుట దుర్లభమైయున్నది.

శాస్త్రాభ్యాసకులపైకి నేను షట్ శాస్త్రవేత్తల వంశమునందు పుట్టినవాడను అనుకోవచ్చును. మాకులమునందు తపఃకర్మాది నిష్ఠయం దుండినవారుగాని జ్ఞానమార్గమున పరిశ్రమచేసినవారు కారు. కనుక నేను ,,పూర్వైః పూర్వతరం కృతం" అనియే

నడుచుకొందును. ఇదేప్రకారము మాపూర్వులు తాంత్రికులు కనుక నేనును తాంత్రికుడుగానేయుందును! మాపూర్వులు ఔషధ రసాయనాది సాధనవంతులు కనుక నేనును వారి మార్గమునందే నడుతును అని పూర్వాచారములు ఈ కాలమునకు ఉపయోగపడునా అని విచారించకయే పూర్వాచారపరాయణులుగా నుందురు. ఇట్టి వారినిగురించి యోగవాసిష్ఠము, నిర్వాణప్రకరణము, ఉత్తరార్ధము, నూటఅరువదినాలుగవ సర్గ, ఏబదియారవ శ్లోకము ఈ అడుగునకని నట్టు వ్రాసియున్నది.

> తాతస్య కూపో యమితి బ్రువాణాః క్షారం జలం కాపురుషాః పిబంతి ।
> యథా భవన్తో వివిచారవంతః తథాఽనిశం మాభవతాజ్ఞ తాప్త్యై ॥

బుద్ధిహీనులు దురభిమానముచే సమీపమునందు శుద్ధమై పవిత్ర మయిన జలముతో గంగానది ప్రవహించుచున్నను ఆ నీటిని అనా దరణచేసి మాతండ్రిగారు త్రొవ్విన నుయ్యిఅను అభిమానముతో నూతిలోని ఉప్పునీళ్లనే త్రాగునట్లు మూర్ఖముతో పునర్జన్మ పరం పరలను ఈయగల మూఢాభిమానములను ఆచారములను వహింతురు అని యర్థము.

ఈ చెప్పిన సత్యముఅనునది వాక్కుకు ఉండవలసిన నాలుగు గుణములలో నొకటి

> అనుద్వేకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
> (శ్రీమద్భగవద్గీత)

వాఙ్మయతపస్సును చెప్పునపుడు శ్రీమద్భగవద్గీతయందు వాక్కుకు నాలుగు గుణములను వర్ణించియున్నారు. అనుద్వేగకరత్వము, సత్య త్వము, ప్రియత్వము, హితత్వము అను గుణములుకలదిగా నుండవలెను. సత్యత్వమునుగురించి పైన వ్రాయబడియున్నది. అనుద్వేగకరత్వము అనగా ఉద్వేగము=దుఃఖము దుఃఖమునుకలుగజేయని వాక్యముగా నుండవలయును. అది సత్యముగాను ఉండవలయును. ప్రియకరము గాను ఉండవలయును. ప్రియము అనగా ముందు పోనుపోను మేలును కలుగజేయకున్నను అప్పటికే అనగా మాటలాడునపుడు సత్య

ముగానుండి సంతోషమునుకలుగజేయుమాట ప్రియము అనబడును. ఆ సమయమునకు అనగా అప్పటికి ఆయాసకరముగానున్నను పిమ్మట మేలుకలుగజేయునట్టి మాటలుగాని కార్యములుగాని హితములు అనబడును. ప్రియము అనగా ఇచ్చకపుమాట. హితము అనగా మేలును కలుగజేయుమాట.

నిర్మమతా

తన స్వాధీనమందుండు వస్తువులు తనవి, ఇతరులు ఆ వస్తువులను తాకకూడదు, ఉపయోగించకూడదు. ఇట్టి గుణములకు మమత అనిపేరు. నాది అను అభిప్రాయముకలిగియుండుట. ఇట్టి అభిప్రాయములేకుండుట నిర్మమత అనబడును. మనఃప్రసాదము ఉంటేనే గాని అందుకుపైన జరుగవలసిన ధ్యానము మొదలగు అనుష్ఠానములు నిరాటంకముగాజరుగవు. ఉత్తరోత్తరాభివృద్ధికి మమత్వము విఘ్నకారి. మనస్సును ఏకాగ్రముగానుంచునపుడు మమత్వమువల్ల అనేక తొందరలు కలుగును. కనుక మమత్వమును వదులుకొనవలయును.

స్థైర్యము

శాస్త్రవిచారమువల్లను స్వఅనుభవమువల్లను హేయములు అని ఏర్పడిన అభ్యాసములు, అభిమానములు, కార్యములు ఇట్టి వాటిని తుట్టాగా వదులుకొనుటకు నిశ్చయించుకొనినపుడు అట్టి స్థితియందు ఏమాత్రమును చలనములేక నిలిచియుండుట.

అభిమాన వివర్జనము

తాను మంచిచదవరి, అందువల్ల మూఢులకంటె మాత్రము కాదు; నావంటిచదువరులకంటె నేను అధికుడను అని యొక విధమయిన గర్వము. దీనిని అభిమానము అందురు.

ఐశ్వర్యము ఎందఱకో ఉన్నది; వారలు ఆ ఐశ్వర్యమును ఏ విధముగా సంపాదించినారోగాని నేను న్యాయముగా సంపాదించితిని. ఉన్నద్రవ్యమును అనేకులు ధర్మమార్గములయందు సెలవు

చేయరుకాని నేనైతే ధనమును ధర్మమార్గములలో సెలవుపెట్టు చున్నాను. అందువల్ల నేను ఉచితమైన కార్యములుచేయువాడను అనునది యొకవిధమైన అభిమానము. అట్టి అభిమానము లేకుండుట.

తపస్సు

అనేకులు దేవపూజ ధ్యానము మొదలగు విధములైన తపస్సులను చేయువారున్నారు. దేవపూజాదులుచేయుకాలము కొద్ది. లోకవ్యవహారములయందు ప్రవేశించి అములుజరుపుకాలము మెండు. ఇది ఎల్లరకును కలిగిన ఆచారము. దేవపూజాదులుచేయుకాలమునందు నిర్మలముగానుంచుకొన్న చిత్తమును ఇతర వ్యవహారముల సమయములందుకూడ నిర్మలముగానుంచుకొని నిష్పక్షపాతముగా కార్యములను జరుపుట నాకొకనికి సాధ్యమేగాని ఇతరులకు సాధ్యముకాదు అనునది యొక విధమైన అభిమానము. ఇట్టి అభిమానము లేకయే దేవపూజాదులచేయుటకు తపస్సు అని పేరు.

రూపము

నేను సొగసుగాడను. నా దేహచ్ఛాయయు నాముఖబింబమును సాముద్రికశాస్త్రరీతిగా బ్రహ్మదేవుడు చాలజాగ్రతతో నిర్మించినాడు. ఆరీత్యా కురూపులైన ఇతరులకన్న నేను అధికుడను అనునది ఒక విధమైన అభిమానము.

కులము

నేను మంచికులమునందు పుట్టినవాడను. మా పెద్దలందరును మంచిచదువరులేకాక యోగ్యులునుకూడ. దుర్గుణములులేనివారు. అట్టి వారివంశమునందు పుట్టినవాడను నేను. కనుక ఇతరులకన్న నేను అధికుడను అనునది యొకవిధమైన అభిమానము.

వర్ణము

నేను బ్రాహ్మణవర్ణమునకు చేరినవాడను. సృష్టికర్తయొక్క ముఖమునుండి పుట్టినవాడను. మాపెద్దలందరును అగ్నిష్టోమము

మొదలగు పశుమేధములు చేసినవారలు కనుక నాకే అగ్రతాంబూల
ము ఇయ్యవలయును.

నేను క్షత్త్రియుడను. ఆదియందు క్షత్త్రియులకే సర్వాధి
కారము ఉండినది. సర్వవిద్యలకెల్ల నధికమైన బ్రహ్మవిద్య రాజులకే
మొట్టమొదట ఉపదేశించబడినది. కనుకనే రాజవిద్యయనియు
రాజగుహ్యము అనియు అట్టి విద్యకు పేరువచ్చినది. నేను వైశ్యుడను,
ఎవ్వరు ఎన్నియజ్ఞములను యాగములను చేసినను ద్రవ్యము, ధనము
వీటిని నేనేకదా శేఖరించి యుంచవలసినవాడను. కనుక నాపదవి
హెచ్చు అనిమొదలగు ఆలాపములు ఒక విధమైన అభిమానము.

ఆశ్రమము

మనుష్యునకు ఏర్పడిన నాలుగు ఆశ్రమములపైకి సన్న్యాసా
శ్రమము అత్యున్నతమైనది. నేను సన్న్యాసిని. కాబట్టి "కాషా
యదండమాత్రేణ యతిః పూజ్యో న సంశయః" అని సన్న్యాసి
ఆశ్రమమునకు మర్యాద అధికము అనియు సర్వాశ్రమములకును
అన్నదాత నేను గాని మరియెవరు అని గృహస్థాశ్రమమునందుండు
వారు అనుకొనుటయు ఇదిమొదలగు తలంపులు ఒక విధమైన అభి
మానము. ఇట్టి అభిమానములన్నియు దురహంకారమును పుట్టిం
చును. కనుక అన్ని అభిమానములను వదులుకొన్ననేగాని చిత్త
ప్రసాదము కలుగచాలదు.

ఈశ్వరధ్యానపరత

"ఈశ్వర స్సర్వభూతానాం, హృద్దేశేఽర్జునతిష్ఠతి" అను
వాక్యప్రకారము ఎందరు ఎందరిని పూజచేసినను ప్రతిమనుష్యుడును
ఈశ్వరునియొక్క అంశయే గనుక వానివానియొక్క మూలపురుషుని
ధ్యానించుట యుక్తము. ఈశ్వరాంశ ఈశ్వరుని ధ్యానించుట
న్యాయము, మిగిలిన ధన కనక వస్తు వాహనాదులను ధ్యానించిన
యెడల అవిఅన్నియు ప్రకృతి సంబంధములే గనుక నశ్వరములు అని
విమర్శించి ఈశ్వరధ్యానమునే ప్రశస్తములని భావించి ఆ ధ్యానము

చేయుటకు ఇచ్ఛపొంది ధ్యానమును ఆరంభించుట నడుపుటయు కూడ ఈశ్వరధ్యానపరత అనబడును.

బ్రహ్మవిత్సహవాసః

బ్రహ్మవేత్తలతో సహవాసము. ఎన్నిజన్మములలో ఎన్నిసుఖములను అనుభవించినను సర్వసుఖములకును ఉత్తమోత్తమమైన బ్రహ్మానందసుఖముతో సమానముకాచాలదు అని తెలిసికొని ఆ బ్రహ్మానందసుఖమును ఈ జన్మమునందో ఇక రాబోవు జన్మమునందో సంపాదించుటకుగా ఆ అనుష్ఠానమునందు ఆరితేరినవారిని ఆశ్రయించి కొంతకొంతగా కొన్నిఅంశములవెంబడి మరికొన్నిటిని నేర్చుకొనుటకుగా అట్టి వారలతో సహవాసముచేయుట. సహవాసము రెండువిధములు. సామాన్యపరిచయమునందారంభించి పదే పదే వారల నివాసస్థలమునకు వెళ్లి వారిని సందర్శించి తనబసకు వాపసు వచ్చుట. ఇట్లు అనేకమార్లు సందర్భముదొరికినపుడంతయు వారల ఆశ్రమములకు పోవుచు వచ్చుచు నుండుట మొదటిది. రెండవది: వారల ఆశ్రమములకువెళ్లి వారలతో సహవసించుట. సహవాసము అనగా సహ=సాన్నిధ్యమునందు వాసః=వసించుట, అనగా అక్కడనే నిలిచియుండుట. గురువులవారి యింటియందే నిలిచి అచ్చటనే వసించుటకు గురుకులవాసము అనిపేరు. గురువులు బ్రహ్మవేత్తలు. కనుక వారి ఆశ్రమమునందే నిలిచియుండుటవల్ల శిష్యునికి అనేక విధములైన లాభములుకలవు. ముఖ్యమైనలాభము సహవాసము. ప్రతి మనుష్యునియొక్కయు శరీరమునందలి అణువులు అతని ప్రేరణలేకయే అతనియెరుకలేకయేకూడ అతనిశరీరమును వదిలి ఇతరుల శరీరములపైన స్థాపించుకొనును. శరీరి అయిన ఆత్మ ఎంతటియోగ్యుడో అతని యోగ్యతయొక్క స్వభావమంతయు అణువులకు అభ్యాసపడియుండును. బ్రహ్మవేత్తల శరీరములయందలి అణువులు బ్రహ్మజిజ్ఞాసచేయు స్వభావమును వాసనారూపముగా చెందియుండును. గురువులవారి శరీరములయందు స్థాపింపబడుటవల ఉత్తమస్వభావమును సంపాదించిన అణువులు శిష్యునిశరీరమందు చేరుటవల్ల శిష్య

నికి ఉత్తమస్వభావము జనించును. ఇట్టికారణములవల్ల బ్రహ్మవేత్తలు లేక వారిస్థితికి సమీపించినవారలు మొదలగు వారలతో సహవాసము చేయుట. సహవాసము అనగా మన శరీరమును వారల శరీరముల సమీపమునందు ఉండునట్లు ఏర్పాటుచేసికొనుట. ఇదే గురుకులవాసము అనబడును. మరియొకవిధము కలదు. అది అనగా "శ్రోత్రాదీంద్రియాణి మనసా సంయమ్య తన్మనసా తేషాం గుణగణ చింతన మాత్రేణ తేషాం సామీప్య ముగమ్య" అను రీత్యా బ్రహ్మవేత్తలను బహుకాలము మనసా చింతించి ఆ విధాన వారి సామీప్యము మనస్సుతో పొందుట.

జ్ఞానశాస్త్రైకపరతా

జ్ఞానమార్గమునకు కావలసిన పుస్తకములు ఉపనిషత్తులు, భగవద్గీత మొదలగు గ్రంథములను చదువుట. ఇది శ్రవణము అనబడును. చదివినదానిని మననముచేయుట. ఉపాసకుడు తాను వృద్ధికి రావలెనని కోరుచుండువాడు. ఇతరులను మెప్పించుకొఅకు శ్రవణము చేయువాడుకాడు. శ్రవణవిషయమును చక్కగా మననము చేయని యెడల విషయము అవగాహనకాదు. కనుక చక్కగా మననము చేయవలయును. శ్రీయోగవాసిష్ఠమునందు ఉపదేశించబడిన విషయములను శ్రీ రామచంద్రులు ఏ విధముగా మననము చేసినదియు, ఎంత అక్కరతో మననముచేసిరో ఆ విధము ఈ దిగువ వ్రాయబడుచున్నది. మనమును అదేవిధముగా అంత అక్కరతో అవ్యాజముగా మననము చేయవలయును.

జీవచ్ఛిత్తం మనో మాయే త్యేవ మాదిభి రాతతైః ।
రూపై రాత్మైన సంసారం తనో తీమ మసన్మయం ॥
ఏభి రేవం మనోమాత్రతంతుబద్ధైః త్రయంగతైః ।
దుఃఖోపశాంతి రేతాని సుచికిత్స్యాని నః కథం ॥
భోగా స్త్యక్తుం న శక్యన్తే తత్త్యాగేన వినా వయం ।
ప్రభవామో న విపదాం అహో సంకట మాగతం ॥
క దేంద్రియాణి దుఃఖేభ్యః సంతరిష్యంతి హేలయా ।
దురీహాదగ్ధదేహాని గరుత్మంత ఇవా ర్ణవాత్ ॥

వీతరాగజనప్రోక్తాః నిర్మలా జ్ఞానదృష్టయః ।
కచ్చి త్పదం త్వయి మనః కరిష్యం తీతి మే వద ॥
హే తాత మాతః పుత్రే తి గిరాం ఆసాం అహం పునః ।
భాజనం చిత్త మాభూవం భోజనం దుఃఖభోగినాం ॥
హే బుద్ధే భగిని భ్రాతు రర్థితాం పూర యాశు మే ।
అనయో ర్దుఃఖమోక్షాయ విచారయ మునే ర్గిరః ॥
త్వాం పాదపతితః ప్రీత్యా యాచే సఖి సుతే మతే ।
తేన భవ్యే భవోచ్ఛేదభూతయే సుస్థిరా భవ ॥

(యోగవాసిష్ఠము, ఉపశమప్రకరణము, మొదటి అధ్యాయము)

వసిష్ఠముని చేసిన ఉపదేశములను శ్రీరామచంద్రుడు మననము చేయుట కారంభించెను. మననము చేయుచు గూడార్థములను కనిపెట్టుటకుగా ప్రయత్నముచేసి చిత్తమే జీవాత్మ, మనస్సు మాయము ఇట్టి ఉపదేశములనుచేసి జీవాత్మయే సంసారమును కలుగజేసికొనుచున్నాడు అని ఉపదేశముచేసిరే దీని అర్థమును ఏవిధముగా అవగాహన చేసికోగలను. భోగములను వదులుకొనుట చాల దుస్తరము. వానిని త్యజించితేనేగాని విపత్తులనుండి తప్పించుకొని వెలుపలికి వచ్చుట కష్టము. అబ్బా ఇట్టి దుఃఖము సంభవించినది. ఏ కాలమునకు ఈ ఇంద్రియములు భోగములను తృణీకరించి చెడ్డ ఆశలచే పీడింపబడిన దేహమును కాపాడగలవు. వైరాగ్యమును సంపూర్ణముగా సంపాదించిన మహర్షిచే బోధించబడిన జ్ఞానవాక్యములు ఎట్టు అర్థమగును. ఓ మనస్సా ఎపుడు ఈ జ్ఞానోపదేశము ఆచరణకు సాధ్యమగును అని నాకు తెలుపుమా. దుఃఖములు వచ్చినపుడు ఓ తండ్రీ హా తల్లీ ఓ కుమారుడా అను దుఃఖాలాపములరూపములను గొన్న అజగరముల పాలపడకయే నే నెపుడు తప్పించుకోగలను. ఓ నా చిత్తమా నాకు ఈ రహస్యమును తెలియపరచకూడదా. ఓ నా బుద్ధితత్త్వమా నేను అవిద్యయొక్క బలముచేత జీవుడనైనట్టు నీవును బుద్ధితత్త్వమైతివే. కనుక నా సహోదరివి కావా నీవు. నీ భ్రాత అయిన నా దుఃఖమును గమనించి నా ప్రార్థనను అంగీకరించి నీయొక్కయు నాయొక్కయు కష్టములను దుఃఖములను నశింప

జేయుటకుగా వసిష్ఠమహామునియొక్క వాక్యరత్నములు నాకు అర్థమగునట్లు నాకు సహాయపడరాదా. నీవు నాకు సఖి. నా సుతయు నాదువు. నీ పాదములబడి వేడుకొందును. గమనించరాదా. ఈ భవసాగరమును ఛేదించుటకు నాకు శక్తికలుగునట్లు సహాయపడునట్టి మననమునందు నాకు తోడుపడరాదా. ఇట్లు మనసును ఒకపుడు, చిత్తమును ఒకపుడు, బుద్ధి నొకపుడు, వేడుకొని తనమననమును చెరచకూడదని ప్రార్థించుచు మననమును చేసెను.

సమతా సుఖదుఃఖయోః

సుఖములు దుఃఖములు కావడికుండలు. "సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖం", "సుఖమధ్యే స్థితం దుఃఖం దుఃఖమధ్యే స్థితం సుఖం" అనియు వినియున్నాము. సుఖములు దుఃఖములును అనేకమార్లు మనము అనుభవించియున్నాము గనుక కొంతమట్టుకు వాని రెంటియందును సమభావమును ఉదాసీనభావమును కలిగియుండుటవల్ల మనస్సునకు తొందర తక్కువయగును.

మానావమానాసక్తిః

ఇతరులు తమను మర్యాదచేసి పూజించవలయునను కోరిక లేకుండుట. అట్టికోరిక ఉండునెడల ఏకార్యమును సరిగా ప్రారంభించబడదు. ప్రారంభించబడినకార్యము సమగ్రముగా నడువదు.

ఏకాంతశీలతా

"ఏకస్తపస్వీ, ద్విరధ్యాయీ" అను వచనము కలదు. కనుక ఒంటరిగా ప్రొద్దుగడుపుటకు అభ్యాసము చేసికొనవలయు. ఒంటరిగా నుండునపుడు మన తలంపులుతప్ప ఇతర ఆలాపములు కలుగవు. ఇందువల్ల మనశ్శాంతి వృద్ధియగును గాని క్షీణించదు. క్షీణించుటకు కారణమైనను ఉండదు.

ఈ అధ్యాయమునందు జీవాత్మ ఎవ్వడనియు అతని స్వభావమిట్టిదనియు ఏ ఉద్దేశముతో పాంచభౌతికలోకములో ప్రవేశించె

ననియు, ప్రకృతియందలి మనస్సు మొదలగు ఆరు ఇంద్రియములను స్వీకరించెననియు, ప్రకృతి అనుపదమునకు వ్యుత్పత్తి ఇట్టిదనియు, గుణవిభజన మొదలగు వివరము లిట్టివనియు, ఇంద్రియములు అంత రింద్రియము అను విషయమును, చిచ్ఛక్తి మొదలగుశక్తు లిట్టివనియు, గుణములతో వాని సమన్వయ మెట్టిదనియు, మనోనాశమునకు కావలసిన విషయవిమర్శయు, మనస్సును మనోమణిగా చేయవలసిన ఆవశ్యకతను గురించియు, వాసనాజాలమనగా నేమియనియు, తన్మాత్రల సంబంధమునుగురించియు, చిత్తసమాధానము నార్జించుటయందు ఇంద్రియ వ్యాపారములనుగురించియు, పురుషకార మవశ్యమనియు, అహంకారముయొక్క ప్రభావమిట్టిదనియు, తృష్ణ సంగము అను వానినిగురించియు, మనోభావములను గురించియు (మనోభావము లనగా Emotions), 'చిత్తమేవ నరః', 'మన ఏవ నరః' అనువానిని గురించియు, కామక్రోధలోభముల సామర్థ్యమునుగురించియు, రాగ ద్వేషములనుగురించి, ఆర్జవము మొదలగు దైవీసంపద్గుణములను గురించియు, ముఖ్యాంశములు మాత్రము చెప్పబడినవి. విపులముగా వ్రాయవలసినయెడల గ్రంథవిస్తరమగునని భయబడి ఈ అధ్యాయ మును ఇంతటితో చాలించి కామాదిషట్కము శమాదిషట్కము అను షట్కద్వయమునుగురించి వ్రాయుటకుగా నాలుగవ అధ్యా యము ప్రారంభించబడుచున్నది.

ఈ షట్కద్వయము ప్రవృత్తి నివృత్తి మార్గములు అను ముఖ్యాంశమునకు అంతర్భాగములు గనుక నాలుగవ అధ్యాయ మునకు "ప్రవృత్తి నివృత్తి మార్గములు" అని పేరు.

---

## ౮ వ అధ్యాయము

### ప్రవృత్తి నివృత్తిమార్గములు

జీవాత్మ తనయొక్క వికాసమునకుగా అనుభవములను సంపాదించవలయునని పాంచభౌతికప్రపంచమునందు ప్రవేశించి క్రమముగా శూద్రుడు వైశ్యుడు క్షత్రియుడు బ్రాహ్మణుడు అను నాలుగు వర్ణములయందును వరుసను జన్మించి ఆ యా వర్ణములయొక్క ధర్మములను ఆచరించి ఆరీత్యా అనుభవములను సంపాదించుకొనును. ఈ విషయము శ్రీ మహాభారతము, ఆనుశాసనికపర్వము, ఇరువదియెనిమిదవ అధ్యాయమునందు బహువివరముగా చెప్పబడియున్నది. ఆ శ్లోకములను గ్రంథవిస్తరభీతిచేత నిక్కడ వ్రాయలేదు.

చాతుర్వర్ణ్యముయొక్కయు బ్రహ్మచర్యాది నాలుగు ఆశ్రమములయొక్కయు గుణములను శీలములనుగురించి 'ఆత్మవిచారము' అను గ్రంథమునందు విపులముగా వ్రాయబడియున్నది. కనుక ఇక్కడ వ్రాయలేదు. ఇచ్చట ముఖ్యాంశములను గురించిమాత్రము సంగ్రహముగా వ్రాయనగును. ద్విజజన్మములను అందిన జీవాత్మలకు పూర్వమీమాంసశాస్త్రము మొట్టమొదట అభ్యాసమునకుగా మహీపీఠమువారు నిర్ధారణచేసి "అథాఽతోధర్మజిజ్ఞాసా" అను వాక్యముతో ప్రారంభించి కర్మకాండను తెలియపరచిరి. మోక్షమునకు ప్రయత్నముచేయు స్థితికివచ్చినవారికి "అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా" అని వేదాంతశాస్త్రములను ఉపదేశించియున్నారు. జ్ఞానమువల్లనే మోక్షము కలుగునని "జ్ఞానాదేవ తు కైవల్యం" తెలియపరిచి జ్ఞానమును సంపాదించుటకు బహిరంగసాధనము కర్మగనుక అట్టి కర్మను పూర్వమీమాంసయం దుపదేశించిరి. "కరణైః క్రియమాణం

యత్ తత్ కర్మేతి ఉచ్యతే" అనగా స్రుక్ స్రువము మొదలగు ఉపకరణములచే చేయబడునది కర్మ. విహితము, ప్రతిషిద్ధము అని కర్మ రెండువిధములు. ప్రతిషిద్ధకర్మ పాపకర్మ యనబడును. విహిత కర్మ మరల మూడువిధములు. 1. నిత్యము, 2. నైమిత్తికము 3. కామ్యము అని.

"కామమయ ఏవాయం పురుషః" అను వాక్యప్రకారము ప్రవృత్తిమార్గము నాశ్రయించిన జీవాత్మకు కామము మొదటిగుణము. "కామ్యం తావ దభ్యుదయమాత్ర జనకం" స్వర్గము కావలెననియు ఐశ్వర్యము కావలెననియు చేయబడుకర్మలు కామ్యములు. కామ్యకర్మ చేయువారలు ధూమ్రాదిమార్గమున చంద్రలోకము అను వేరు వేరుగల స్వర్గలోకభోగమునకు పోదురు.

ధూమ్రాదిమార్గము అర్చిరాదిమార్గము అనునవి ఛాందోగ్యోపనిషత్తునందు వివరముగా చెప్పబడియున్నవి.

ముండకోపనిషత్తు, ప్రథమముండకము, ద్వితీయ ఖండమునందు "ఇష్టాపూర్తం మన్యమానావరిష్ఠం నాఽన్యచ్ఛ్రేయో వేదయంతే ప్రమూఢాః" అని చెప్పియున్నది. ఇష్టము అనగా "అగ్నిహోత్రం తపః సత్యం వేదానా ముపలంభనం। ఆతిథ్యం వైశ్వదేవం చ ఇష్టమిత్యభిధీయతే॥" అనగా యజ్ఞయాగాదులు, తపస్సు, సత్యము, వేదాధ్యయనము, అతిథిపూజ, వైశ్వదేవము మొదలగు పంచయజ్ఞములు ఇవన్నియు ఇష్టములు అనబడును. పూర్తము అనగా "వాపీకూప తటాకాది దేవతాయతనాని చ। అన్నప్రదానమారామః పూర్తమిత్యభిధీయతే॥" బావులు నుయ్యులు తటాకములు మొదలగు జలాశయములను లోకుల ఉపయోగమునకుగా త్రవ్వించుట, దేవాలయములు కట్టుట లేక జీర్ణోద్ధారము చేయుట మొదలైనవాటిని పూర్తము అందురు.

విహితములైన కామ్యకర్మలు స్వర్గాదిలోకములయందు భోగములను అనుభవించవలెనను నుద్దేశముతో చేయబడుటవల్ల కొంత మట్టుకు నిందితములు. పైనచెప్పిన ముండకోపనిషద్వాక్యము "ఇష్టాపూర్తం" అనుదానివల్ల మూఢులు కామ్యకర్మలను చేయుదురు

అని తెలియవచ్చుచున్నది. "దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ" అని శ్రీ కృష్ణభగవానులవారు ప్రస్తావవశాత్తుగా దూషించియున్నారు. కామ్యకర్మలనుచేయువారు విశేషధనోపపత్తిని కలిగియుంటేనేగాని సోమయాగము మొదలగు పశుబంధములను చేయకూడదు.

యస్య త్రైవర్షికం విత్తం పర్యాప్తం భృత్యవృత్తయే ।
అధికం వాఽపి విద్యేత ససోమం పాతుమర్హతి ॥
(మనుధర్మశాస్త్రము)

త్రైవార్షికాదధికాన్నో యః సహ సోమం పిబేద్ద్విజః ।
(యజ్ఞవల్క్య)

పుణ్యాన్యన్యాని కుర్వీత శ్రద్దధానో జితేంద్రియః ।
న త్వల్ప దక్షిణైర్యజ్ఞైః యజేతా థ కథం చన ॥
ఇంద్రియాణి యశస్స్వర్గం ఆయుః కీర్తిం ప్రజాః పశూన్ ।
హంత్యల్ప దక్షిణో యజ్ఞః తస్మాన్నాఽల్పధనో యజేత్ ॥

ఇట్లు మిక్కిలి ధనవంతులే సోమయాగము మొదలగు పశుబంధములను చేయతగును. సోమయజ్ఞమును చేయనియెడల దోషములేదు. "విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణం। శ్రద్ధాదిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥" అని శ్రీమద్భగవద్గీతయందు చెప్పబడియున్నది. ఫలమునుకోరి చేయబడుటవల్ల యజ్ఞాదికర్మలు రాజసస్వభావములు. చాలినంత దక్షిణ, అన్నదానము ఇట్టివి లేనందువల్ల తామసకర్మలు. ఇట్టి కర్మలు నిత్యములునుగావు. చేయనందువల్ల ప్రత్యవాయము ఏమియులేదు. అయినను కామముచే ప్రేరేపింపబడి జనులు భిక్షమెత్తియైనను యజ్ఞయాగాదికర్మలను చేయుటకు ప్రయత్నపడుచున్నారు. ముఖ్యాంశము కామము.

నైమిత్తిక కర్మలు, కామ్యకర్మలు వీటిని వదులుకొని నిత్యకర్మలను గురించి విచారింతము. నిత్యకర్మానుష్ఠానమువల్ల సంస్కారము జరుగుట ఒక ప్రయోజనము, ఇందుకు స్మృతులయందధికారములున్నవి. రెండవప్రయోజనము వివిదిషా జనక పక్షము. ఇందుకు శ్రుతులయందధికారములు ఉన్నవి.

ప్రవృత్తి మార్గమునందు నిత్యకర్మలయందు నలువది సంస్కారములు విధించబడియున్నవి.

౧. గర్భాధానం, ౨. పుంసవనం, ౩. సీమంతం, ౪. జాతకర్మ, ౫. నామకరణం, ౬. అన్నప్రాశనం, ౭. చౌలం, ౮. ఉపనయనం, వ్రతచతుష్టయం, ఉద్వాహం, పంచమహాయజ్ఞములు మొదలగునవి. ఇవి గౌతమసూత్రము, తృతీయప్రశ్నము, అష్టమ ఖండమునందు చెప్పబడియున్నవి.

సంస్కారములవల్ల స్మృతులయందు చెప్పిన యెనిమిది విధములైన ఆత్మగుణములు పుట్టును. ఆత్మగుణములు ఏవి అనగా "దయా సర్వభూతేషు క్షాంతి రనసూయా శౌచ మనాయసం మంగళం అకార్పణ్యం అస్పృహా చేతి". నిత్యకర్మలను శ్రద్ధతో చేయువానికి ఆత్మగుణములు లభించును. జీవాత్మల గుణవిభాగమును అనుసరించి నిత్యకర్మలను నియమించిరి. అందునుండి ఆత్మగుణములు జనించునవి. ఆ గుణములవల్ల జ్ఞానము సంపాదించుటకు ముఖ్యకారణమైన వివిదిషాసన్న్యాసమునందు అభిలాషకలుగును. కనుక సారాంశమునందు ఆత్మగుణములను సంపాదించుటకొఱకై నిత్యకర్మానుష్ఠానము. "కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే" అని చెప్పబడియున్నది. మెల్లగా ప్రకటనలేకయే ప్రవృత్తిమార్గమునుండి నివృత్తిమార్గము నవలంబించుటకు ఇది త్రోవ.

కర్మానుష్ఠానమునందు కొన్నివిధముల కర్మలవల్ల చంద్రలోక ప్రాప్తి (చంద్రలోకము స్వర్గమునం దొకభాగము), దేవలోక ప్రాప్తి, బ్రహ్మలోక ప్రాప్తి, ఇట్లు వేర్వేరు ప్రయోజనములు చెప్పబడియున్నవి.

శ్రీమద్భగవద్గీత అష్టమాధ్యాయమందు చెప్పియుండున దేమనగా

> శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే ।
> ఏకయా యాత్యనావృత్తిం అన్యయావర్తతే పునః ॥

అని రెండు మార్గములను "కృష్ణమార్గ" మనియు మరియొకటి "శుక్లమార్గ" మనియు చెప్పియున్నది. కృష్ణమార్గము ననుసరిం

చినవారికి పితృలోకప్రాప్తియు శుక్లమార్గము ననుసరించినవారు బ్రహ్మలోకమునకును పోదురనియు చెప్పియున్నది. ‘కృష్ణమార్గమును’ దక్షిణమార్గమనియు ధూమ్రమాదిమార్గమనియు వాడుటకలదు. “శుక్లమార్గ” మును ఉత్తరమార్గమనియు అర్చిరాదిమార్గమనియు ఇతరస్థలములలో వాడియున్నది.

ఈ మార్గములనే సవ్యాఽపసవ్యమార్గములు అందురు. ఈ మార్గములనుగురించి ఛాందోగ్యోపనిషత్తునందు, విష్ణుపురాణమునందు, వేదాంతసూత్రముల అద్వైతభాష్యమునందు, శ్రీమద్భగవద్గీతయందును మరియు ననేకస్థలములయందును వివరముగా వ్రాయబడియున్నది. అన్నిస్థలములయందును చెప్పియుండు విషయములయొక్క ముఖ్యతాత్పర్యము ఏమనగా శ్రౌతస్మార్తకర్మలే శ్రేయోదాయకములనియు అన్యములు శ్రేయస్కరములు కావు అనియు దలచి ఆ మార్గమునందే నడుచునట్టివారు (ప్రమూఢాః) పితృయానము అనునితర నామధేయముగల ధూమ్రమాదిమార్గముగుండా స్వర్గమునకు పోయి “క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి” అని అక్కడ నుండ తగినంతకాలముండి భూలోకమునకుగాని మరియు క్రిందిలోకములకుగాని వత్తురు అని ముండకోపనిషత్తునందు చెప్పియున్నది. ఇటుగాక తపస్సునందుగాని హిరణ్యగర్భాద్యుపాసనయందుగాని నిలిచి ఇంద్రియనిగ్రహము నభ్యసించిన వానప్రస్థులైనను సన్న్యాసులైనను లేక జ్ఞాననిష్ఠయందుండు గృహస్థులో, “సూర్యద్వారేణ తే విరజాః ప్రయాంతి యత్రా మృతః పురుషో హ్యవ్యయాత్మా” అను వచనప్రకారము సూర్యోపలక్షితమైన దేవయానమార్గమున పోయి కల్పాంతపర్యంతమైన హిరణ్యగర్భస్థానమైన సత్యలోకమునకు పోదురు. ఈ రెండు అభిప్రాయములును ముండకోపనిషత్తునందున్నవి. పంచాగ్నివిద్యోపాసకులు బ్రహ్మలోకమునకు పోదురని చెప్పబడియున్నది. అయితే జ్ఞానమార్గమును అనుసరించినవారు మాత్రము “బ్రహ్మణా సహ ముక్తిం” బ్రహ్మదేవునికి ముక్తికలుగుకాలమువరకు బ్రహ్మలోకమునందుండి బ్రహ్మతో సహ అంతకంటె పైలోకములకు పోదురు అనియు పంచాగ్నివిద్యోపాసకులు బ్రహ్మలోకమునందు

కల్పాంతమువరకుమాత్ర ముందురనియు శ్రోత్రకల్పము ఆరంభించ గానే బ్రహ్మలోకమునుండి భూలోకమునకు వచ్చువారనియు అద్వైత గ్రంథములయందు తెలియపరచబడియున్నది.

"శతం చైకా చ హృదయస్య నాడ్య స్తాసాం మూర్ధానం అభినిస్సృతై కా । తయోర్ధ్వ మాయన్ అమృతత్వ మేతి విష్వజ్ఞన్యా ఉత్క్రమణే భవన్తి" అని కఠోపనిషత్తునందు చెప్పబడియున్నది. అనగా హృదయమునుండి నూరు నాడులు బయలుదేరుచున్నవి. సుషుమ్నానాడి యొకటిమాత్రము ఊర్ధ్వమార్గమును పట్టి వెళ్లుననియు మరణకాలమందు హృదయపుండరీకమునందు నిలిచి హృదయమునుండి ఊర్ధ్వగామినియైన నాడిద్వారా శిరస్సును భేదించు కొనిపోవువారు "సూర్యద్వారేణ" "ఆభూతసంప్లం స్థావం అమృతత్వం హి భాష్యతే" అను అమృతత్వమునో లేక బ్రహ్మతోకూడ మోక్షమునో పొందుదురు. "న తస్య ప్రాణా ఉత్క్రామంతే అత్రైవ సమవానీయంతే" అను వచనము ఉత్క్రాంతి లేని విదేహముక్తులకు అన్వయించును.

ఈ పైచెప్పిన విషయములనుగురించి విష్ణుపురాణము, ద్వితీయాంశము, అష్టమోధ్యాయమునందలి శ్లోకములు కొన్ని ఈ క్రింద తెలియపరుచబడుచున్నవి.

పితృయాణము

ఉత్తరం యద గస్త్యస్య అజవీధ్యా శ్చ దక్షిణం ।
పితృయాణ స్స వై పంథా వైశ్వానరపథాత్ బహిః ॥
తత్రా సతే మహాత్మానః ఋషయో౽ గ్నిహోత్రిణః ।
భూతారంభకృతం బ్రహ్మ శంసంతః హి ఋత్విగుద్యతాః ॥
ప్రారంభంతే లోకకామా స్తేషాం పంథా స దక్షిణః ।
చలితం తే పునః బ్రహ్మ స్థాపయంతి యుగేయుగే ॥
సంతత్యా తపసా చైవ మర్యాదాభిః శ్రుతేన చ ।
జాయమానా స్తు పూర్వే తే పశ్చిమానాం గృహేషు వై ॥
పశ్చిమా శ్చైవ పూర్వేషాం జాయంతే నిధనే ష్విహ ।
ఏవ మావర్తమానా స్తె తిష్ఠం త్యాభూతసంప్లవాత్ ॥
సవితు ర్దక్షిణం మార్గం శ్రితా హ్యా చంద్రతారకం ।

దేవయానము

నాగవీధ్యుత్తరో య శ్చ సప్తర్షిభ్య శ్చ దక్షిణః ॥
ఉత్తరః సవితుః పంథా దేవయాన స్తు సః స్మృతః ।
తత్ర తే వశినః సిద్ధాః విమలాః బ్రహ్మచారిణః ॥
సంతతిం తే జుగుప్సంతి తస్మాత్ మృత్యుః జిత శ్చ తైః ।
అష్టాశీతిసహస్రాణి మునీనా మూర్ధ్వరేతసాం ॥
ఉదక్పంథానం అర్యమ్ణః శ్రితా హ్యా భూతసంప్లవాత్ ।
తే సంప్రయోగా ల్లోభస్య మైథునస్య చ వర్జనాత్ ॥
ఇచ్ఛాద్వేషప్రవృత్త్యా చ రాగద్వేషవివర్జనాత్ ।
పున శ్చాకామసంయోగాత్ శబ్దాదేః దోషదర్శనాత్ ॥
ఇ త్యేభిః కారణై శ్శుద్ధాః తేమృతత్వం హి భేజిరే ।
ఆభూతసంప్లవస్థానం అమృతత్వం విభావ్యతే ॥
త్రైలోక్యస్థితికాలో య మపునర్మార ఉచ్యతే ।
యావన్మాత్రప్రదేశే తు మైత్రేయాస్థితో ధ్రువః ॥
క్షయ మాయాతి తావ త్తు భూమే రాభూతసంప్లవే ।

విష్ణుపదము

ఊర్ధ్వోత్తర మృషిభ్యః తు ధృవో యత్ర వ్యవస్థితః ।
ఏత ద్విష్ణుపదం దివ్యం తృతీయం వ్యోమ్ని భాస్వరం ॥
నిర్ధూతదోషపంకానాం యతీనాం సంయతాత్మనాం ।
స్థానం తత్పరమం విప్ర పుణ్యాపాపపరిక్షయే ॥

ఈ గ్రంథము ఇరువదియేడవ పుటయందును ఇరువదియెనిమిదవ పుటయందును కొన్నివిషయములను గురించి ప్రవృత్తినివృత్తిమార్గములనుగురించి వ్రాయు సందర్భమున వ్రాయబడును అని చెప్పబడియున్నది. అందులో మొదటిది లోకాలోకపర్వతము.

లోకాలోకపర్వతము

మత్స్యపురాణము, వాయుపురాణము, శ్రీమద్భాగవతము, విష్ణుపురాణము మొదలగు గ్రంథములయందు భూలోకము, భువర్లోకము, స్వర్గలోకము అను మూడులోకములును కృతకములనియు జనలోకము, తపోలోకము సత్యలోకములనునవి అకృతకములు అనియు

"కృతకాకృతకయో ర్మధ్యే మహర్లోక ఇతి స్మృతః" అని విష్ణు పురాణము, ద్వితీయాంశము, సప్తమ అధ్యాయము, ఇరువదవ శ్లోకమునందును "మేఢీభూత స్సమ స్తస్య జ్యోతిశ్చక్రస్య వై ధ్రువః। ధ్రువాదూర్ధ్వం మహర్లోకః" అనియు అదే సప్తమ అధ్యాయమునందును చెప్పియున్నది. అష్టమ అధ్యాయమునందు మహర్లోకమే లోకాలోకపర్వతము అనునట్లు చెప్పియున్నది. శ్రీమద్భాగవతము ద్వితీయస్కంధమునందుకూడ వ్యాఖ్యానకర్త ఇట్లే చెప్పియున్నారు.

లోకాలోకపర్వతముపైన నలుగురు లోకపాలురు ఉన్నారని విష్ణుపురాణమునందును మత్స్యపురాణమునందు లోకాలోకపర్వతముయొక్క మధ్యన లోకపాలురు ఉన్నారనియు వార్లపేళ్లు సుధాముడు, హిరణ్యరోముడు, పర్జన్యుడు, కేతుమంతుడు అనువారు లోకరక్షకులై వసియించియున్నారనియు చెప్పియున్నది. కనుక సమన్వయమునకు లోకపాలురు మహర్లోకమునందున్నారని అర్థము.

శింశుమారచక్రము

"ఆధారభూత స్సవితుః ధ్రువో మునివరోత్తమ। ధ్రువస్య శింశుమారోసౌ సోపి నారాయణాశ్రయః॥" ఇది విష్ణుపురాణము, ద్వితీయాంశము, నవమాధ్యాయమందున్నది. "చక్ర మక్షే నిబద్ధం తు ధ్రువే చాక్ష స్సమర్పితః। సహ చక్రో భ్రమ త్యక్షః సహాక్షో భ్రమతి ధ్రువః॥" అని వాయుపురాణమునందును ఉన్నది. శింశుమార చక్రమునకు 'తారాచక్రం' అనియు 'జ్యోతిశ్చక్రము' అనియు పేళ్లు. అశ్వినిమొదలగు ఇరువదియేడు నక్షత్రములును నవగ్రహములును ధ్రువుడును తారాచక్రముఅను నపరనామధేయముగల శింశుమారచక్రముపైనున్నారు. చక్రముతిరుగునపుడు అందరును తిరుగుచున్నారు.

సూర్యఉదయాస్తమయములు

"దివసస్య రవి ర్మధ్యే సర్వకాలం వ్యవస్థితః" అనియు, "నైవాస్తమయ మర్కస్య నోదయ స్సర్వదా సతః" అనియు, "ఉద

యాస్తమయా ఖ్యా హి దర్శనాఽదర్శనం రవేః" అనియు, "గోళా కారాం భువం ఉపర్యధోభాగేన పృథివీం ప్రదక్షిణీయతా జ్యోతిశ్చ క్రేణ సార్ధం తత్తద్గ్రహాం శ్చ భూమ్యర్ధ మేవ ఆచ్ఛాదయతి, తేన ఉదయాస్తమయవైచిత్ర్యవ్యవస్థితం వదంతో జ్యోతి ర్విదోఽపి పౌరాణికరీత్యా ఉదయాస్తమయా (వదంతి)". (విష్ణుపురాణము) సూర్యుడు సర్వకాలములయందును ప్రకాశించుచున్నాడు. అస్తమనము లేదు. ఉదయమును లేదు. గుండ్రముగానుండు భూమిని జ్యోతిశ్చక్రముతోకూడి చుట్టివచ్చుటలో సూర్యుడు మొదలగు గ్రహములు మనకండ్లకు మొదట కానవచ్చుకాలము ఉదయకాలము అనియు మనకు కానరాలేకపోవుకాలముయొక్క ప్రారంభమునకు అస్తమనకాలమనియు పేళ్లు.

అజవీథి, నాకవీథి మొదలగువీథులు

విష్ణుపురాణము, మత్స్యపురాణము, యాజ్ఞవల్క్యస్మృతి, వాయుపురాణము మొదలగు గ్రంథములయందు నాకవీథి మొదలగు వీథులనుగురించి చెప్పియున్నది.

తత్రాష్టాశీతిసాహస్రా మునయో గృహమేధినాం ।
పునరావర్తినో బీజభూతా ధర్మప్రవర్తకాః ॥
సప్తర్షి నాకవీథ్యంత ర్దేవలోకం సమాశ్రితాః ।
తావంత ఏవ మునయః సర్వారంభవివర్జితాః ॥
తపసా బ్రహ్మచర్యేణ సంగత్యాగేన మేధయా ।
తత్ర గత్వా వతిష్ఠంతే యావ దాభూతసంప్లవం ॥

(యాజ్ఞవల్క్యస్మృతి—అధ్యాత్మప్రకరణము)

మఱియు విష్ణుపురాణమందు

ఉత్తరం యద గస్త్యస్య అజవీథ్యా శ్చ దక్షిణం ।
పితృయాణ స్స వై పంథా వైశ్వానరపథా ద్బహిః ॥
నాగవీథ్యుత్తరో య శ్చ సప్తర్షిభ్య శ్చ దక్షిణః ।
ఉత్తర స్సవితుః పంథా దేవయాన స్తు సః స్మృతః ॥

(విష్ణుపురాణము—ద్వితీయాంశము)

ఈ పైనచెప్పిన రెండు ఆకరములవల్ల అజవీథియు నాకవీథియు తెలియబడుచున్నవి. ఈ వీథులకును పితృయానము దేవయానము అనువాటికిని సంబంధమున్నట్లు తెలియవచ్చుచున్నది. మత్స్యపురాణమునందుకంటె వాయుపురాణమునందు వీథులు, మార్గములు, పితృయానము, దేవయానము అను నంశములు అధికవివరముతో చెప్పియున్నది. మత్స్యపురాణమునందు వీథులుమాత్రము చెప్పియున్నవి. మార్గములు కానరావు.

అశ్వినీ కృత్తికా యామ్యా నాగవీ థీతి శబ్దితా ।
రోహిణ్యార్ద్రా మృగశిరో గజవీ థ్యభిధీయతే ॥
పుష్యాశ్లేషా తథాఽ దిత్యా వీథీ చైరావతీ స్మృతా ।
ఏతా స్తు వీథయ స్త్విస్ర ఉత్తరోమార్గ ఉచ్యతే ।
తథా ద్వే చాపి ఫల్గున్యౌ మఘా చైవార్షభీ మతా ।
హస్త శ్చిత్రా తథా స్వాతీ గోవీ థీతి తు శబ్దితా ॥
జ్యేష్ఠా విశాఖో నూరాధా వీథీ జారద్గవీ మతా ।
ఏతా స్తు వీథయ స్తిస్ర మాధ్యమో మార్గ ఉచ్యతే ।
మూలా షాఢో త్తరాషాఢా అజవీ థ్యభిశబ్దితా ।
శ్రవణం చ ధనిష్ఠా చ మార్గీ శతభిష క్తథా ।
వైశ్వానరీ భాద్రపదే రేవతీ చైవకీర్తితా ।
ఏతాస్తు వీథయ స్తిస్రో దక్షిణోమార్గ ఉచ్యతే ।

ఈ ప్రకారము ఇరువదియేడు నక్షత్రములు మూడేసినక్షత్రములు ఒక్కొకవీథియు మూడువీథులు ఒకమార్గముగా విభజింపబడియున్నవి. దీని అర్థవిశేషములు మనకు తెలియవలసిన అవశ్యము కానరాదు. నాకును తెలియదు.

కామాదిషట్కము ప్రవృత్తిమార్గమునకు చేరినది. కామముచే ప్రేరేపింపబడి వస్తుసంగ్రహము చేయుచు ప్రకృతిలోమునిగినపుడు ప్రవృత్తిమార్గమును త్రొక్కుచున్నాడు అని పేరు. ప్రవృత్తియందు మునిగినవాడు బురదను తప్పించుకొని పైకిలేచుటకు ప్రయత్నముచేసినట్లు ప్రవృత్తిమార్గమును వదిలి నివృత్తిమార్గమును

కోరును. నివృత్తిమార్గయాత్రకు శమాదిషట్కమును అభ్యసించ వలసినది అత్యావశ్యకము.

అరిషడ్వర్గములో చేరినదైనను కామము హేయముకాదు. "ధర్మాఽవిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ" అని శ్రీమద్భగవద్గీతయందు చెప్పియున్నది. హేయస్వభావమును వదలిన కామము ఉన్నతమైనది. అదే భగవద్రూపమైనది అని పై చెప్పిన గీతావాక్యముయొక్క అర్థము. కనుక కామముయొక్క మూలమును విచారింతము. భగవచ్ఛక్తి త్రివిధము. జ్ఞానేచ్ఛాక్రియారూపకము. అందు జ్ఞానశక్తినే జ్ఞానయోగముగా నుపయోగింతురు. క్రియాశక్తి కర్మయోగముగా నుపయోగింపబడును. త్రివిధమైనశక్తి వ్యక్తతచెందునపుడు మొదట కామముగా నారంభించును. "సోఽకామయత" "కామమయ ఏ వాయం పురుషః" "కామస్తదగ్రే సమవర్తతాధి" "మనసో రేతః ప్రథమం తదాసీత్" ఇత్యాది శ్రుతివాక్యములున్నవి. వీని తాత్పర్యము ఏమనగా కామము మొదటపుట్టెను. దానినుండి మనస్సుపుట్టెను అని యర్థము. కామము సృష్టికి (బహుత్వమునకు) కారణము. "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ" (తైత్తిరీయము). నేను అనేకము అగుదును గాక అని కామమును వ్యక్తపరిచెను.

కామము వ్యక్తముకానుకాను అది తృష్ణ-తహ్న-అశనాపిపాస-లోకైషణ, ఈ ప్రకారముగా మారును. అందులోనుండి విత్తైషణ-దారానుతేషణ, పుత్రేషణ, బలఏషణ మార్పులు. ఇవి అన్నియు "బహుస్యాం" అను కామముయొక్క మార్పులు.

ఈ లోకమునందు "బహుస్యాం" కాలేనివాడు పరలోకమునందు "బహుస్యాం" అగుటకు ప్రయత్నపడును. పైనచెప్పిన విత్తేషణమొదలగునవి ఈ లోకమునందు "బహుస్యాం" అను కామముయొక్క మార్పులు. బహు అనగా అనేకము అని ఒక అర్థము. మరియొక అర్థము "పెక్కు" "గౌరవము" లేక "గురుత్వము" అనియు కలదు. ఉదాహరణము: "బహుభారము, బహూకరించుట" మొదలగునవి.

కామము

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।
పురుషః ప్రకృతిస్థోహి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్ ॥

(శ్రీ భగవద్గీత)

అవ్యక్తదశయందున్న విశ్వమును వ్యక్తదశకు తెచ్చినపుడు అదివరకును ఒకటిగానుండిన పురుషుడును ప్రకృతియు వేరు వేరుగా నేర్పడిరి. "బహుస్యాం" అను తలంపునకు ఇది సందర్భము. పురుషపరమంతయు పుల్లింగము. ప్రకృతిపరమంతయు స్త్రీలింగము. "స్త్రీపుంస ప్రభవం విశ్వం స్త్రీపుంసాత్మక మేవ చ" ఈ లోకము స్త్రీ పురుష సంయోగమువలన కలిగినది. స్త్రీపురుషరూపముగా నున్నది. అందువలన కామము ప్రథమమున పురుషప్రకృతి సంయోగ మపుడు కలిగినది. ఈ విషయము శివపురాణము, వాయుసంహిత, శ్రీమద్భాగవతము, ఈ పురాణములయందంతటను చెప్పబడియున్నది. ఇట్టి స్థితికే అవిద్య అని పేరు. సకల ద్వంద్వానుభవములకును కామమే మూలము. జంతువులకు సామాన్యధర్మములలో తమ శరీరములను కాపాడుకొనుట మొదటిది. ఈ కార్యమునందు జంతుసామాన్యమునకు ఒకరి నొకరు (ఒకటినొకటి) మ్రింగుటయు ఒకటితోనొకటి కొట్లాట పెట్టుకొనుటయు కల్లుకు ఒకటినొకటి జయించుటయుగా నున్నది. మృగప్రాయమునందు మృగమును మృగము చంపుట ధర్మము. ఇది శరీరపోషణార్థమే. నాగరికము అధికముకానుకాను అచేతన ద్రవ్యములను చేతనులు భుజింతురు. ఇదియు ఒకరినొకరు (ఒకటినొకటి) మ్రింగుటయేకదా. రెండవధర్మము "బహుస్యాం" అనగా తనవంటివారిని తాను సృష్టించవలెనను ఇచ్ఛ. ఈ ఇచ్ఛయందు రెండువ్యక్తులు పరస్పరము సమీపించి వ్యవహరించుట. శరీరపోషణార్థము విరోధము; వంశస్థాపనార్థము స్నేహము; శరీరపోషణార్థము వికర్షణ స్వభావముగల ప్రేమ; వంశస్థాపనార్థము ఆకర్షణరూపమగు స్నేహము; శరీరపోషణార్థము క్రోధము; వంశస్థాపనార్థము కామము.

ప్రజాతంతువు

వంశస్థాపనకుగా నారంభించిన కామము ప్రజాప్రాప్తికి పిమ్మట ఆ ప్రజయందు ప్రేమగామారును. తాను కనిన బిడ్డను ప్రేమించుట స్వభావము. కామప్రేరితమైనందున జనించినప్రజయందు కామము ప్రవేశించి ప్రేమగాపరిణమించును. అనగా ప్రేమఅనుగుణము కామము అనుగుణముయొక్క పరిణామమైనది.

ప్రతివ్యక్తియు జీవించవలెనని ఆశకొనియుండును. ఈ జీవితాశ వల్లనే ప్రజాతంతువును వృద్ధిచేసికొనును. తనకు సహాయార్థము గాను తన ప్రజయొక్క సహాయార్థమును పరివారమును కలుగచేసికొనవలసియుండును. ఆ పరివారముపైన ప్రేమయు తాను వారలకు స్వామిఅను భావమును ఆ స్వామిభావమునకు గురుతుగా ఔదార్యమును గలుగును. కనుక ఔదార్యము అనుగుణమునకు కామము కారణము.

భూతా వా వర్తమానా వా జనిష్యాశ్చాపి సర్వశః ।
కామాత్ సర్వే ప్రవర్తేతే లీయంతే వృద్ధిమాగతాః ॥
కామః సర్వమయః పుంసాం స్వసంకల్పసముద్భవః ।
వక్తుం న శక్యతే యచ్చ పరం చానుపరం చ యత్ ॥
ఆనంద మమృతం దివ్యం పరంబ్రహ్మ తదుచ్యతే ।
పరమాత్మేతి చాప్యుక్తం వికారాః కామసంజ్ఞితాః ॥

(శివపురాణము)

భూతభవిష్యద్వర్తమానములు అన్నియు కామమువల్లనే ప్రయత్నపడునవి. పుట్టుట, ఉండుట, చచ్చుట అన్నియు కామముయొక్క ప్రేరణయే. మనుష్యులకు వారివారి సంకల్పములవల్ల పుట్టినను కామము బహుబలముగలది గనుక ఈ కామము ఎపుడు ఏమిపనిని చేయునో చెప్పుటసాధ్యముకాదు. ఆనందమునకు కారణము గనుక ఆనందమయమైన బ్రహ్మము కామమే అనిచెప్పదగను.

సుప్తానాం జాగ్రతాంవాఽథ సర్వేషాం యో హృది స్థితః ।
నానావిధాని కర్మాణి కురుతే బ్రహ్మ తత్ మహత్ ॥

సర్వభూతాత్మ భూతాఖ్యా త్రిలింగా విశ్వరూపిణీ ।
కామ స్త్వేషా హి సా మూర్తిః బ్రహ్మవిష్ణ్వీశ్వరాత్మికా ॥
త్రివృత్ బ్రహ్మ తతో విశ్వం కామ శ్చేచ్ఛా త్రయం కృతం ।
స్పందో ప్యశక్యోయం ముక్త్వా కామః సంకల్ప ఏవ హి ॥

నిద్రించుచున్న వారియొక్కయు మేలుకొనియుండువారియొక్కయు అంతరింద్రియమునందు కామము వసియించుచు సర్వకార్యములను చేయించుచున్నది, "బహుస్యాం" అను కామముయొక్కఫలమే త్రిమూర్తులగు బ్రహ్మవిష్ణ్వీశ్వరాఖ్యులగు వ్యక్తులు. వారి వల్లనే కదా ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులును విశ్వమును కలిగినవి. కామప్రేరితము కాక యే (స్పందము) కదులుటయు లేదు.

ఔదార్యము మొదలగు ఉన్నతగుణములు కామమువల్లనే పుట్టినవి అని చెప్పబడియె. కామమే అడ్డగింపబడినపుడు కోపమును కలుగజేయును. తన ప్రయత్నమును సాగించుటకు ప్రయత్నము జరుపునపుడు కామమే లోభము అగును. తనప్రయత్నము అనుకూలించినపుడు కామమే మదముగా మారును. తాను సంపాదించిన వస్తువులను ఇతరులు అపహరించునపుడు కామమే మత్సరము అను గుణముగా వ్యక్తమగును. కామమువల్ల పుట్టినజీవి తేచ్చు ఏకాకిత్వ మును మాని బహుత్వమును పొందునపుడు కామము ఉన్నతపదవిని పొంది వాత్సల్యము, అభయప్రదానము అను గుణములుగామారును. వాత్సల్యము మొదలగు ఉన్నతగుణములు గలవాని కామమును ఎవ్వరైనను అడ్డగించినపుడు ముందువలె ప్రత్యేకరూపము లేనందున కోపము అను గుణమును పుట్టించక అసక్తి, వైరాగ్యము అను గుణములుగా మారును. అసక్తిగలవానికి ఇతరులు విరోధములు చేసినపుడు అతడు శమము అను గుణమునకు ఆస్పదము ఇచ్చును. అనగా అట్టివానియందు కామము శమముగా కనబడును. అందు నుండి జుగుప్సపుట్టును. కనుక మనకు ప్రత్యేకభావము ఉండినపుడు కామము ఎన్నిరోదుర్గుణములను పుట్టించును. మనము ఏకాకిత్వ మును వదులుకొనినపుడు, శాంతవైరాగ్యాది గుణములను సంపా

దించుకొనినపుడు అరిషడ్వర్గమునకు మొదటిదిగానుండిన కామము షట్సంపత్తికి మొదటిదైన శమముగా మారును.

> ఉత్పన్న ఆత్మావబోధస్య అద్వేష్టృ త్వా దయోగుణాః ।
> అయత్నతో భవం త్యస్య న తు సాధనరూపిణః ॥
>
> (వేదాంతసారము)

హేయములైన గుణములు ఉత్తమగుణములుగా మారుటకు ఆత్మ బోధయే ముఖ్యకారణము.

మనుష్యులకందరకును ఆకర్షణశక్తియొకటియు వికర్షణశక్తి యొకటియు ఉన్నవని ఇదివరకే చెప్పబడెను. ఈ అరిషడ్వర్గము పైకి

| ఆకర్షణ | వికర్షణ |
|---|---|
| 1. కామము | 1. క్రోధము |
| 2. లోభము | 2. మోహము |
| 3. మదము | 3. మాత్సర్యము |

అని రెండుతరగతులుగా విభజించవచ్చును. ఈ గుణములన్నియు అధికముగా నున్నపుడు మనుష్యుని వెఱ్ఱివానిగాను గుడ్డివానిగాను చేయును. కామాంధులు, క్రోధాంధులు, మదాంధులు, ప్రమాదము, ఉన్మాదము, ఇట్టి పేళ్లు ఈ గుణములు అధికముగా గలవారికి అన్వయించునవి.

ఆకర్షణ వికర్షణ అగు గుణములే ఇచ్ఛాద్వేషములుగా పరిణమించును.

> మునే రపి వనస్థస్య స్వాని కర్మాణి కుర్వతః ।
> ఉత్పద్యంతె త్రయః పక్షాః మిత్రోదాసీనశత్రవః ॥
>
> (మహాభారతము—శాంతి. 3 వ అధ్యా.)

వనమునందు వసించుచు ఇతరుల వ్యవహారములలో ప్రవేశించకయే తన కార్యములను మాత్రము చేసికొనుచు కాలముగడుపుచున్న మునికి కూడ వీడు నాకు మిత్రుడు, వీడు నాకు శత్రువును కాదు మిత్రుడును కాదు కనుక ఉదాసీనుడు, వీడు నాకు శత్రువు, అను

సంబంధభావములు పుట్టును. ఇవి ఆకర్షణ వికర్షణ శక్తులవల్ల కలుగునవి.

### కామాదిషట్కము, శమాదిషట్కము

అరిషడ్వర్గమైన (1) కామము, (2) క్రోధము, (3) లోభము, (4) మోహము, (5) మదము, (6) మాత్సర్యము అను శత్రువులకును శమాదిషట్కములోని (1) శమము, (2) దమము, (3) ఉపరతి, (4) తితిక్ష, (5) శ్రద్ధ, (6) సమాధానము అను సాధనషట్కమునకును ఒకవిధమైన సంబంధమును కనిపెట్టవచ్చును.

#### కామము

స్త్రీ పురుష ఆకర్షణయందు మనస్సు చీకాకులుగా లోబడుటకు ప్రతిగా శమము అను గుణమును చెప్పవచ్చును. శమమునందు మనశ్శాంతియు కామమునందు మనస్సుయొక్క ఉద్రేకమును కలవు. విరక్తి (వైరాగ్యమును) ని అభ్యసించినందుకు ఫలముగా శమము కలుగును. వైరాగ్యమును గురించి మననముచేసినందున నశ్వరములైన వస్తువులయందు జుగుప్స కలుగును. నశ్వరములను ఆకర్షించు గుణము పోయినపుడు మనస్సుయొక్క ఉద్రేకముమాని శాంతి కలుగును.

#### క్రోధము

నందు వేగము కనబడును. "కామక్రోధోద్భవం వేగం" అని గీతాశ్లోకమునందు ఉపయోగించబడి యున్నది. అట్టివేగమును చాలించినపుడు దమము అను గుణము పుట్టును.

#### లోభము

అనగా వస్తువులను సంపాదించవలయునను దాహము. ఇది చల్లారని అగ్ని. ఉపరతి మనస్సుపైనయు ఇంద్రియములపైనయు అధికారము నడిపి కోరినవస్తువులు దొరికినను దొరకకున్నను తన

మనస్సు చెదరక ఉంచుకొనుట. ఆ వస్తువులయందు ఉదాసీనభావమును పెంచుకొనుట. లోభమును అణగద్రొక్కినపుడు వస్తువులను ఆకర్షించుట అను గుణమునుమాని ఇతరులకు తనయొద్దనుండు వస్తువులను ఇచ్చుట అను సుగుణములు పుట్టును. అనగా దానము, త్యాగము, తపస్సు అనుక్రోశము (ఆక్రోశము చల్లపడినపుడు అనుక్రోశము), కరుణ కృతజ్ఞత (కృతఘ్నత లోభమువల్ల కలుగును. దమమువల్ల కృతజ్ఞత కలుగును), నమ్రత, శ్రద్ధ, విశ్వాసము, స్నేహము, భక్తి అను మంచి గుణములు ఒకటొకటిగా పుట్టును.

మోహము

అనగా సంపాదించిన వస్తువులు తనవేగాని యితరులకు హక్కులేదు అను దృఢతలంపుతో ఆ వస్తువులను పిచ్చివానివలె కరుచుకొని యుండుట. వదులుకొనుటకు ఇష్టములేక వానియందు పట్టుదల కలిగియుండుట. తన యిష్టములేనిదే ఆ వస్తువులను ఎవ్వరైనను అపహరించినయెడల అందువల్లకలుగు దుఃఖమును "నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు" అను గుణముతో సహించుకొనుట. తనకు ఇష్టములైన కార్యములుగాని అనిష్టములైన కార్యములుగాని సంభవించినపుడు ఎల్లపుడును సమచిత్తము కలిగియుండుట. సమచిత్తమనగా "దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః" అను వాక్యమునందు చెప్పినప్రకారము దుఃఖములు కలిగినపుడు మనస్సు విరిగిపోవుటయు సుఖములు వచ్చినపుడు ఉప్పొంగుటయు లేకుండుట. ఈ రీతిగా నడుచుటకు తితిక్ష అనిపేరు. తితిక్ష అనుగుణముచేత తనకు వస్తువులయందు కలిగియుండు పట్టుదల భ్రాంతి (మోహమును) వీటిని జయించవచ్చును.

మదము

అను దుర్గుణము తనకు అనుకూలముగా కార్యములుజరుగుచు వచ్చునపుడు "కోఽన్యోఽస్తి సదృశో మయా" నాతో సమానమెవ్వరు అని తోచునట్టి అహంభావము. ఇట్టి అహంభావమును పోగొట్టు

కొనుటకు ఉపాయము శ్రద్ధ అను సుగుణము. శ్రద్ధ అనగా ఇతరులుకూడ గుణవంతులు, ఐశ్వర్యవంతులుగా నున్నారు అను మొదలగు స్తోత్రములను వినునపుడు ఆ స్తోత్రములను నమ్ముట, అట్లు నమ్మితే తనవంటివారు ఎవ్వరుఉన్నారు అని తలచిన అహంభావమునశించి, తనవంటివారు ఇతరులున్నారు. తనకంటె నధికులుకూడ ఉందురు, అని తోచును. గనుక మదము అను చెడ్డగుణమునకు ప్రతిదైన మంచిగుణము శ్రద్ధ.

మాత్సర్యము

అను గుణమును పరిశీలించగా ఇతరుల మంచిస్థితినిచూచి ఓర్వలేమి. మరియు ముందు ఏకాలమందైనను ఇతరులు తనకంటె ఉన్నతమైనస్థితికివత్తురో ఏమో అని ఎల్లపుడును భయమును సందేహమును పొందియుండుట. ఈ దుర్గుణమును సమాధానము అను సద్గుణముయొక్క సహాయముతో గెలువవచ్చును. సమాధానము అనగా ప్రతివ్యక్తియు వానివాని కర్మయొక్క శక్తికిలోబడినవాడనియు వాడు క్రొత్తక్రొత్తగుణములనుగాని ఐశ్వర్యమునుగాని సంపాదించుట సాధ్యముఅనియు మనకంటె నెవ్వరైనను అధికమైన ఐశ్వర్యమును సంపాదించినపుడు ఓర్వలేమి అను దుర్గుణమును చూపకయే మనమును అట్టిదైనగాని అంతకంటె అధికమైనదిగానియగు ఐశ్వర్యము సంపాదించు శక్తిగలవారము అను విశ్వాసమును ముందిడికొని ధైర్యముగానుండవలయు. అపుడు మాత్సర్యము అను దుర్గుణమును సమాధానము అను మంచిగుణముచే గెలిచినవారమగుదుము.

ఇట్లు ప్రవృత్తిమార్గమునందు ఉత్తరోత్తర వృద్ధినికోరువారు కామక్రోధాదులను కొంతకొంతగా పరిశుద్ధపరుచుకొనవలయును.

ఇక నివృత్తిమార్గమునుగురించి వ్రాయబడును.

## నివృత్తిమార్గప్రవేశము

మహీపీఠమునందు ప్రకృతకాలమునందు నివృత్తిమార్గసంబంధమై జరుగు తారకదీక్షలయొక్కయు లోకోపాకారసేవయొక్కయు

వివరములనుగురించి శ్రీ లెడ్బీటరుగారు అనుగ్రహించి ఒక గ్రంథమును వ్రాసియున్నారు. ఇదివరకును లోకులకుగాని మహీపీఠమునందు ప్రకృతకాలమునందు శిష్యులను అంగీకరించి వారిని మహీపీఠమునందు చేర్చుకొను జీవన్ముక్తులు అనుగ్రహించిన శిష్యకోటికి గాని తెలిసియుండని అనేక తారకోపదేశవిధానములను ఆ గ్రంథమునందు బహిరంగపరిచి యున్నారు. మహీపీఠమునందు లోకోద్ధారతత్పరులై తమరు జరుపుచున్న లోకోపకారకార్యమునకు సహాయపరులుగా కాగలశక్తిని పొందినవారిని శిష్యులుగా అంగీకరించు జీవన్ముక్తులకు ఆంగ్లభాషయందు « మేస్టర్లు » అని దివ్యజ్ఞానసమాజమునందు వ్యవహారసాంకేతికనామము. లోకులలో జీవాత్మలు కొందరు శమాదిగుణ సంపన్నులగుచుండగా వారిని తగుమైన మార్గమునందు చరియింపచేయుటయు అట్లు చరించినపుడు ఆ ప్రవర్తనను చక్కపెట్టి ఋజుమార్గమునందు నడిపించి వృద్ధికి తెచ్చుటయు నిర్హేతుక జాయమాన కటాక్షమును వెదజల్లు మహనీయుల కార్యముగా నున్నది.

చీకటినిండిన లోకమునందు వెలుతురు స్వల్పమైనను ఏదో ఒక మూలయందు అతి ఆడంబరరహితమైన కుటీరమందుండినను చుట్టుప్రదేశమున నిండియుండు చీకటిని మించి ఆ వెలుతురు కనపడును కదా. అట్లు రజస్తమోగుణములనే ప్రకటించు స్వభావముగల లోకులమధ్య సత్త్వగుణము అను మిణుగురును కలిగి ఆ మిణుగురును కాలక్రమమున అతిప్రకాశవంతమైన కాంతివలె చేసికొనుటకు ప్రయత్నము చేయువారు లోకోద్ధారపరులైన మహీపీఠమువారికి కనబడుదురు. లోకోపకారతత్పరులై ఎల్లపుడును యోగ్యులయిన జీవాత్మలు ఎక్కడ నున్నారా అని ఆతురతతో వెదకుచున్న మహనీయులు చిన్నమిణుగురుయొక్క వెలుతురువలె సత్త్వగుణమును కలిగి దానిని వ్యక్తపరుచుకొనుటకు ప్రయత్నము చేయువారికి సహాయపడుదురు. వీరలు ఎడతెగక శిష్యాన్వేషణము చేయుచుందురు. శిష్యాన్వేషణతత్పరులై తమ ఉన్నతప్రదేశమునుండి నివృత్తిమార్గయాత్రచేయు శిష్యులకు తమను తెలిపించుకొనకయే పరోక్షమునందుండి సహాయముచేయువారు « మేస్టర్లు ». నివృత్తిమార్గము

నందు చాలదూరము అనుష్ఠానముచేసి దృఢపడునంతవరకును పరోక్షమునందుండి తన వృద్ధినిగమనించి తనకు ఏ యే కాలములందు ఏమి సలహాలు కావలెనో అట్టి సూచనలను పరోక్షముననుండియే శిష్యుని మనస్సునందు కలుగజేయుచున్న మేస్టరును శిష్యుడు జాగ్రదవస్థయందు కనుగొనడు.

లోకమునందు సాధారణజనుల వ్యవహార మేమనగా సత్స్వభావముగలవారు పరోపకారముచేయుచు ఉపకారము పొందినవానికి తమను ఎఱుంగించుకొనుటయు ఉపకారము పొందినవాడు ఉపకారికిచేయు కృతజ్ఞతాపూర్వక ప్రణామములను ఉపకారి అంగీకరించుటయు సాధారణముగా మనము చూచుచుందుము. కుడిచేతితోచేసిన సహాయము ఎడమచేతికైనను తెలియరాకనే ప్రకటనారాహిత్యమును అభ్యసించుచు పరోపకారముచేయు మహనీయులు కూడ లోకమునం దున్నారను సంగతి మనలో ననేకులకు తెలిసియున్నది.

మరియు పరోపకారము చేయునుద్దేశముతోనే లోకమునందు ఉండువారలు వారి సహజధర్మమైన పరోపకారమును జరిపినపుడు ఉపకారము చెందినవారిచేతి సత్కారమును ఎదురుచూడరుకదా. మరియు దాత ప్రతిగ్రహీత అని వేఱుభావమును అనగా పృథగ్భావమును మఱచి దాతకును ప్రతిగ్రహీతకును తాదాత్మ్యబుద్ధి వృద్ధి ఆయియుండగా దాత తన దాతృత్వమును ప్రకటించుకోడు అను రహస్యముకూడ లోకమునందు మనము చూచుచున్నాము. ఉపకారము చెందినవానికి తన కుపకారము చేసినవా రెవ్వరు అని కూడ తెలియకనే ఉపకారము చెందినవాడు తా నెవ్వరికి కృతజ్ఞత చూపవలెనో అనికూడ తెలియని సందర్భములుకూడ కలవు. మహీపీఠమునకుచేరిన ఋషులు లోకులకు ఎవ్వరి కెట్టి సహాయము అవశ్యమో అట్టి సహాయమును చేయుచుందురుగాని ఉపకారము చెందినవారు తమను కనుగొనుటకు వీలుకలుగజేయరు. ఉపకారము చేయుటయే తమ వ్రతము అని బ్రతుకుచున్న జీవన్ముక్తులు తమనుతామే మఱచి సహాయము చేయుచుందురు.

శాంతా మహాంతో నివసంతి సంతో వసంతవ ల్లోకహితం చరంతః ।
తీర్ణా స్స్వయం భీమభవార్ణవం జనా నహేతునాఽ న్యా నపి తారయంతః ॥

శాంతులును మహాత్ములునైనవారు లోకమునకు వసంతకాల మెట్లు ఎవరిప్రేరేపణయు లేక ఆనందము కలుగజేసి లోకహితమును కలుగ జేయునో అట్లు లోకోపకారార్థమే జీవించియున్నారు. తాము స్వ థాగా సంసారసాగరమును దాటి దుఃఖరహితులై ఆనందవారిధి యం దుండువారైనను సంసారమునందు మునుగుచు తేలుచునుండు ఇతరులను వారు ప్రార్థించకయే తరింపజేయుటకు సిద్ధముగానుందురు.

మహీపీఠమునకు చేరిన మహనీయులు అట్టి వారలు. సర్వా త్మైక్యభావముకలిగి దానిని అభ్యసించి దృఢపడిన వారే జీవన్ముక్తు లగుదురు. ఇతరులు జీవన్ముక్తులుగారు. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని దృశ్యప్రపంచము, అందలి చరాచరములు, మానవకోటి, అంద రును బ్రహ్మమే అని మననముచేసి నిదిధ్యాసనమునభ్యసించి, "అయ మాత్మా బ్రహ్మ", "అహం బ్రహ్మా స్మి" అను వాక్యములను మన నముచేసి అనుభవమునకు తెచ్చుకొన్నవారలకే సర్వాత్మైకత్వ జ్ఞానముకలుగును. వారే జీవన్ముక్తులు. మహీపీఠమునందు ఉండు వారు జీవన్ముక్తులే. మహీపీఠము జీవన్ముక్తసమాజము.

భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జన లోకము, తపోలోకము అను ఆరులోకములను మించి సత్యలోకము అని పేరుగల బ్రహ్మలోకమునుచేరి అచ్చట బ్రహ్మదేవునియొక్క అభీష్టమును జరుపుటయే వ్రతముగా జరుపుచుండువారు జీవన్ముక్తులు. వారి ముక్తియొక్క చిహ్నము సర్వాత్మైకత్వము అని ఇదివరకే చెప్పబడియున్నది. "సర్వేషు భూతే ష్వహ మేవ సంస్థితో జ్ఞా త్మనాఽం తః బహిః ఆశ్రయస్సన్" (వివేకచూడామణి—497) అనగా జీవన్ముక్తునియొక్క స్థితి సర్వభూతములను లోపల వెలుపల జ్ఞాతగా ఆశ్రయించియున్నాను అని ప్రతినిమిషమునందును తెలిసి కొనియుండుట. జీవన్ముక్తులు మోక్షముచెందినవారు. వివేకచూడా మణియందు "అఖండరూపస్థితి రేవ మోక్షః" అని 480 శ్లోక మునందు చెప్పియున్నది "సర్వశరీరేషు చైతన్యైకతానతా"

అని మండలబ్రహ్మోపనిషత్తునందు చెప్పియున్నది. సర్వశరీరముల లోనును ఒకటే చైతన్యముఅని అనుభవించువాడు జీవన్ముక్తుడు.

జీవన్ముక్తులు బ్రహ్మలోకమునందుచేరి బ్రహ్మతోసహా మోక్షము నొందుదురు. "బ్రహ్మణా సహా తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే । పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరంపదం" అని స్మృతి వచనము. బ్రహ్మలోకములోనున్నపుడు బ్రహ్మదేవునిచేత నియోగించబడు "లోకస్యాఽజ్ఞానశాంతయే" అను సేవ చేయుచు వసిష్ఠ మహర్షి మొదలగువారు మహీపీఠముగా నేర్పడినట్టు లోకమునందు నిండియున్న అజ్ఞానమును పోగొట్టుటకై అధికారమునుపొందిన ఆధికారికపురుషులుగా భూలోకమునందు చరించుచు సత్యలోక అనుభవమును ఆనందమును అనుభవించుచుందురు.

### ఆధికారికపురుషులు

మనుష్యలోకమునందు కొంచము కొంచముగా జ్ఞానమును సంపాదించి కుటీచక బహూదక హంస పరమహంసాది పదవులలోనైనను అట్టి గుర్తులు ఏర్పడకయే ఆ పదవులకు కావలసిన మనఃపరిపాకమును పొంది జీవన్ముక్తినిచెంది బ్రహ్మలోకమునకుపోయిన జీవాత్మలుకొందరు బ్రహ్మవేత్తలయ్యు మరల భూలోకమున శరీరధారులై జన్మించి లోకసేవచేయుదురు అని పురాణములయందు చదివియున్నాము. అపాంతరతముడు అను వేదాచార్యుడు విష్ణుదేవుని ఆజ్ఞచే లోకసేవచేయుటకుగా శ్రీ కృష్ణద్వైపాయన మహర్షి (వేదవ్యాసులు) గా జన్మించిరట. ఇంతకుముందు ఈ గ్రంథమునందు ౧౮ పుటయందు తెలియచేసియుండుప్రకారము వసిష్ఠమహాముని బ్రహ్మలోకమందుండినను బ్రహ్మదేవుని ఇచ్ఛప్రకారము, భూలోకమునందు అజ్ఞానమును తొలగగొట్టుటకుగా మనుష్యశరీరమును గ్రహించి పుట్టి పనిచేయుచున్నారు అని వినియున్నాము. భృగుమహర్షి మొదలగు బ్రహ్మమానసపుత్రులును లోకసేవచేయుచున్నారు అని వినుచున్నాము. శ్రీ సనత్కుమారులు బ్రహ్మదేవునియొక్క మానసపుత్రుడే అయ్యును ఈశ్వరునికి తానుగా వరమిచ్చి కుమారస్వామిగా

జన్మించిరట. వారేకదా మహీపీఠమునకు అధిపతిగానున్నారు. వీర లందరును వేదార్థవేత్తలనుట నిశ్చయము. శ్రీమద్భాగవతము షష్ఠ స్కంధమునందు చిత్రకేతువు ఉపాఖ్యానమునందు చిత్రకేతువునకు కనబడిరి అని చెప్పబడియున్నదని ఆత్మవిచారమునందు చెప్పబడి యుండు వారందరును బ్రహ్మవేత్తలే అయినను బ్రహ్మదేవుని అభీష్ట ప్రకారము వారికి ఇచ్చిన అధికారమునుపొంది భూలోకమునందు జను లకు జ్ఞానోపదేశముచేయుటకుగా సంచరించుచున్నారు అని చదివి యున్నాము. ఇట్లు బ్రహ్మలోకమునుండి బ్రహ్మదేవుని ఆజ్ఞచొప్పున అధికారమును వహించి భూలోకమునందు గూఢముగా సంచరించు చుండు మహనీయులకు ఆధికారికపురుషులు అనిపేరు.

ప్రారబ్ధకర్మ అనునది "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అనుభ వించితేనే క్షీణించును. జ్ఞానప్రాప్తివల్ల సంచితకర్మ ఆగామికర్మ అనునవి రెండును క్షీణించును. బ్రహ్మదేవుని ఆజ్ఞప్రకారము లోక మునందు అజ్ఞాననాశముచేయుటకు ఒప్పుకొనిరి కదా. ఆ ఒప్పు కొనుటయే ఆధికారికపురుషులకు తగులుకొన్న ప్రారబ్ధకర్మ. ఇట్టి ప్రారబ్ధకర్మ అనుభవించుటచేతనే అనగా జ్ఞానోపదేశముచేసి లోకుల అజ్ఞానమును పోగొట్టితేనే నశియించును.

ఆధికారికాస్తు పరమేశ్వరేణ తేషు తేషు అధికారేషు నియుక్తాస్సంతః సత్యపి సమ్యగ్దర్శనే కైవల్యహేతౌ అక్షీణకర్మాణః యావదధికార మవతిష్ఠంతే

పరమేశ్వరునిచేత నియమింపబడిన ఆధికారికపురుషులు జనులను తరింపజేయు పర్యంతమును తమ అధికారపదవిలోనే యుందురు.

సకృత్ప్రవృత్త మేవ హి తే అధికారఫలదానాయ కర్మాశయ మతి వాహయంతః స్వాతంత్ర్యేణ గృహాదివ గృహాంతరం అన్యం దేహం సంచరంతః స్వాధికార నిర్వర్తనాయ అపరిముషితస్మృతయః ఏవ దేహేంద్రియప్రకృతి వశిత్వాత్ నిర్మాయ దేహాన్ యుగపత్ క్రమేణవా అధితిష్ఠంతి।

వారికి జనసామాన్యమువలె కర్మవేగముచే శరీరత్యాగము చేయుట, మరల శరీరధారణము చేయుట అను నిర్బంధములు లేవు. స్వతం త్రులై ఒక గృహమునుండి మరియొకగృహమును ప్రవేశించువారి

వలె యోగశక్తిని ఉపయోగించి ఇపుడు ఉన్నశరీరము చాలినంత ఉపయోగకారిగా కానియెడల క్రొత్తశరీరమును నిర్మించుకొని ఆ శరీరమునందు నివసించి తాము ఒప్పుకొన్న అజ్ఞానశాంతి అను ఉద్యోగమును చేయుచుందురు. తమ కార్యమునకు ఒక శరీరము చాలకపోతే పదియాళ్లలో పది శరీరములను కల్పించుకొని అనగా నిర్మాణముచేసికొని అట్టి అనేకశరీరములతో ఏకకాలమునందే పని చేయుదురు. ఇట్లు నిర్మించుకొనబడిన శరీరవాసులకు నిర్మాణకాయులు అనిపేరు.

## నిర్మాణకాయము

శ్రీ పాతంజలయోగసూత్రములయందు కైవల్యపాదమునందు నాలుగవ సూత్రము "నిర్మాణచిత్తా న్యస్మితామాత్రాత్" అని యొక సూత్ర మున్నది. కైవల్యపదవిమైన సమాధిస్థితిని పొందిన వాడు తాను క్రొత్తబంధములను కలుగఁజేసికొను విధమున కర్మలు చేయడు. ప్రారబ్ధము నేమో అనుభవించి తీరవలయును. సంచిత ముగానుండు కర్మను ఇకముందు అనేకజన్మములయందు కొంత కొంతగా అరుగగొట్టవలసియుండును. అయితే అనేకజన్మము లెత్తి భూలోకమునందు వ్యవహారము జరుపుచు క్రొత్తబంధములను ఏర్ప రచుకొనక సంచితకర్మలను సమియజేయుటకు కాలయాపనము అవును. అది యిష్టము లేకయే త్వరగా బంధవిముక్తుడు కావలె నని యిచ్ఛయించవచ్చును. ఇట్లు త్వరగా బంధవిముక్తి పొందుటకు ప్రయత్నపడునట్టి యోగి సంకల్పబలముచే ననేక శరీరములను సృష్టిం చుకొనవచ్చును. ఈ శరీరములకు నిర్మాణకాయము లని పేరు. ప్రతినిర్మాణకాయమునందును ఒక చిత్తముంటేనే గాని ఆ నిర్మాణ కాయములు ఉపయోగపడవు. అసంఖ్యాకములైన నిర్మాణకాయ ములతో సంచితకర్మ సంబంధియైన సుఖదుఃఖానుభవమును సమయ కొట్టవలెనని ప్రతినిర్మాణకాయమునందును ఒకచిత్త ముండునట్టు లెక్కకుమీరినన్ని చిత్తములను సృష్టించుకొందురు. ఆచిత్తములు నిర్మాణచిత్తములు. అనేక నిర్మాణచిత్తములను సృష్టించుకొనిన

యోగి ఆ చిత్తములతో ఆ కాయములతో సంచితకర్మను అనుభవించి ఆ సంచితకర్మను అరుగకొట్టుకొనును. ఇందులో ముఖ్యాంశము యోగియైనవాడు తనకు కావలసినపుడు ఒక శరీరమునైనా బహుశరీరములనైనా నిర్మించుకోగలడు అని తెలిసికొనుటయే.

ఇంతకు పూర్వమే యోగసిద్ధి యొకటి సంపాదించబడి యుండును. "స్థూలస్వరూపసూక్ష్మాన్వయార్థవత్త్వసంయమా ద్భూతజయః" అను సూత్రప్రకారము భూతజయము సంపాదించబడి యుండును. భూతజయము అనగా పృథివి అప్పు తేజస్సు వాయువు ఆకాశము అను పంచభూతములను వాని వానికి సంబంధపడిన తన్మాత్రలను వాని ధర్మములను అన్నిటిని జయించుట. అందుకు ఫలము అణిమాది అష్టసిద్ధులు. భూతజయము అను శక్తిని సంపాదించి అణిమాదిసిద్ధులను సంపాదించిన కామరూపి తనకు ఇష్టమువచ్చిన శరీరము ఇష్టమువచ్చినపుడు ఇష్టమువచ్చిన తీరున సంకల్పించుకొని ఇష్టమువచ్చిన స్థలమున కొంతకాలమో దీర్ఘకాలమో నిలబడి యుండు శక్తిగలవాడగును.

ఇట్లు కల్పించుకోబడిన శరీరమునకు నిర్మాణకాయము అని పేరు. కాయము అనగా శరీరము. శరీరము స్థూలము, సూక్ష్మము, అను భేదములు కలిగియుండును. అందులో సూక్ష్మశరీరము అనునది అనేక విధములైన సూక్ష్మత్వ (సౌక్ష్మ్య) తారతమ్యములు కలిగి యుండును. శ్రీయోగవాసిష్ఠము, ఐందవోపాఖ్యానమునందు జగత్తునందు అందరికిని

సర్వ ఏవ జగ త్యస్మిన్ ద్విశరీరా శ్శరీరిణః ।
ఏకం మనశ్శరీరం తు క్షిప్రకారి సదా చలం ॥

రెండు శరీరములు కలవు అని చెప్పబడియున్నది. కాయమును నిర్మించుకొను శక్తిగలవారు మనశ్శరీరమును నియమించుకొని ఆ శరీరముపైన స్థూల అణువులతో కవచమువలె పూతపూసికొని తాము ఎవరికి దర్శనము నియ్య తలచుదురో అట్టి శిష్యులకు "దృగ్గోచరస్థ" అని స్థూలదృష్టికి కనబడుదురు. ఈ విధమున దృగ్గోచరులై

తమయొక్క నిర్మాణ (మనః) కాయమునందు నిర్మాణచిత్తముతో వ్యవహారములను జరుపుదురు.

దివ్యజ్ఞానసమాజపు గ్రంథములయందు ఈ నిర్మాణ (మనః) కాయమును "మాయావిరూపము" (Māyāvirupa) అందురు. మాయావిరూపమును ఉపయోగించి మహాత్మగురువులును వారి ముఖ్యశిష్యులును లోకులకు సేవచేయుదురు. సహాయముచేయుదురు. వీరలకే "అదృశ్యసహాయులు" అనిపేరు. మనమందరమును యత్కించిత్తుగా నిర్మాణకాయములను సృజించుకొని సూక్ష్మలోకములయందు అదృశ్యసహాయులుగా కైంకర్యముచేయవచ్చును. ఈ శక్తిని మనము ఉపయోగించి ఇతరులకు ఉపయోగపడుటకు ముఖ్యముగా సర్వాత్మైకత్వ దృష్టియుండవలెను.

మాయావిరూపమును ఉపయోగించువారు రెండు విధములుగా నుపయోగింతురు. యోగానుష్ఠానమునందు సమాధిదశకువచ్చి ("సమాధిస్థానకం గత్వా" "మానుషీ మానుషం దేహం త్యక్త్వా బభ్రామ సా తదా" "ఆకాశదేహే అపి తే మిథోఽత్ర" మనుష్యదేహమును యోగగృహమునందువదిలి ఆకాశదేహముతో యథేష్టముగా సంచరించుట ఒకవిధము. లేక పైనవివరించినరీతిన నిర్మాణ (మనః) కాయముతో సంచరించుట మరియొకవిధము. మనవంటి వారలము మన స్థూలశరీరములు శయనించియుండుకాలమందు స్థూలేతరశరీరములతో యథేచ్ఛముగా దిక్కాలాది నిబంధనలను కొంతమట్టుకు సరకుచేయకయే లోకమునందు సంచరించవచ్చును. ఆ సమయమునందు దూరమునుగాని శరీరశ్రమనుగాని అనుభవించవలసిన అవశ్యముండదు. మదరాసులో నివసించువారు తమ స్థూలశరీరమును మదరాసులో నిద్రపోగొట్టి లండను పట్టణమునందో లేక జపాను ఇత్యాదిదేశములయందో మరునిమిషమున కార్యస్థానములను నిర్ధారణచేసికొని "యం యం భావం మనసా సంవిభాతి" అనినట్టు ఇష్టమువచ్చినప్రకారము కైంకర్యముచేయవచ్చును. అయితే అక్కడివారలకు స్థూలదృష్టికి కనపడుట సాధారణముగా మనవంటి వారికి సాధ్యపడదు.

యోగసిద్ధులైన జీవన్ముక్తులు తమ నిర్మాణకాయములతో గాని ఇతరవిధములైన సూక్ష్మదేహములతోగాని భక్తులసంతోష మునకుగా ఆవిర్భవించునపుడు తాము ఎవరికి దృగ్గోచరులు కావలె నని యిచ్ఛయింతురో వారలకుమాత్రము తాము దృశ్యులగుదురు. అనుగ్రహించబడినవారి సమీపమునందున్న యితరులకు కనబడరు. ఈ విధమున ఇతరులకు అదృశ్యులుగా అగుటయు నొక యోగ సిద్ధియే. నిర్మాణ (మనః) కాయముతో భక్తులకు దర్శనమిచ్చు నపుడు ,, అనావరణాత్మకే ప్యాకాశే భవత్యావృత్తకాయః సిద్ధానా మ ప్యదృశ్యో భవతి". ఆవరణరహితమైన ఆకాశమునందు సం చరించునపుడు సిద్ధులకుకూడ అదృశ్యుడగును. ఇది ఈశితృత్వం లేక ఈశత్వం అని చెప్పబడును. ఇది అణిమాది అష్టైశ్వర్యములలో నొకటి. శ్రీమద్భాగవతము, షష్ఠస్కంధమునందు చిత్రకేతూ పాఖ్యానమునందు చిత్రకేతువు తన పుత్రుడు చనిపోయినందున దుఃఖాక్రాంతుడై మూర్ఛచెందియుండగా నతనికి ఋషులు దర్శన మిచ్చినపుడు ,, కౌ యువాం యోగసంపన్నౌ మాహిష్ఠౌ చ మహీ యసాం। అవధూతేన వేషేణ గూఢా విహ సమాగతౌ" అని చిత్రకేతువు అడుగుచున్నాడు. అందు గూఢా అను పదము పైవివ రించిన అర్థమును సూచించుచున్నది. ఈ కాలమందును నిర్మాణ (మనః) కాయమును నిర్మాణచిత్తమును ఉపయోగించువారు సాధా రణమనుష్యమాత్రులవలె నుండువారు కలరు.

బ్రహ్మలోకవాసము అనగా నేమి. సాధారణజనులు స్థూల శరీరమే జీవాత్మ అని నమ్మియుందురు. ఇది గ్రామ్యబుద్ధి. ప్రతి మనుష్యుడును దేహమునుధరించిన జీవాత్మ అని మొట్టమొదట నిశ్చయజ్ఞానమును సంపాదించుకొనవలయును. నేను, నా దేహము అను అహంతను మమతను వదిలి కర్తను శరీరమునుండి వేరుపడిన వానినిగా నిశ్చయజ్ఞానమును పొంది ఆ భావము రూఢిపడునట్లుగా అభ్యాసము చేయవలయును. జ్ఞాననిష్ఠకు ఈ నిశ్చయజ్ఞానము పునాది. సాధారణజనునియొక్క శరీరము భూలోకమునందు సంచరించుచుండి నను వాని సంవిత్ (తెలివి, లేక నేను అను భావము) తరుచుగా

భువర్లోకమునందు వ్యవహరించుచుండును. ఇది చాల సూక్ష్మమైన అంశము. ఈ భావము దృఢబడుటకుగా ఈ విషయమును మరికొంత నొక్కి చెప్పవలెను.

### క్షేత్రక్షేత్రజ్ఞులు

శ్రీమద్భగవద్గీత పదుమూడవ అధ్యాయమునందు జీవాత్మ క్షేత్రజ్ఞుడు అనియు శరీరము క్షేత్రము అనియు చెప్పబడియున్నది. అయిదవ శ్లోకము మొదలు క్షేత్రము వర్ణించబడియున్నది. సుబాలోపనిషత్తునందు భూతాత్మ, ఇంద్రియాత్మ, సంకల్పాత్మ ఇత్యాది నామములతో శరీరముల అధిదేవతలను వివరించియున్నది. ఇన్నిటికిని విలక్షణుడు జీవాత్మ. ఇంద్రియవ్యాపారములు భువర్లోకమునకు చేరినవి. ఇంద్రియవ్యాపారములలో జీవాత్మ ఉండునపుడు అతని స్థూలశరీరము భూలోకమునం దున్నను అతడు భువర్లోకమునందు సంచరించుచున్నాడు అని యర్థము. తరువాత మనస్సును ఉపయోగించి తానుచేసిన శ్రవణముయొక్క విషయమును మననముచేయునపుడు సంకల్పాత్మ అనబడును. అనగా మనస్సుతో వ్యవహారము చేయుచున్నాడు అని యర్థము. ఇంద్రియవ్యాపారములు భువర్లోకమునకు సంబంధించినట్లు మనస్సు స్వర్గలోకమునకు సంబంధించినది. కనుక మననవ్యాపారము జరుపునపుడు స్థూలశరీరము భూలోకమునందుండినను ఆ స్థూలశరీరధారియగు జీవాత్మ మనోమయలోకము అయిన స్వర్గలోకమునందు సంచరించుచున్నాడు. ఒక్కొకలోకమునకు ఒక వ్యాపారము కలదు. ఆ యా వ్యాపారమును చేయువాడు జీవాత్మయే. కండ్లకు గోచరించునది స్థూలశరీరమే. కనుక నేత్రేంద్రియగోచరమైన స్థూలశరీరము భూలోకమునందు ఉండినను స్థూలశరీరధారి అయిన జీవాత్మ ఏ సమయమునందు ఏ లోకవ్యాపారము చేయుచుండునో ఆ లోకమునందు ఉన్నాడు అనవలయును. నివృత్తిమార్గముయొక్క నియమములను ఆనుభవించుచు మెట్టుమెట్టుగా అమానిత్వము అదంభిత్వము అని వర్ణింపబడియుండు గుణములను అభ్యసించి స్థిరపరుచుకొనిన జీవాత్మ సూక్ష్మలోకములయందు వసి

యించుచున్నాడు అని చెప్పవలయును. దేహము అనగా స్థూల దేహము భూలోకమునందే సంచరించుచుండును. జీవాత్మ ఏమో సూక్ష్మలోకములలో సంచరించుచుండును అను నిశ్చయజ్ఞానముతో ఆ భావమును అభ్యసించి స్థిరపరుచుకోవలెను.

లోకములన్నియు ఒకటితోనొకటి పెనగొనియున్నవి అని "ఓతం ప్రోతం" అను సంజ్ఞావాచకమును ఆత్మవిచారము అను గ్రంథమునందు ఉపయోగించి యున్నాము. ఒక లోకమును విడిచి మరియొకలోకమునకు పోవుట అనగా స్థలాంతరమునకు పోవుట కాదు. స్థిత్యంతరమును మాత్రము పొందుట అని తెలిసికొనవలయును. ఈ విషయము ఆత్మవిచారమునందు విపులముగా వ్రాయబడియున్నది. అచ్చట జైగీషవ్యోపాఖ్యానము చెప్పబడియున్నది. ఆత్మవిచారమునందలి అ భాగమును ఇచ్చట వ్రాయుట అవశ్యముకాదు అని వ్రాయలేదు.[1]

కనుక జీవన్ముక్తులు బ్రహ్మలోకవాసులు అనునపుడు వారల స్థూలశరీరములు భూలోకమునందే ఉండును అనియు వారు అనగా జీవాత్మలు (క్షేత్రజ్ఞులు) బ్రహ్మలోకమునందు వ్యవహరించుచుందురు అనియు భావము.

మహీపీఠమునకుచేరిన మహనీయులు తరుచుగా రాజర్షులు అనబడుదురు. లోకమునందు ప్రబలియున్న అజ్ఞానమును నశింపజేయుటకు రాజరికకార్యములనుకూడ చక్కపెట్టవలెను.[2] కనుక మహీపీఠములో కొందరు లోకమును చక్కగా పాలించుటకుగా లోకమును తమలో తాము ఒకరొకరు ఒక్కొక దేశమునకు కావలసి యోగక్షేమములనంతయు భాగించుకొందురు. ఏ దేశమునకు ఏ కాలమునందు ఎట్టిరాజు ఉండవలెనో ఎట్టి విద్యలు అవశ్యమో ఏ విధమున ఏ జనాంగము ఒక్కొక గుణముగా గుణములనన్నిటిని నేర్చుకొని శీలమును చక్కపెట్టుకోవలెనో అందుకుగా ఏ యే అధి

[1] ఆత్మవిచారము చూడుడు.

[2] ఈ గ్రంథము ౧౬౭ వ పుటయందు "జ్ఞాత్వా రాఘువ రాజానః పరాం నిర్వృతిం గతాః" అను అంశమును చూడుడు.

కారి ఏవిధముగా యుక్తులు పన్నవలెనో ఇది మొదలుగా గల వివరముల నన్నిటిని నెలకొల్పుచు తమమట్టుకును తాము ప్రచ్ఛన్న వృత్తియందుండి తమ కార్యార్థముగా నేర్పరిచిన వ్యక్తులగుండా (ప్రతినిధులగుండా) కార్యము జరుపుచుందురు. వ్యక్తులుచేయుకార్యములను ఎందుకుగా ఈ కార్యమును ఈ విధముగా చేయుచున్నాను, నేనే స్వబుద్ధితో చేయుచున్నానా లేక ఎవరిప్రేరణచేతనైనా చేయుచున్నానా అని ప్రతినిధులు సందేహించుటకుకూడ వీలు ఉండదు.

ప్రకృతకాలమునందు ఏ యే దేశములలో జన్మించితే ఆ యా దేశములందలి కార్యములు చక్కగా జరుగునో అట్లు ఆయా దేశములయందు జీవన్ముక్తులు జన్మించి ఆయా దేశముల వేషభాషలుగలవారై జీవన్ముక్తులు లోకసేవచేయుచున్నారు. జీవన్ముక్తులకు జాతి నీతి కులగోత్ర నామధేయములు గణనయే లేదు. ఇవన్నియు శరీరములకేగాని ఆత్మకుకాదు. వారలు కర్మవశమున కార్యక్రమమును జరుపువారు కదా. ధర్మవ్యాధుడు, తులాధరుడు, విదురుడు మొదలగు జ్ఞానులు బ్రాహ్మణశరీరములుగాక ఇతరజాతి శరీరములను ధరించియుండినటుల పురాణములలో చదువలేదా. కనుక దివ్యజ్ఞానసమాజమునందు పనిచేయు అగ్రగణ్యులగు బెసంటమ్మగారు, లెడ్బీటరుగారు మొదలగువారు కొందరు జీవన్ముక్తుల పేళ్లను తెలియచేసినపుడు మన పురాణములలో మనము వినిన ఋషులపేళ్లు వినరాలేదే అది యెందుకు అని కొందరు శ్రద్ధాళువులుకూడ సందేహించిరి. దివ్యజ్ఞానసమాజపు గ్రంథములయందు చాలమట్టుకు బౌద్ధమతమునందు ఋషులకు ఉపయోగింపబడినపేళ్లు కనబడుచున్నవి. దివ్యజ్ఞానసమాజమును స్థాపించిన మ్యాడం బ్లావట్‌స్కీగారు తాను ఏ మహనీయులను ఆశ్రయించి సమాజమును స్థాపించిరో ఆ మహనీయులు చాలమట్టుకు టిబెట్టుదేశమునందు వసించియున్నారు. హిమవత్పర్వతమునకు ఉత్తరముననుండు దేశమునకు టిబెట్టుదేశము అని పేరు. ఇది మనపురాణములయందు ఉత్తరకోసలదేశము అని వాడబడియున్నది. కాశీదేశము ఉత్తరహిందూస్థానమునందున్నది.

కాశీపట్టణము మహాత్మ్యమున ప్రఖ్యాతి చెందియున్నది. దక్షిణ దేశమున అట్టి మాహాత్మ్యముకల స్థలము ఏదైననుండినయెడల ఆ స్థలమునకు దక్షిణకాశి అను పేరు వ్యవహారమునందు కనబడుట మనకు తెలిసినవిషయమే. అట్లే హిమవత్పర్వతమునకు దక్షిణమున నున్న కోసలదేశము, మగధదేశము మొదలుగాగల ప్రఖ్యాతినొందిన దేశములకు ప్రతిగా నుత్తరకోసలము ఉత్తరమగధము అనుపేళ్లు మన పురాణములందు కానవచ్చుచున్నవి. హిమవత్పర్వతమునకు ఉత్తరమున కొన్ని దేశములు ఉన్నట్టు మనపురాణములలో కనుపరచి యున్నది. అట్టి ఒక దేశమునకు టిబెట్టు దేశము అని ఈ కాలము నందు పేరు. పురాణములలో ఉపయోగించిన పేళ్లు ఇపుడు మారి పోయినవి. అచ్చటి మతము బౌద్ధమతము. అచ్చటిభాష టిబెటన్ భాష. కనుక అచ్చట ఆశ్రమములను కల్పించుకొని కాపురముండు శరీరములకు టిబెటన్ నామధేయములేకదా యుండవలెను. వారలు ఆర్యులై జీవన్ముక్తులై ఆర్యజనాంగపు పేళ్లువహించి యుండినవారలయ్యును ప్రకృతకాలమునందు టిబెటను దేశ సరిహద్దులలో నుందురు గనుక వారలపేళ్లు టిబెటనుపేళ్లుగా వ్యవహారమందు ఉండును. హస్తినాపురమునందు అవతరించియుండిన దేవాపి అను రాజర్షి యిపుడు టిబెట్టుదేశమునందు ఉన్నారు. అచ్చటి నామరూపవేష భాషలు కలవారై ఆ దేశపు నామధేయమైన “కుట్ హూమి” అను పేర వ్యవహరింపబడుచున్నారు. ఇదేవిధముగా మన పురాణముల యందు (శ్రీమద్భాగవతమునందు) సూర్యవంశపు రాజర్షి “మరు” అను ఇక్ష్వాకువంశజులు ప్రకృతము టిబెట్టు దేశపు ప్రాంత్యములో ఆశ్రమముచేసికొని యుండుటవలన ఆ దేశపు నామధేయమైన “మోర్యా” అను పేర వ్యవహరించబడుచున్నారు. ఇదే విధముగా టిబెటన్ పేరుతో నొక ఋషి “జ్వాల్ కూల్” (జ్వాలాకుల) అను నొక ఋషికలరు. “సిరాపిస్” అను పేరుతో ఈజిప్టు దేశమందు ఒక ఋషికలరు. క్రీస్తుమతమునందలి నామధేయములతో “వెనీషను” “హైలారియన్” “రాగోసి” “జీసను” అను మహర్షులు కొందరు ఇదివరకును ప్రస్తావించబడియున్నారు. కనుక

జాతి నీతి కులగోత్ర దూరగం నామరూప గుణదోష వర్జితం ।
దేశకాల విషయాతివర్తి యత్ బ్రహ్మ తత్త్వమసి భావయాఽత్మని ॥
(వివేకచూడామణి—256)

జాతి, నీతి, కులము, గోత్రము, నామము, రూపము, గుణము, దోషము, దేశము, కాలము, విషయము, ఇవన్నియు లేని బ్రహ్మస్వరూపమును పొందిన జీవన్ముక్తులు తాము చేయుటకు నిశ్చయించుకొనిన కార్యమును ఉద్దేశించి ఎప్పటికి ఏ జాతియందు పుట్టవలెనో ఏ దేశమందో ఏ నామమో వాటిని తమ కార్యనిర్వాహార్థముగా వహించి లోకులు ఏమిగా భావించినను వారు చేయవలసిన జ్ఞానోపదేశములను చేయుచు అజ్ఞానశాంతిని చేయుచుందురు.

దక్షిణామూర్తి పీఠము

బదరికాశ్రమము, నైమిశారణ్యము ఇట్టి ఆశ్రమములయందు మహర్షులు గుంపులు గుంపులుగా ఉన్నారని పురాణములయందు వినుచున్నాము ఈ ఆశ్రమములు హిమవత్పర్వతమునకు దక్షిణమున నుండునవి. హిమవత్పర్వతమునకు ఉత్తరమునందు కలాపగ్రామము, శంబళము అను స్థలములు ఋషులకు ప్రసిద్ధనివాసస్థలములు అని శ్రీమద్భాగవతము మొదలగు పురాణములయందు చెప్పబడియున్నది.

ఈ గ్రంథము ౨౨ వ పుటయందు కనుపరిచిన (శ్రీమద్భాగవతపురాణము ప్రకారము) ప్రసిద్ధమైన లోకనాయకులపైకి మనువులు ఋషులు ఇంద్రుడు అను పేళ్లు ఇప్పట్లో మనువు, భోధిసత్త్వాలు, మహాచోహాను అను పేళ్లతో దివ్యజ్ఞానసమాజమునందు వ్యవహరించబడుచున్నవి. బదరికాశ్రమమునందు దక్షిణామూర్తిపీఠము అని ఒక దివ్యప్రదేశము ఉన్నది. అచ్చట వైవస్వతమనువు మైత్రేయఋషి శ్రీమద్భాగవతమునందు ప్రస్తావించబడియుండు లోకనాయకుడు అయిన ఇంద్రుడు (ఈ ఇంద్రునకే దివ్యజ్ఞానసమాజమువారి గ్రంథములలో బౌద్ధమత సంజ్ఞావాచకము అయిన ,, మహాచోహాను ’’ అనుపేరు ఉపయోగించబడి యున్నది) అను అధికారులు

ఉన్నారు. ఇది దివ్యజ్ఞానసమాజమునందలి ప్రముఖులకు[1] తెలిసిన సంగతి. ఈ దక్షిణామూర్తిపీఠమువద్దనే తారకదీక్షలు జరుగును. ఈ విషయము ఇక ముందు చెప్పబడును.

దివ్యజ్ఞానసమాజస్థాపకులు

కర్మ పునర్జన్మము అను అనుభవములవల్ల జీవాత్మకు క్రమ క్రమముగా బంధనివర్తియు ఆ విధమున జీవాత్మయొక్క వికాసమును అగును అను శాస్త్రములవలన మానవలోకమునందు బంధనివర్తిని సంపాదించినవారిని ఋషులు మునులు మహాత్ములుఅను ఇట్టి నామములతో వ్యవహరించుట అందరకును తెలిసిన విషయమే. స్వప్రయోజనపరులై స్వకార్యధురంధరులుగానుండువారికంటె "కామక్రోధవియోగైస్తు విషయా నింద్రియైః చరన్" "కామక్రోధ వియుక్తానాం" "కామరాగవివర్జితం" "కామసంకల్పవర్జితాః" ఇట్టి విశేషణములచే వర్ణించబడియుండు మహనీయులు అధికులు కదా. కాబట్టి లోకమునందలి జనులు అనేక విధములయిన మెట్లలో (దర్జాలలో) నున్నారని ఒప్పుకోవలసియుండును. అదేవిధముగా పరిశీలించుచురాగా జీవన్ముక్తులుగా పరిణమించిన మహనీయులుకూడ లోకములోనున్నారు అని ఒప్పుకోవలెను. ప్రకృతకాలపు నాగరికమునందు మహనీయులు అనగా ఋషులు జీవన్ముక్తులు ఇట్టివారు జనసమూహములో కలిసి చరించుచుందురు అను విషయమును సందేహించుట మర్యాద. ఇట్టి మహనీయులు వారివారికి కావలసిన దేశములలో ఆశ్రమములు నియమించుకొని ఒకరి నొకరు వారి స్థూలశరీరములతో సంధించుటకు వీలులేకపోయినను మనశ్శరీరములతో సంధించుచు లోకోద్ధరణమునకుగా ఏకగ్రీవముగా పనిచేయుచుందురు.

మహీపీఠమునకు అధ్యక్షులు శ్రీ సనత్కుమారులు. అందరు జీవన్ముక్తులును వారికి లోబడినవారే. సనత్కుమారులవారు శంబళ

---

[1] బెసంటమ్మగారు, లెడ్బీటరుగారు మొదలగువారు.

గ్రామమునందు ఆశ్రమము కల్పించుకొనియున్నారు. మనువు, బోధి సత్త్వులు, గౌతమమహర్షి, అగస్త్యమహర్షి, దేవాపిమహర్షి, మోర్యారాజర్షి మొదలగు మహనీయులందరును శ్రీ సనత్కుమారుల వారి ఆజ్ఞకు (అభీష్టములకు) లోబడి నడుచుకొనువారు.

"లోకస్యాఽజ్ఞాన శాంతయే" అనగా లోకమునందు ప్రబలి యున్న అజ్ఞానమును క్షీణింపజేయుటకు మహిమావిత పువారు ప్రయత్నము చేయుటకు సమయమును నిరీక్షించుచుందురు. అనేక విధముల అనేక స్థలములయందు అనేక సమాజములను వివిధములైన సంస్కార సంఘములను మనుష్యులు ఏర్పరుచుకొనునట్లు ప్రేరేపించుట వారల కార్యము. భరతఖండమునందు ప్రబలుచుండిన బ్రహ్మసమాజము ఆర్యసమాజము మొదలగు చర్చలయందు జీవన్ముక్తులు పాల్గొనుచు ప్రచ్ఛన్నవృత్తితో ఆ సమాజములయొక్క అధ్యక్షులకు సలహాలు వారల మనస్సులలో జనించునట్లుచేయుచుందురు. ఒక భరతఖండము మాత్రముకాదు. ఐరోపా అమెరికాదేశములలో శుద్ధనాస్తిక వాదుల సమాజములలోకూడ సూక్ష్మశరీరములతో పాల్గొనుచు వాటి యందు పనిచేయు సభికులకుకూడ శీలము ముఖ్యము అనుమొద లగు సలహాలను ఇచ్చుచుందురు. అమెరికామొదలయిన దేశముల యందు జీవాత్మ అనువాడొకడు ఉన్నాడా లేదా అను చర్చలు ఆ కాలమందు అనగా ఇప్పటికి సుమారు అరువది సంవత్సరములకు ముందు జరుగుచుండెను. నాస్తికవాదము ప్రబలుచుండెను. అపుడు లోకమునందంతయు విచారదృష్టి ప్రబలుచుండెను. అట్టి సమయ మందు ఇద్దరు మహాత్ములు (మోర్యారాజర్షిగారును కుటుహూమి మహర్షిగారును) తమ శిష్యులను భూలోకమునందు జతగూర్చి దివ్యజ్ఞానసమాజములను సమాజమును స్థాపించునట్లుచేసి జీవాత్మ అనువాడు కలడా అను చర్చజరుగుచుండిన అమెరికాదేశమున మ్యాడంబ్లావట్స్కీకి కలనలు ఆల్కాటును సహకారిగా చేసి సమాజమును స్థాపించిరి. ఈ సమాజము కొన్ని సంవత్సర ములు అమెరికాదేశమందు పనిచేసి పిమ్మట భరతఖండమునకు వచ్చెను.

సనాతనయోగము

"స ఏవా యం మయా తే ద్య యోగః ప్రోక్త స్సనాతనః" అనియు "యే నైవ యాతా యతయో స్య పారం త దేవ మార్గం తవ నిర్దిశామి" అని వివేకచూడామణియందును చెప్పినట్టి పురాతనమార్గము ఒకటియున్నది. అట్టి మార్గమున చరించుటకు అర్హులుగానుండువారికి దాని సంప్రదాయమును తెలియపరచగోరి అట్టి మార్గము గుప్తమార్గము గనుక దివ్యజ్ఞానసమాజమునందు "గుప్త శాఖ" అను నొక శాఖనుస్థాపించిరి. ఐహిక సుఖములయందు కొంత విముఖులైనవారు గుప్తశాఖలోచేరి అనుష్ఠాననియమములను అభ్యసించుటకు ఒప్పుకొనిరి. ఆరీత్యా పూర్వజన్మములయందు మెంబర్లకు మేస్టర్లతో ఏ విధమైన స్పర్శగాని కలిగియుండియుంటే అట్టి సంబంధ రజ్జువును స్థిరపరుచుకొనుటకు వీలుకలుగజేసిరి. మ్యాడం బ్లావట్ స్కీగారు ఈ గుప్తశాఖను స్థాపించినవారు. ఆనిబెసంటమ్మగారు ఆ సత్కార్యమును స్థిరపరిచి భరతఖండమునందును ఇతర దేశములయందును అనేకులకు మేస్టర్లుకలరు అనియు వారలకును తమకును పారమార్థిక సంబంధముకలదనియు మొదలగు నమ్మకములు కలుగునట్టు చేసిరి.

గుప్తశాఖయందు

దివ్యజ్ఞానసమాజమునందు చేరియున్న వారే మెంబర్లుగా చేరవచ్చును. మేస్టర్లు లోకసేవాధురంధరులుగాని వేరుకాదనియు మేస్టర్లతో మాలిమికలుగవలెనని ఇచ్ఛయించితే రెండువిధములుగా నడువవలసినది అనియు తెలియజేసిరి. రెండు విధములు ఏవనగా మొదటిది మెంబర్లు తమయందు ప్రబలియుండిన తమోగుణమును రజోగుణమును సవరించుకొనుచు రెండవమార్గము అగు లోకసేవను దివ్యజ్ఞానసమాజమును లోకులు ఎరుగునట్టు ప్రకటీకరించి ఆద్వారా లోకులకు అజ్ఞానశాంతికి ఆస్పదము కలుగజేయుట.

తమోగుణమును గెలువవలయునని సూర్యోదయాత్పూర్వమే నిద్రమేల్కొని స్నానాది అనుష్ఠానములను ముగించుకొని ధ్యా

భ్యాసము అవశ్యముగా నేర్పరిచి ఉపాసకుల స్వభావమునకు అనుసరించిన ధ్యానాభ్యాసమును వారు వారు చేయవలయుననియు ఉదయాత్పూర్వమే ధ్యానాభ్యాసమునంతయు ముగించుకొని ధ్యానకాలమందు చింతించి చింతించి చర్చచేసిన సర్వజీవాత్మైక్యభావమును దినమంతయు జరుగవలసిన వ్యవహారములయందు అభ్యసించితేనే ధ్యానకాలమునందుచూపిన ఉత్సాహము అనుష్ఠానమువల్ల దృఢపడును అని తెలిపిరి. ఇట్లు కొంతకొంతగా తమోగుణమును జయించు నుపాయములను చెప్పియిచ్చిరి.

"అభ్యాసానుసారిణీ విద్యా" అను వాక్యప్రకారము ఉదయాత్పూర్వము జరిగిన ధ్యానమును భగవంతునికి ప్రీతిగా

లోకేశ చైతన్యమయా దిదేవ శ్రీకాంత విష్ణో భవదాజ్ఞ యైవ ।
ప్రాత స్సముత్థాయ తవ ప్రియార్థం సంసార యాత్రా మనువర్తయిష్యే ॥

అను శ్లోకమునందలి అర్థమును సార్థకము చేయునట్లు ప్రతికార్యమును తన ఇష్టదేవత, గురుదేవులు వీరలకు సమర్పించి కర్తృత్వాభిమానము మానుమని ఉపదేశములు గావించుచువచ్చిరి. అప్పుడప్పుడును ఆనిబెసంటమ్మగారు మొదలగు ప్రముఖులు గుప్తశాఖవారికి పైసంగతులు జ్ఞాపకపరుచుచు తాము ఉపదేశముచేయు జనులకు నిర్దేశముగా ఆ ధర్మములను తామే అనుష్ఠించిచూపిరి. "న తు వృథావాక్యం సముచ్చార్యతాం" అను న్యాయమును తాము ఆచరించి చూపుచుండిరి. మరియు పగటికాలమం దంతయు వ్యవహారమోహమువల్ల న్యాయప్రవర్తనను మరిచిపోయిరేమో అని తమ చర్యలను తాము సాక్షిరూపముగా నిలిచి సాయంకాలము పరిక్షించుకో వలయుననియు అట్టి పరిక్షను చక్కగా చేయగా ఏర్పడిన తుణ్ణాతలను దిద్దుకోవలయుననియు ఇట్టి అనుష్ఠానములను ఉపయోగించుచు గుప్తశాఖకు చేరినవారలను దిద్దుచుండిరి. గుప్తశాఖయందు సాధన చతుష్టయము అగు (1) వివేకము, (2) వైరాగ్యము, (3) శమాది షట్క సంపత్తి, (4) ముముక్షుత్వము అను సాధనములను అభ్యసించుటకు కావలసిన సలహాలను చెప్పియిచ్చి ఒక్కొకసాధనముగా

దృఢపడునట్లు చేయుచుండిరి. సనాతనధర్మ మతమునందు గురుకుల సేవ అనునది ఎట్టిదో అట్టిదిగా గుప్తశాఖను ఏర్పరిచి నడిపించి బాహ్యప్రపంచమునందు అమ్మగారు (బెసంటమ్మగారు) తాను గురుదేవులవారి ప్రతినిధిగా గురువుగా నిలిచియున్నను వాస్తవముగా గురువులు జీవన్ముక్తులుగానుండు మోర్యారాజర్షి మొదలగు జీవన్ముక్తులలో నొకరు ఆ యా శిష్యునియొక్క వృద్ధినిగమనించువారు అనియు అట్టి జీవన్ముక్తులు పరోక్షమునం దుండియే శిష్యునిశీలమును పరీక్షించుచుండి, సమయము అసన్నమైనపుడు కటాక్షించి శిష్యుని యొక్క వృద్ధియందు తమకు ఉండు ఆతురతను గోచరింపచేయుదురు అనియు పదే పదే తెలియచేయుచుండిరి.

గుప్తశాఖకు ఆంతరంగికాధిపతి మోర్యారాజర్షిగారు. అనేక జీవన్ముక్తులకు శిష్యభావముతో అనుబంధము కలిగియున్నవారందరును పూర్వానుబంధముయొక్క ఆకర్షణశక్తివల్లనే దివ్యజ్ఞానసమాజమునందు మెంబర్లగా చేరియుందురు. వారలయొక్క పారమార్థిక వికాసములు వేరు వేరు పదవులయందు అనగా దర్జాలయందుండును. పక్వముచెందిన అంతఃకరణము కలవారు, ముక్కాలుపాలు పక్వులైనవారు, అర్ధపాలు పక్వులైనవారు, ఇట్లు అనేకనూర్లతరగతులుగా విభజించుటకు సాధ్యమగునట్లు శిష్యులు లోకమందంతయు కర్మదేవతలచే వెదచల్లబడినట్టుగా నచ్చటచ్చట పుట్టిపెరుగుచు ఆ యా దేశములయందు ప్రబలుచున్న దివ్యజ్ఞానసమాజశాఖలలో చేరుచుందురు. అట్లుచేరి వారికంటె పూర్వము సమాజములోచేరి క్రమముగా గుప్తశాఖకు చేరియుండువారి అనుష్ఠానములను ఆచరణలను గమనించి తామును గుప్తశాఖలో చేరుటకు ఇచ్ఛయింతురు.

ఈ ప్రకారము క్రమేణ జీవన్ముక్తులలో నొకరు తనకు నిజమైన గురువనియు ఆ జీవన్ముక్తగురువులను సమీపించుటకు మధ్యవర్తిగా గుప్తశాఖకు బాహ్యప్రపంచమునందు అధికారిగానుండువారు తనకు మధ్యవర్తిగురువుగాను అంగీకరించుటకు వీలుకలుగును.

మనుష్య సమూహామునందు ప్రతివారును జాగ్రదవస్థయందు ఎవరితో సహవాసము చేయుచుందురో అట్టివారితో తాము నిద్ర

పోవునపుడు సూక్ష్మలోకములలో కనుగొనుచు వారలతో సహవాసముచేయుట సహజముగానున్నది. జాగ్రదవస్థలో చేసినకార్యములవంటివే నిద్రాసమయమునందుకూడ స్ఫురించును. దీనికి అభ్యాసము కారణము. అభ్యాసము ముదిరినపుడు స్వభావమును కలుగజేయును. కనుక జాగ్రదవస్థయందు జీవన్ముక్తులగు అపరోక్షగురువులవారిని చింతించి ప్రేమించి మనసా వారితో సహవాసము చేయుచున్నయెడల నిద్రాసమయమునందు సూక్ష్మశరీరములో మనము చరించు సమయమున సూక్ష్మశరీరముతో సేవచేయుచుండు జీవన్ముక్తులైన అపరోక్షగురువులవారిని సూక్ష్మలోకములయందు సంధింతుము.

అపరోక్షగురువులవారు

అను పేరు జీవన్ముక్తులకు అన్వయించును. మధ్యవర్తిగురువులవారు అనుపేరు గుప్తశాఖకు బహిఃప్రపంచమునందు అధిపతిగా నుండి మనవలెనే స్థూలశరీరధారిగా నుండువారికి అన్వయించును. మనకు వీలుపడినపుడు ఈ మధ్యవర్తి గురువులవారిని సంధించవచ్చును. మాటలాడవచ్చును. మన సందేహములను వారికి తెలియచెప్పి వారివల్ల ఆ సందేహములను తీర్చుకొనవచ్చును. మనము చేయు జపమునందును తపస్సునందును మనకు కానవచ్చు కష్టములనుగాని సంతోషములనుగాని వారికి తెలియుచేసుకొని వారివల్ల సహాయమును పొందవచ్చును. వారి సమీపమునందు వసియించు భాగ్యము లేనివారు మధ్యవర్తిగురువులవారికి ఉత్తరములువ్రాసి వారినుండి ప్రత్యుత్తరములు పొందవచ్చును. ఈ విధముగా అపరోక్షగురువుల (మధ్యవర్తిగురువుల) వారితో మనము సంబంధము కలుగజేసుకొని వారిని వీలుపడినప్పుడెల్లయు మనసాచింతించి చింతించి ఆ విధముగా వారితో మనసా సామీప్యమును మాలిమిని స్నేహమును సంబంధమును కలుగజేసికొని ఆ సంబంధమును దృఢపరుచుకొన్నయెడల మనయొక్క నిద్రాసమయమునందు మనము సూక్ష్మశరీరములతో సంచరించుట కారంభించగానే అపరోక్షగురువులవారిని (మధ్యవర్తిగురువులవారిని) సూక్ష్మలోకమునందు సంధించ

గలము. మనయొక్క ఆస్థ యెంతనిజమో శ్రద్ధ ఎంతఅవ్యాజమో ఎంత దృఢమో ఎంత ఆతురతతో కలిసియుండునో అంతశీఘ్రముగా మనము సూక్ష్మలోకమునందు మన అపరోక్షగురువులవారిని సంధింతుము. ఇది నమ్మకమైన మాట. వారి వారికిని అనుభవము లగువిషయమే.

మనసహాధ్యాయులు

అనగా మనవలెనే గుప్తశాఖయందు మెంబర్లుగానుండు వారు అనేకులుందురు. అపుడపుడు దివ్యజ్ఞానసమాజ సమ్మేళనములు అనేకదేశములయందు వేరు వేరు కాలములలో జరుగును. ఆ సమ్మేళనములకు వచ్చు మెంబర్లు ఒకరితో నొకరు పరిచయముకలుగజేసుకొందురు. అట్టి సమ్మేళనములయందు గుప్తశాఖయొక్క సమ్మేళనములుకూడ జరుగును. దివ్యజ్ఞానసమాజమునందు బహిరంగ శాఖకు చేరినవారు తమరు అంగీకరించిన "యూనివర్సల్ బ్రదరుహుడ్డు" అను సౌభ్రాతృభావమును వ్యక్తీకరించుటకుగా లోకసేవయందు పాల్గొనుచుందురు. లోకసేవ ఎన్నియోవిధముల జరుగవచ్చును. అట్టి బహువిధములయందును దివ్యజ్ఞానసమాజసభికులు పాల్గొనుచు సేవాసమితియందు ప్రాముఖ్యమును పొందియుందురు. బహిరంగ సభవారే అట్లు సెవాధురంధరులుగా నుండగా గుప్తశాఖయందు చేరిన మెంబర్ల సంగతి చెప్పవలసిన అవశ్యమే యుండదు.

సేవచేయు స్వభావము కలవారందరును ఒకరితో నొకరు పరిచయము చేసికొనుట స్వభావమేకదా. కాబట్టి ఒక దేశమునందలి గుప్తశాఖ మెంబర్లు ఒకరొకరి సంగతిని వినియుందురు. ఆవిధాన పరస్పరము ఒక విధమైన ఐకమత్యము జనించియుండును. ఇంతట గుప్తశాఖాసమ్మేళనములు జరిగినపుడు గుప్తశాఖాసామాజికులు ఒకరినొకరు సంధించి "పరస్పరం భావయంతః" అనినట్టు పరస్పర అనుభవములను జంకక ఒకరు మరియొకరికి తెలియచెప్పుకొనుచు ప్రేమానురాగ బద్ధులగుదురు. ఇదంతయు వేరువేరు దేశములయందలి సమ్మేళనముల సంగతి. అట్లుండ సభికులకూడ తమ నిద్రా

సమయమునందు తాము సూక్ష్మశరీరములతో సూక్ష్మలోకముల యందు సంచరించుచు తమ అపరోక్షగురువుల వారైన (మధ్యవర్తిగురువైన) గుప్తశాఖాధికారిని సూక్ష్మలోకములయందు ఒకరొకరుగానో లేక సమూహములుగానో సంధించి ఆ సమయము నందు సూక్ష్మలోకములయందు తమతోకూడ ఉన్న తమవంటి గుప్త శాఖాసామాజికులతో పరిచయముచేసికొని పరిచయము ముదిరి నపుడు స్నేహము, అనురాగము మైత్రి ఇట్లు ఏవిధముచేతనైనను ఐక మత్యము ఏకాత్మత్వము అను స్థితికివత్తురు.

ఈ ప్రపంచమునందు జనులు జాగ్రదవస్థలో ఒకరినొకరు సంధించినపుడు తమ మనస్సులలో కొన్ని సంగతులను దాచిపెట్టు కొని పైకి ఒక మాట లోపలికి వేరు వేరుతలంపుతోను ఉండుట మన కందరకును అనుభవమే. సూక్ష్మలోకమునందు ఒకరినొకరు సంధించినపుడు ఇట్టి వేషమువేయుటకును తమలో కొన్ని ఇచ్ఛలు, ద్వేషములు, అనురాగములు దాచికొని పైకి తళుకుచేసికొని యుండుటకును సాధ్యపడదు. అచ్చట ఉండినది ఉన్నట్టుగా వ్యక్త పడును. కనుక ఒకరినొకరు ఎంతగాఢముగా ప్రేమించుటయు ఉదా సీనతతోనుండుటయు ద్వేషించుటయు ఎదుటివారికికూడ తేట తెల్లము అగుచుండును.

అవ్యాజప్రేమతో గుప్తశాఖమెంబర్లు ఒకరితో మరియొకరు ఐకమత్యమునుచెందుట సూక్ష్మలోకములయందు సాధ్యము. అతి సులభము. ఆ లోకమునందు సంపాదించిన ఏకాత్మభావము ఈ లోక మునందు ఒక మెంబరు మరియొక మెంబరును సంధించిన సమయ మునందు వాసనాబలముతో జాగ్రదవస్థయందుకూడ వ్యక్తమగు చుండును.

ఇదివరకును చెప్పినదంతయు ఒక దేశమునందలి మెంబర్లను గురించియే కదా. ఒక దేశమునందు గుప్తశాఖాసామాజికుల సంఘట నము సుష్ఠుగానేర్పడగా, ఇట్లే ప్రతి దేశమునందును ఏర్పడగా, దివ్య జ్ఞానసమాజముయొక్క వార్షికసభలకు దేశదేశములనుండియు వచ్చు గుప్తశాఖాసామాజికులు అందరును పరస్పరము ఒకరితోనొకరు

కలిసి మన మందరమును ఏకార్థసమవేతులము (అనగా ఒకటే యుద్దేశముతో వచ్చిన వారము) అను అభిప్రాయము స్థిరపడుచుండును. ఇందరును ఏకగ్రీవముగా గుప్తశాఖాధికారియు మధ్యవర్తిగురువు అనగా అపరోక్షగురువును అగువారికి బద్ధానురాగులై చరింతురు. మధ్యవర్తిగురువులవారికి మెంబర్లుచూపు అనురాగము మర్యాద నమ్రత ఇట్టివాటిని వారు మాత్రముకాదు వారికంటె పై అధికారమునుచెందియుండు గుప్తశాఖయొక్క ఆంతరంగిక గురువులవారుకూడ అంగీకరింతురు. నమస్కారమునకు ఆశీర్వాదము ఫలమైనట్టు గుప్తశాఖమెంబరు ప్రతియొకనికి ఆంతరంగిక అధికారిఅయిన జీవన్ముక్తులవారియొక్క ఆశీర్వాదము అంగీకారము ఇవన్నియు అందును. ఇచ్చట మరియొక విశేషము. అనగా దినదినమునందును ఘంటఘంటకును శిష్యుడు మనసాచేయుపూజ లన్నియు జీవన్ముక్తగురువులవారికి చేరుటయు వారియొద్దనుండి ఆశీర్వాదములు శిష్యునికి అందుటయు ఇట్టి వ్యాపారము జీవన్ముక్తగురువులవారికిని శిష్యునికిని ఏర్పడుచు కాలక్రమమున జీవన్ముక్తగురువులవారి సమక్షమమునందు శిష్యుడు హాజరుకావడము అను మాలిమి యేర్పడును.

గుప్తశాఖకు ఆంతరంగిక అధిపతి అయిన జీవన్ముక్తులవారు మహీపీఠమునకు చేరినవారనియు వారివలె అనేక జీవన్ముక్తులు ఏకగ్రీవముగా లోకమునందలి అజ్ఞానమును పోగొట్టుటకు ప్రయత్నము చేయుచున్నారనియు జ్ఞాపకార్థము మరల వచించవలెనని తోచుచున్నది.

పరస్పరమైత్రి

కాలక్రమమున గుప్తశాఖమెంబర్లలో ప్రబలుచు వచ్చును. "వ్యవసాయాత్మికాబుద్ధిః" అన్నట్టు ఏయే మెంబరు ఎంతెంత శ్రద్ధతో జపము తపస్సు శీలము భక్తి లోకసేవ అను గుణములను అభ్యాసముచేయుచుండునో అంతటి దట్టమైన శ్రద్ధాభక్తులు అతనియందు కనబడుచుండును. శ్రద్ధతో విశ్వాసపాహిత్యముతో మన

సా ఆచరించక స్థూలశరీరముతో మాత్రము స్నానసంధ్యా జపములను చేయువారికి వారి కృషిని అనుసరించి అందుకు తగినంత ఫలమేకలుగును. శ్రద్ధతో అనుష్ఠానాదులను చేసినవారు పొందిన లాభములను చూచియు వినియు వారలవలెతానును కాలేదే అని చింతించితే తనను తాను చక్కబెట్టుకోవలెనేగాని వారినిచూచి తాము అసూయగాని జుగుప్సగాని పొందకూడదు. నివృత్తిమార్గమునందు చరించువారు ఏదేశమందుగాని ఏమతమునందుగాని ఒకరు చెందిన వృద్ధి అందరికిని సముదాయ సామగ్రియేగాని ఇతరముకాదు. ఒక గురువు ఒకసమాజము వీనికి చేరిన వారందరును ఒక తండ్రియొక్క సొత్తుకు కొడుకులు; అందరును సమానహక్కుకలిగియుండు విధముగా నెంచుకొని పరస్పరస్నేహము, సహాధ్యాయులు పొందిన వృద్ధికి ఆహ్లాదము, సంతోషము ఇట్టి సంతోషములను పొందియుండవలయును.

శిష్యులందరును గురువులవారికి పుత్రమర్యాద. గురువులవారికి శిష్యులందరియందును వాత్సల్యభావమును శిష్యులకందరకును గురువులవారియందు పితృభక్తియు శిష్యులందరిలో నొకొరొకరికి భ్రాతృభావమును దినదినమునను వృద్ధియగుచుండవలయును. ఒక ఉపమానము. అనగా వీణనువాయించు సంగీతపండితుడు వీణయొక్క తంతెలన్నియు ఒక్కొకతంతెయు వేరు వేరు నాదము నిచ్చుశక్తికలిగియున్నను ఒక్కొకతంతెను ప్రత్యేకముగా మీటినపుడు ఒక్కొక విధమైన నాదము నిచ్చుచుండినను అన్నిటిని సమానకాలమునందు మీటినపుడు ఏ విధముగా నొకటియొక్క నాదముతో మరియొకటియొక్క నాదముకలిసి గ్రామముకట్టితే సంతోషపడునో ఆ ప్రకారము ఉండక ఒకనాదముతో మరియొకనాదము లయముచెందనపుడు తృప్తి చెందడో ఆ విధముగా ఒకశిష్యుడు మరియొకశిష్యునితో లయము చెందక తాను ప్రత్యేకభావమును చూపినయెడల గురువులవారికి సంతోషము కలుగదు. ఈ ప్రత్యేకభావమును ఆ శిష్యుడు పోగొట్టుకోవలెను. లేకపోతే ఒకశిష్యునియొక్క తప్పువల్ల ఇతరశిష్యులందరి సమూహముయొక్క వృద్ధిచెడునట్లు సందర్భించితే గురువుల

వారు అట్టి ప్రత్యేకభావముగల శిష్యుని వదులుకొందురు. శిష్యునికి ఇంతకంటె మించినదౌర్భాగ్యము కలుగచాలదు. శిష్యులందరును వీణయొక్క తంతెలవలె ఏకోద్దేశముతో నడుచుకొనుచు ఆ వీణయొక్క తంతెలను సంగీతపండితుని వ్రేళ్లు ఏకవిధమున మీటుచు సంగీతగ్రామమును పుట్టించుచుండునో ఆ విధముగా గురువులవారు శిష్యులను లోకసేవయందు సిద్ధపరుచుచుందురు. శిష్యుని వికాసము ముఖ్యముకాదు. లోకసేవ ముఖ్యము. గురువులవారి అభీష్టప్రకారము నడుచుకొనుచుండగా అవశాత్తుగా శిష్యునికి వికాసము ప్రయత్నము లేకయే సిద్ధించుచుండును.

గురుమహారాజుగారియందు పరిపూర్ణనమ్మకము

ఉండవలయును. ఈ నమ్మకమునే వేదాంతశాస్త్రములయందు శ్రద్ధ అందురు. వేదాంతవిచారము చేయువాడు లోకప్రసిద్ధములైన సాధనములను కొంతమట్టుకు అనుష్ఠించి స్వాధీనపరుచుకొని యుండవలెను. సాధనచతుష్టయసంపత్తి కలిగియుండవలెనని ముఖ్యతాత్పర్యము. శ్రవణమనననిదిధ్యాసనములు అని మనము వినుచుండు శ్రవణము అను చర్యను జరుపుటకు ఒక మధ్యవర్తిగురువు కావలెను. ఆ అపరోక్షగురువులవారుకూడ తన మాటలయందు నమ్మకము గలవారికేగాని ఇతరులకు నిరాటంకముగా విషయములను తెలియ చెప్పరు. నమ్మనివారికి చెప్పితే కాలయాపనయేగాని లాభమునున్న.

“శ్రద్ధావాన్ లభతే జ్ఞానం” అని శ్రీమద్భగవద్గీతయందు చెప్పియున్నది. మరియు, “అజ్ఞశ్చాఽశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి” అనియు చెప్పబడియున్నది. మధ్యవర్తిగురువులవారు అని మనము ఇదివరకును తెలిసికొనిన మహానుభావులు ఒక కాలమునందు మనవలెనే స్వల్పజ్ఞానము గలవారుగా నుండిరి. అయితే స్వప్రయత్నమువల్ల మెట్టుమెట్టుగా జ్ఞానమార్గమునందు శమము దమము దయ అను గుణములను వృద్ధిచేసికొని సర్వాత్మైక్యభావమును అనుష్ఠించి అనుభవించి అందుకు ఫలముగా లోకమునందు ప్రబలియుండు అజ్ఞానమును పోగొట్టవలెను అని సంకల్పము పెట్టుకొన్నట్టు శిష్యులకు

తాము నడిచినత్రోవను తెలియచేయువారు. మనము అనగా శిష్యులు ఇయ్యగల ఏ పదార్థమును వారలకు స్వప్రయోజనముగలవి కావు. వారు కోరరు. మన మేమి ధనమిచ్చినను వారు లోకసేవకే దానిని ఉపయోగింతురు. మనముగా వారిని వెదకుకొని పోతిమే గాని ఇతరముకాదు. వారు స్వప్రయోజనపరులు గారు. ఇట్టి సందర్భమునందు గురువులవారియందు వారి ఉపదేశములయందు ఎందుకుగా పరిపూర్ణమైన నమ్మకము ఉండకూడదు. నమ్మకములేనపుడు వారి ఉపదేశక్రమమును మనము ఆచరించుటకు వీలు ఉండదు. కాలహరణము, ఉద్దేశము ప్రాప్తించక పోవుట ఇట్టివి సందర్భించునే కాని ప్రయోజనము ఉండదు. మనముచేసిన గురూపసత్తికి ప్రయోజనము కావలెనంటే గురువులవారియందు పరిపూర్ణనమ్మకము ఉండవలెను.

లోకవ్యవహారములయందు ఒకరియందు పరిపూర్ణనమ్మకము ఉండవలెనంటే అసాధ్యము. అదేవిధముగా పరిపూర్ణ అపనమ్మకము కూడ చెడ్డదే. ఈ రెండువిధములైన మనోభావములను వదిలి వేదాంతవిద్యాభ్యాసమునందు శమదమదయాగుణవంతులైన మధ్యవర్తిగురువులవారి నాశ్రయించి వారి ఉపదేశములను విని నిర్వ్యాజముగా వాటిని నమ్మి వానియొక్క నిజమును మనము అవగాహనచేసికొనుటకుగా యుక్తులను వెదకి మనలోమనము వాదించుకొని స్థిరపరచుకోవలెను. దీనికి మననము అని పేరు. ఉపాధ్యాయుల ఉపదేశములను వినుట శ్రవణము అనబడును. శ్రవణము మననము అను రెండుకార్యములును విరామము లేక జరుపుచుండవలెను.

శిష్యుని జీవితమునందు ఎన్నియో ఇచ్ఛలుండును. నివృత్తి మార్గమును అవలంబించినవాడు తాను కోరినతత్త్వము ఇదేకదా అని నిర్ధారముచేసికొని ఆ నిర్ధారమును మొదటిదానినిగా నెంచి మిగిలినవన్నియు అముఖ్యములు అని నిరాకరించుకొనవలెను. మఱియు, గురువులవారు అనగా మధ్యవర్తిగురువులవారియందు శ్రద్ధ (పరిపూర్ణనమ్మకము) ఎందుకు ఉండవలెను అనగా వారికి సకలమును తెలిసియున్నది; మనకు తెలియనివి వారికి తెలిసియున్నవి. ఆ విషయములను మనము తెలిసికొనవలయును. వారు దయాపరమూర్తి. ఏ

కాలమందు ఏ విధముగా ఏ విషయములను మనకు చెప్పవలెనో ఆ వివరము వారికి తెలిసియున్నది. పరిపూర్ణనమ్మకము ఉంటేనేగాని వారు ఉపదేశించువిషయములు మన మనస్సులో ప్రవేశించవు. మనము విశ్వసించము. అందువల్లకలుగు నష్టము శిష్యులకే కదా. వృథాగా కాలయాపన జరుగును. ఇంతే ఫలము. కనుక శ్రద్ధ ముఖ్యము.

పరమగురుచరణసన్నిధి అను పుస్తకమునందు శ్రద్ధనుగురించి విపులముగా వ్రాసియున్నది. మొట్టమొదట తనకు (శిష్యునికి) నిజమైన శ్రద్ధకలదా అని శిష్యుడే తనను తానే పరీక్షించుకోవలెను. గురువును వెదకివచ్చిన ఉద్దేశము నిజమేనా లేక నిజముకాదా. తాను నివృత్తిమార్గమును కోరినది స్వప్రేరణవల్లనేనా లేక ఇతరుల ప్రోత్సాహముచేతనా. ఇతరులు ఆ మార్గమును ప్రవేశించుచుండగా చూచి మనముకూడ వీరివలె నివృత్తిమార్గమును అంగీకరించితే బాగావుండును అని ప్రవేశించుటకు ప్రయత్నపడినపుడు లాభనష్టములను చక్కగా యోచించి చర్చించి అంగీకరించితిమా అని పరీక్షించుకోవలెను. అంతఃప్రేరణచే సంసారమునందు జుగుప్స కలుగకుంటే, వైరాగ్యముకొంతమట్టుకు పుట్టకుండినయెడల, నివృత్తిమార్గమును ప్రవేశించవలయునను అభిప్రాయమైనను పుట్టదుకదా. అట్లు నివృత్తిమార్గమును వెదకికొనిపోయినపుడు నిర్హేతుకముగా శిష్యునియందు వాత్సల్యముతో దయాపరమూర్తిఅగు గురువు సహాయముచేయునపుడు అట్టి గురువును నమ్మకుంటే వారిమాటలయందు నిండియుండు బుద్ధిమతులు మనను చెందవు.

అవ్యాజమైన పరిపూర్ణమైన నమ్మకము (శ్రద్ధ) లేనియెడల గురువులవారు అనుగ్రహించు వాత్సల్యముయొక్కయు వారు మనలో ప్రవేశపెట్టునట్టి శక్తియొక్కయు ప్రయోజనమును మనము (శిష్యుడు) పొందుట అసాధ్యము.

మధ్యవర్తిగురువులు శిష్యునివలనపొందు మర్యాద, శ్రద్ధ ఇవన్నియు పరోక్షగురువులవారగు జీవన్ముక్తులవారికి చేరుచున్నవి అని యిదివరకే చెప్పబడియున్నది. ప్రకృతమునందు జీవన్ముక్తగురువులవారు పరోక్షస్థితియందుండినను మధ్యవర్తిగురువులవారిని ఎంత

కెంతకు శిష్యుడు నమ్మునో ఎంతమట్టుకు మధ్యవర్తిగురువులవారు చెప్పినప్రకారము శిష్యుడు అనుష్ఠించునో అందునుచూచి పరోక్ష గురువులవారగు జీవన్ముక్తగురువులు శిష్యునికి అపరోక్షత నొందుదురు. అనగా ప్రత్యక్షముగా కనబడుదురు.

జీవన్ముక్తగురువులవారిని శిష్యుడు తన కండ్లారచూడలేదు. కనుక వారియొక్క ఉనికినే సందేహించుట సాధ్యము. శాస్త్రములను చదివియు మధ్యవర్తిగురువులవారి మాటలనువినియు పరోక్ష గురువులవారు ఉన్నారని నమ్మవలసియున్నది గనుక కొందరు శిష్యులు జీవన్ముక్తగురువులవారి ఉనికినే సందేహించుట సాధ్యము. వారి ఉనికిని నమ్మకపోవుట, తనయందు నివృత్తిమార్గయాత్రకుగా పుట్టిన వాంఛను బలపరుచుకోకపోవుట, తాను ఎన్నటికైనను నివృత్తి మార్గమునందు తృప్తికరముగా నడువగలనా, అంతశక్తి నాకుకలదా, అని సందేహపడుటయు ఆ సందేహముయొక్క ఫలముగా ప్రయత్నమును ఉపేక్షించుటయు సంభవించును. ఇట్టి లోపములు ఉండిన యెడల శిష్యునివలన గురువులవారికిగాని గురువులవారివల్ల శిష్యునికి గాని ఉపయోగములేదు. శిష్యుడు ఆచరించవలసిన లోకసేవ యందు శ్రద్ధతగ్గును. గురుశిష్యులకు ఏర్పడిన ప్రేమపాశము బల హీనమగును. క్రమక్రమముగా కార్యహాని కలుగునుగనుక గురువుల వారియందును తనయొక్క శక్తియందు నమ్మకము దృఢపరుచుకో వలయును. దీనినే అవ్యాజమైనశ్రద్ధ అందురు.

దేవే చ వేదే చ గురౌ చ మంత్రే తీర్థే మహాత్మ న్యపి భేషజే చ ।
శ్రద్ధా భవ త్యస్య యథా యథాం తః తథా తథా సిద్ధి రుదేతి పుంసాం ॥

తాము ఉపాసించవలెనని అనుకొన్న దేవునియందును వేదవాక్యములయందును ఉపదేశము ఏ మహానుభావుడు చేసినట్టైన తనకు జ్ఞానముకలుగునో జ్ఞానముయొక్క ఫలముగా సకల దుఃఖములును నివారణమై మోక్షముకలుగునో అట్టి గురుదేవునియొక్క వాక్యములయందును, ఏమంత్రమును ఉపదేశముపొంది ఆమంత్రమును సాధించినపుడు ఆమంత్రముయొక్క అభిమానదేవతవల్ల మన ఇష్టము

ఫలించునో, ఏ తీర్థములను దర్శించితే మేలుకలుగును అను ఉద్దేశ ముతో తీర్థములను దర్శనముచేయుదుమో అట్టి తీర్థములయొక్క మహాత్మ్యమునందును, ఏవైద్యుడు మందులు ఇచ్చి చికిత్సచేసినపుడు తన రోగములు కుదిరి తనకు ఆరోగ్యముకలుగునో అట్టి వైద్యుని యందును ఎట్టిశ్రద్ధ (నమ్మకము) మనస్సునందు దృఢముగా, ఎంతటి దృఢముగానుండునో, అందుకు తగినంతమాత్రమే సిద్ధికలుగును. ఇందులో సందేహము ఏమియులేదు. ఇతరులను మోసపుచ్చుట అందరకును సాధ్యము. తన మనస్సును తానే మోసపుచ్చుటకు సాధ్యముకాదు. సూర్యునిప్రకాశము మన యింటిలో ప్రవేశించ కూడదు అని యిచ్ఛయించువారు గవాక్షులను మూసినట్టు గురుదే వులవారి అనుగ్రహము తనయందు ప్రవేశించకూడదు అని తలచిన శిష్యుడు గురువులవారి వాక్యములయందు నమ్మకములేకుండవచ్చును. అప్పటికి గురువులవారిని వెదకికొనిపోవుట యెందుకు అని తెలియలేదు.

శ్రద్ధావిహీనస్య తు న ప్రవృత్తిః ప్రవృత్తిశూన్యస్య న సాధ్యసిద్ధిః ।
అశ్రద్ధయైవా భిహతాశ్చ సర్వే మజ్జంతి సంసారమహాసముద్రే ॥

శ్రద్ధలేనియెడల ప్రయత్నములేదు. ప్రయత్నములేనియెడల తాను కోరినది లభించదు. కనుక గురువులవారు చెప్పుమాటలయందు నమ్మకము ఉండవలయును. నమ్మకముఉన్నపుడే ప్రయత్నముచేయు టకు సాధ్యమగును. ప్రయత్నముచేసినపుడు కార్యము సిద్ధించును. „ప్రయత్నా ద్యతమాన స్తు యోగీ సంశుద్ధకిల్బిషః । అనేకజన్మసం సిద్ధ స్తతో యాతి పరాం గతిం ॥" అని శ్రీమద్భగవద్గీతయందు చెప్పబడియున్నది.

అందువలన సర్వప్రయత్నముతో అపరోక్షగురువులువారి వాక్కులయందు నమ్మకమును ఉంచి తాను వృద్ధికిరావలయును.

ప్రవృత్తినివృత్తిమార్గముల సారాంశము

ప్రజ్ఞానముయొక్క అంశువు లేక పరమేశ్వరునియొక్క అంశ లేక సుదీప్తమగు మండుచునుండు అగ్నియొక్క విస్ఫులింగము అని

శాస్త్రములయందు తెలుపబడియుండు జీవాత్మ తాను పాంచభౌతిక ప్రపంచమునందు జన్మించి మరల మరల జన్మించి అనుభవములను సంపాదించి సచ్చిదానందమూర్తియొక్క కిరణముమాత్రముగా నారంభించి తానే సచ్చిదానందుడుగా వృద్ధిచెందుటకుగా ప్రయత్న పడినందున జీవాత్మ ప్రకృతియందుమునిగి ప్రకృతియందుగల మనస్సు మొదలగు ఇంద్రియములను ఉపయోగించి ఇంద్రియారామమున క్రీడించుచు చూచినదానినంతయు తనకు కావలయునని ఆకర్షించుచు కొనుచు ప్రవృత్తిమార్గయాత్ర సలుపుచుండెను. విషయములయొక్క తీక్ష్ణత అనుభవమువల్లనేగాని వేరువిధముగా తెలియదు. కనుక ప్రవృత్తిమార్గయాత్రయొక్క ఆరంభమునందు మంచి చెడ్డ అన్నిటియొక్కయు అనుభవములను సంపాదించవలయును. ఈ స్థితియందు నీచములైన విషయానుభవములు అవశ్యమే. అందుకు కామము తోడుపడి జీవాత్మకు సహకారిగానుండును. మంచి విషయముల యొక్క అనుభవము ఎంత సహాయకారియో చెడ్డవిషయములయొక్క అనుభవమును ఈ పదవియందు సహాయకారియే. ఈ అనుభవముల వల్ల, వాని ఫలములవల్ల, విమర్శజ్ఞానము జనించును. ప్రవృత్తిమార్గముయొక్క ఆరంభదశయందు చూచినదంతయు కావలయునని ఆకర్షించును. ఇందువలన సంపాదనశక్తి వృద్ధియగును. ఎదుటివానికి లాభముకలుగునా నష్టముకలుగునా అని యోచించుటకు అవకాశముండదు. ఆక్రమణమే ముఖ్యము. కొన్నిజన్మములకు ఆవల తాను తన సంతానము ఇవియే గణనకు వచ్చునుగాని ఇతరులు లెక్కకు రారు. తనకుగా లోకము సృష్టింపబడినదిగాని తాను లోకమునకుగా సృష్టించబడలేదు అని అభిప్రాయపడియుండును. సంతానము తాను తన ప్రియులు ఇట్లు కొంతకొంతగా విశాలదృష్టి కలుగుచు తాను ఇతరులకు కొన్నివస్తువులనిచ్చి వానికి ప్రతిగా నితరులవస్తువులను సంపాదించుకోవలయునని తోచును. ఇట్లు ఇతరేతరశ్రేయస్సు మనస్సునందు పుట్టును. ఇట్లు కొన్నిజన్మములకు పిమ్మట జీవాత్మ లౌకికవ్యవహారములందు మంచిశీలవంతుడు నాణ్యవంతుడు సహాయపరుడు యోగ్యుడు అనిపించుకొనుటకు సాధ్య

పడును. పుచ్చుకొనుటమాత్రము ముందు తెలిసియుండినది. ఇపుడు ఇచ్చుటనుకూడ నేర్చుకొనియున్నాడు. ఇచ్చుకోళ్లు పుచ్చుకోళ్లును సమానములుగానుండును. పుచ్చుకొనుట మాత్రము అభ్యసించినపుడు ఇచ్చినవారలకు ఇతడు అప్పుపడియుండినాడు. ఆ అప్పులను తీర్చుకో వలసినది అవశ్యము. ఈ విధముగా తలంపులు జనించినపుడు ఉపాస కుడు ప్రవృత్తిమార్గముయొక్క కడపటి మజిలీలలో నడుచుచున్నాడు అని చెప్పవచ్చును. ఇక కొంతకాలమునకు ఇతడు ప్రవృత్తిమార్గ మునందు తేరినవాడు అగుచుండగా ఒకానొకపుడు గ్రంథపఠనము వల్లనో పురాణశ్రవణమువల్లనో లేక ప్రవరునికి సిద్ధపురుషసమాగ మముకలిగిన విధముననో జీవితోద్దేశము ఇతని మనస్సున ఒక నిమిష మాత్రమునకు స్ఫురించును. లేక కొందరివిషయమునందు ఏదో ఒక పెద్దదుఃఖము సంభవించును. లేక తాను చేయుచున్న వ్యాపారము నందు అతి నష్టమువచ్చును. ఇట్టిది ఏదో ఒకటి సంభవించి తన యొక్క గొప్పతనము, మనస్సంతోషము ఇట్టివానికి బలమైన దెబ్బ తగులును. ఇట్టి దుఃఖమువలన కొంతవైరాగ్యము పుట్టును. శ్రీ మద్భాగవతము షష్ఠస్కంధమునందు చిత్రకేతువు ఉపాఖ్యానము వలె అనేక సంవత్సరముల తపస్సుయొక్క ఫలముగా పుట్టిన కుమా రుడు చనిపోవును. మహాద్దుఃఖము ప్రాప్తించును. ఆ ద్వారా కొంతమట్టుకు వైరాగ్యము ముదురును. "కోన్యోస్తి సదృశో మయా" నాతో సమానమెవ్వరు అని ధర్మమార్గమునందు చరించు చుండినవానికి లోకదృష్టిమాని, నశ్వరపదార్థములవల్ల కలుగు లాభముమాని, ఈశ్వరసేవచేయవలయునని ఆశపుట్టును. అయినను నశ్వరపదార్థసేవనము చాలజన్మములయందు అభ్యసించబడియుండినం దున మరల మాయకమ్ముకొని ఈశ్వరసేవ మరువబడును. అయినను నిశ్చయపదార్థము ఇట్టిదని కొంతకాలమైనను, ఒక నిమిషకాలమై నను ఇతనిచే కనుగొనబడెను.

అపుడపుడు తాను చాల ప్రేమించియుండిన వస్తువులు మను ష్యులు బంధువులు మొదలగువారికి రోగములు చావులు నష్టములు కలుగుచుండగా కొంత[illegible] ఐహికవిషయములయందు పట్టు

వదిలి ఆముష్మికవస్తువులనుగురించి విచారము కలుగుచువచ్చును. నే నెవ్వడను ఎక్కడివాడను మొదలగు విషయములు స్ఫురించుచు కొంచము కొంచముగా ఆముష్మికవిచారము వృద్ధిపొందుచుండును. ఇదియే నివృత్తిమార్గమును త్రొక్కుటకు ప్రారంభదశ.

నివృత్తిమార్గపు ప్రథమమజిలీలును ప్రవృత్తిమార్గపు కడపటి మజిలీలును చాలమట్టుకు ఒకటినొకటి పోలియుండును. నివృత్తిమార్గమునందు ముఖ్యమైన చిహ్నము తాను సంపాదించినదానిని ఇతరులకు ఇచ్చుట. ప్రవృత్తిమార్గముయొక్క ముఖ్యచిహ్నము ఆక్రమించుకొనుట. దానధర్మములు ఇతరుల ఉపయోగమునకుగా జేయుట నివృత్తిమార్గముయొక్క చిహ్నము. తనయొక్క సుఖమును కొంత కొంతగా మరిచి ఇతరులమేలును గమనించుట నివృత్తిమార్గముయొక్క చిహ్నము. ప్రవృత్తిమార్గ ప్రారంభమునందు మొదటిమజిలీలలో నితరులు దుఃఖపడినను చింతలేదు తాను సుఖమును పొందవలెనను తలంపు ఉండును. ప్రవృత్తిమార్గమందు ముదురుచురాగా తాను సుఖపడవలెను; ఇతరులును సుఖపడవలెను ఇదే న్యాయము అను తలంపు ఉండును. నివృత్తిమార్గమునందు తన సుఖములను మరిచి ఇతరులను సుఖపెట్టవలెనను స్వభావము గట్టిపడును. నివృత్తిమార్గమునందు స్థిరముగా నిలుచుచు రాను రాను తాను దుఃఖమును అనుభవించినను చింతలేదు; ఇతరులకు సుఖముకలుగవలెననుకోరిక అధికముగానుండును.

ప్రపంచమంతయు నొకటే కుటుంబము అను నమ్మకము క్రమేణ జనించును. అందువల్ల ప్రవృత్తిమార్గమునందు తాను ఇతరులను బాధపెట్టినదానినంతయు తలచుకొని అందువల్ల ఏర్పడిన ఋణములనంతయు కొంత కొంతగా తీర్చుకొనుటకు ప్రయత్నపడును.

ఈ సందర్భమునందు దివ్యజ్ఞానసమాజముయొక్క గుప్తశాఖను గురించి విచారించును. ప్రవృత్తిమార్గమునందు విరక్తికలిగి నివృత్తిమార్గమును త్రొక్కుటకు ఆరంభించి కొంతదూరము పోయినవారికే గుప్తశాఖవల్ల ప్రయోజనము కలదు. మనుష్యులకు అందరకును ఉండవలసిన సామాన్యధర్మములపైకి స్వప్రయోజనరాహిత్యము, ఒక

విధమైన విరక్తి, త్యాగము, పరోపకారబుద్ధి ఇదంతయు వృద్ధిచేసుకొనవలయునని ప్రయత్నము చేయువారలే గుప్తశాఖయందు అభిరుచి కలిగియుందురు. అనేక సంవత్సరములకాలము ప్రయత్నపడి అభ్యసించితేనేగాని పైవివరించిన మంచిగుణములు పట్టుపడవు. కనుక ప్రయత్నమునకు ఆరంభించువానికి గుప్తశాఖ యుక్తమైన స్థలము. సన్యాసము అని లోకులు చెప్పునట్టి పదవికి అంకురములేనివారలు గుప్తశాఖయందు చేరుటవల్ల లాభముండదు.

గుప్తశాఖయందు చేరినవారికి తమ స్థూలశరీరములను పరిశుద్ధిగానుంచుకొని స్వప్నశరీరమును (Astral Body) దట్టపరుచుకొని శ్రవణమననములచే అంతఃకరణమును చురుకుగా చేసికొని బుద్ధికుశలత అనగా కుశాగ్రబుద్ధి అనునట్టి గ్రాహకశక్తిని కలుగజేసికొని ఇకముందు దీక్షామార్గమును ప్రవేశించుటకు కావలసినంత అక్కరను పుట్టించుకొనవలయును అనునది ఉద్దేశముగా నుండవలయును. దీక్షామార్గమునందు భూమికలు గలవు. ఆ భూమికలను క్రమ క్రముగా జయించి జీవన్ముక్తినిపొందుటయు ఈ స్థితిని పట్టుదలతో నితరులకంటె నతిశీఘ్రముగా పొందుటకు కావలసిన బంధవిముక్తిని సంపాదించి తాను సన్నాహముచేసి సంపాదించిన శక్తులనన్నిటిని లోకసేవయందు వినియోగపరుచుటయు ముఖ్యోద్దేశముగా నుండవలెను. ఇట్టి ఉద్దేశములు లేనియెడల గుప్తశాఖయందుచేరి ఉపయోగము ఉండదు. సర్వమతగ్రంథములును జీవాత్మకు నేర్పు విద్య ఇదియే. సకలదైవీసంపద్గుణములను నంపాదించుకొనుట అందరకును ముఖ్యమే. శ్రీమద్భగవద్గీత పదుమూడవ అధ్యాయమునందు చెప్పియుండు అమానిత్వము అదంభిత్వము మొదలగుగుణములను సంపాదించవలసినదియు సకలమత సమ్మతమే. అయితే గుప్తశాఖయొక్క ముఖ్యాంశము స్వప్రయోజనమును మరిచి లోకసేవ చేయవలసినది ముఖ్యధర్మము. ఇదియే ఇకముందు పొందవలసిన జీవన్ముక్తిదశకు ప్రారంభము. మనఃపూర్తిగా అక్కరతో మెలుకువతో లోకసేవయు తనయొక్కశీలమును వృద్ధిపరుచుకొనుటకు యత్నమునుకూడ చేయువారు అందరును మహీపీఠమువారికి ప్రియులు.

ఇట్టివారలను మహీపీఠమువారు గమనించి ఇకముందు జెప్పబోవు ప్రకారముగా నాదరింతురు.

## శిష్యపరిశోధన

దివ్యజ్ఞానసమాజమునందలి గుప్తశాఖనుగురించియు ఆ శాఖ యొక్క అధిపతులనుగురించియు ఆ శాఖయొక్క సభికుల సమాగమములనుగురించియు చెప్పతగినంత చెప్పబడినది. ఇంతకంటె నధికముగా తెలిసికోవలయునని కోరికయుండినయెడల శ్రీ లెడ్బీటరుగారివల్ల వ్రాయపడిన గ్రంథములు అనేకములు సహాయపడవచ్చును. అవి ఆంగ్లభాషయం దుండుటవలన వారి గ్రంథములలో నొకటియందు ఉండువిషయములను కొద్దిగా తెలియపరుచుటకు ప్రయత్నించుచున్నాను.

గుప్తశాఖకు ముఖ్యాధికారి అనగా అందలి సామాజికులకు కావలసిన వృద్ధినిగురించి అక్కరపుచ్చుకొనువారు ' మోర్యా ' అను వ్యవహారనామముగల యొక జీవన్ముక్తులు. వారు అంతరంగశాఖ యొకటి ఉండవలయునని ఆ శాఖను స్థాపించి దానికి తాము గుప్తగురువులుగా నేర్పడిరి అని యిదివరకు వ్రాయబడినది.

జీవన్ముక్తసమాజము (Brotherhood) అని యొక్క గుప్త సమాజముకలదు. ఆ సమాజమునందు జీవన్ముక్తులు ముఖ్యముగా మెంబర్లు. వారల శిష్యులుకూడ అనేకులు ఆ సమాజమునకు చేరినవారు. రాజవిద్య, రాజగుహ్యము, గుప్తవిద్య అనువేళ్ల వ్యవహరింపబడు బ్రహ్మవిద్యయందు ఒక పదవిని ఎక్కినవారికి జీవన్ముక్తులు అనిపేరు. వీరలు స్థూలశరీరములను ధరించియుండువారు. జీవన్ముక్తిదశకు ఎక్కినవారిని మనము స్థూలదృక్కుతో విమర్శించుట చాలకష్టము. వారల స్థూలశరీరములయందలి అణువులు బహుతేజోవంతములు. ఓజోవంతములు. ఓజస్సును తేజస్సును వారి ముఖవిలాసమునందు కనబడుచుండును. అంతశ్శీతలత అను పదవి వారి ముఖ్యచిహ్నము. సూర్యునియొక్క తేజస్సును మనమందరమును కనుక్కొని యుండినను సూర్యుని ఎవ్వరైనను చర్మచక్షువులతో చూడజాలము.

అట్లు చూచుట కారంభించినయెడల మనకండ్లు చూపులేక చెడిపోవును. తగిన అద్దములను ఉపయోగించితేనేగాని వేరు విధమున చూడజాలము. జీవన్ముక్తులు భూలోకమునందు జనసంఘములో సంచరించునెడల వారల పరిశుద్ధతను మనలోకమునందలి మలినవస్తువులు తగ్గించలేవు. అయినను జీవన్ముక్తుల ముఖవిలాసమునందు ప్రకాశించుచుండు ఓజస్సు తేజస్సు ఇవి మనుష్యులకు దుర్నిరీక్ష్యములు. తమ యోగికకార్యములను నిరాటంకముగా జరుపుకొనుటకుగా జీవన్ముక్తులు జనసంఘములయందు బసచేసి యుండరు.

బదరికాశ్రమమునందును శంబళము, కలాపము మొదలగు గ్రామములయందును వారలు నివసించియుందురని యిదివరకే చెప్పబడియున్నది. శ్రీ దక్షిణామూర్తి పీఠముయొక్క సమీపమున మనువు, బోధిసత్త్వులు, మహాచోహాను అను పరమఋషులు బసచేసియున్నారు అను సంగతిని జ్ఞాపకముంచుకొనవలయును. ఇతర ఋషులు, శ్రీ మోర్యా, శ్రీ కుటుహూమి మొదలగు ఋషులు టిబెట్టుదేశమునందు సాధారణముగా విజనప్రదేశములందు ఇండ్లుకట్టించుకొని ప్రపంచముతో సంబంధము చాలించుకొనియుండు సన్యాసులుగా కాపురము ఉన్నారు. వారల శిష్యులు పరిజనులు ఇట్టివారు వారి ఆశ్రమముల సమీపమందు వసించుచుందురు. దూరస్థలములయందు నివసించుచున్న మనవంటివారిని పైనచెప్పిన జీవన్ముక్తులు వారి జ్ఞానచక్షువుచే చూచి గమనించుచుందురు.

మరియొక విషయమును ఇపుడు తెలియచేయవలయును.

### సూక్ష్మదేహములతో దేశాంతరగమనము

స్థూలశరీరముగాక ఇతరములైన సూక్ష్మశరీరములు మనకు గలవు. అవి స్థూలశరీరముయొక్క సంబంధము లేకయే దేశమునందు సంచారముచేయును. జీవాత్మ ఇచ్ఛయించినపుడు అతని సంచారమునకు సూక్ష్మశరీరములు స్థూలశరీరమువలెనే ఉపయోగపడును. శ్రీ యోగవాసిష్ఠమునందు ఇట్టి సూక్ష్మశరీరములనుగురించి సందర్భ

వశమున ఇతర అనేక శరీరములనుగురించియు చెప్పియున్నది. ఆకాశ దేహయు, మనశ్శరీరము, స్వప్న దేహము అను దేహములనుగురించి యు, "నిర్మాణచిత్తాన్యస్మితామాత్రాత్" అను యోగసూత్రము నందు చెప్పిన నిర్మాణశరీరములనుగురించియు శ్రీయోగవాసిష్ఠము నందు చెప్పియున్నది. స్థూలశరీరము చిన్నవయస్సునందు, శైశవ మునందు స్వాధాగా పనిచేయుటకు, దూరగమనమునకు చాలినంత దార్ఢ్యములేకయుండి ఆహారము వ్యాయామము మొదలగువాటిని సేవించగా దార్ఢ్యమునుపొందినట్టు సూక్ష్మదేహములుకూడ వాని వానికిగా। నేర్పడిన వ్యాయామములను పొందినపుడు స్వాధాగాచరిం చుటకు కావలసినశక్తినిపొందును. కొంతమట్టుకు తెలివితో ప్ర యత్నముచేసినయెడల సాధారణ జనులుకూడ తమ ఆస్ట్రిలుబాడీతో (స్థూలశరీరముయొక్క సంబంధములేకనే) దేశాంతరగమనము చేయ గలరు. అట్లుండగా దేశాంతరగమనము ఆస్ట్రిలుబాడీతో నడప వలెనని కోరు ఉపాసకులు వార్లయొక్క అనుష్ఠానములయొక్కయు యోగముయొక్కయు (యోగము అనగా నింద్రియములు మనస్సు అనువాటిని కొంతమట్టుకు జీవాత్మయొక్క ఇష్టప్రకారము వ్యవ హరించునట్టుచేయుట) ఫలముగా స్వప్నదేహమును మాత్రము స్థిర పరుచుకొని కొందరు ఉపాసకులు స్వేచ్ఛగా తమ ఉద్దేశప్రకారము ఉద్దేశించిన స్థలములకు పోగలరు. స్వప్నదేహముతోగాని మనశ్శరీర ముతోగాని పయనముచేయువారికి స్థూలపదార్థములు అడ్డుచేయ లేవు. ముండ్లు, చెట్లు, రాళ్లు, కొండలు వీటినన్నిటిని వాటిలో దూరి ఆవలికి పోగలరు. ఇట్టి ప్రయాణములు జాగ్రదవస్థలో జ్ఞాపకము ఉండవు. అనుష్ఠానము అవ్యాజముగా నడిపి పరోప కారచింత (బుద్ధికాదు) ను బలపరుచుకొని గర్వమును, అహం భావమును చాలమట్టుకు జయించితే స్వప్నదేహముతో చేసినకార్య ము జాగ్రదవస్థలో జ్ఞాపకమునకు వచ్చును. యోగమార్గమునందు ప్రయత్నముచేసి ఒక పదవినిపొందినవారికి దూరదృష్టి దూర శ్రవణము ఇట్టి సిద్ధులు సాధ్యములు. ఇందుకు స్వప్నదేహము దట్టము కావలయును.

## యోగదృష్టి

యోగదృష్టిని ఉపయోగించి జీవన్ముక్తులు తమ శిష్యులు ఏ యే కాలములయందు ఏమిచేయుచున్నారు అని తెలుసుకొనుట అతి సులభము. వారలు ఏమి మాటలాడుచున్నారు అని దూరశ్రవణ శక్తివల్ల తెలిసికొందురు. ఈ రీత్యా తమ శిష్యులుగాని, భవిష్యత్కాలమందు ఎవరిని వారు శిష్యులుగా నేర్పరుచుకొనుటకు ఇచ్ఛయింతురో అట్టి శిష్యులు ఏకాలమునందు, ఎట్టి సందర్భమునందు ఎట్టి సందిగ్ధమునందు, ఎట్టి ఇరుకునందు ఎట్లు నడుచుకొందురో ఆ సంగతులంతటిని తెలుసుకొందురు అనుటకు సందేహమేలేదు. ఈ ప్రకారము తమ శిష్యులను, శిష్యులుగా నేర్పరుచుకోబోవువారిని వారు గమనించుచున్నారు అని గుప్తశాఖయందుండు ప్రతి మెంబరును నిరీక్షించుచుండుట వారి ధర్మము, వారి ఆశయముకూడ.

ఇట్లు శిష్యులను గమనించుశక్తి జీవన్ముక్తులకు మాత్రము కాదు. వారి ముఖ్యశిష్యులుగానుండిన శ్రీ ఆనిబిసెంటు అమ్మగారు శ్రీ లెడ్బీటరుగారు మొదలగువారలకుకూడ సాధ్యము.

గుప్తశాఖకుచేరిన అనేకమెంబర్లు వీలుపడినప్పు డెల్లయు తమ స్వప్నదేహములతో తమ గురుదేవులయిన జీవన్ముక్తులయొక్క ఆశ్రమములకు వెళ్లుదురు. జాగ్రదవస్థయందు కనుగొనుటకు సాధ్యముకాని జీవన్ముక్తులను స్వప్నదేహముతో దర్శించుట సాధ్యము. అట్లు స్వప్నదేహమునందు చేసినసంచారములుగాని వ్యవహారములుగాని జాగ్రదవస్థకువచ్చిన పిమ్మట చాలమంది శిష్యులకు జ్ఞాపకముండదు. ఇట్లు జ్ఞాపకము లేకయుండుట ఉపాసకునికి కొంతవరకు చాలమంచిది. స్థూలశరీరమందు జాగ్రదవస్థయందు మనము ఉండునంతకంటె అనేకంతలు వీర్యవంతులు, ధైర్యవంతులు, యుక్తిమంతులుగా నుందుము మనము అని గురువులవారు పదే పదే వ్రాసియున్నారు. ఖులాసాగా నడుచువాని కాలికి భారము కట్టినట్లు స్థూలశరీరము ఉండును అని పుస్తకములలో చదివియున్నాము. స్వప్నదేహముతో మనవంటివారలు

చేసిన కార్యములు అతి సాహసవంతములుగా నుండునట. అట్టి సాహసకార్యములను లోకోపకారార్థము గురువులవారి సాహాయిక సైన్యమునం దొకరుగా చేసినకార్యములు మనము జాగ్రదవస్థకు తిరిగివచ్చినపుడు మనవంటివారికి జ్ఞాపక ముంటే మనకు గర్వము పుట్టును. గర్వము ఉపాసకునికి పతనహేతువు గనుక జ్ఞాపకము లేక పోవుట మన అదృష్టమే.

### జీవన్ముక్త గురుదేవులవారి స్థూలశరీరములు

టిబెట్టు దేశమునందు కొండలనడుమ నొక నది పారుచున్నది. ఆ నదియొక్క ఒక గట్టునందు మోర్యాఋషిగారి బస ఉన్నది. మరియొక్క తీరమునందు కుటుహూమిఋషిగారి ఇల్లు ఉన్నది. ఈ తీరమునందే ఒక చిన్నకుటీరమును నిర్మించుకొని జ్వాలకూలు ఋషిగారున్నారు. గుప్తశాఖకు అధిపతియైన మోర్యారాజర్షిగారు క్షత్రియశరీరమును ఇప్పటికిని ఉపయోగించుచున్నారు. ఈ స్థూలశరీరమును చూచినవారు కొందరు ఉన్నారు. వారియొక్క (స్థూలశరీరముయొక్క) వయస్సు ఇంత అని చెప్పుట అసాధ్యము. మన శరీరములు అనారోగ్యమువల్లను మనస్సునందు చింతలు, వ్యాకులములు, ఈర్ష్యాదులవల్లను శిథిలములై పోవుచున్నవి. మహర్షులశరీరములు మనశరీరములవలె శిథిలము కావు. చూచినవారు మోర్యాఋషిగారు సుమారు ముప్పదియైదు లేక నలువది సంవత్సరముల వయస్సుగలవారివలె కనబడుదురని చెప్పుచున్నారు. వాస్తవముగా నూటయేబది సంవత్సరములకంటె నధికముగా నుండును అని కొందరు చెప్పియున్నారు. ఇంచుమించుగా నూరేండ్లకుముందు వారినిచూచిన మ్యాడం బ్లావట్‌స్కీ అమ్మగారు అప్పటికి మోర్యాఋషిగారి స్థూలశరీరము ముప్పది నలువదియేండ్లదానివలె కనబడినది అని వ్రాసియున్నారు.

ఇదేవిధముగా కుటుహూమి ఋషిగారుకూడ యౌవనపురుషునివలెనే కనబడుచున్నారట. జీవన్ముక్తుల స్థూలశరీరములవయస్సు మనవంటివారలు నిర్ధారముచేయుట చాలకష్టము. సంతుష్టులై కామ

క్రోధముల వేగముచేత శిథిలముకాక తేజోవంతములైన శరీరములు కాలవశమున జీర్ణములు కావు.

ఈ విధముగా జాగ్రతతో పెంచబడినశరీరములు జనసంఘముల మధ్యన ఎల్లకాలము ఉండినయెడల అనేకవేల జనులదుష్ట తలంపులు, అధర్మములు, పాపకృత్యములు మొదలగువాటియొక్క దుష్టస్పందములవల్ల పరిశుద్ధమైన శరీరము మసలితనమును చెంద వచ్చును. కనుక విజనప్రదేశములందు ఋషులు ఆశ్రమములను కలుగ జేసికొనియుందురు. అయినను స్థూలశరీరములతో కొన్ని స్థలములకు వారలుపోయి చేయవలసిన లోకసేవలు కొన్నియుండును. కనుక అపుడపుడు మోర్యాఋషిగారు ఒకవైపునకును కుటుహూమిఋషిగారు ఒకవైపునకును, పోయి సంచారముచేయుచుందురు. వీరలనిద్దరిని (వారిస్థూలశరీరములను) దర్శించుకొను ప్రాప్తి చెందిన వారలను కొందరిని ఎరిగినవారలు ఇప్పటికిని జీవదశయందున్నారు.

కుటుహూమిఋషిగారు ఇపుడు ఉపయోగించుచుండు శరీరము కాశ్మీరదేశమునందలి బ్రాహ్మణశరీరము. కాశ్మీరదేశపు బ్రాహ్మణులు కొందరు దక్షిణ హిందూస్థానమునందు ఉద్యోగములో నుండువారిని నేను చూచియున్నాను. ఇంగ్లీషువారి దేహచ్ఛాయకును వారల దేహచ్ఛాయకును చాల వ్యత్యాసముకానరాదు. స్థూలశరీరమునుగురించి నంతవరకును శ్రీ మోర్యాఋషిగారి శరీరమును గురించి వ్రాసినదంతయును శ్రీ కుటుహూమిఋషిగారికి కూడ నన్వయించును.

దివ్యజ్ఞానసమాజమునందు చెప్పబడియుండు జీవన్ముక్తులందరును ఆధికారికపురుషులు. మహీపీఠమంతయు ఆధికారికపురుషుల సమాజము. కనుక ఆధికారికపురుషులు లోకమునందు స్థూలశరీరములతో కొన్ని సందర్భములలో ప్రవర్తించవలసియుండును. అట్టి సందర్భములయందు ఆధికారికపురుషులు తమ స్థూలశరీరములను తమ ఆశ్రమములలో భద్రముగానుంచి లోకమునందు తమ శిష్యులు ఉన్నస్థలములకు తమ సూక్ష్మశరీరములతో వచ్చి శిష్యులను అడిగి

వారి స్థూలములను పుచ్చుకొని, అనగా వారలయొక్క స్థూలశరీరములలో ప్రవేశించి పనిచేతురు. శిష్యులు గురుదేవులవారికి తమ స్థూలశరీరములను సమర్పించి తమ సూక్ష్మశరీరములతో సేవచేయుచుందురు. ఈలాటి వృత్తాంతము శ్రీ శంకరాచార్యులు వారిని గురించి శంకరవిజయమునందు చెప్పబడియున్నది.

గుప్తశాఖనుగురించి వ్రాయుచు ఆ శాఖకు అధిపతిగానుండు మోర్యారాజర్షినిగురించియు ఆశాఖయందు అక్కరపుచ్చుకొను ఇతర జీవన్ముక్తులనుగురించియు కొన్ని సంగతులు వ్రాయబడినవి. ముఖ్యముగా గుప్తశాఖయందుచేరినవారి యుద్దేశము తాముసు తమ గురువులవారివలెనే జీవన్ముక్తులు కావలెననియే ఉండును. ఆ ఉద్దేశము అవ్యాజముగా నిజముగానుండినయెడల అందుకు కావలసిన జ్ఞాననిష్ఠ గమసించవలసియుండును. తగు ప్రయత్నములుచేసి జ్ఞానసంపాదనచేయవలయును. ఆ ప్రయత్నములలో ముఖ్యమైనది సాధనచతుష్టయము. సాధనచతుష్టయమును సంపాదించుట గుప్తశాఖయొక్క ముఖ్యోద్దేశము. పరోక్షగురువులవారైన జీవన్ముక్తుల అభిలాష ప్రకారము అపరోక్షగురువులైన శ్రీ బిసంటమ్మగారు శ్రీ లెడ్బీటరుగారును ఇతరులును గుప్తశాఖకుచేరిన మెంబర్లను అప్పుడపుడును సాధనచతుష్టయమును సంపాదించుకొవలసినదని చెప్పుచు అందుకు అవశ్యములైన సలహా ఇచ్చుచుందురు. మెంబర్లకందరకును శ్రద్ధ ఒకటేతీరున నుండదు. “శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః” అని శ్రీమద్భగవద్గీతలయందు చెప్పినట్టు శ్రద్ధావంతులు కొంతమట్టుకు నిజమైన కృషిచేసి తమ అభివృద్ధిని గమనించుచుందురు. తమ ఆశ్రమములయందు ఉండియే లోకమునందు ఏదేశమందో ఏగ్రామములోనో నివసించుచుండు ఉపాసకుడు ఏవిధముగా ధర్మప్రవర్తనమునందున్నాడో సందిగ్ధములయందు ఎట్లు నడుచుకొనుచున్నాడో ఎట్టి సదాచారములను కలిగియున్నాడో అదంతయు పరోక్షమునందుండియే అతని జీవన్ముక్తగురువులవారు గమనించుచుందురు. అందువల్లనే జీవన్ముక్తులగు గురువులవారిని పరోక్షగురువులవారు అని యిదివరకును అంటిమి.

## ఋణానుబంధము

లోకములో మనుష్యుల కందరకును ఒకరితోనొకరికి బంధము ఏర్పడియుండును. ఒకరికొకరు మేలుచేసియో కీడుచేసియో లేక స్వభావతః ఒకరినొకరు ఆకర్షించియో ఒకరికొకరికి ఒకవిధమైన సంబంధము ఏర్పడియుండును. ఆకర్షమువల్ల సంబంధము ఏర్పడినవారలు ఉపరిజన్మములందుకూడ ఆకర్షింపబడుదురు. ఇట్లు అనేకసూర్ల జన్మములయందు ఆకర్షింపబడుచు ఒక జీవాత్మకును మఱియొకజీవాత్మకును ఒకవిధమైన స్నేహము ఏర్పడును. స్నేహము ముదురుచు గాఢప్రీతి కలుగును. ఈ విధముగా నొక్కొక జీవాత్మకును తనవంటి గుణములుగల పెక్కుమంది జీవాత్మలతో అనుబంధము ఏర్పడును. ఈ అనుబంధమునకు ఋణానుబంధము అని పేరు. “ఋణానుబంధరూపేణ పశుపత్నిసుతాలయాః” అని లోకవాడుకను వినియున్నాము. ఇట్టి ఋణానుబంధ మేర్పడిన జీవాత్మలు ప్రవృత్తిమార్గమునందే అడుగు తరగతులలో నుండువారు కొందరు. నడిమితరగతులలో నుండువారు కొందరు. నివృత్తిమార్గము నెక్కనారంభించినవారు కొందరు. నివృత్తిమార్గమునందు నిలకడకొనినవారు కొందరు. ఇట్లు వారు వారు వారలశ్రద్ధ భక్తి వృత్తము మొదలగు సాధనములతో అత్యున్నతపదవియైన జీవన్ముక్తపదివిని ఎక్కినవారుకూడ ఉందురు. పదవి ఎక్కువకాను కాను ఇతర జీవాత్మలతో ఋణములు ఎక్కువయగుచుండును. క్రమేణ జీవన్ముక్తపదవికి ఎక్కినవారు తాము ఎవ్వరితో సంబంధము పొందియుండిరో వారినందరిని కనిపెట్టి తమ యోగశక్తితో లోకములోనుండు జీవాత్మలకు తాము పరోక్షమునందు ఉండి అనగా తాము ఎవ్వరికి సహాయము చేయుదురో వారల కండ్లకు అగబడకయే నివృత్తిమార్గయాత్రకు కావలసిన సహాయములను చేయుచు వారలకు తాము జ్ఞానదాతలుగా నేర్పడి తాము వారికి పడిన ఋణములను తీర్చుకొందురు. ఇది చూడగా జీవన్ముక్తిస్థితిని పొందినవారికి లోకులయందు ఉండునంతఅక్కర లోకులకు తమ వృద్ధి విషయమున ఉన్నట్టు కనబడదు. నిజముగా “లోకస్యాஉ జ్ఞానశాంతయే” అను ..... చూపువారు జీవన్ముక్తులే.

ఆరువేలకోట్ల జీవాత్మలు భూలోకము భువర్లోకము స్వర్గలోకములను మూడు లోకములయందును జీవ వికాసమునందు ఉన్నారని వినుచున్నాము. ఇన్నికోట్ల జీవాత్మలును స్వల్పసంఖ్యగల జీవన్ముక్తులచే తరించవలసినదిగా నున్నది. కనుక ఒక్కొక జీవన్ముక్తుడును అనేకవేల జీవాత్మలతో ఋణానుబంధముచెంది వారల వికాసమునకు ప్రయత్నపడుచు గురుశిష్యసంబంధము నేర్పరుచుకొని తనకు శిష్యులనుగాచేసికొనుటకు నిశ్చయింపబడిన జీవాత్మలు భూలోకమునందుండునపుడు ఆ లోకమునందు ఏవిధముగా జ్ఞానోపదేశములు చేయవలెనో ఎవరిని మధ్యవర్తిగా నేర్పరుచుకొని జ్ఞానోపదేశము చేయవలెనో ఆ ప్రకారమును ఇతరలోకములయందు ఉన్నపుడు ఇతరవిధములుగానును లోకులను వారి వికాసవిషయమై గమనించుచుందురు. ఇదిచూడ శిష్యులు గురువులను వెదకికొనిపోవుటఅను లోకవాడుకకు విరోధముగా గురువులవారే శిష్యులను వెదకికొని పోవునట్లున్నది. ఇదియే నిజమైనసంగతి. ఇది ఋణానుబంధముయొక్క మహిమ. ఇదేవిధముగా మనమందరమునుకూడ మనకన్న తక్కువ పదవియందుండు వారలతో ఋణములను ఏర్పరుచుకొనుచున్నాము. కనుక మనమును ఇతరులకు పడిన ఋణములను తీర్చుకొనవలయును. ఇప్పటినుండియే ప్రారంభించ వలయును. "స్వాధ్యాయప్రవచనే చ" అను వాక్యముయొక్క ఉద్దేశము ఋణానుబంధము నేర్పరుచుకొనుటయే.

ఇంతకుముందు వ్రాయబడియున్నట్టు జీవన్ముక్తులు ఎల్లపుడును తమ తమ శిష్యులు గుప్తశాఖయందు ఎవరెవ్వరు ఏమాత్రము వృద్ధిపొందుచున్నారు అని గమనించుచుందురు. వారి ఆశ్రమములనుండియే జ్ఞానదృష్టిచే గమనింతురు. ఇంతేకాదు. శ్రీమద్భాగవతము తృతీయ స్కంధమునందు చెప్పినప్రకారము, కపిలావతారము ముగియు సందర్భమున కపిలమహర్షి హిమవత్పర్వత ప్రాంత్యములకు పోయెననియు అచట "ఆస్తే యోగం సమాస్థాయ సాంఖ్యాచార్యై రభిష్టుతః। త్రయాణా మపి లోకానా ముపశాంత్యై సమాహితః॥" అని చెప్పియుండుప్రకారము జీవన్ముక్తులు నిరతమును తపస్సుచేయుచు లోకమునకు ఉపశాంతిని వర్షించుచుందురు.

ఇదంతయు పరోక్షగురువులు చేయుపని. అపరోక్షగురువులైన శ్రీ బిసంటమ్మగారివంటివారు జీవన్ముక్తులతరపున వారి వారి శిష్యుల కందరకును గుప్తశాఖమూలముగా జాగ్రదవస్థయందు జ్ఞానబోధలను చేయుచుందురు అని ఇదివరకే చెప్పబడియున్నది. ఇదంతయు స్వప్రయోజనార్థముకాదు. పరోపకారార్థమే. నిర్హేతుకముగా చేయబడునది లోకసేవయే అను ముఖ్యాంశమును మరవకూడదు. లక్షోపలక్షలకాలముగా మహీపీఠమువారు చేయుచున్న జ్ఞానోపదేశము లోకమునందుండువార్ల కందరకును సామాన్యముగానుండును. ఇపుడు ఈ గుప్తశాఖయందుచేరి అక్కరతో, శ్రద్ధతో, భక్తితో, పరోపకారబుద్ధితో, అవ్యాజకరుణారసమును వెదజల్లుచు గురుదేవుల వారివలె తామును బహువిశాలమైన లోకమును తనలో కలుపుకొని తాను అనుభవించు మనశ్శాంతిని అంతయు తాను పొందిన జ్ఞానమునంతయు నితరులకు తెలియచెప్పవలెనను నిజమైన ఇచ్ఛకొన్న శిష్యుని అతనియొక్క గురుదేవులవారు తమ సమక్షమమునకు పిలిపించుకొందురు. ఈ సంగతి ఎంతటి అదృష్టమువని మనము కనుగొనలేము.

మన జాగ్రదవస్థయందు మనము దర్శనసంభాషణాదులను సలుపుటకు సాధ్యముగానుండు శ్రీ బిసంటమ్మగారును, వారి పదవి యందుండు ఇతరులును జీవన్ముక్తులగు పరోక్షగురువులవారి ప్రతినిధులు. ఒకానొక శిష్యుడు సాధనసంపత్తికి నిజమైనప్రయత్నము చేయుచు సాధనములను కొంతమట్టుకు అనుష్ఠించుచున్నాడని జీవన్ముక్తులు జ్ఞానదృష్టితో గమనించినపుడు ఆ శిష్యుని తన సమక్షమమునకు పిలుచుకొనిరమ్మని జీవన్ముక్తగురువులవారు మధ్యవర్తి గురువులవారికి ఆజ్ఞనొసంగుదురు. మధ్యవర్తిగురువులవారు పిలువబడిన శిష్యులను వారల స్వప్న దేహములతో ఆశ్రమములకు తీసికొని వెళ్లుదురు.

సనాతనధర్మమునందు మహీపీఠమువారి సంప్రదాయమునందు శిష్యులకు బ్రహ్మవిద్యను ఉపదేశించుటలో కొన్ని సంప్రదాయములు గలవు. జ్ఞానభూమికలు అను పేర ఏడు భూమికలు

గ్రంథములయందు చెప్పబడియున్నవి. ఈ భూమికలు మహోపనిషత్తునందు చెప్పబడియున్నవి. ఇదే విధముగా అజ్ఞానభూమికలు అనికూడ ఏడు భూమికలనుగురించి చెప్పియున్నారు. ఆ విధముగా జ్ఞానదానమునందుకూడ కొన్ని భూమికలు గలవు. అజ్ఞానభూమికలు జ్ఞానభూమికలు అను సాంకేతిక నామధేయములవలె జ్ఞానోపదేశ భూమికలనుగురించి లెక్కపెట్టి చెప్పియుండలేదు. కాని శిష్యుడు జ్ఞానోపదేశమునుపొందుటకు ఎట్లు నడుచుకోవలెనుఅని చెప్పియున్నారు. ఇందులో ముఖ్యమైనది సాధనచతుష్టయసంపత్తి. ఇది శిష్యునిచే చేయబడునది. శిష్యుడు కొన్నిభూమికలను సాధించినపిదప గురువులవారి భాగమునకు కొన్ని భూమికలు గలవు. గురువులవారు జ్ఞానోపదేశమును ఆరంభించుటకు ముందు శిష్యుని పరిశోధించవలసినది ఒకభూమిక. ఈ పరిశోధన పరిపరి విధముల జరుగును. సనాతనధర్మమునందు గురువు తనకు సరియని తోచినట్లు అనేక విధములచేత శిష్యుని శోధింతురు. అనేక గురువులమార్గములు అనేకములు. పురాతన సంప్రదాయమును తెలియపరుచునట్టి గ్రంథములు మనకు కొన్ని కానవచ్చుచున్నవి. ఆ గ్రంథములయందు ఈ పురాతన సంప్రదాయమునుగురించి వివరముగా చెప్పియున్నారు. అట్టి గ్రంథములలో ముఖ్యమైనది యోగవాసిష్ఠము ఒకటి. "ఆదౌ శమదమప్రాయైర్గుణైః శిష్యం విశోధయేత్" అని పైన చెప్పబడిన యోగవాసిష్ఠమునందు స్థితిప్రకరణము దామవ్యాళకటోపాఖ్యానము (౪౨ వ సర్గ-౨౩ వ శ్లోకము) నందు చెప్పియున్నది. అనగా గురువులవారు శిష్యునకు జ్ఞానోపదేశము నారంభించుటకు ముందు ఆ శిష్యునికి శమదమాదిగుణములు ఉన్నవా అని పరీక్షించవలెనట. దివ్యజ్ఞానసమాజముయొక్క గుప్తశాఖకు చేరినవారు ముఖ్యముగా నేర్చుకొనుటకు ప్రయత్నముచేయునవి లోకప్రసిద్ధములైన సాధనచతుష్టయము.

పురాతన సంప్రదాయమునందు జ్ఞానమార్గమునందలి సంగతులనుగురించి గురువులవారిని సమీపించినపుడు శిష్యులను గురువులవారు తమ ఆశ్రమములయందు ఒక సంవత్సరకాలము నిలుపుకొను

దురు. ఇది ప్రశ్నోపనిషత్తునందు చెప్పబడియున్నది. ఆ సంవత్సర కాలమును శిష్యులు తమ చదువు తపస్సు మొదలగునవి జరుపుకొనుచు తమయొక్క పురోవృద్ధికిగా కావలసిన శాస్త్రజ్ఞానమును తపస్సును స్థిరపరుచుకొనుచు, ఇకముందు ప్రారంభించబోవు శ్రవణమునకు అర్హతను సంపాదించుకొనుచుందురు. "క్షురస్యధారా నిశితా" కత్తియొక్క పదునుపార్శ్వమున నడుచుటవంటి సాహసమును పొందవలసినవిద్యకదా బ్రహ్మవిద్య. కత్తిమీది సామును నేర్చుకొను అభ్యాసము కావలసియున్నది. అట్టి అభ్యాసమును సాగించుచు గురువులవారి ఆశ్రమములయందు శిష్యుడు నివసించియుండుట ఆనుపూర్విక సంప్రదాయము. ప్రకృతనాగరిక కాలమునందు లోకవ్యవహారములయందు చరించుచు పొట్టపోసుకొనుచు ఉన్నను శుభేచ్ఛగలవారు జీవనోపాయములను సంసారములను వదిలిపెట్టి గురువుల వారిని వారియొక్క ఆశ్రమములయందు కనిపెట్టి వారి ఆశ్రమములలో వసియించుటకు వీలులేదు. ఇట్టి దినములలో గురువులవారు ఆనుపూర్విక సంప్రదాయమును నడిపించుచు వివిదిషాజనకములైన వ్యాసంగములను శిష్యుడు జరుపుకొనుచు ఉండియు బ్రహ్మవిద్యోపదేశమును పొందుటకు కావలసిన ప్రయత్నములు జరుగుచునే యున్నవి. పరిస్థితులు మారినవిగాని సంప్రదాయములు మారలేదు. గురువులవారి ఆశ్రమమునందు వారి సాన్నిధ్యమందు ఉండుటయే శిష్యునికి ఒకవిధమైన బలము. గురువుల వాతావరణమునందు బలము ప్రచ్ఛన్నముగా నుండును.

ప్రవృత్తిమార్గమునందు నడుచుచు కొంతకొంతగా ప్రవృత్తి మార్గమునకు అవశ్యములైన కామాదిషట్కమును నివృత్తిమార్గమునకవశ్యములయిన శమాదిషట్కముగా మార్చుకొని తన శీలమును చక్కపెట్టుకొనుచు నివృత్తిమార్గయాత్రకు సిద్ధమగుచు నివృత్తిమార్గమునకు ముఖ్యచిహ్నమైన అఖండవృత్తిని అభ్యసించుచు వచ్చునట్టి శిష్యుని, పరోక్షమునందు హిమవత్పర్వతప్రాంత్యములయందు తమ ఆశ్రమములలో తమ స్థూలశరీరములతోనుండు గురువులవారు తమ యోగశక్తితో సూక్ష్మదృష్టితో సామాన్యముగా పరీక్షించినదాని

యొక్క ఫలితార్థముగా శిష్యుని తమ సమక్షమునకు పిలిపించు కొందురు.

### అఖండరూపస్థితి

"ఊర్ధ్వమూల మధ శ్శాఖం అశ్వత్థం ప్రాహు రవ్యయం" అని చెప్పబడియున్నది. లోకమును అందలి సృష్టినంతయు ఒక వృక్షముగాపోల్చి ఆ వృక్షమునకు పత్రపుష్పశాఖాదులు ఉన్నట్టు ఒక్కొకవ్యక్తియు అన్నిశాఖలు పత్రములు పుష్పములును సముదాయమందు ఒకటే వృక్షముగా నున్నట్టు ప్రతిపత్రమును వాయువును ఆకర్షించి ఊపిరివిడిచి ఉచ్ఛ్వాసనిశ్వాసములు నడుపుచుండగా వృక్షము ఆరోగ్యమును చెందియుండునట్టును వృక్షము తన మూలము అనగా వేరుతో జలమును త్రావి ఆ రసమును బోదె, కొమ్మలు, రెల్లలు, ఆకులు, పుష్పముల కంతటికిని ఇచ్చినట్టు ఈ వృక్షమునందు ఏ భాగమునకు దెబ్బతగిలినను చెట్టునకంతయు నొప్పి కలిగినట్టు ఉండుస్థితికి అఖండవృత్తి అనిపేరు. "వేదాంత సిద్ధాంత నిరుక్తిరేషా బ్రహ్మైవ జీవః సకలం జగచ్చ । అఖండరూపస్థితి రేవ మోక్షో బ్రహ్మాద్వితీయే శ్రుతయః ప్రమాణం ॥" అని వివేకచూడామణియందు చెప్పియున్నది.

మోక్షము అనగా అఖండరూపస్థితియే అని తాత్పర్యము. జీవన్ముక్తులు అఖండరూపస్థితిని అనుభవించుచుండువారు. లోకమంతయు తామే అను అభిప్రాయముకలిగి ఇతరుల సుఖదుఃఖము అజ్ఞానము ఇవన్నియు తమవే అని తెలిసికొని అనుభవించుచు ఉండువారు. ఎవరినైనను తాము శిష్యులుగా కొనవలెనని యత్నించితే మొట్ట మొదట అఖండరూపస్థితిని వారికి తెలియపరిచి వారలుకూడ అఖండ రూపస్థితిని యథాశక్తిగా అనుష్ఠించితేనే వారలను శిష్యులుగా నొప్పుకొందురు. "యే నైవ యాతా యత యోఽస్య పారం త దేవ మార్గం తవ నిర్దిశామి" అనినట్టు జీవన్ముక్తులు ఏ అఖండరూపస్థితిని అనుష్ఠించినందువలన జీవన్ముక్తులు అయిరో ఆ అఖండరూపస్థితిని ఆదినుండియు తెలియజేయుదురు. 'యూనివర్సలు బ్రదరుహుడు' అని దివ్యజ్ఞాన

సమాజమును చేరుటకు ముఖ్యోద్దేశమైన సర్వజీవాత్మైక్యభావము అను సౌభ్రాతృభావమును తెలియచేసినారు. ఆ అఖండరూపస్థితిని కొంతవ ట్టుకు అభ్యాసమునం దుంచుకొన్న వారినే శిష్యులుగా నెత్తికొందురు.

లోకులలో ఎవ్వడైనను శమదమాది గుణములను అభ్యసించుటకు ప్రయత్నపడి ఆ గుణములనుగురించి వ్యాసంగము చేయుచున్న సందర్భమున గురుదేవులనారు అతనిని తన ఆశ్రమమునుండియే గమ నించుచుందురు అని యిదివరకే చెప్పబడియె. లోకమునందు నివృత్తిమార్గమునందు చాలదూరము పయనముచేసి సర్వజీవాత్మైక్య భావమును మనసా అంగీకరించి క్రియయందు పరోపకారము, లోక సేవ, దేశసేవ ఇట్టి సేవలచేయుచు తనను లెక్కపెట్టకయే ఇతరులను గురించి సహాయపడువారు హితకాములు అనబడుదురు. శ్రీ జీవన్ముక్తగురువులవారు మధ్యవర్తిగురువులతో చెప్పి పైనచెప్పిన హిత కామిగానుండు శిష్యుని తమవద్దికి పిలుచుకొని రమ్మని చెప్పుదురు అనియు నిదివరకే చెప్పబడియున్నది.

మనలో చాలమంది నిద్రించుకాలమందు మనస్థూలశరీరములు నిద్రించుచుండగా అ శరీరమునువదిలి స్వప్నశరీరములతో భువర్లోక మునందు నిరాటంకముగా సంచరించుచు పరోపకారము చేయు చుందుము. అదృశ్యసహాయులు అనువర్గమునందుచేరి గుంపులు గుంపులుగాకూడి శ్రమలలోమునిగినవారలకు సహాయము చేయుచుందుము. జాగ్రదవస్థయందు మనము పనులుచేసినయెడల స్థూలశరీరము అలిసి పనిచాలించియుండవలయునని తోచును. స్వప్నశరీరమునకు (స్వప్నశరీరము అనుపేరు యోగవాసిష్ఠమునందు ఉన్నది) అలసట అనునది లేదు. కనుక ఎంతకాలమైనను స్వప్నశరీరముతో పనులు చేయవచ్చును. చేసినపనులు జాగ్రదవస్థలో జ్ఞాపకముండదు.

శ్రీ జీవన్ముక్తగురువులవారు ఒకానొకశిష్యుని తమ సన్నిధానమునకు తెమ్మని చెప్పినపుడు ఆ ఆజ్ఞపొందిన మధ్యవర్తిగురువులువారు హితకామి అగు శిష్యుని తన వెంటతీసికొని, తానును హితకామియు ఇద్దరును స్వప్నశరీరములతో జీవన్ముక్తగురువులవారి ఆశ్రమముచేరి గురుదేవులవారికి తమ రాకను వెరిగింతురు.

గురుదేవులవారు మధ్యవర్తిగురువులవారిని, శ్రోత్రగా నక్కడికి పోయిన హితకామియగు శిష్యుని ఇద్దరిని తమ ఆశ్రమములోనికి రమ్మందురు. హితకామియైన శిష్యుని కార్యములను ఆమోదించి అతని సమూహమునందున్న సామాన్యజనులకంటె హితకామి ఉత్తముడు అని సంతోషవార్తలను పలికి వారిని అదరింతురు.

## శిష్యుని ప్రతికృతి

లోకమునందు సంచరించుచు గుప్తశాఖలో నుండువారలను సిద్ధపరుచుచుండు మధ్యవర్తిగురువులవారు జీవన్ముక్తగురువులవారి ఆజ్ఞ చొప్పున తనవెంటతీసుకొనివెళ్లిన హితకాముడైన శిష్యుని జీవన్ముక్త గురువులవారు కొన్నిసంతోషవార్తలతో స్వాగతమిచ్చి ఇకముందు అంగీకరింపబడుటకుగా సిద్ధపడవలసినందుకు కావలసిన కొన్నిబుద్ధి మతులను శిష్యునికిచెప్పి శిష్యపరిశోధనకు ప్రారంభింతురు.

పూర్వకాలమునందు శిష్యుడు గురువులవారి అశ్రమములందే కొన్నిసంవత్సరములకాలము ఉండుచుండెడివారు. ఈ కాలపు పరిస్థితులను అనుసరించి శిష్యుని స్థూలశరీరముతో తమయొద్ద నిలుపుకొనుటకు బదులు శిష్యుని వాని జీవనోపాయములు జరుపుకొనుటకుగా వాపసు అంపింతురు. అయితే శిష్యునియొక్క ప్రతికృతి ఒకటిని సిద్ధపరుచుకొని ఉంచుకొందురు. ప్రతికృతి అనగా సాదృశ్యరూపము. ఫోటగ్రాపు కాదుగాని ఒక బొమ్మ. “సాదృశ్యప్రతికృతి దర్శనైః ప్రియాయాః” అని కవి కాళిదాసు ఉపయోగించి యున్నాడు. ఈ బొమ్మ స్థూలశరీర బొమ్మకాదు. స్వప్న దేహము అను ఆస్ట్రిలుబాడీ మనశ్శరీరము అను మెంటలుబాడీ వీటియొక్క ఛాయారూపము. అనగా శిష్యుని మనోభావములు అతని స్వప్న దేహమును, మనశ్శరీరమును ఎట్లు స్వల్పమార్పులనైనను విడిచిపెట్టకయే చూపునో అదే విధమున ఈ బొమ్మయు మార్పులను చూపును. అసలుశిష్యుని యొక్క స్వప్న దేహమునం (ఆస్ట్రిలుబాడీయం) దు ఏ విధములైన మార్పులు కలుగునో ఆ విధములైన మార్పులు ఈ బొమ్మయందు

కూడ కనుకోవచ్చును. జీవన్ముక్తగురువులవారు శిష్యుని శోధించుట ఈ విధముగా నుండును.

మన అందరియొక్క మనోభావములు మన స్వప్నదేహము నందు మార్పులను కలుగజేసి ఆ దేహముయొక్క స్పందములను మార్చును. మనయొక్క మనశ్శరీరమును మన సంకల్పములు మార్చును. శిష్యునియొక్క స్వప్నదేహమందు కలుగు మార్పులు (గురుదేవులవారి ఆశ్రమమునందుండు) స్వప్నదేహముయొక్క ప్రతినిధియగు ఛాయారూపముగానుండు బొమ్మయందుకూడ కనబడును. అదేవిధముగా మనశ్శరీరమునందుకూడ. జీవన్ముక్తగురువులవారు ఈ బొమ్మను తమకు అవకాశముకలిగినపుడంతయు పరీక్షించుచుందురు. శిష్యుడు వాని నివాసస్థలమందు వ్యవహారములలో మనశ్శాంతిని పోగొట్టుకొనెనా, లేక మతిహీనుడై విషయసుఖములయందు అధర్మముతో నడుచుకొనెనా, లేక మనశ్చాంచల్యము, దుఃఖముతో ఖిన్నుడగుట మొదలగు దుర్మార్గములందు పడెనా అను రహస్యమును కనుగొందురు. శిష్యుడు గురువులవారి యెదుటగాని మరి యెట్టివారి యెదుటగాని చేయుటకు సిగ్గుపడగల నడతలను దాచిపెట్టుకొని, కప్పిపెట్టవచ్చును. కాని కప్పిపెట్టవలెనన్నను సాధ్యము కాచాలదుగా నేర్పడిన ఆ బొమ్మను చూచినంతమాత్రముననే గురుదేవులవారికి శిష్యునియొక్క తప్పులు ఒప్పులు అన్నియు వ్యక్తపడును. "ఆదౌ శమదమప్రాయైః గుణైః శిష్యం విశోధయేత్" అను చర్య ఇట్లు జరుగును. శిష్యులు శ్రీ గురుదేవులవారి యెదుటనుండిన యెడల కొన్ని అయోగ్యములైన తలంపులను తలంచరు. దుష్టకార్యములనుచేయరు. అపవాదాస్పదములైన మాటలనుగాని వృథా వాక్యములనుగాని దూషణాదిభాషణంబులనుగాని జరుపరు. శ్రీ గురుదేవులవారి మరుగున తనయొక్క దైనందిన వ్యవహారములయందు ఎవ్వరికిని భయపడక తనయొక్క దుష్టస్వభావమును వ్యక్తపరుచుటకు జంకడు. అప్పట్లో గురుదేవులవారి జ్ఞాపకము ఉండదు. కనుక పరిశోధన అను కార్యము పరోక్షమునందుండి బొమ్మలో కనబడు మార్పులను చూచినపుడు బాగుగా లోటులేక జరుగును.

ఇట్టి శోధన దీర్ఘకాలము జరుగును. శోధించి శోధించి దినదినమును మేలుగా అగుచున్నదని తెలిసినపిమ్మటనే అంగీకరించుట సాధ్యము. ఇంతటి కఠినమైనశోధన ఎందుకుగా జరుపవలెను అని చదువరుల మనస్సులో తోచవచ్చును. అందుకు జవాబుగా

> శిష్యాఽజ్ఞాన కృతం పాపం గురోః భవతి నిశ్చయః ।
> తస్మాత్ సర్వప్రయత్నేన గుణాన్ సర్వాన్ పరీక్షయేత్ ॥
> పరీక్ష్య బహుధా శిష్యం ఉత్తమం నీచకర్మభిః ।
> నీచం చ ఉత్తమకర్మణ తతో దీక్షాం సమాచరేత్ ॥
>
> (ఆగమశాస్త్రములు)

శిష్యుడు అజ్ఞానముతో చేయుపాపము గురువులవారినే అందును. ఇది నిశ్చయము. కనుక సర్వప్రయత్నములచే అన్నిగుణములను పరీక్షించవలయును. ఉత్తమవర్ణమునందు పుట్టినశిష్యుని నీచకర్మముల యందు నియమించియు నీచవర్ణమువానికి ఉత్తమకర్మల నిచ్చియు వారలమనస్సులలో కలుగునట్టి మార్పులను గమనించవలయును.

> ప్రత్యక్షాభిః పరోక్షాభిః ఉపాధిభిః అనేకధా ।
> శోధితా యైకరూపాయ రహస్యామ్నాయ గోపినే ॥

పరీక్షను ప్రత్యక్షముగాను పరోక్షముగాను పరీక్షించి ఆ పరీక్షయందు తేరినవానినే శిష్యునిగా నంగీకరించ తగును.

### అంగీకారము

అంగీకారము అను పదవియందు గురుశిష్యులకు కలుగు ఒద్దిక ఇంతటిది అనిచెప్పుటకు మాటలు చాలవు. 'గురుశిష్యులొక్కటియే కదా' అను వాక్యమునందు సూచించబడిన ఐక్యభావము లోకము నందు ఏ ఇద్దరు పురుషులకైనను ఉన్నయెడల ఇట్టిది అని ఉపమాన ము చెప్పవచ్చును. కాని అట్టి ఏకీభావము లోకమునందెచ్చటను కానరాదు. అందువలన నిరుపమ మయినది. జీవన్ముక్తులగు గురువులవారు తమ తేజస్సును శిష్యుని తేజస్సులో చొప్పించి ఆరీత్యా శిష్యునితో నొక్కటియై ఆ ఐకమత్యమును దటపరిచి శిష్యుడు

గురుదేవులే తాను అని అనుభవమువల్ల తెలిసికొనునట్టు ప్రయత్నము చేయుదురు. (చదువరులు ఈ ఐకమత్యము ఎట్లు ఉండును అని చక్కగా మననము చేసిచేసి దీనియొక్క అర్థపుష్టినంతయు చక్కగా గుర్తెరుగుట మేలు.)

ఇంతటి దట్టమైన ఏకీభావము ఉండినపుడేగాని శ్రీ గురుదేవులవారి లోకోపకారసేవ శిష్యుని మూలముగా జరుగదు. ఇంతగా నిండి నిబిడీకృతమైన ఏకీభావమువల్లనేగాక ఇతరవిధమున గురువులవారియొక్క తలంపులు దీవనలు లోకమునకు శిష్యునిమూలమున ప్రసరించవు.

పరిశోధనఅను భూమికయందుండు శిష్యుడు లోకులలో నితరులగు మంచి శీలసంపన్నులకంటె అధికుడు అనుటకు కారణములేదు. మంచి శీలముకలిగి "శుభేచ్ఛ" అను భూమికయందుండు హితకాములు అనేకులు ఆరంభమునందు మితిమీరిన అక్కరతో పైకెక్కవలెనని ప్రయత్నముచేయుట సహజమే. హర్షముతో నారంభించిన వారందరును హర్షమును కొంతకాలమునకు పోగొట్టుకొందురు. హర్షము చచ్చినపుడు ఉద్వేగముపుట్టును. గబగబ గుణమును హితకామియైన శిష్యుడు అణగద్రొక్కి ఆరంభశూరత్వమును గెలిచి స్థైర్యము, సౌమ్యము, శ్రద్ధ అనుగుణములను సంపాదించుకొనవలయును. గబగబ గుణమే కార్యసిద్ధికి ముఖ్యము అని తలవక ప్రవాహకాలమునందు నదీజలమునందు కానవచ్చు గబగబత్వము ప్రవాహము నిలిచినపుడు గబగబత్వములేకయే జలము వడిగా ప్రవహించినట్టు స్థిమితము వేగముతోకలిసియున్నట్టు శిష్యుని స్వభావము స్థిమితమును ఉపర్యుపరి పదవులకు పోవలెనను ఆస్థనుకూడ చూపవలయును. "యతాత్మా దృఢనిశ్చయః" అను వాక్యమునందును "బుద్ధ్యా ధృతి గృహీతయా" అను వాక్యమునందును ఉండు అర్థము ప్రకారము నడుచుకొనవలయును.

ఈ ప్రతికృతిఅను బొమ్మయందు శిష్యునియొక్క తప్పులు మాత్రము కనపడునని తలవకూడదు. త్రుటులు కనబడినట్టుగానే మంచిగుణములు, పరోపకారబుద్ధి, సమయస్ఫూర్తి, కార్యసాధన

యందుచేయు యుక్తులు దక్షత మొదలగు గుణములుకూడ కనబడును. ‘‘మేధావీ పురుషో విద్వాన్ ఊహాపోహ విచక్షణః’’ అను గుణములు ఉన్నయెడల అవియు కనబడును. ‘‘సంతుష్ట స్సతతం యోగీ’’ అను వాక్యమునందు గల గుణములును, ‘‘అనపేక్షః శుచిః దక్షః ఉదాసీనః గతవ్యథః’’ అను గుణములును ‘‘అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణః’’. ‘‘నిర్మమః నిరహంకారః’’ అను గుణములును శిష్యునియందు ఉన్నయెడల అవియు శ్రీ గురుదేవులవారు ఆ బొమ్మమూలముగా నిరాటంకముగా తెలిసికొందురు. ఇట్లు శ్రీ గురుదేవులవారు పరీక్షను జరుపుచు దీర్ఘకాలము శిష్యుని పరిశోధించి పై మెట్టుకు ఎక్కించవచ్చును. శిష్యుడు అర్హుడే అని నమ్మకము ప్రబలను ప్రబలను శ్రీ గురుదేవులవారు సంతుష్టిచెంది పైమెట్టునకు ఎక్కగలందులకు కావలసిన సహాయము చేయుదురు.

శిష్యుని పరిశోధించువిధమును కొంతమట్టుకు ఒకటి రెండు సందర్భములను వివరముగా వ్రాయుచున్నాను. శ్రీ లెడ్బీటరుగారి పుస్తకములోనుండి ఎత్తి వ్రాయబడుచున్నది.

శ్రీ లెడ్బీటరుగారు చెప్పుచున్నారు:

ఒకరాత్రి శిష్యులు కాబోవు బాలురను వెంటపెట్టుకొని నేను జీవన్ముక్తగురువులవారగు శ్రీ కుటుహూమి ఋషిగారిబసకు వెళ్లితిని. వారు తమయింటి వసారాలో కూర్చొనియుండిరి. నేను బాలురతోకూడ వారిని సమీపించగానే వారు తమ చేతులను చాచి బాలురకు స్వాగతమిచ్చిరి. బాలురందరును నమస్కరించి గురుదేవులవారి ముఖమునందే దృష్టి నిలిపియుండిరి. అపుడు గురుదేవులవారు ఇట్లనిరి.

మీకు స్వాగతము. పూర్వజన్మములయందు మీ రందరును నాతోకూడ లోకసేవ చేసినవారలు. ఈ జన్మమునందుకూడ అట్లే చేయుదురు అనుకొనుచున్నాను. . . . . . . . . మీరు మీ శరీరములపై పరిపూర్ణ జయమును సంపాదించవలయును. మిమ్ము ను మీరు పరిపూర్ణముగా మరిచి ఇతరులను గమనించి

వారలపాలిటి దైవములుగా నుండుటకు నేర్చుకొనవలయును. ఇట్లు నడుచుకొనగలరా అని అడిగిరి.

శిష్యులందరును నమ్రతతో మా శక్తికిసాధ్యమైనంతవరకును అట్లు నడుచుకొనుటకు ప్రయత్నము చేయుదుము అని చెప్పిరి.

అపుడు గురుదేవులవారు తమ సమీపమునందుండిన బాలుని తనకుగా లాగికొని వాని శిరస్సుపైన తన రెండుచేతులను ఉనిచి అట్లైతే నిన్ను నా శిష్యునిగా నెత్తికొని పరిశోధనను ఆరంభించెదను. మరియు నిదిమొదలు నీవు జాగరూకతతో కృషి చేసితివేని నిన్ను అంగీకరించగలను. నా ఆశీర్వాదము నీపై నున్నది. ఈ అశీర్వాదమును లోకులపై వెదజల్లుట నీ భారము అనిరి.

శిష్యుడు స్వామిన్ నన్ను మంచివాణ్నిగా జేయుడు అనెను.

గురుదేవులవారు చిరునవ్వుతో నీ ప్రయత్నమువల్లనే ఈపని సాధ్యమగును. అయినను నేను నీకు సహాయముచేయుదును అనిరి. ఇదేవిధమున ఇతర బాలురనుకూడ అనుగ్రహించిరి. ఇందుకు అనంతరము శ్రీ గురుదేవులవారు లేచినిలబడి నావెంబడి రండు, నే నేమి చేయుదునో చూడుడు అని ముందుకు పోసాగిరి. మే మందరము వెంబడించి వెళ్లితిమి. మమ్ముల నందరిని ఒక గుహ లోపలికి తీసుకొని వెళ్లిరి. అచట బాలురతో మీ ప్రతికృతి బొమ్మలను నిర్మించబోవుచున్నాను చూడుడు అని చెప్పి బొమ్మలను నిర్మించిరి. ఆ బొమ్మలలో నొకటిలో నొకమెట్టిమచ్చ కనబడెను. అపుడు గురుదేవులవారు అ బొమ్మయొక్క అసలు ఆసామినిచూచి ఈ మెట్టిమచ్చ ఏమిటి అని అడిగినందుకు శిష్యుడు తనకు తెలియదు అనెను. పూర్వదినమునందు శిష్యుడు చూపిన కోపభావముయొక్క గురుతు అని శ్రీ గురుదేవులవారు అతనికి తెలియపరిచి ఇటువంటివర్ణము ఉండకూడదు అనిచెప్పిరి. మరియును ఈ బొమ్మలను పదేపదే నేను చూచుచు మీరలు ఏ విధముగా నడుచుకొనుచున్నారు అని నేను కనుగొందును

అని చెప్పి, మా కందరకును సెలవిచ్చిరి. మేము నమస్కృతు లొనర్చి మా దారిన తిరిగివచ్చితిమి.

అని శ్రీ లెడ్బీటరుగారు తమ గ్రంథమునందు వ్రాసియున్నారు.

ఇదివరకు చెప్పినదంతయు బాలశరీరవాసుల విషయము. ప్రౌఢులను శోధనయందు ఉంచినయెడల వారల స్వభావ గుణ కర్మల ననుసరించి ఆయాచర్యలయందే లోకోపకారమును చేయుటకు ఏర్పరు తురు. బాలురకు జాగ్రదవస్థయందు విమర్శచాలదు గనుక ఇట్టి పనిని ఈ విధమునచేయవలెనని శ్రీ గురుదేవులవారు నిర్ధారణచేయు దురు. శిష్యులనైపుణిని గమనించి వారికి యుక్తము అని తోచినపుడు శిష్యులకు కొన్ని బుద్ధివార్తలను అంపుటకలదు. అట్లు పంపిన బుద్ధి వార్తయొకటి ఈ దిగువ వ్రాయబడుచున్నది.

మహీపీఠపు ఋషుల అభీష్టమును జరుపవలెనను ఆశ నీకు నిశితము గానున్నది అని నేనెరుగుదును. అయినను ఇకముందు ఉన్నత భూమికలు నీ వెక్కవలసియున్నది అని మరువకుము. పంథ యందు (నివృత్తిమార్గమునందు) అభ్యుదయసిద్ధి కావలె నన్నయెడల ప్రమాదములేని జాగరూకత కలిగియుండ వలయును. లోకసేవచేయవలయునని నీకు స్థూలముగా తెలిసి యున్నను స్వల్ప సహాయములను ఇతరులకు చేయుటకుగా సందర్భములను వెదకుచుండవలయును. చిన్నచిన్న సహాయ ములు సుష్ఠుగా చేసి చేసి వాడుకపడినపుడే పెద్దఉపకారము సవరణగాజేయుటకు వీలు కలుగును. నీవు నివృత్తిమార్గమును (పంథను) కోరుకొన్నాడవు అను సంగతిని మరువకుము. ఈ జ్ఞాపకము నీకెప్పుడును లోకుల దుష్టతలంపు లనెడి నారాచ ములను దూరాన తరిమి నిలుపుటకు ఉపయోగించును. ఇది ఒక కవచముమాత్రముగాక చక్కని కార్యములను సుష్ఠుగా జేయుటకు ఒక ప్రోత్సాహముగా కూడ నుండును. గ్రామ్య బుద్ధులయొక్క నీచ స్వభావములు నివృత్తిమార్గమును అవలం బించినవారికి అనుష్ఠేయములుకావు అని నీవెరుగుదువు. నీచ

కృత్యములను అనుష్ఠించువారియందు కనికరమును, కృపను చూపవలసినది మనకు విధాయకము.

జీవన్ముక్తి యింకను చాలదూరముగానున్నను ఆ మార్గమును త్రొక్కుటకు ప్రారంభమైనదికదా. నీవు సహాయపరుడవు అని లోకులు గుర్తించరు. ఐనను జీవన్ముక్తుల కారుణ్యము అను సూర్యకాంతిని నీవు వెదజల్లవలయును.

ఇప్పటికే ఎంతో సాధించినాను అనుకొని ప్రయత్నమును మందగించకుము. కుశాగ్రబుద్ధిని సంపాదించుట అవశ్యము అను సంగతిని మరువకుము. అనుకంప, కృప, సహన అనుగుణములు మనయందు వృద్ధిచెందుచున్నవి అని నిశ్చయము కావలెను. ఏదైనను ఒక విషయమునుగురించి చర్చించునపుడు ఇతరుల అభిప్రాయములు మనయొక్క అభిప్రాయములతో నేకీభవించక పోవచ్చును. అందువల్ల ఆ అభిప్రాయములు తప్పులు అనుకొనగూడదు (ఈ విషయము ఈ గ్రంథము ౧౩౫ వ పుటయందు చూడుడు). కనుక ధిక్కారవార్తలు, వాదమునందు పట్టుపట్టుట, క్రోధముమొదలగు పెడసరపు గుణములను సమీపమునకు రానీయకూడదు. మాటలు కొద్దిగానుండవలయును. అవికూడ నాణ్యములుగా మర్యాదకలవిగానుండవలయును. మాటలాడుటకుముందు నీ మాటలు యుక్తియుక్తములా ప్రియకరములా హితకరములా అని (౧౫౩ వ పుటచూడుడు) విమర్శించి మాటాడవలయును. ప్రేమరసమును తనయందు వృద్ధిపరుచుకొనువాడు ఎల్లపుడును కాపాడబడును. ప్రేమరసము (కరుణారసము) అన్నిటికిని ఆధారము. కరుణారసము లేనిదే ఎన్ని ఆచారములున్నను చాలదు. కోపతాపాది దుష్టభావములు దూరాన నుంచబడవలయును. మననము చేసి చేసి ఈ దుష్టతలంపులు నిన్ను వదిలిపోవునట్టు చేసికొనుము. నీకు కోపోద్రేక సూచనవచ్చినను ఆ ప్రదేశములు మహాపీఠమువారి శాంతతను అల్లకల్లో

లము చేయును. గర్వము జనించనేకూడదు. వృద్ధిచెందుట కాశయుండువానికి గర్వము పెద్దప్రతిబంధకము. మహానాణ్యమైన తలంపులు పలుకులును అభ్యాసపడవలయును. ఇతరులకు ఎట్టివిధమైన మనఃకంపమునుగాని అసూయనుగాని మన పలుకులు కలుగజేయకూడదు.

ప్రతినిత్యమును ఏదోయొక లోకోపకారమును నిర్ధారముగా చేయవలయును. అవకాశమున్నపుడు ఇష్టమున్నపుడును ఏదేని చేయుదును అని తలవకూడదు. నా మనస్సుకు ఇష్టమైన లోకసేవ చేయుదును అని కాదు. లోకమునకు అవశ్యముగానుండు సేవ నాకు సాధ్యమైనంతమట్టుకు శక్తినిమించినట్టు చేయుదును అని చేయవలయును. నేను ఏ విధముగా మోక్షము చెందగలను అని చింతించక ఇతరులను ఏ విధముగా వృద్ధికి తేగలను అని లోకసేవ చేయవలయును. నివృత్తి మార్గమునందు చరించువానికి దయ, సహాయపరత్వము, ఏ సందర్భమునందును ఇతరులకు సహాయముచేయు స్వభావము ఇవి సహజగుణములుగా నుండవలయును. ఇతరులకుగా పాటుబడినకాలమే సరిగా వ్యయపెట్టబడినకాలము. ఆ దినమే సుదినము అని ఎల్లపుడును స్వభావజన్యమైన పరోపకారబుద్ధిని వృద్ధిపరుచుకొనవలెను.

నీలో తప్పులున్నపుడు ఇది ఏమి అంతటి తప్పుకాదు అని నీయందు దయచూపుకొనకూడదు. కఠినముగా విమర్శించి నిన్ను నీవు దండించుకొనినట్టు దిద్దుకొనవలెను. పట్టుదలతో పని చేసినయెడల ఫలము సిద్ధించును. మనోనిశ్చయము ఉన్న యెడల నిన్ను నీవు చక్కపెట్టుకొనుట సాధ్యమే. గురుదేవులవారు నా తప్పులను దిద్దుదురు అని యుండకుము. ("చంద్రస్వరూపం నిజచక్షుషైవ జ్ఞాతవ్య మన్యై రవగమ్యతే కిం" చంద్రుడు ఈ విధముగానుండును అని ఒకడు తన కండ్లతో చూచినపుడే కదా చక్కగా తెలియును. ఇతరులు

చెప్పితే తెలియునా.) ఆ ప్రకారముగా నీతప్పులు వాట్లను దిద్దుకొనుట ఇట్టివి నీవుగా చేయవలసిన పనులు.

నీవు కృపాకటాక్షములను చూపుటకు కావలసిన సందర్భములు నీ యెదుట నేను కనపరిచియున్నాను. ఆ సందర్భములను నీవు సంతోషముతో ఉపయోగించుకొని సేవచేసియున్నావు. కనుక ఇంకను అట్టి పరిస్థితులను కలుగజేయుదును. నీకు సాధ్యమైనంతమట్టుకును అవ్యాజముగా ఆ పరిస్థితులను అవలంబించి సేవచేయవలయును. అప్పుడే నీవు ఈ మార్గమునందు వృద్ధికెక్కగలవు. చేతికివచ్చిన పనిని చక్కగా చేసినందుకు బహుమతిగా మరికొంచము అధికముగా పనిదొరుకును. యుక్తితో క్రియాసిద్ధి జరిపినవానినే కదా నమ్మి మరికొంత పని యిత్తురు. నీకు స్వల్పపనులు అని తోచినవాటియందు గురువిశ్వాసము, లోకముపైన ప్రేమయు, చూపి కార్యసిద్ధి కలుగునట్టు నడుచుకొంటివేని నీవు అధికము, గొప్ప అనుకో గల పనులు నీకు ఇయ్యబడును. నీకును నాకునుగల సంబంధమును శీఘ్రముగా దట్టముగాచేసికొని నీ సహపాఠిశిష్యులు వృద్ధికివచ్చుటకు వారలకు కావలసిన సహాయములను చేయుచు నివృత్తిమార్గము అను జ్ఞాననిష్ఠయందు భూమికలను జయింతువని నేను నమ్ముచున్నాను. నీవు ఇప్పటికే లోకమునందలివారిని ప్రేమించుశక్తి కలిగియున్నావు. నీతో సమానులైన వారిపై ప్రేమను వర్షించుటకు శక్తియున్నది. అట్లు చేయుటకు నీకు ఇష్టమును ఉన్నది. మహారాజు లోకులపై ఔదార్యమును, కృపను వర్షించు చందమున నీవు ఉదారగుణముకలిగియున్నావు. పూర్వజన్మములయందు సంపాదించిన ఈ మహాగుణములను పొందియుండుట నీయదృష్టము. అయితే నీవు బహుజాగరూకతతో నిన్ను పరీక్షించుకొనుచుండుము. ఏలయనగా నీకును తెలియకనే నేనింతగొప్పవాడనుకదా అను గర్వము ఉద్భవించి నిన్నుచెరుచును.

కనుక సదాకాలమందును ఉదారము మొదలగు గుణముల నన్నిటిని వర్ణించుచు గర్వమునకు ఆస్పదమియ్యకుండుము. "జ్ఞానమార్గమునందు ప్రవేశించినానే అని నమ్రతను అభ్యసించుము. జ్ఞానభూమికలనన్నిటిని జయించినాను అని తెలిసి మరియు నెక్కువగా నమ్రతచెందియుండుము. నమ్రతయే జ్ఞానికి చిహ్నము" అని పెద్దవారు చెప్పియున్నారు. కనుక ఎప్పుడును నమ్రతను అభ్యసించవలయును. అణుకువ ఉండవలయును.

జీవాత్మలతో ఏకీభావముచెందుటకుగా నీకు తెలిసినందరిని నీవు ప్రేమించవలయును. అయితే తెలిసినవారినిమాత్రము ప్రేమించితే అది చాలదు. నీకు తెలియనివారినికూడ ప్రేమించి వారల హృదయములలో వారి యెరుకలేకయే ప్రవేశించి ఆరీత్యా వారి కష్టనష్టములు ఇట్టివి అని తెలిసికొని వారికి నీచేతనైనవరకును మనసా వాచా కాయములతో సహాయముచేసి వారల కష్టములను నివారణచేయుటకు నేర్చుకొనవలయును. (ఈ సందర్భమందు రంతిదేవుని కథను చదువవలయును).

శ్రీమద్భాగవతమునందు రంతిదేవుడు అనువాని వృత్తాంతము చెప్పబడియున్నది. రంతిదేవుడు జీవకారుణ్యమును అభ్యసించినవారు. ఇతరుల కష్టములనంతయు తాను తీసికొని కష్టమిశ్రమములు కాని సుఖములను ఇతరులు అనుభవించునట్టు చేయుశక్తి తనకు కలుగవలెనని ప్రార్థించుచు ఆ విధముగా నడుచుకొనిన మహానుభావుడు. ఇతని కథ 'ఆత్మవిచారము' నందు వ్రాయబడియున్నది. "న కామయే హం గతి మీశ్వరా త్పరాం అష్టర్ధియుక్తా మపునర్భవం వా। ఆర్తిం ప్రపద్యే అఖిలదేహభాజాం అంతః స్థితో యేన భవంతి అదుఃఖాః॥ అనియు "కృపయా భృశసంతప్తః" అనియు చెప్పబడియున్నది.

మరియు శ్రీ గురుదేవులవారు ఇట్లుచెప్పిరి.

ఇతరుల తప్పులనుగురించి గమనించి వారలను హాస్యమాడుట అతి సులభమైనపని. కాని వారలు ఎందువల్ల తప్పులను చేసినారు అని విమర్శించి తెలిసికొని వారితో కలిసిమెలిసి వారి భావములను బాగుగ తెలిసికొని వారిని ప్రేమించి అనుకంప గలిగి వారిని సవరించుట కష్టము. లోకులను నీవెంబడి నివృత్తి పంథయందు లాగుకొని వెళ్లుటకు వేరు విధమైన ఉపాయము కానరాదు. ఈ విధముగా నంతయు నీవు ఆచరించి వృద్ధికి వచ్చినపుడు నేను చేయుచున్న ఉత్కృష్ట లోకసేవయందు నిన్ను సహాయమునకు ఉంచుకొందును. నాయొక్క కార్యమునందు నాకు అనేకుల సహకారము కావలసియున్నది. కనుక నీవు త్వరగా వృద్ధికిరావలెనని నా దీవనలు నీపై వెదజల్లెదను. కోపమునకు కొంచమైనను ఆస్పదమియ్యకుము, అణుకువను సదా అభ్యసించుము, నిన్ను నీవు ఎల్లపుడును మరిచియుండుము. ఈ విధములచే నీవు వృద్ధిచెందగలవు.

ఇన్నివిధములుగా యుక్తులునేర్పి "దుర్గం పథం" అని పేరుగల జ్ఞానమార్గమునందు చరించునట్టిశక్తిని ఇచ్చుటకుగా శిష్యుని పరిశోధించుట ఆనుపూర్విక సంప్రదాయము. సనాతనమార్గయాత్రకు ఇది మొదటిభూమిక. ఇట్లు మహీపీఠమునందు గల ఋషులపైకి శిష్యులను సంపాదించి పై భూమికలకు సిద్ధపరుచు జీవన్ముక్తులు నడుచువిధముగా నున్నది. శిష్యులను కోరకయే తమంతటతాము లోకరాజ్యమును నలుపుఋషులు కొందరుగలరు. వారల చర్యలను గురించి మనము తెలిసికొనుట అసాధ్యము. మనమును జీవన్ముక్తులయితిమేని అప్పటికి విదితమగునో ఏమో. అందుకుగా ప్రయత్నము చేయుచు లోకులను మనవెంబడి పట్టుకొని వెళ్లవలెను. ఈ మార్గమునకు దీక్షామార్గము అని పేరు. మరియొకటి మోక్షమార్గము లేక సద్యోముక్తిమార్గము అనబడును. దీక్షామార్గమునందు శిష్యుని గురు

వులవారు పరిశోధనచేయు సందర్భమునం దున్నాము. పరిశోధన పరి పరి విధముల చేయబడును. శ్రీ గురుదేవులవారు వారి ఆశ్రమము నందే ఉండి వారు సంపాదించిన జ్ఞానదృష్టితో శిష్యునియొక్క సదాచారములను మెచ్చుచు త్రుణ్ణతలను సవరించుచుండు స్థితి ఇది. ఇట్లు పరీక్షించి తృప్తికరముగా నున్నపుడు శిష్యుని అంగీకరింతురు. అంగీకరించిన పిమ్మట శిష్యునిబొమ్మను చెదరగొట్టుదురు. చదువరులు ఈస్థితిని శీఘ్రముగా చెందగలరని గ్రంథకర్త అతని గురుదేవులవారిని ప్రార్థించుచున్నాడు.

## అంగీకృతశిష్యుడు

దీర్ఘకాలమో స్వల్పకాలమో ఏ శిష్యుని విషయమునం దెట్లు జరుగవలెనో ఆ విధమైనశోధన జరిగినపిమ్మట అంగీకరింపబడుటకు అర్హుడే అని జీవన్ముక్తగురువులవారు తలచినపుడు శిష్యుని అంగీకరింతురు. ఒకానొక శిష్యుని జీవన్ముక్తగురువులవారు అంగీకరించినపుడు జరిగినసంభాషణను ఈ క్రింద వివరించుచున్నాను. (ఇది శ్రీ లెడ్బీటరుగారి గ్రంథమునుండి వ్రాయబడినది).

దినచరి ప్రకారము నేనును నా స్వాధీనమునందు ఉండినశిష్యులును కుటుహూమిఋషిగారి ఆశ్రమమునకు వెళ్లితిమి. మోర్యాఋషిగారుకూడ అచ్చటనుండిరి. ఏదో బహు అక్కరతో సంభాషించుచుండిరి. వారి సంభాషణ చాలించినపిదప మామూలు ప్రకారము స్మేరాననులై కుటుహూమిఋషిగారు మమ్ములను పిలిచిరి. ప్రణామపూర్వకముగా లోపలప్రవేశించితిమి. నా వెంబడివచ్చిన శిష్యులపైకి ఒకరు జీవన్ముక్తులవారికి చాల ప్రియశిష్యుడు. అతనిని చూచి గురుదేవులవారు ఇట్లు పలికిరి:

నీవు నా పనిని చేయుదువని నిశ్చయించుకొన్నావా? లోకోపకారమైన సేవను జాగరూకతతో చేయగలవా?

ఇందుకు శిష్యుడు తాను అలాగేచేయను నిశ్చయించుకొన్నాను అని ప్రతియిచ్చెను.

అందుకు మరల జీవన్ముక్తులు ఇట్లు పలికిరి:

నీవు సరిగానే పనిచేయుచున్నావు. ప్రయత్నమును తగ్గించకుము. నీ యొక్క సేవను మనోనిశ్చయమును చూచి మెచ్చి నీ పరిశోధనకాలమును తగ్గించినాను. నీవు ఇతరశిష్యులకును సహాయముచేసి వారినికూడ నీవలె శిష్యత్వమునకు సిద్ధపరిచినావు. అందుకు నాకు చాల సంతోషము. స్వప్రయోజనపరముకాని ప్రేమయే నిజముగా లోకమునందు నివృత్తిమార్గముయొక్క ఫలము ననుభవించుటకు తగుమైన సాధకము. నిష్కామ ప్రేమను పరిశుద్ధముగా నుంచువారు కొందరే. ఈర్ష్యగాని స్వప్రయోజనేచ్ఛగాని వారలకు తెలియకయే ప్రవేశించును. నీవు ఇదివరకును నీ ప్రేమను పరిశుద్ధముగా నుంచుకొని యున్నావు అనునది నిజమే. అయితే విమర్శజ్ఞానము, జాగరూకత అను ఈ రెండుగుణములను బలపరుచుకోవలయును. సందిగ్ధములయందు తటాలున ఎట్లు నడువవలసినదియు నేర్చుకొనవలయు. ఆ నిమిషమునందు కాక పది నిమిషములకు ఆవల విమర్శజ్ఞానము కలిగితే ఉపయోగము లేదు. మాటలాడుటకు మునుపే, ఏదేని కార్యము చేయముందుగానే ఆ మాట ఆ కార్యము వాట్లవల్ల మేలుకలుగునా కీడుసంభవించునా అని చక్కగా ఆలోచించవలయును. అయితే ఇదివరకును నీవు తృప్తికరముగా నడుచుకొనుచున్నావు. కనుక నాకు నీయందు ఇష్టము. సమయస్ఫూర్తి చక్కగా నభ్యసించుము.

అని అతనితో చెప్పి నావెంబడివచ్చిన శిష్యులందరియొక్కయు తలలపైన వరుసను వారి హస్తములను పెట్టిరి. (ఈ విధముగా ఆనుపూర్విక "హస్తమస్తక న్యాయమును" సలిపిరి.)

ఇదంతయు నైనపిమ్మట జీవన్ముక్తులవారు శిష్యులనందరను ఆశీర్వదించి మీరలు అంగీకరింపబడిన వివరమును శ్రీమహాచోహానుగారి రిజిస్టరులలో దాఖలు చేయంతిము రండు అని అందరను

వెంటపెట్టుకొని శ్రీమహాచోహానుగారి ఆశ్రమమునకు వెళ్లిరి. శ్రీమహాచోహానుగారు అందరనుచూచి గమనించి ఇట్లు చెప్పిరి:

మీ రందరును చిన్నవయస్సుగలవారు. అయినను అంగీకరింపబడితిరి. ఇట్టిపదవిని ఇంతటి లేతవయస్సునందే అందినందుకు నాకు చాల సంతోషము. మీకు అందరకును నా సంతోష సన్మానమును ఒసంగుచున్నాను. మీరు అందినపదవిని కాపాడుకొనుడు

అని దీవించి అంగీకరించబడిన శిష్యులందరపేళ్లను తమయొద్దనుండు రిజిస్టర్లలో దాఖలు చేసికొనిరి.

అంగీకారభూమికయందు శిష్యుడు గురువులవారితో నైక్యమును పొందును. గురుశిష్యు లొక్కటియే కదా అని పరమగురుచరణ సన్నిధియందు చెప్పియుండు ఐక్యము అత్యాశ్చర్యకరమైనది. పోను పోను మరి మరి వృద్ధియగునదేగాని వేరుకాదు. దీనిని మనుష్యభాషలో వర్ణించుట అసాధ్యము. ఇట్టి ఐక్యము ఒకతూరి కలిగినపిమ్మట పోగొట్టుటకు సాధ్యముకాదు. గురుదేవులవారి ఆశ్రమములకు శిష్యుని యింటికి అనేకమైళ్లదూరమున్నను జాగ్రదవస్థయందు ఇద్దరిశరీరములు చాల దూరమందున్నను శిష్యుని మనశ్శరీరము మొదలగు ఉన్నతశరీరములు గురుదేవులవారి శరీరముల స్పందములతో నిమిడి ఏకీభావమును చెందియే యుండును. గురుదేవులవారు శిష్యులశరీరములను సర్వకాలములయందును తంబురతంతులకు సుతియెక్కించినట్టుగా గురుదేవులవారు సుతినెక్కించుచుందురు. ఇందువల్ల నిదానముగా క్రమేణ గురుదేవులవారి శరీరముల స్పందములే శిష్యులశరీరస్పందము లగును. అందువల్ల లోకసేవవిషయమునందు గురుదేవులవారు ఏ వివరములను తలతురో ఆ వివరములు శిష్యుల మనశ్శరీరములలో స్ఫురించును. గురుదేవులవారిపైన శిష్యుడు మననము చేయుచుండుటచేత, తాను వారంత వాడు కావలెనని అవ్యాజముగా ఆశించుటచేత, మరల మరల ఆశించగా శిష్యుడు తనశరీర

ములను ఉన్నతస్పందములను కలుగజేయుటకు సిద్ధపరుచుచుండును. గురుదేవులవారి నిశితస్పందములకు అభ్యాసము కాను కాను వారు తలచినదంతయు శిష్యునికి స్ఫురించుచు, లౌకుల గ్రామ్యబుద్ధులు యుక్తులు ఇట్టివాటిని నిగ్రహించుశక్తిని సంపాదించును.

ఈ విధముగా శిష్యుల శరీరములకు సుతినెక్కించుట నిదానముగా జరుగవలయును. తంబరతంతులుకూడ అజాగ్రతగా త్వరగా కావలెనను ఆశతో సుతినెక్కించగా తంతులు తెగునే; అచేతన వస్తువు విషయమందు అట్లగునేని చేతనప్రాణివిషయమందు ఎంత అధికమైన జాగ్రతగానున్నను మేలుకదా. కాబట్టి ఇది నిదానముగా జరుపవలసిన శిక్ష. శిథిలము సాధ్యము. శిథిలములేక బాగుపరుచుట ముఖ్యము. ఇందుకుగా పట్టునట్టి కాలయాపన చింతనీయముకాదు. శరీరములయొక్క స్పందసౌష్ఠవము అతి జాగరూకతతో జరుగవలసినపని.

ఇట్లు స్పందసౌష్ఠవమును సంపాదించిన శరీరములు గల శిష్యుడు భక్తియు ప్రేమయు నిండినమనస్సుతో గురుదేవులవారిని తలచుకొన్న నిమిషమునందే గురుదేవులవారి మనస్సులో శిష్యుని జ్ఞాపకము ఉదయించి ఒక నిమిషమాత్రములో నొక ఆశీర్వాదము (దీవన) ఇయ్యబడును. ఈ ఆశీర్వాదము అనేక కిరణములు ఏక కాలమునందు గుమికూడినట్టి వెలుతురుతో శిష్యుని ఆవరించుకొనును. గురుశిష్యులు ఒక్కటియే కదా అను న్యాయమును అనుసరించి గురుదేవులవారి ఉన్నత స్వభావములు గల స్పందములు శిష్యుని ఆవరించినది సరియే. ఇందుకు సంతోషమేకాని శిష్యుని యందు శిలుకునిలిచియున్న కామక్రోధాది గుణములచే ప్రేరేపింపబడిన తలంపులు దురదృష్టవశమున తలంపబడెనేని అట్టి మందస్పందములు గురుదేవులవారికిని వారిచే నంగీకరింపబడియుండు శిష్యునికిని గల ఐకమత్యప్రభావముచే జీవన్ముక్తులగు గురుదేవులవారి శరీరములనుకూడ తాకును. అట్టి తాకుడు గురుదేవులవారిని నిమిష

మాత్రకాలము వారుచేయుచున్న అత్యున్నత లోకసేవనుండి మర లించును. ఇది గురుదేవులవారికి అసూయకలుగజేయరీత్యా గురుదేవులవారు ప్రియశిష్యుడైనను అతని మందస్పందములుగాని ఏస్పందములుగాని తమను అందకుండునటుల తమ యిద్దరికిని నడుమ నొక మనసా కల్పితమయిన తెరనువేసికొని శిష్యుని కొంత కాలము తననుండి వేరుపరుతురు. ఇది శిష్యునికి చెడ్డ దౌర్భాగ్యము. ఈ దౌర్భాగ్యమును పోగొట్టుకొనుటకుగా తన శీలమును అతి శుద్ధ ముగా నిశితముగా చక్కపెట్టుకొనవలయును. చిత్తశుద్ధి మరల నమ్మక ముగా కలుగునంతవరకును ముందరి అన్యోన్య సంబంధము ఏర్పడదు.

పరోపకారబుద్ధి బలపడనివానిని గురుదేవులవారు అంగీ కరించుటే లేదు. తనను తాను మరిచి ఇతరులకు మేలుచేయని వారికి ఈ అమోఘమైన పదవి రానేరాదు. ఇతరుల సొమ్మును సంగ్రహించు స్వభావమును వదిలి „నిష్పరిగ్రహః" అని శ్రీ మద్భగవద్గీతలలోచెప్పిన విధము మనసా వాచానైనను పరిగ్రహ మును వదలనివారిని గురుదేవులవారు అంగీకరించరు. అంగీకరింప బడిన శిష్యుడు గురుదేవులవారి జ్ఞాపకమునందు మునిగియుండును అను సంగతి మరువకూడదు. అతి జాగరూకతతో లోకసేవచేయుచు మనసా నేను గురుదేవులవారి ప్రతినిధిని అనితలుచుచు ఆ తలంపు అను వింటిత్రాటిని ఎక్కుపెట్టునట్టు మనస్సును మెలుకువతో నుప యోగించుచు తానుచేయవలసిన గురుదేవులవారి సేవ అగు విధిని (Duty) ముగించగానే ఎక్కుపెట్టబడిన వింటిత్రాటిని వదలించినటుల తన మనస్సునుకూడ కొంత తడవు ఖులాసాగానిలుపుకొనవచ్చును. ఇది శిష్యుడు నడుచుచున్న జ్ఞానమార్గము గనుక ఏమాత్రమైనను నిర్విణ్ణుడుకాకూడదు. అనిర్విణ్ణులకుగాని యితరులకు జ్ఞాన మార్గమునందు వృద్ధిలభించదు. ఇన్ని సంవత్సరములు కాచియున్న ను నాశక్తికి మించినంతసేవను అవ్యాజముగాచేసి గురుదేవులవారికి సమర్పించినను నాకు ఏవిధమైన జ్ఞాననిష్ఠయొక్క గురుతులు తెలియ రాలేదే అని వగచుటకూడదు. („మోహాంధకారే నిస్సారే ఉదేతి స్వయ మేవ హి" అని దక్షిణామూర్తి ఉపనిషత్తునందు చెప్పిన

ప్రకారము శిష్యుని మనస్సును అంతఃకరణమును కప్పియున్న మోహము అను నంధకారము తొలగినతోడనే స్వయముగానే అనగా సూచనలేకయే జ్యోతితో సమానమైన తెలివి కనబడును. కాలయాపన కానుకాను శిష్యుడు తన అంతఃకరణమును శోధించు కొనుచు ద్విగుణీకృతమైన దృఢమైన భక్తిని, శ్రద్ధను, అమాయిక పారిశుద్ధ్యమును వృద్ధిపరచుకొనవలయును. శిష్యుడు తనకు వృద్ధి దొరకనందుకు వ్యాకులపడునంతకు పదంతులు అధికముగా గురుదేవులవారు వ్యాకుల పడుదురట. వారికి లోకోపకారకరమైన సేవకు లెక్కకు మించినందరు శిష్యులున్నను చాలదు. కనుక శిష్యులు ఎవరును అంతఃకరణపరిపాకమును పొందుటకు దృఢప్రయత్నము చేయలేదే అని చింతించుచుందురట. కాబట్టి ఫలావాప్తికలుగక పోయినది మనయొక్క తప్పే అని యెరుగవలయును. ఇట్లు అంగీకృతుడైన శిష్యుని సంకల్పములు గురుదేవులవారి అంతఃకరణమునందు ప్రతిఫలించుచు గురుదేవులవారి తలంపులు శిష్యుల మనస్సులలో స్ఫురించుచు వీరలిద్దరికిని నొక విధమైన పరస్పరసంబంధ స్ఫూర్తి కలుగుచుండును గనుక ఒకరున్న తావున మరియొకరున్నట్టే భావము. అనగా శిష్యులు ఉన్న స్థలములో గురుదేవులవారి శక్తి ప్రసరించుచున్నట్టే ఉండును. శిష్యుడు చూచునదంతయు అతని గురుదేవులవారు శిష్యునిమూలముగా చూతురు. శిష్యుడు వినునదంతయు గురుదేవులవారు శిష్యుని మూలముగావిందురు. శిష్యునికి స్ఫురించునట్టి సుఖస్పందములు దుఃఖస్పందములు మనోభావములు గురుదేవులవారికికూడ కలుగును. కనుక అంగీకృతశిష్యుడు గురుదేవులవారితో నేకీభావముచెందిన కారణమున శిష్యునియెదుట నితరులు జరిపిన వ్యవహారములు శిష్యుని మనస్సునందిమిడియుండినందున ఆ నిమిషమునందే గురుదేవులవారు ఆ సందర్భముల నన్నిటిని గ్రహించకపోయినను వారి మనస్సును ఆక్రమించియున్న అవసరమైన ఇతర కార్యము ముగియగానే శ్రీ గురుదేవులవారు శిష్యుని వైపునకు తన జ్ఞాపకమును మరలించగానే శిష్యునియెదుట జరిగిన ఊరివారి వ్యవహారములన్నియుకూడ శ్రీ గురుదేవులవారి మనస్సు

నకు విదితములు అవును. ఐకమత్యముయొక్క మాహాత్మ్యము ఇంతటిది.

శ్రీ గురుదేవులవారికిని శిష్యునికిని ఐకమత్యము నెమ్మదిగా దట్టముగా నేర్పడవలయును అను అంశము ఆధునికములైన దివ్యజ్ఞాన సమాజ గ్రంథములయందుమాత్రము చెప్పియున్నది అని తలవకూడదు. బహుపురాతనములయిన తాంత్రికగ్రంథములలోకూడ ఐకమత్యము చెప్పబడియున్నది. తాంత్రికగ్రంథములలో శారదాతిలక తంత్రము అనునది యొకగ్రంథము. అందులో అయిదవ పటలములో డెబ్బదియేడవ శ్లోకము "విలోక్య దివ్యదృష్ట్యా తం తచ్చైతన్యం హృదంబుజాత్। గురు రాత్మని సంయోజ్య కుర్యా దధ్వవిశోధనం॥" అని చెప్పియున్నది. ఏ విధముననైనను గురుదేవులవారి చైతన్యమునకును శిష్యుని చైతన్యమునకును సంయోజనమైతేనే గాని అంతకు మీద జరుగవలసిన దీక్ష జరుగచాలదు.

అంగీకృతశిష్యునియొక్క అదృష్టము మరియొకటి యున్నది. ఇది మహాద్భాగ్యము. అది అనగా తానుగా విమర్శించి సందిగ్ధములయందు తీర్మానము చేసుకొనలేనపుడు, శ్రీ గురుదేవులవారినడిగి తీర్మానించుకొనుట. అది యెట్లుజరుగును అనగా అనేకులు శిష్యులు అనేకవిధముల నభ్యసింతురు. నా మార్గము (శ్రీ లెడ్బిటరుగారి మార్గము) ఎట్లనగా. మనశ్శాంతితో అనగా మనస్సుయొక్క స్పందనములను పరిపూర్ణముగా అణచి నా గురుదేవులవారిపై ధారణజేసి నాకు సాధ్యమైనంతటి దట్టముగా వారిపైననే నా యొక్క మనస్సును నిలిపి నేను తీర్మానము గోరిన విషయమును శ్రీ గురుదేవులవారే తీర్మానించితే ఏవిధముగా తీర్మానింతురు అని కాచియుందును. అపుడు నాయొక్క మనస్సునందు ఒక తీర్మానము స్ఫురించును. అట్లు స్ఫురించిన తీర్మానము వారిది అని నేను అనుకొందును. అది వారి తీర్మానముగానే ఉండవచ్చును. ఉండకపోవచ్చును. నేను ఆ తీర్మానము అనకొనిన దానిని అవలంబింతును.

ఇట్లు శ్రీ గురుదేవులవారిపైన భారము వేయుట ఎన్నటికో, ఎన్నాళ్లకో కాదాచిత్కముగా మాత్రము ఉపయోగించవచ్చును. శిష్యుడు సోమరియై ప్రతివిషయమునందును గురుదేవులవారిని తొందరపెట్టకూడదు.

శిష్యులు చేయుతప్పులను శ్రీ గురుదేవులవారు గమనించుచుందురు అని యిదివరకే చెప్పబడియున్నది. గమనించి వారి సంకల్పమును మనపార్శ్యమునకు త్రిప్పి తప్పులను వాటియొక్క స్వభావమును వారి మనశ్శక్తిచే మనయొక్క మనస్సులలో స్ఫురించునట్లు చేయుదురు. అట్లుకాక మధ్యవర్తిగురువులవారి మూలముగా అన్యాపదేశముగా చెప్పినట్టు చెప్పింతురు. అన్యాపదేశము అనగా లోకములో ఎక్కడనో ఎవ్వడో మనము చేయుచున్న తప్పులనుచేసి ఇట్టి విధముగా అవమానపడెను అని తెలియునట్టుగా చెప్పి దిద్దుటకు ప్రయత్నపడుదురు. అంగీకృతశిష్యుడు తనను తాను అతివివరముగా పరీక్షించుకొనుచుండవలయును. శ్రీ గురుదేవులవారి దీవనలు శిష్యులమూలముగా లోకమును అందును.

ఆ విధముగా దీవనలు గురుదేవులవారినుండి వెడలి శిష్యుని పరిశుద్ధాంతఃకరణమునందు ప్రవేశించి శిష్యుని అంతఃకరణమునుండి ఆ దీవనలు ఎవరికిగా తలంపబడినవో వారికిచేరును. శ్రీ గురుదేవులవారి అంతఃకరణము మిగుల పరిశుద్ధమైనది. పరిశుద్ధములైన జలములు గొట్టములగుండా ప్రజల ఉపయోగమునకు పారుచుండగా గొట్టములలో ఏ విధమైన మలినమైనను ఉండకూడదుకదా. ఉన్నయెడల జలము గొట్టముల త్రోవను పోవుటవల్ల ఆ గొట్టములలోని మాలిన్యమును కలుపుకొని పోవునుకదా. అందువల్ల మాలిన్యమును కలుపుకోకయే ఉండుటకుగా గొట్టములు పరిశుద్ధములుగా నుండవలయును. ఆవిధముగా శ్రీ గురుదేవులవారియొక్క పరిశుద్ధాంతఃకరణమునుండి ప్రవహించు దీవనలు శిష్యుని పరిశుద్ధాంతఃకరణము త్రోవన ప్రవహించవలసినది ముఖ్యము. మన అంతఃకరణములు అభిమానములు, పక్షపాతములు అనుమాలిన్యములతో కలిసియుండును. శ్రీ గురుదేవులవారి సేవ సుష్ఠుగాచేయుటకై అంగీకృతశిష్యుడు సమదృష్టిగలిగియుండవలయును.

సమదృష్టిని

సంపాదించుకొనుటకుగా

ముష్టయో మోహబీజానాం దృష్టయో వివిధాఽపదాం ।
కుదృష్టయః క్షయం యాంతి దృష్టే తస్మిన్ పరావరే ॥

త్రిమూర్తులకంటె అధికమైన బ్రహ్మమును (శ్రీ గురుదేవులవారిని) గాంచినయెడల మోహములను పుట్టించుతలంపులును నానావిధము లైన ఆపదలకు కారణమైన భ్రాంతియు నశించును.

నిత్య మంతర్విచారస్య పశ్యతః చంచలం జగత్ ।
జనక స్యైవ కాలేన స్వయ మాత్మా ప్రసీదతి ॥
న దైవం న చ కర్మాణి న ధనాని న బాంధవాః ।
శరణం భవభీతానాం స్వప్రయత్నా దృతే నృణాం ॥
అయమే వాహ మిత్యస్మిన్ సంకోచే విలయం గతే ।
సమస్తభువనవ్యాపీ విస్తార ఉపజాయతే ॥
అయమేవాహ మి త్యస్యా నిశాయా ఉదితే క్షయే ।
స్వయం సర్వగతః స్ఫారః స్వాలోకః సంప్రవర్తతే ॥
ఉపాదేయా నుపతనం హేయై కాంత వివర్జనం ।
య దేత న్మనసో రామ తం బంధం విద్ధి నే తరత్ ॥
మా ఖేదం భజ హేయేషు నో పాదేయపరో భవ ।
హేయా హేయదృశౌ త్యక్త్వా శేషస్థః సుస్థిరో భవ ॥
నిరాశతా నిర్భయతా నిత్యతా సమతా జ్ఞతా ।
నిరీహతా నిష్క్రియతా సౌమ్యతా నిర్వికల్పతా ॥
ధృతి ర్మైత్రీ మనస్తుష్టిః మృదుతా మృదుభాషితా ।
హేయోపాదేయనిర్ముక్తే జ్ఞేతిష్ఠం త్యపవాసనం ॥

(యోగవాసిష్ఠము, ఉపశమ ప్రకరణము)

సదాకాలమును హృదయమునందు ఆత్మను (శ్రీ గురుదేవులవారిని) గురించి చింతించుచు లోకసేవయే నిజమైనది అను స్మృతినిచెందిన వానికి కాలక్రమమున ఆత్మ (శ్రీ గురుదేవులవారు) ప్రసన్నమగును. సంసారబాధలవల్ల భయపడిన నరులకు దైవముగాని కర్మలుగాని ధనముగాని బంధువులుగాని సహాయులుకారు. అయితే స్వప్రయత్న

మే సహాయకారి. ఈ దేహమే నేను అనునట్టి తప్పుభావము నశింపగా విశాలదృష్టి కలుగును. లోకమంతయు అతనియందే కనబడును. అల్పస్వభావముగల దేహాత్మభావము అను చీకటి తొలగిన తోడనే సర్వగతమైన సర్వజీవాత్మైక్యభావము ప్రకాశించును. యుక్తములైన వస్తువులను గ్రహించుటయు అయుక్తములైన వస్తువులను నిరాకరించుటయు అనునట్టి మనోభావములే బంధములు. నికృష్టవిషయములను విడుచుటవల్ల కలుగునట్టి ఖేదమును గాని సంపాదించవలసిన శ్రేష్ఠములైన విషయములయందు ఆసక్తిని గాని పొందకూడదు. హేయోపాదేయములైన వస్తువులయందు భేదబుద్ధి బంధము కలుగజేయును. ఈ వస్తువు, ఈ గౌరవము, ఈ మర్యాద, నాకు కలుగుగాక అను ఆశ లేకుండుటయు, సర్వభూతములకును తాను అభయము నిచ్చుచుండుటవలన తనకు దేనినుండియు భయము కలుగుటకు వీలులేదు అను జ్ఞానమును తాను దేహాదులకంటె ప్రత్యేకముగానుండు ఆత్మయే అను నిత్యత్వజ్ఞానమును సకలభూతములను తాను సమానముగా చూచుటవల్లకలుగు సమత్వబుద్ధియు పైచెప్పిన మంచిగుణములను అభ్యసించు నిష్ఠయు, ఆశ లేకుండుటయు, అనిష్టములు ప్రాప్తించినపుడు వాని విషయమై ప్రతిక్రియ చేయకుండుటయు సౌమ్యభావము అనగా నెల్లపుడును ఆహ్లాదము కలిగియుండుటకు మనస్సు వికల్పమును చెందనీయక యుంచుకొనుటయు, పట్టుదలయు, సర్వులయందును స్నేహమును, యథాలాభసంతుష్టియు మెత్తనిమనస్సు కలిగియుండుటయు, ప్రియవాదిత్వమును సంపాదించియుండుటయు అను నీ గుణములు సమదృష్టిని పుట్టించును. ఇట్టి గుణములుగల శిష్యునియొక్క (అంగీకృత శిష్యునియొక్క) శుద్ధమైన అంతఃకరణమునందు శ్రీ గురుదేవులవారి దీవనలు ప్రవేశించి పరిశుద్ధముగా లోకులకు వ్యాపించును.

మన స్థూలశరీరములయందు పాదాంగుళ్యగ్రములు హస్తాంగుళ్యగ్రములు పెదవులు నాసారంధ్రములు నాలుకకొన దేహమాద్యంతము గల రోమకూపములు ఇట్టివి “ఏతాని విద్యుత్ స్థానాని” విద్యుత్తుకు ఉనికిపట్టులు. విద్యుత్తు అనగా మేఘములయందు కనబడుశక్తి.

దీనినే యంత్రములవల్ల నిర్బంధించి ఇపుడు ఇలెక్ట్రిక్కు దీపములు మొదలగు శక్తులను లోకులు ఉపయోగించుచున్నారు. శ్రీ గురు దేవుల వారి దీవనలు అను విద్యుచ్ఛక్తి మన (శిష్యునియొక్క) దేహమునందు ప్రవేశించి వెలుపలికి వెళ్లవలసినపుడు మన (శిష్యునియొక్క) శరీరములయందలి విద్యుత్ స్థానముల త్రోవను వెలుపలికి వెడలవలయును. కనుక ఆ విద్యుత్ స్థానములయందు ఏ మాత్రమైనను మాలిన్యము ఉండకూడదు. కనుక శిష్యులు తమ శరీరములయందలి విద్యుత్ స్థానములను అతిపరిశుద్ధముగా నుంచుకొనవలయును. అనగా చేతుల వ్రేళ్ల సందులయందును గోళ్లయందును కాళ్ల వ్రేళ్ల సందులయందును గోళ్లయందును దేహము అంతటయు నిండియుండు రోమకూపములయందును ఏ మాత్రమైనను మురికి దాగియుండక స్నానకాలమునందు అతి జాగరూకతతో దేహమును శుద్ధిచేసుకొనవలయును. ముక్కుపొడుము వేసికొని నాసారంధ్రములయందు మాలిన్యమునుచేర్చుట, తాంబూలమునందు పొగాకుచేర్చుట, చుట్టకాల్చి నోటిని గబ్బుతో నింపుట ఇవన్నియు విహంగమార్గయాత్రికునికి పనికిరావు. ఇది బహిఃశుద్ధి. అంతశ్శుద్ధి అనగా అంతఃకరణశుద్ధి. నివృత్తిమార్గమునందు నడుచుచుండువారును నడుచుటకు ఇచ్ఛయించువారునుకూడ పైనచెప్పిన విద్యుత్ స్థానములను పరిశుద్ధిగానుంచుకొని శ్రీ గురు దేవులువారి దీవనలను శుద్ధములైన త్రోవలవెంబడి లోకమునకు పంపవలయును. ఇది బహుముఖ్యము. అజాగ్రతగా అవసరముతో అపరిపూర్ణస్నానము వర్జనీయము. పొగాకు పొడుము మొదలగు అశుద్ధములు వర్జనీయములు.

"అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికా" అను స్థలములయందునుండి విద్యుచ్ఛక్తి బయలువెడలి భరతఖండము నందంతటయు నిండును. ఈ శక్తిని యంత్రములతో నిర్ధారణ చేయుట సాధ్యముకాదు. అనేక దేవాలయములయందు తగుమైన కాలములయందు పూజలుజరిగి ఆ పూజలను చూచుటకుగా జనబాహుళ్యము అట్టి దేవస్థలములకు వెళ్లుదురు. అట్లు దేవస్థలములకు వెళ్లువారలు తమభక్తిని అచ్చట కుమ్మరించి అచ్చటిదీవనలను తెచ్చుకొందురు. అంగీకృతశిష్యులు అట్టి స్థలములను దర్శించి ఇతరులకన్న

నధికమైనంత దీవనలను తనలోనికి చొప్పించుకొని లోకులపై వర్షించ వచ్చును. ఇది ఒకవిధమైన లోకసేవ. ఇట్లు లోకులను సుఖపెట్టుచు ఆనందవారిధియందు ముంచుచు శ్రీ గురుదేవులవారి సేవచేయ వచ్చును. ఆహారవిషయమునందు అతివిమర్శను ఉపయోగించవల యును. మాంసాహారము కొంచమైనను పనికిరాదు. సాత్త్వికాహా రమునే భుజించవలయును. కల్లు సారాయి గంజా మొదలగు మత్తు వస్తువులు కూడనేకూడదు. "ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః। సత్త్వ శుద్ధౌ ధ్రువా స్మృతిః। స్మృతిలంభే సర్వగ్రంధీనాం విప్రమోక్షః। తస్మైమృదితకషాయాయ తమసః పారం దర్శయతి భగవాన్ సన త్కుమారః। (ఛాందోగ్యోపనిషత్తు, సప్తమ ప్రపాఠకము.)" మొ దట ఆహారము పరిశుద్ధమై యుండవలయును. అపుడు అంతఃకర ణము శుద్ధమగును. శుద్ధాంతఃకరణమునుండి స్మరణశక్తి కలుగును, అందువలన సర్వసంశయములు నశించును. ఇట్లు పరిశుద్ధుడైనవానికి శ్రీ భగవాన్ సనత్కుమారులు తత్త్వములను బోధింతురు. ఆ రీత్యా అజ్ఞాననివర్తి కలుగును.

ఇట్లు శ్రీ గురుదేవులవారిసేవను లోకసేవరూపముగా చేయు చుండగా శ్రీ గురుదేవులవారు తాము అంగీకరించి తనతో నేకీ భావముచెందిన శిష్యుని దీక్షాగురువులవారి సన్నిధిన సమర్పించుటకు కావలసిన ఏర్పాట్లను చేయుదురు.

ఇదివరకును శిష్యుడు తన గురుదేవులవారితో మాత్రము సం బంధమును కలుగజేసికొని తన గురుదేవులవారి ప్రతిభలో నైక్యము చెందియుండెను. ఇపుడు శిష్యుడు ఉండు పదవికంటె నెక్కువమెట్టు తారకదీక్షను పొందుటయే. తారకదీక్షను ఇచ్చుగురువులవారు శ్రీ సనత్కుమారులవారు. వారి అనుజ్ఞలేనిదే ఎవ్వరికిని దీక్ష సంభవించ దు. ఈ దీక్షనే తారకోపదేశము అందురు. లోకములో వ్యవహార మునందు ఉండు పిపీలికామార్గము విహంగమార్గము అను రెండు మార్గముల పైకి విహంగమార్గమే దీక్షామార్గము. దీక్షామార్గము నందు చరించినవారు చాలమట్టుకు ఆధికారికపురుషులుగా నేర్పడు దురు. దీక్షలనుగురించి ప్రాయసభిప్రాయము లేదు.

## రెండు మార్గములు

ప్రవృత్తి నివృత్తి మార్గములు రెండు. ఇది ఒకమెట్టు. కర్మ మార్గము జ్ఞానమార్గము అనునది ఒక మెట్టు. పిపీలికామార్గము విహంగమార్గము అనునది ఒక మెట్టు. ఇట్లు సందర్భమును అనుసరించి రెండు రెండుగా మార్గములు చెప్పబడియున్నవి. మరియొక జతమార్గములు ఉన్నవి. అవి ఏవి అనగా మోక్షమార్గము అనునది యొక్కటి. మోక్షసన్యాసమార్గము అనునది ఒకటి. కడపట చెప్ప బడిన జతయందు సాధారణముగా జనబాహుళ్యము లోకమునందు తమ తమ మతములయందు విధింపబడిన శ్రద్ధాభక్తిధ్యానములను అనుష్ఠించుచు ప్రవృత్తిమార్గమునందు అనేకజన్మములనుగడపి ప్రవృత్తిమార్గమునుదాటి నివృత్తిమార్గమును అవలంబించి మందమధ్యమ వైరాగ్యములను అభ్యసించుచు మోక్షేచ్ఛ స్వల్పముగాపొంది కాల క్రమమున ముముక్షుత్వమును వృద్ధిచేసికొనును.

సాధనానాం తు సర్వేషాం ముముక్షా మూలకారణం ।

(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము)

అన్నిసాధనములపైకి ముముక్షు ముఖ్యసాధనము. మోక్షమును పొందవలెనను ఇచ్ఛ తీవ్రముగా లేనపుడు ప్రయత్నముకూడ తీవ్ర ముగా నుండదు. ముముక్షుత్వము నాలుగు తరగతులుగా నుండును.

తీవ్ర మధ్యమ మంద అతిమంద భేదా చ్చతు ర్విధా ।
ముముక్షా తత్ప్రకా రోపి కీర్త్యతే శ్రూయతాం బుధైః ॥

(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము)

ముముక్షుత్వము ఆదియందు అతిమందముగా నుండును.

మార్గే ప్రయాతుః మణిలాభవత్ మే లభేత మోక్షో యది తర్హి ధన్యః ।
ఇత్యాశయా మూఢధియా మతి ర్యా సైషా తిమందా భిమతా ముముక్షా ॥

ముముక్షుత్వము అనునది యేదో యొక ద్రవ్యము అని మూఢులు తలచి అట్టివస్తువు ప్రయాణికునికి మార్గమునందు ఒకరత్నము దొరకి

నట్టు ముముక్షు నాకు దొరకచాలదా అని కోరుచుండుట అతిమంద ముముక్షుత్వ మనబడును.

మోక్షస్య కా లోస్తి కి మద్య మే త్వరా భుక్త్వైవ భోగాన్ కృతసర్వకార్యః ।
ముక్త్యై యతిష్యేఽహ మ థేతి బుద్ధిః ఏ షైవ మందా కథితా ముముక్షా ॥

ఇపు డేమి అవసరము, భోగముల నన్నిటిని అనుభవించి పిదప మోక్షమునకు ప్రయత్నము చేయవచ్చును. అని యుండుటకు మందముముక్షుత్వము అనిపేరు.

తాపత్రయం తీవ్ర మవేక్ష్య వస్తు దృష్ట్వా కళత్రం తనయాన్ విహాతుం ।
మధ్యే ద్వయో ర్లోథన మాత్మనో యత్ సైషా మతా మాధ్యమికీ ముముక్షా ॥

తాపత్రయముచేత తీవ్రశ్రమనొంది భార్యాదులగు సంసారమును వదులుకోవలెనని కోరినను, సంసారమును వదులుకొనుటకు నిశ్చయము చాలకయు ఒకపుడు సంసారమును వదులుకోవలెనని ఇచ్ఛయించుచు మరియొకపుడు వేరువిధముగా చింతించుచు నిశ్చయము లేక నడుచుకొనుచుండుట మధ్యమముముక్షుత్వము అనబడును.

తాపై స్త్రిభి ర్నిత్య మనేకరూపైః సంతప్యమానః క్షుభితాంతరాత్మా ।
పరిగ్రహం సర్వ మనర్థబుద్ధ్యా జహాతి సా తీవ్రతరా ముముక్షా ॥

తాపత్రయముయొక్క అనేకరూపములగు దుఃఖములచే నిత్యమును శ్రమపడుచు మనస్సునొచ్చి సంసారమందు అనర్థమేకాని వేరుకాదు అని నిశ్చయించి అన్నిటిని సంసారముతోసహా వదులుకొనుటకు నిశ్చయించుట తీవ్రతరమైన ముముక్షుత్వము అనబడును.

ఇట్లు తరగతులు కలిగియుండు మోక్షేచ్ఛను అనుసరించి మార్గములు నిర్ణయించబడును.

పైన చెప్పబడిన నాలుగు తరగతులపైకి మొదటిమూడు తరగతులును త్వరలేనిమార్గమును అనుసరించియుండును. త్వరలేనిమార్గమును పిపీలికామార్గము అందురు. పిపీలికలు అనగా చీమలు నిదానముగా ఒక మైలుదూరము ప్రయాణముచేయుటకు నాలుగుగంటల ప్రొద్దు కావలసియుండును. ఆ మైలుదూరమును పక్షులు (విహంగ

ములు) కాలుఘంట కాలములో దాటగలవు. మోక్షమార్గమునందు అందులో పిపీలికామార్గమునందు నిత్యకర్మానుష్ఠానములను జరిపి కాలేన కామ్యకర్మనువదిలి నిష్కామకర్మలను చేయుచు స్వార్థమునువదిలి పరమార్థమును అవలంబించి ఆవల జ్ఞానమార్గమును అవలంబించి సర్వజీవాత్మైక్యభావమును గుర్తించి అట్టి సర్వజీవాత్మైక్యభావమును అభ్యసించుటకు ఆరంభించి అపుడు ఉన్న శరీరపతనానంతరము మరుజన్మమునందు శుచిమ్మంతులును శ్రీమంతులునైనవారి గర్భమునందు జన్మించి అచ్చట పూర్వజన్మమునందు అభ్యసించిన అనుష్ఠానముల యొక్క వాసనాబలముచే ముందుజన్మమునందు విడిచిన భూమికనుండి జ్ఞాననిష్ఠను అభ్యసించి ఉపాసన చేసి చేసి “బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే” అని “అనేకజన్మసంసిద్ధః తతో యాతి పరాం గతిం” అని మోక్షము చెందును.

విహంగమార్గమునందు పిపీలికామార్గమువలెనే ప్రారంభదశయందు చరియించి జ్ఞానమార్గమునందు ఒక మెట్టుకెక్కి లోకమునందు జనబాహుళ్యము దుఃఖమునందే మునిగియుండుటనుచూచి వారలతో తాను ఐక్యముచెందుట కిచ్ఛయించి వారలకంటె తాను ఉన్నతపదవియం దుండినను మోక్షసామ్రాజ్యపదవికి సమీపమునందుండినను ఇచ్ఛయించితే ఎల్లను దాటి ఆనందసాగరమునందు మునిగి సుఖపడుట తనకు సాధ్యముగానుండినను ఇదమిత్థము తెలియని బుద్ధిహీనులయందు కృపకలిగి మోక్షపదవి తనకు చేతచిక్కినదానిని నిరాకరించి లోకులనందరను చక్కపరిచి వారలనందరను తనవెంబడి తీసికొని మోక్షసామ్రాజ్యమును ప్రవేశించుటకుగా దృఢప్రయత్నము చేసి తాను ముక్తుడై ‘విముక్తశ్చ విముచ్యతే’ అను వాక్యప్రకారముగా నడుచుకొనును. అనగా జీవన్ముక్తపదవి లభించినను అపరిపూర్ణ జ్ఞానముగల లోకులందరికి జ్ఞానము కలుగజేసి వారలనుకూడ జీవన్ముక్తులుగా జేయుటకుగా తనను తానే దిట్టపరిచి బ్రహ్మలోకమును నిరసించి (సన్న్యసించి) భూలోకమునందే స్థూలశరీరమును ఉపయోగించుచు నిలిచియుండుట. దీనిని నేను మోక్షసన్యాసమార్గము అని యుపయోగించియున్నాను. శ్రీ భగవద్గీతయందుగల పదునెనిమిదవ

అధ్యాయమునకు మోక్షసన్యాసయోగము అని పేరు. నేను చెప్పిన మోక్షసన్యాసమార్గము శ్రీ భగవద్గీతలలో పదునెనిమిదవ యధ్యాయము కాదు. మోక్షసన్యాసమార్గము అను పేరు స్వకపోలకల్పితము.

ఈపైన వ్రాయబడిన విషయముయొక్క సారాంశము ఏమనగా అతిమందము, మందము, మధ్యమము అను తెఱగుల నెరుగబడు ముముక్షుత్వమును ఆచరించి కొంత కొంతగా నొకజన్మమునందు కొంతమట్టుకు మరియొకజన్మమునందు మరికొంతమట్టుకు ఈ విధముగా పిపీలికాగతిని చరించి "బహూనాం జన్మనాం అంతే" అనినట్టు మోక్షమును చెందుట. ఇది అతినిదానముగా ప్రయాణము చేయుట. ఆ విధాన లభించిన మోక్షమును అనుభవించి సుఖాన ఉండుట.

మరియొకటి విహంగమార్గము. నివృత్తిమార్గమునందు ప్రవేశించగానే జ్ఞానాభ్యాసమును ఆరంభించి జ్ఞానము అనుపదమునకు శ్రీమద్భగవద్గీత నాలుగవ అధ్యాయమునందు చెప్పినట్టు అర్థము చేసికొని "యేన భూతాని అశేషేణ ద్రక్షసి ఆత్మని అథో మయి" అని సర్వజీవాత్మైక్యభావమునుగురించి స్వప్రయత్నమును బలపరిచి లోకులు అజ్ఞానదశయందు మునిగియుండుటచే వారలపైన కరుణ చూపి మొదట ప్రవృత్తిమార్గమునందు గృహస్థాశ్రమమునందు తాను అనుభవించిన అతిథిపూజ వైశ్వదేవము మొదలగు కర్మలయొక్క సారాంశమైన తననుతాను మరిచి యితరులకు సుఖము నిచ్చుట అను గుణమును ముందిడికొని ఇతరులను తరింపజేయనుద్దేశముతో తాను విహంగమార్గమును త్రొక్కుట కారంభించి ఒకటి రెండు మూడు లేక పది జన్మములలోనే జీవన్ముక్తిని సంపాదించి ఆ ఉన్నతస్థితియందునుండి కొన్నిజన్మములకు ముందు తనవలెనే అజ్ఞానదశయందుండిన లోకులకు జ్ఞానోపదేశముచేసి వారలను మోక్షమునకు సిద్ధపరుచు నుద్యోగమునందు అమరియుండుట. ఈ రెండవ మార్గమునందు తాను మోక్షముయొక్క సుఖమును నిరసించినాడు గనుక ఇతనిమార్గమును నేను మోక్షసన్న్యాసమార్గము అని అనుచున్నాను. ఈ మోక్షసన్న్యాసమార్గమునే ఆధికారికపురుష

మార్గము అనవచ్చును. విహంగమార్గమునందు ఈ ఆధికారికపురుష మార్గము ఒక అంతర్భాగము.

తత్ర బ్రహ్మలోకగతానాం త్రిధా గతిః । యే పుణ్యోత్కర్షేణ గతాః తే కల్పాంతే పుణ్యతారతమ్యేన అధికారికా భవంతి । యే తు హిరణ్యగర్భాద్యుపాసనాబలేన గతాః తే బ్రహ్మణాసహ ముచ్యంతే । యే భగవదుపాసకాః తే స్వేచ్ఛయా బ్రహ్మాండం భిత్వా వైష్ణవం పద మారోహంతి ॥

అనగా బ్రహ్మలోకమునకు పోయిన ఉపాసకులకు మూడు త్రోవలు కలవు. పుణ్యాధికమువల్ల బ్రహ్మలోకమునకు పోయినవారు అధికారికపురుషులుగా భూరాదిలోకములకు తిరిగివత్తురు. మిగిలిన రెండు తరగతులవారలు ప్రకృతము మనము విచారించుచున్న విషయమునకు సంబంధపడినవారు కారు. కనుక వారిసంగతి వ్రాయలేదు.

శ్రీ యోగవాసిష్ఠము ముముక్షుప్రకరణము, ఏకాదశసర్గ ఏడు ఎనిమిది శ్లోకములలో తెలియపరిచిన మహీపీఠమువారు పైన చెప్పిన ఆధికారికపురుషులు. నివృత్తిమార్గము నారంభించి భూతానుకంపవల్ల ఇతరులకంటె త్వరగా జీవన్ముక్తిని సంపాదించి బ్రహ్మలోకమునకుపోయి ఆధికారికపురుషులుగా తిరిగి ఈ లోకమునకువచ్చి లోకులకు జ్ఞానదానము చేయుటకుగా కంకణముకట్టి నిలిచియుండువారే మహీపీఠమువారును వారి శిష్యులును అని యెరుగవలయును. పరోపకార మహాసేవయందు అనేకకోట్ల కష్టములున్నవి. మహీపీఠపువారి శిష్యులు అట్టి కష్టములకెల్లయు సిద్ధపడియుండువారు.

సంచితకర్మనంతయు అతిస్వల్పకాలములో ననుభవించి అట్లు అనుభవించుటకు ఎంతటి శ్రమలుపడవలెనో అన్నిశ్రమలను దుఃఖముగాని విసుకుగాని లేకయే అనుభవించి ఆర్ద్రహృదయముతో పరమేశ్వరుని కైంకర్యమే ముఖ్యము అని నిశ్చయించి శ్రమపడువారికి "ప్రారబ్ధేతర పూర్వపాప మఖిలం ప్రామాదికం చోత్తరం । న్యాసేన క్షపయన్ అనభ్యుపగత ప్రారబ్ధఖండం చ నః । ధీపూర్వోత్తర పాప్మనా మజననాత్ జాతే పి తన్నిష్కృతేః । క్వాటిల్యే సతి శిక్షయా ప్య నఘయన్ క్రోడీకరోతి ప్రభుః ॥" అని రహస్యత్రయసార

మను గ్రంథమునందు శ్రీ వేదాంతాచార్యులవారు సెలవిచ్చి యున్నారు. అనగా ప్రారబ్ధకర్మను వినాగా మిగిలిన కర్మనంతయు కర్మదేవతలు క్రోడీకరించి కొన్నిజన్మములలోనే సమసిపోవునట్లు ఉపాసకునికి ఇచ్చుచున్నారు అని భావము. ఇట్లు క్రోడీకరించబడిన కర్మను అనుభవించుట అనునది నోటిమాటలకు సులభమైనపని. అట్లు అనుభవించువారి మనస్సులయందు ఉండు శ్రమను వివరించి చెప్పుటకు నోటిమాటలు చాలవు. తేలు కుట్టినవిషము మూపున కెక్కియుండును. మంత్రము వేయగా మోచేతికిదిగును. మూపునుండి మోచేతికి ఒకయెముక. మరియొకతడవన మంత్రము వేసినపుడు మణిబంధమునకు దిగును. మోచేతినుండియు మణిబంధమునకు ఒకటేయెముక. అక్కడినుండి వ్రేళ్లకీళ్లవరకును అనేక యెముకలు. ఒక మంత్రమునకు ఒక యెముకవిధము చాలమార్లు మంత్రము వేయ వలయును. కాలమధికముగా కావలసియుండును. తేలు కుట్టినవిష బాధ విస్తరించి యుండినదంతయు క్రోడీకరింపబడినపుడు చాల బాధకరముగా నుండును. ఈ విధముగా క్రోడీకరింపబడిన కర్మాను భవము దుఃఖకారియే అయినను ఉపాసకుడు ఉద్దేశమును అనుసరించి శ్రమకు జడియడు. విహంగమార్గము అనగా నోటిమాట కాదు. కనుకనే ఈ మార్గమునకు "దుర్గం ఫథం యత్ కవయో వదంతి" అని దుర్గపథము అని పేరు. ఇందులో కర్మక్షయము అనునది ముఖ్య మైనకార్యము. పాతకర్మను అనుభవించి ఆరీత్యా సమియగొట్టి క్రొత్తకర్మకు కారణభూతములైన కొన్ని స్వల్పతప్పుల పాలబడకయే లక్ష్యమును మరువకయే తాను అనుభవించు దుఃఖములు ఇత రులకు తెలియరాకుండునట్లు గోప్యముగా శ్రమలుపడుచు బైటికి ఆనందమునుచూపుచు మెలుకువతో నడుచుకొనవలయును. ఇది ముఖ్యాంశము.

ఈ నాలుగవ అధ్యాయమును ఇంతటితో చాలించి అయిదవ అధ్యాయమును ప్రారంభించుచున్నాను.

## ౫వ అధ్యాయము

### కర్మను క్షీణింపఁజేయుట

ఇదివరకును చెప్పబడిన ప్రయత్నము లన్నియు ఉపాసకుడు తన యొక్క మనోబలమువల్ల, తనయొక్క హర్షమువల్ల, ప్రాజ్ఞాత్మయొక్క సహాయమువల్ల తురీయాత్మయొక్క ప్రేరణవల్ల జరుగునట్టి ఉత్సాహ సహితమైన దృఢప్రయత్నముయొక్క ఫలము. ప్రతిజీవాత్మయు ప్రవృత్తి మార్గమునందు చరించినపిమ్మటనే నివృత్తిమార్గమునందు చరించును. ప్రవృత్తిమార్గమునందు చరించుకాలమునందు కామముచే ప్రేరేపించ బడి స్వలాభమునకుగా నితరులకు నష్టము కలుగజేసి యుండవచ్చును. అటుగాక స్వలాభమును కోరకయే తులిపితనమువల్ల ఇతరులకు కష్టము లను కలుగజేసి వారలు కష్టపడుచుండగాచూచి ఆనందించుచు మరి కొన్ని కష్టములు కలుగజేయుటకు ఇచ్ఛయించి యుండవచ్చును. ఇట్లు దుష్కృత్యములు చేసినపుడు ఈ కుచేష్టలవల్ల తాను చెడ్డకర్మను పుట్టించుచున్నాను అను తలంపైనను అ కాలమునందు ఉపాసకునికి ఉండదు. అయితే కర్మదేవతలయొక్క లెక్కలలో ఈ అప్పులన్నియు లెక్కపెట్టబడి యుండును. ముందుజన్మములయందు ఈ అప్పులనన్ని టిని తీర్చుకొనవలసియుండును. ప్రవృత్తిమార్గమునందు చేసిన తప్పులు ఒప్పులు అన్నిటియొక్కయు ఫలమును తుట్టాగా అనుభ వించి తేనేగాని నివృత్తిమార్గమునందు అందులో విహంగమార్గమందు నిరాటంకముగా ప్రయాణము జరుగదు. నివృత్తిమార్గమునందుకూడ పిపీలికామార్గమునందు చరించువారికి పురాతనకర్మ (సంచితకర్మ) కొంత కొంతగా పంచిపెట్టబడి అనేకజన్మములయందు ఆ సంచిత మును ప్రారబ్ధకర్మరూపముగా అనుభవించి అరుగగొట్టుటకు ఉపా

యముకలదు. అటుగాక విహంగమార్గమునందు చరించు ఉపాసకుడు తాను తనయొక్క కర్మను కొన్నిజన్మములయందే అరుగగొట్టుకొవలసియుండును. అప్పులను నిదానముగా తీర్చుకొనుట సులభము గాని ఒకటేసమయమునందు అనగా కొన్నిజన్మములలోనే తీర్చుకొనవలయుననిన అందువలన కలుగునట్టి శ్రమ, కష్టము, దుఃఖము వీటిని ఇట్టివి, ఇంతటివి అని చెప్పుట చాల కష్టము. అయినను ఉపాసకుడు నివృత్తిమార్గమును కోరుకొని అందులోనును విహంగమార్గమును కోరుకొనినవాడు గనుక "అనేకజన్మసంసిద్ధః" "బహూనాం జన్మనాం అంతే" పొందగల ఫలమును (క్రమముక్తిని) కొన్ని జన్మములలోనే పొందుటకు (సద్యోముక్తి) సాహసించుటకు సిద్ధపడియుండువాడు గనుక శ్రమలకు ఓర్చుకొనవలసియుండును. ప్రతి నిత్యమును కష్టములు, నిష్ఠురములు, నష్టములు, జాడ్యములు ఇందులో నేదోయొకటియో లేక ఏకకాలమునందే అన్నియునో కలుగుచుండును.

పరిశోధనము అను స్థితియందుగాని అంగీకారము అను స్థితియందుగాని సంచితమును అతితీవ్రముతో నరుగగొట్టుటకు ప్రయత్నముచేయు నుపాసకునికి పూర్వాధ్యాయముయొక్క చివరను చెప్పిన "క్రోడీకరోతి ప్రభుః" అనురీత్యా కర్మదేవతలు కర్మను క్రోడీకరించి ప్రారబ్ధరూపముగా మార్చి అనుభవమునకు ఇత్తురు. ఉపాసకుని శీలమునుగురించి అనేక అపవాదములు లోకులు వాడుకొనునట్టు ఏర్పడవచ్చును. ఇట్టి సందర్భములయందు లోకులలో కొందరు నికృష్టముగా మాటలాడుకొనుటకు ఆస్పదము ఉండును. నివృత్తి మార్గమునందు చరించనివారు ఎన్నిమాటలనైనను మాటలాడవచ్చును. అయితే నివృత్తిమార్గమునందు చరించుచుండు ఉపాసకుని సహాధ్యాయులు ఈ అపవాదప్రసంగములయందు పాలుగొనుటగాని ఆ ప్రసంగములు నిజముగానే ఉండవచ్చును అని నమ్ముటగాని నమ్మినను ఇతరులతో ఈ దూషణవార్తలను ఉపయోగించి వారలతో తానుకలిసి దూషించుటగాని ఉపాసకుని మనస్సునందు దుఃఖము కలుగజేయును. అంతేకాదు. వృథా దూషణవాక్య

ములను మాటలాడినవారుకూడ చాలక్రూరమైన కర్మను తమకు కలుగజేసికొనుచున్నారు. అపవాదవాక్యములు నిజముగానుండినను వాటిని (1) పరిశోధన, (2) అంగీకారము అను భూమికలయందుండు వారు తమ మనస్సులయందు చర్చించుటయే వారలకు చాల చెడుపును కలుగజేయును. ఆ విషయములనుగురించి యితరులతో మాటలాడుటయో పదంతలు నూరంతలు బహుచెడ్డకర్మను కలుగజేయును. ఉపాసకుడు శ్రమపడి కర్మను అరుగగొట్టుకొనునుగాని ఇతరులు (సహాధ్యాయులు) తమకు తామే అతిబలవంతములైన ప్రత్యవాయములను కలుగజేసికొందురు.

ఇందరు ఇన్నివిధముల ఉపాసకునికి కీడు చేయుచుండినను ఉపాసకుడు "హర్షామర్షభయోద్వేగైః యో విముక్తః" అనినట్లు (అధికవైరాగ్యమును మున్నిడికొని) దుఃఖించకూడదు. దుఃఖములు తాను కోరుకొన్నవే కదా. ముందు ఎన్నడో వజ్రములతో నంటుపోగులు వేసికొనవలెనని ఎదురుచూచి ప్రకృతమునందు చెవికుట్టుకొందురు. కుట్టుకొనుట చాల బాధను కలుగజేయును. అయినను భవిష్యత్కాలమునందు తాను అనుభవించగోరిన సుఖమును ఉద్దేశించి లోకులు బాధను ఓర్చుకొనుచుందురు. ఆ విధముగా ఉపాసకుడు తానుగా కోరుకొనిన ప్రకారము కర్మ క్రోడీకరింపబడి అనుభవమునకు ఇయ్యబడినది. అది తన ప్రార్థనను అంగీకరించియే కదా ఇయ్యబడినది. ఆ కర్మానుభవమును ముగించినపిమ్మట మేఘజాలముచే కప్పబడిన సూర్యుడు మబ్బువదిలినపిమ్మట ప్రకాశించిన రీతిగా ఉపాసకుడును ప్రకాశించును. ఇంతేకాదు. ఉద్వేగముగాని భయముగాని తనచుట్టునుండువారలకుకూడ ప్రసరించునే, వారల సంతోషములను అపహరించిన రీత్యా వారలకు శ్రమకలుగునే అను వాత్సల్యతను ముందిడికొని ఉపాసకుడు భయోద్వేగములనుండి విరమించవలయును.

ఏ కష్టములు నష్టములు అవమానములు దూషణలు తిరస్కారములు ఏవి ఉపాసకునికి సంభవించినను అతడు ముందు ఒకపుడు చేసిన కర్మయొక్క ఫలమేగాని కారణములేకయే సంభవించునవి

గావు. తానుపడిన అప్పులను తానేకదా తీర్చవలయును. ఈ అప్పులు ఇతరులు తీర్చజాలనివి. తననెత్తినపెట్టుకొన్న భారమును ఇతరులు దించగలరు, తనకుకలిగిన రోగముయొక్క శ్రమను తానేకదా అనుభవించవలయును, అని విచారించి దుఃఖమును తగ్గించుకొని కర్మఫలమును అనుభవించితీరవలయును.

దుఃఖములు వచ్చినపుడు మనస్సు నొచ్చుకొనక యుండుటకు తితిక్ష అని పేరు. "సహనం సర్వదుఃఖానాం అప్రతీకారపూర్వకం। చింతావిలాపరహితం సా తితిక్షా నిగద్యతే॥" సాధనచతుష్టయము పైకి శమాదిషట్కము అనునది ఆరు అంతర్భాగములుగల ఒక సాధనము. శమము దమము ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానము అనునవి ఆరు అంతర్భాగములు. అందులో తితిక్ష ఇట్టిది అని పైనచెప్పిన శ్లోకమువల్ల తెలియుచున్నది. ఉపాసకునికి సంభవించు సర్వదుఃఖములను సహించుకొనుట తితిక్ష అనబడును. సహించుకోవచ్చును; అయితే మరునిమిషమునందు దుఃఖములు కలుగజేసినవారికి ప్రతిదుఃఖములను కలుగజేయవచ్చును. అది కూడదు. బుద్ధిహీనతవల్లనే ఒకనికి మరియొకడు దుఃఖములు కలుగజేయును. ఉపాసకునికి కలుగుదుఃఖములు తనయొక్క కర్మశేషమువల్లనే కలుగును అని ప్రతీకారము లేకయే దుఃఖములను సహించుకొనవలయును. ప్రతీకారములేకయే దుఃఖములను సహించుకొనుటయు సులభమేకాని చింతయు ఏడ్పును లేకయే సహించుకోవలయును. నాకు ఇంతటి దుఃఖము కలిగినదే; నేను ఎవ్వరికిని దుఃఖమును కలుగజేసి యుండలేదే ఇది అన్యాయము అను చింతగాని దుఃఖమును అనుభవించునపుడు ఏడ్పులేక యుండవలయును. ఇదియును కొంతమట్టుకు సాధ్యమే. కాని దుఃఖములు సంభవించినందున ప్రాక్కర్మ తీరుచున్నదే, అప్పులు తీరుచున్నందుకుగా నేను సంతోషపడవలయును, కర్మనంతయు క్రోడీకరించి యిమ్మని కర్మదేవతలను నేను కోరుకొనియుంటినికదా. నేను ఇప్పుడు పడుకష్టములన్నియు నా ప్రార్థనను అంగీకరించి ప్రభువులు నా కర్మలను క్రోడీకరించి యిచ్చినఫలమేకదా. ఇందువలన నా విహంగమార్గప్రయాణము నిరాటంకముగా కావచ్చును. కనుక

ఇంకయు శిలుకు నిలిచియుండు కర్మలనన్నిటిని నా అనుభవమునకు కుమ్మరించవలయునని కోరుచు హర్షముతో దుఃఖములను అనుభవించి అప్పుతీర్చవలయును.

విహంగమార్గ ప్రయాణము అనగా ప్రత్యవాయములను లక్ష్యపెట్టక దుఃఖములను జయించి అప్పులనుతీర్చుకొని నిరంజనుడై పరమసుఖమును లోకమునకు ఇచ్చుట. అందుకై అప్పులుతీరునదంతయు సంతోషకరముగానేకదా యుండవలయును. మన ప్రార్థనవల్లనేకదా కర్మ క్రోడీకరింపబడినది. కనుక మన ప్రార్థనను అంగీకరించినదే మనకు గౌరవము. మఱియు మనకును అభీష్టసిద్ధి.

ప్రాక్కర్మ అనగా సంచితకర్మ. సంచితకర్మ ఎంతఉన్నదో మనకు తెలియదు. ఏ తరహాకర్మ బాకీఉన్నదో అదియును తెలియదు. కనుక ఎన్నివిధములైన కష్టములు రానున్నవో అదియును తెలియదు. "మరణవ్యాధిశోకానాం కి మద్య నిపతిష్యతి" అని మరణమే రావచ్చును. తనకు అతిప్రియులుగాని స్నేహితులుగాని బంధువులుగాని చావవచ్చును. తనకు ఉన్న ఆస్తియంతయు పోతేపోయి తాను బ్రతుకుటకు త్రోవతెలియకయు దివాలెత్తినందున హితులగు స్నేహితులుకూడ అలక్ష్యపెట్టవచ్చును. చాలనమ్మిన సహాధ్యాయులు తనను దూషించినను దూషించవచ్చును. తాను కలలోనైనను చేయుటకు ఇష్టపడని తప్పులను చేసినట్టు ఇతరులు కల్పించి మాటలాడి అవమానపరచవచ్చును. అవమానకరములైన గప్పాలు ఊరివారు మాటలాడుకొనవచ్చును. ఏవిధమైన మానహాని ప్రాణహాని ధననష్టము, రోగము ఏదైనను సంభవించవచ్చును. శిలుకు ఉండు కర్మఅంతయు పైనచెప్పిన విధముగా వ్యక్తపడవచ్చును. వీటినంతయు హర్షముతో భరించవలయును.

ఇన్నివిధములుగా కష్టములు పడుచుండినను శ్రీ గురుదేవులవారిని నమ్మి వారి సహాయముచేతనే విహంగమార్గమునందు భూమికలను జయించుటకు ఉత్సాహము కలుగుచుండును. విరామములేక కష్టములు, నష్టములు, రోగములు, దుఃఖములు కలుగుచుండగా తనకు శ్రీ గురుదేవులవారి సహాయము ఉన్నదికదా అను హర్షము

ఉండును. ప్రతి నిత్యమును ధ్యానాభ్యాసకాలమున శ్రీ గురుదేవుల వారి దయార్ద్రచిత్తమునుండి సంతోషస్పందములు ఉపాసకుని ఆవరించియుండును. కొన్ని సమయములయందు ధ్యానమునందు కూర్చొన్నపుడు ధ్యానము సరిగా జరుగదు. పైనచెప్పిన కష్టములు మొదలగు దెబ్బలు తగిలి తనకు లోకమునందు ఎవ్వరైనను స్నేహితులు ఉన్నారా అని సందేహించి ఉత్సాహము మందగించుసందర్భము తటస్థించును. అపుడు ధ్యానముకూడ జరుగదు. ధ్యానకాలమునందు నియతిగా కలుగుచుండిన స్పందములు కలుగవు. నడి ఎడారిలో తనకు ఉండిన ఒక ప్రాపుకూడ పోయినదే అని అధైర్యము కలుగును. ఉత్సాహము క్షీణించును. శ్రద్ధతగ్గవచ్చును. ఇట్టి కష్టములువచ్చినపుడు తనను గురుదేవులవారు మరిచిపోయిరా? ఒకవేళ గురుదేవులవారుఅను అర్థమును వెఱ్ఱివానివలె నమ్మియుంటినా. వారు ఉన్నారు అనునదికూడ రిక్తపోయిన పురాణవచనమేనా అని తోచినను తోచును. ఈ విహంగమార్గము కోరుకొన్నది వెఱ్ఱితనమా. ఇన్ని దినములును నేను అనుభవించిన సుఖస్పందములు నిజమేనా లేక నాకుకలిగిన భ్రమనా అనికూడ తోచును. ఎడారి మధ్యనుండి తుపానులుకొట్టుచుండగా ఏత్రోవనపోవలయును అని ఏనను తోచక అసలు తాను నమ్మినడిచిన త్రోవఅంతయు మిథ్యనేగాని విహంగమార్గము అనునది యేమి? ముందు నాతోకలిసి స్నేహితులుగానుండి పిపీలికామార్గమునందు చరించుచుండిన వారలనమ్మకమే శ్రేయస్కరము అనికూడ ఉపాసకుడు తలచవచ్చును. అయినను యుక్తిని ఉపయోగించి తాను జరుపుచుండిన శ్రవణము మననము అనుష్ఠానములు అనువానియొక్క బలముచేత శ్రీ గురుదేవులవారియందు నమ్మకము పోగొట్టుకొనక ఒకటే నమ్మకముతో తన ధ్యానమును జరుపుచుండగా నొకదినమున ధ్యానకాలమునందు శ్రీ గురుదేవులవారి సుఖస్పందములు మునుపటివలె తనను ఆవరించును. అపుడు హర్షము పుట్టును. ఇట్లు పగలు రాత్రివలె హర్షము నిరుత్సాహము మారిమారి కనబడుచుండును. ఎన్ని ఇడుములు వచ్చినను శ్రీ గురుదేవులవారియందును విహంగమార్గమునను, 'దుర్గం పథం'

ఒకటియున్నది అను విషయమునందును శ్రద్ధమాత్రము తగ్గక ఇన్ని ఇడుముల నడుమయు 'పరపురుషానురక్తిగల భామిని గృహమందెల్ల పనులనుచేయుచు' అనురీత్యా విహంగమార్గమును ఆమార్గ ప్రయాణ మునందు గల ఇబ్బందులను ఆ ఇబ్బందులను జయించుటకు తనకు కలిగియుండు అపారశక్తిని ధృతిని నమ్మి విహంగమార్గమును విడువక పట్టుకొనియుండవలయును.

"ఏకాకీ యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః" అని చెప్పి యుండు ఏకాకిత్వమును అనుభవించుచున్నాను అని ఉపాసకుడు శ్రద్ధకలిగియుండవలయును. విహంగమార్గయాత్రను మానుకొన కూడదు. మానుకొన్నయెడల యోగభ్రష్టుడగును. ఇది చెడ్డకర్మ.

ఏకాకిత్వము

విహంగమార్గయాత్రయందు ఉపాసకులు పదేపదే లెక్కలేనన్ని కష్టములను దుఃఖములను దూషణలను అపవాదములను అనుభవించు చుందురు. ఈతనేర్పువారు నేర్చుకొనువారికి సహాయముచేయుచుం దురు. సహాయముచేయుచు కొన్ని సమయములయందు అభ్యాసకుడు తన శక్తిని ఉపయోగించి నీటియందు స్వతంత్రముగా పాటుపడనిమ్మని తమ సహాయమును ఒక నిమిషకాలము మానుకొని అభ్యాసకుని సమీప మందు కాచియుందురు. తత్కాలమునందు సంభవించిన ఆపదను అభ్యాసకుడు జయించినపుడు సంతోషింతురు. అదేవిధముగా విహంగ మార్గమునందును శిష్యుని బలమును ధృతిని విశ్వాసమును పరీక్షించు టకై ఏకాకిత్వమును అనుభవించవలసియుండును. చిన్నబిడ్డలు నడువ నారంభించినపుడు తల్లి ఆ బిడ్డకు సహాయముగా చేయిపట్టినడిపించుచు ఒకపుడు బిడ్డ స్వతంత్రముగా ఏమాత్రమునడువగలడు అని బిడ్డచేతిని వదిలిపెట్టునట్టు ఏకాకిత్వముకూడ. శిష్యునివృద్ధిని కనుగొనుటకు కొంతమాత్రము శ్రీ గురుదేవులవారు దాగియుండుటకలదు. ఇది శిష్యుని త్వరగా స్వతంత్రముగా నిలుపుటకుగా చేయుయుక్తి. ఒకటి రెండుమార్లు ఇట్లు ఏకాకిత్వమును అనుభవించిన వెనుక ఉపాసకునికి

ఏకాకిత్వము అనునదియు ఈ మార్గమునందు ఒక భూమిక అని ఏకాకిత్వమునకు ఉపాసకుడు భయపడడు.

ఓర్వలేమి

అనునది మహాక్రూరమైన కర్మ. సహాధ్యాయులు ఒకరియొక్క జయమునకు సంతోషించి తాము ను దృఢప్రయత్నముసుచేసి భూమికలను గెలువవలయును. కాని తమలో నొకనియొక్క వృద్ధినిచూచి దుగ్ధపడుట లోకమునందు సాధారణము. విద్యావిధానములలో లోకమునందు పరీక్షలుపెట్టి తేరినవారికి పారితోషికములు ఇచ్చుట మొదలగు అచారములవల్ల సహాధ్యాయులలో నొకరినొకరు మించినాము అను గర్వమును కలుగజేయుట దీనియొక్క ఫలితము. లౌకిక వ్యవహారములయందు సహాధ్యాయులు ఒక్కొకడు పొందినలాభము వానిదేగాని అందరికిని సముదాయఫలము కాదు. నివృత్తిమార్గము నందును అందులో ముఖ్యముగా విహంగమార్గమునందు ఒక్కని లాభము అందరకును సముదాయ లాభముగా నుండును. శిష్యుల నందరిని తంబర తంతులతో పోల్చియున్నాము కదా. ఒక తంతె ఇచ్చునట్టి నాదపుష్టి మిగిలిన తంతెలనుకూడ రంజింపచేయునట్టు ఒకశిష్యుడు పొందినలాభము అందరిదిగా నుండును. కనుక ఒకరి వృద్ధికి ఇతరులు ఓర్వలేమిపడుట అసంభావితము. ఓర్వలేమి అను దుర్గుణమును విహంగమార్గమునందు అభ్యసించువారలకు పతన హేతువు.

ఓర్వలేమివల్ల మరియొక దుర్గుణము పుట్టును. లోకులలో నొకరినొకరు తప్పులుపట్టుట కలదు. ఒకరియెదుట నిలిచి వాని తప్పులు ఇట్టివి అని అతనితో చెప్పుటకు కొంతధైర్యము కావలసియుండును. అట్టి ధైర్యములేనివారు ఒకరిమరుగున వారి తప్పులను గురించి యితరులతో మాటలాడుకొందరు. ఇది చాల నికృష్టమైన నడత. దీనిని రంధ్రాన్వేషణము అందురు. రంధ్రాన్వేషణమువలన ఎవ్వరికిని లాభము లేదు. తప్పులు పట్టబడినవాడు తనయొక్క శీలమునందు తప్పులు ఉన్న యెడల దిద్దుకొనుటకు అస్పదము ఉండదు. అతనికి తెలియరా

లేదు. రంధ్రాన్వేషణము చేయువారు తప్పులుచేసినవానియొక్క వృద్ధినికోరి తప్పులు పట్టలేదు. ఆతప్పులనుగురించి యితరులతో వృథావాక్యము లాడిరిగాని అందువల్ల తమకే కలుగు చెరుపును గురించి యోచించలేదు. తప్పులనుగురించి చింతించినందున ఆ తప్పులతోడను అట్టి యితరతప్పులతోడను సంగము కలుగజేసికొని తప్పులుపట్టు గుణమును అభ్యాసపరుచుకొనుటయేగాక అట్టితప్పులు తన శీలమునందు ప్రవేశించుటకు ఆ సంగము కారణమగును. ఇది లోకులసంగతి. నివృత్తిమార్గమునందు అందులోను విహంగమార్గమునందు అంగీకృతసహాధ్యాయులు ఒకరి తప్పులనుగురించి మరియొక్కరు రహస్యముననో ఇతరులతోనో ప్రసంగించినయెడల తమ కత్తులతో తమ దేహములనే కోసికొందురు. ఈ మార్గమునందు జీవాత్మలందరును ఒకటే అను భావమును మొదటియందే తెలిసికొని అనుష్ఠానమునకు తెచ్చుకొనవలయును. వృథావాక్యములను ,, న తు వృథావాక్యం సముచ్చార్యతాం " అని మాటలాడి శక్తిని వ్యయపరచుట తప్పు అని తెలిసికొనవలసియున్నది. అనుష్ఠానమునకు తేవలసియున్నది. ఇంతేకాదు. రంధ్రాన్వేషణము వృథావాక్యము కాదు. గుణాన్వేషణమువల్ల లాభముకలదు. రంధ్రాన్వేషణము ఇరుప్రక్కలయందును చెరుపు కలుగజేయును. దూషించువాడు తాను ఏ తప్పులనుపట్టి దూషించెనో ఆ తప్పులను తానే చేయుటకు నేర్చుకొనునట్లు ఏర్పడును. తప్పులు పట్టపడినవానియందు ఆ తప్పులు ఉన్నయెడల అతడు తనను సవరించుకొనుటకు వీలులేదు. తప్పులు అతనియందు లేనియెడల తప్పులు పట్టినవానికే లేక తప్పులను చర్చించుకొనినవారికే పెద్దనష్టము కలుగును. అంగీకరించబడిన శిష్యుని శ్రీ గురుదేవులువారు తమ కార్యములకు ఇబ్బంది కలుగజేసినవాడని అతనిని అతడు చక్కపడునంతవరకును మినహాయించి యుంచుట తటస్థించును. ఇది పెద్దదౌర్భాగ్యము అని ౨౮౩ వ పుటయందు చెప్పబడియున్నది. కనుక సహాధ్యాయులు తప్పులు చేయుచున్నారు అని తోచినయెడల వారి సమక్షమున వారితప్పులు వారికి తెలియపరుచుటమంచిది. ఇందువల్ల దుష్కర్మ జనించదు.

ఉపాసకునియందుండు కొన్నిగుణములవల్ల కొంతదుష్కర్మ జనించుచుండును. ఆ గుణములలో కోపతాపము ఒకటి. ప్రకృత కాలమునందు మన చుట్టును ఉండువారు అనేక కారణములచేత అతృప్తిచెంది ఆశపడినవస్తువులు దొరకనందున వ్యాకులపడు చుండగా ప్రక్కయింటివారుగాని ఎవ్వరుగాని అసూయకలుగునట్లు నడుచుకొనిన మనకు కోపముకలిగి నిష్కారణముగా చూచినవారిపై నంతయు కోపగించుకొనుచుండుటను చూచుచున్నాము. ఇట్టి ఆవరణ ములయందు నివసించుచుండుటవలన వారలందరియొక్క కోపాగ్ని దీప్తమై అది ఉపాసకునికి కోపముకలుగునట్లు చేయును. కోపమునకు ఆస్పదమిచ్చినవాడు ఏకాలమునందు ఏ కార్యమును ఏ విధముగా చేయు నో అతనికి తెలియరాదు. అయినను కోపతాపములవల్ల దుష్కర్మ జనించును. కర్మక్షయమునకుగా కష్టపడి ప్రయత్నముచేయుచుండు ఉపాసకుడు కోపమునకు ఆతిథ్యమును ఇచ్చినందున క్రొత్తదుష్కర్మను పుట్టించును. కనుక కోపగించుకొనక జాగ్రతగా నుండవలయును.

స్వార్థత

స్వార్థతవల్ల క్రొత్తచెడుకర్మ జనించును. సోమరితనము ఒక తరహాస్వార్థత. తనకు సంతోషమును ఇచ్చు పుస్తకములు, నవలలు ఇట్టి వాటిని ఏకాగ్రమైన హర్షముతో చదువుచుండి కాలనియతి ప్రకారము నియమించుకొన్న కార్యమును మరిచి కాలాతీతదోష మునకు లోబడువారు కొందరు.

కౌశలము

"యోగః కర్మసు కౌశలం" అని గీతలయందు చెప్పియున్నది. అయినను కౌశలము లేకయే కార్యములుచేయుచు పదేపదే తప్పులు చేయుచు కాలహరణము చేయువారు కొందరు. వృథాగా కాలము పోగొట్టుటకూడ క్రొత్తచెడుకర్మను పుట్టించును. వృథాగా పోగొట్టిన కాలమునందు లోకోపకారకార్యమును దేనినైనను చేసియుండవచ్చు ను. అది చేయబడలేదు. ఇది న్యూనత.

మనోవ్యథ

మనోవ్యథవల్ల చేయవలసిన అనుష్ఠానాదులు సకాలమునందు క్రమముగా జరుగుటకు వీలుండదు. ఇది క్రొత్తచెడుకర్మను పుట్టించును. ఒకరు మనోవ్యథతో ఖిన్నులైయుండిన తన చుట్టునుండు వారికికూడ ఆ మనోవ్యథ వ్యాపించును. ఇతరులకు మేలునుకలుగ జేయుటయే వ్రతముగా నొప్పుకొన్న ఉపాసకుడు తన ఉద్దేశమునకు విరోధమైన ఫలమును కలుగజేసికొనును. ఈ తప్పువల్ల క్రొత్త చెడుకర్మ జనించును.

తొందర

తొందరఅను అభ్యాసము చెరుపును కలుగజేయును. తొందర మాటలు పనులు అభ్యాసపడినయెడల నిజమును మాటలాడుట సులభముకాదు. విహంగమార్గమునందు ఏమాటకు ఎంతఅర్థము కలదో అదంతయు ఉద్దేశించియే మాటలాడబడును. ఇతరులను గురించి అపహాస్యముగాని వారు తప్పులుచేసినారు అనిగాని తలచుటతప్పు. అట్టి అభ్యాసమును మానుకోవలెను అంటే ఆ మాటలకెంత అర్థముకలదో అంతటిని ఉద్దేశించియే చెప్పవలెను. తొందరవల్ల చెప్పినమాటలను సరిగా అర్థముచేసికొనలేరు. అందువల్ల ఉపాసకునికి నష్టముకలుగును. ఇట్టి తొందరవల్ల క్రొత్తదుష్కర్మ పుట్టును.

ప్రలాపన

తనకు సంభవించిన దుఃఖములను పదేపదే తలచుకొని ప్రలపించుటవల్ల క్రొత్తకర్మజనించును. పూర్వకర్మను క్షీణింపజేసికొనవలసిన సందర్భమునందు క్రొత్తదుష్కర్మను కలుగజేసికొనుటవల్ల లాభములేదు. ప్రలాపమువల్ల లాభములేకున్నను ఉపాసకుని మనస్సునందలి ప్రలాపస్పందములు దుఃఖపడుచున్నలోకులకు మరియు విశేషముగా దుఃఖపడుశక్తిని యిచ్చును. ఇతరులను తప్పుత్రోవకు లాగినకర్మ ఉపాసకునికి చేరినది.

నవ్వు

నవ్వును అణుచుకొనుశక్తిని సంపాదించవలయును. చిన్న వయస్సుగల బాలురు బాలికలు సంతోషపడుటకుగా నవ్వును పుట్టించు కథలను చదివి వానియందు నవ్వునకాస్పదమునిచ్చు విషయములనుగురించి నవ్వుట తప్పుకాదు. ఇతరులు వర్షాకాలమునందు అడుసుమార్గమునబోయి కాలుజారిపడినపుడు విమర్శజ్ఞానము లేని పెద్ద వయస్కులుకూడ నవ్వుటను చూచియున్నాము. విహంగమార్గగామికి ఇందువల్ల క్రొత్తకర్మజనించును. నవ్వు అపహాస్యమును చూపును. అపహాస్యము దుఃఖమును పుట్టించును. నవ్వును అణుచుకొనుటకు నేర్చుకొనుట మంచిది. నిష్కారణముగా నవ్వరాదు.

వృథావాక్యములు

వృథావాక్యములు గ్రామ్యసంభాషణములు అనునవి సోమరి తనమునకు గురుతులు. అవశ్యముగాచేయవలసిన కార్యములుచేసి శరీరము అలసటచెందియుండినపుడు లోకోపకారమును కలిగించు తలంపులుతలచుచు శరీరమునకు కొంతవిశ్రాంతిని ఇయ్యవలయు. మనస్సుతో పనిచేసినపుడు శరీరముయొక్క అంగములకు, మాంసవసాదిధాతువులకును కొంత విశ్రాంతిని ఇచ్చినవారమగుదుము. మనస్సునకు విశ్రాంతి అవశ్యములేదు. అటుగాక విశ్రాంతికాలమునందు లోకవార్తకు ఆస్పదమిచ్చినయెడల ఆత్మస్తుతి పరనిందఅను దురభ్యాసములకు కారణముకలుగును. లోకవార్తను విమర్శించి పరీక్షించినయెడల చాలమట్టుకు ఆత్మస్తుతియో పరనిందయోగానే ఉండును. కనుక లోకవార్త, గ్రామ్యసంభాషణము, వృథావాక్యములు ఇట్టి వాటిని 'న తు వృథావాక్యం సముచ్చార్యతాం' అను న్యాయప్రకారము మానవలయును. ఆవిధముగా చెడుకర్మను పుట్టించుట తగ్గును.

గర్వము

గర్వముఅను గుణమువల్ల ఇతరులను నికృష్టముగా చూచుటకు కారణము కలుగును. అదేవిధముగా ఇతరుల వ్యవహారములయందు

వారి అనుమతిలేకయే ప్రవేశించవలయునను ఆశగొనుటకూడ ఒక దోషము. ఇతరులు మనవ్యవహారములయందు ప్రవేశించుట మనకు ఇష్టము ఉండదు. అదేవిధముగా ఇతరుల వ్యవహారములయందు మనము ప్రవేశించకూడదు. ఇతరుల రహస్యములను వారి అనుమతిపొంది యైనను పొందకయైనను తెలిసికొనవలయునను ఆశ చాలచెడ్డది. సహాధ్యాయులు ఎట్లు వృద్ధికి వచ్చుచున్నారా అని కనుగొనుటకు ప్రయత్నించుటకూడ చాలతప్పు.

లోకసేవ

లోకసేవయందు ఇతరులతోకలిసి ఏకగ్రీవముగా పనిచేయుటకు ఇష్టపడకుండుటయైనను తనతో ఇతరులు కలియకూడదు అనుకొనుటయు పృథగ్భావమును చూపును. ఏకగ్రీవముగా పనిచేయు నభ్యాసమును నేర్చుకొనవలయును.

ఈ పైన వ్రాసినవన్నియు సామాన్యముగా స్వల్పవిషయములు అనవచ్చును. కాని వానివల్ల కలుగనష్టము చాలపెద్దది.

ఈ విధముగా విమర్శించి కర్మక్షయమును కలుగుజేయు త్రోవలను అవలంబించుకొనుచు క్రొత్తదుష్కర్మను కలుగుజేయు త్రోవలను వదులుకొనుచు తారకోపదేశము అను దీక్షను పొందుటకు పక్వమగుచు నుండవలయును.

తారకోపదేశము, దీక్షలు ఏవిధముగా నియ్యబడును, ఎన్ని దీక్షలు, ఇచ్చువారెవ్వరు, వాని విధానములు ఏవి, అను విషయములనుగురించి ఈ గ్రంథమునందు విచారించుట అవశ్యము అని నాకు తోచలేదు కనుక ప్రయత్నము చేయలేదు.

---

## ౬ వ అధ్యాయము

### ఉపసంహారము

జీవన్ముక్తులు అనగా స్థూలశరీరమునందు ఉండగానే మోక్షము యొక్క సుఖమును అనుభవించువారు. మోక్షమును సంపాదించి కొనినను బ్రహ్మలోకమునుండి మరలివచ్చి త్రిలోకి అనబడు భూలోక భువర్లోక స్వర్లోకములయందు ఇడుములబడుచున్న జనసమూహ మును తరింపజేయుటకు ప్రయత్నము చేయుచుండువారు. వీరలు విముక్తసంగులు. ముక్తులైనను చిన్నవయస్సునందు ప్రవృత్తిమార్గము నందు నేర్చికొనిన భూతానుకంప, ప్రియవాదిత మొదలగు గుణ ములను వృద్ధిచేసికొని నివృత్తిమార్గమునందు అన్నిభూమికలను దాటి జీవన్ముక్తిని సంపాదించి వారి పుణ్యతారతమ్యప్రకారము ఆధికారిక వర్గమునందు ఏతరగతియందు ఆధికారికులు కావలయునో ఆ తరగతి యందు అమరి మహీపీఠమునందుచేరి శ్రీ సనత్కుమారులవారి శిష్యప్రశిష్యులై లోకరక్షణచేయుచుండువారు. వీరికే సంసృతి బంధ ముక్తులు అనిపేరు. సంసృతిబంధముక్తులు అనగా సంసారబంధము నుండి విడువబడినవారు, జీవన్ముక్తులు. వీరినే ముక్తులు అందురు.

"ముక్తస్యేశ్వరరూపత్వాత్" అను న్యాయప్రకారము వీరలు ఈశ్వరుని శక్తితో సమానమయిన శక్తిని సాహసమును అనుకంపను కలిగి లోకులను రక్షించువారు.

> యస్యానుభవ పర్యంతా తత్త్వే బుద్ధిః ప్రవర్తతే ।
> తద్దృష్టిగోచరా స్సర్వే ముచ్యంతే స్వపాతకైః ॥
>
> (జీవన్ముక్తివివేకము)

ఏ ఉపాసకుని బుద్ధి పరమాత్మతత్త్వ వివేకమును (అనగాజీవన్ముక్తిని) పొందునో అట్టి పురుషునియొక్క (జీవన్ముక్తునియొక్క) కటాక్ష

వీక్షణకు గోచరించిన మనుష్యులందరును పరమపవిత్రులై సమస్త పాపములనుండి విముక్తిచెందుదురు.

ఈక్షణధ్యానసంస్పర్శైః మత్స్యకూర్మవిహంగమాః ।
పోషయంతి స్వకాన్ పుత్రాన్ తద్వత్పండిత నృత్తయః ॥

(జీవన్ముక్తి వివేకము)

మత్స్యములు తమపిల్లలను చూచిన మాత్రముననే పిల్లలు పెరుగు విధమున జీవన్ముక్తులు ఈక్షణముచేతనే మందాధికారులను వృద్ధికి తెచ్చి మధ్యమాధికారులుగా జేయుదురు. తాబేళ్లు తమ పిల్లలను మనస్సున చింతించుటచేతనే పిల్లలుపెరుగునట్లు జీవన్ముక్తులు మధ్యమాధికారుల వృద్ధినిగురించి చింతించుటచేతనే వారలను ఉత్తమాధికారులుగా చేయుదురు. పక్షులు తమపిల్లలను స్పృశించి తమయొద్ద నుంచుకొన్నందున పిల్లలుపెరుగునట్లు మధ్యమాధికారులుగానుండి ఉత్తమాధికారులుగా నయినవారిని తమ సామీప్యమందుంచుకొని ఉపదేశముచేసి హస్తమస్తకన్యాయముతో పైపదవికి ఎక్కింతురు.

ఈ ప్రకారము జ్ఞానదానముచేయు జీవన్ముక్తులసంఘము మహీపీఠము. ఈగ్రంథము ౧౪ వ పుటమొదలు జ్ఞానావతరణము, జగద్యాత్ర అను శీర్షికలక్రిందవ్రాసిన విషయములను మరియొకతూరి చదివినయెడల అచ్చట చెప్పినట్లు బహువిధముల మహీపీఠమువారు ఇప్పటికిని పనిచేయుచున్నారు అని తెలియును. ఇపుడు జీవన్ముక్తులైన ఆధికారికపురుషులు జీవన్ముక్తిని పొందకమునుపు లోకమునందు బహువిద్యలును వృద్ధిచేయుటకై అవతరించి "గృహాద్గృహం" అనినట్లు శరీరపాతానంతరము మరియొక్క శరీరమును ధరించి లోకసేవచేయుచుండిరి. వారలు ఇపుడు జీవన్ముక్తులై ముందువలెనే లోకోపకారమును చేయువారు కొందరు. బ్రాహ్మణధర్మమును నడుపువారు కొందరు; క్షత్రియధర్మమును నడుపువారు కొందరు. ఈ విధముగా మహీపీఠమునకుచేరి పనిచేయుచుందురు.

నాగార్జునాచార్యులు మొదలగు మహనీయులు ఇపుడు జీవన్ముక్తులుగానున్నారు. వారు జీవన్ముక్తినిచెందుటకు మునుపు భరత

ఖండమునందు జన్మించిచేసిన మహత్కార్యములను యోచించిన యెడల వారలిట్టివారని తెలియవచ్చును. ద్వైతము విశిష్టాద్వైతము అద్వైతములను దర్శనముల నిచ్చినవారల సంగతినిగురించి చెప్ప కూడదని బౌద్ధమతమునందు పన్నెకెక్కిన నాగార్జునాచార్యుల వారిని మనకు ఉదాహరణముగా తీసికొని కొంత వ్రాయుచున్నాను. నాగార్జునాచార్యులవారు ఇప్పటి అవతారమునందు కుటుహూమి మహర్షిగానున్నారు. ఆర్యసంగులనువారు ఇప్పటి జన్మమునందు జ్వాల్‌కూలు ఋషిగానున్నారు. నాగార్జునాచార్యులవారి జీవితమును గురించి శ్రీ ప్రఫుల్లచంద్రరాయిగారు వ్రాసినారని శ్రీ దువ్వూరి జగన్నాథశర్మగారు వ్రాసియున్నారు. ఆ వ్యాసమునుండి కొన్ని సంగతులు ఈ దిగువవ్రాయబడుచున్నవి. నాగార్జునాచార్యులవారు ఇప్పటికి ౧౩౦౦ సంవత్సరములనాడు ఘూర్జరదేశమునందు నివసించి యుండిరట. వారు కాశ్మీరదేశమునందు సంచరించిరట. (అప్పటి అనుబంధమువల్లనే కాబోలు ప్రకృతజన్మమునందు కాశ్మీరదేశపు బ్రాహ్మణవంశమునందు జన్మించిరి.) “సిద్ధనాగార్జునో నామ పురాసీత్ తాపసో మహాన్ । శాంతో దాంతో జితాత్మా చ నియతః ప్రయతః శుచిః ।” అని నాగార్జునాచార్యులవారిని వర్ణించియున్నారు. వారు మతస్థాపనాచార్యులవారు. ఆంధ్రులు వారిని ఆంధ్రులు అందురు. బౌద్ధమతమునందు హీనాయన మనియు మహాయనమని యు రెండుభాగములుగలవు. నాగార్జునాచార్యులవారు మహాయన శాఖను స్థాపించినవారు.

నాగార్జునాచార్యులవారు ఏలోహమునైనను బంగారముగా మార్చుశక్తిగలిగినవారని తెలియుచున్నది. యోగశక్తులు అనేకములు వారికి కలిగియుండినవని తెలియుచున్నది. రసతంత్రముపై అనేక గొప్పగ్రంథములనువ్రాసినారని వదంతి. అనేక మంత్రములను తంత్రములను తెలిసికొనియుండిన బౌద్ధమతసిద్ధులవారని తెలియుచున్నది.

ఇట్లు అనేకులు వివిధజన్మములనెత్తి మతవ్యవహారములందు పాల్గొనుచుండిరి. వారలలో ననేకులు ఇప్పుడు జీవన్ముక్తులై మహీపీఠములో చేరి అధికారపురుషులుగా పనిచేయుచుండువారు.

నాగార్జునాచార్యులవారును వారివలెనుండు ఇతరలును మహీ పీఠమునకుచేరినవారలును పెక్కువిధములైన మంత్రములను తెలిసిన వారును. లోకమునందు అనేకమంత్రములను ప్రయోగించి పూజలను వైద్యములను చేయుచుండినవారు.

మంత్రములు

అను విషయమునుగురించి ఈ గ్రంథమునందు వ్రాయతలచు కొని యుంటిని. విషయముపెద్దది. డెబ్బదియైదవ పుటయందు ప్రస్తావ వశమున కొన్ని సంగతులను చెప్పుటకు ప్రయత్నముచేసినను నాకు తెలిసినంతవరకైనను సమగ్రముగా వ్రాయుటకు అనుకూలించలేదు. మంత్రమహోదధియను గ్రంథమును అనేక తాంత్రికశాస్త్రములను పరిశీలించి వ్రాయవలసిన విషయము అతి బాహుళ్యముగా నున్నది. కొంతమట్టుకేవ్రాసి నిలిపినయెడల తనివితీరదు కనుక ఉత్తరోత్తర స్థూలశరీరమవకాశము నిచ్చినయెడల వ్రాయవలయునని ఎంచి ఇప్పటికి రెండుమంత్రములగురించి మాత్రము అతిస్వల్పముగా, చాలసంగ్రహ ముగా వ్రాయుచున్నాను.

మంత్రములనుగురించి వ్రాయునపుడు మంత్రజపము దానికి కావలసిన అంతర్యాగము, బహిర్యాగము, షోఢాన్యాసము, ప్రయో గము, ముద్ర, యంత్రము, ప్రయోజనము అను అనేక విషయములను గురించి వ్రాయవలసియుండును. అదంతయు భవిష్యత్కాలమునందు చింతించవలసిన విషయములే. ఇపుడు సంగ్రహముగా కొంత చెప్ప బడుచున్నది. జపమాలయు నిందుకు చేరిన ముఖ్యాంశమే.

మంత్రము శబ్దాత్మికము. శబ్దము అనగా చప్పుడు ధ్వని అని యర్థము. ధ్వని స్వరరూపముగా నుండును. ధ్వనిని స్వరమును అపే క్షించి స్పందములు ఏర్పడును. ధ్వనివల్ల కలుగుస్పందములు ఉచ్చ రించువారియొక్క ఉద్దేశమును సాత్త్వికగుణమును అనుసరించి వీర్య వంతములుగా నుండును. ఏకాక్షరమంత్రములుకొన్ని; బీజాక్షరములు కొన్ని. అవియును ఏకాక్షరములే. యంత్రములతో కలిసి ఉచ్చరింప బడు మంత్రములును ముద్రలతో కలిసి ప్రయోగింపబడు మంత్ర

ములును బహుబలము గలవి. మనుష్యులను బీజాక్షరోచ్చారణవలన కాపాడవచ్చును, లేదా చంపవచ్చును.

ఏకాక్షరమంత్రములలో సంయుక్తాక్షరములతో నేర్పడిన మంత్రములుకొన్ని. మంత్రములలో కొన్నిటికిని మరికొన్నిటికిని మిత్రారి భావములు గలవు. ఆ రహస్యములు అందరకు తెలియవు. తెలియక ఉపయోగించినపుడు ఒకటా ఉపద్రవము గలుగును. లేక ప్రయోజనము కలుగదు. కొందరికిని కొన్ని మంత్రములకును స్నేహము ఉండును. కొన్నిమంత్రములు కొందరికి శత్రుభావము కలవిగానుండును. మంత్రమును ఉపదేశించువారు పుచ్చుకొనువానికిని మంత్రమునకును సిద్ధారిచక్రము అను చక్రమును వ్రాసి పరీక్షించి సిద్ధముగా నుండినపుడే ఉపదేశించవలయును. తెలిసినవారి సహాయము కోరకయే స్వయముగా అచ్చుపుస్తకములనుండి చదివి మంత్రగ్రహణము చేయువారు తమకు లాభము సంభవించితే సంతోషమే. దుఃఖము సంభవించినపుడు ఎవరిని దూషించవలయును. హానికలిగితే అది తమయొక్క తప్పు అని తెలిసికొనవలయును.

మంత్రములు ‘ ఋష్యాదిచ్ఛందో దైవత-ఛందాంసి ’ అను విధానములు గలవి. అన్నిమంత్రములకును వినియోగము కలదు. దీనినే ఉద్దేశము అందురు. ప్రణవము అను సంయుక్తాక్షరరూపమైనది యొకటి ఏకాక్షరమంత్రము కలదు. ఈ మంత్రమును సృష్టికర్త సృష్ట్యాదియందు ఉపయోగించినట్లు శాస్త్రములయందు చెప్పబడియున్నది. లయకర్త లయప్రారంభమునందును ఉచ్చరించుననియు స్థితికర్త స్థితికాలమునందును ఉపయోగించును అని తెలియుచున్నది. ఒకటే ఏకాక్షరమంత్రమును ముగ్గురు మూడు పరస్పరవిరోధములయిన కార్యములలో నుపయోగించినట్లైతే ఆ మంత్రముయొక్క ఉచ్చారణమునందుగాని లేక ఉద్దేశమునందుగాని ప్రయోగమునందుగాని లేక యంత్రమునందుగాని భేదముండవలయును. కనుక మంత్రము ఒకటేయైనను పరిస్థితులు మారినపుడు ఫలము మారునని తెలిసికొనవలయును.

మంత్రములను ఉపయోగించినను మనశ్శక్తిని మంత్రముతో జతపరచనియెడల శక్తిచాలనందున ప్రయోజనము తక్కువగానుం

డును. మనశ్శక్తిని ప్రబలముగా నుపయోగించు శక్తికలవానికి మంత్రములు అవశ్యములుగావు. మనశ్శక్తితో చేయచాలిన కార్యమునకు మంత్రము సహాయకారిగా నుండును. ప్రబలమైన మనశ్శక్తిని ఉదారముగా సెలవుచేయుటకు బదులుగా కొంతమనశ్శక్తి కొంతమంత్రమును కలుపుకొనుటవల్ల మనశ్శక్తి అను ద్రవ్యమును మిగిల్చుకొనవచ్చును.

శీలము పరిశుద్ధముగా లేనివాడు ప్రణవమును ఉచ్చరించవలసినరీతిగా నుచ్చరించినయెడల ఉచ్చరించువానికి చెడుపుకలుగును. కనుక శీలము చాల ముఖ్యము. వినువారలకుకూడ చెడుపుకలుగును.

గాయత్రీమంత్రము బహు ఉన్నతమైన మంత్రము. "న గాయత్ర్యాః పరం మంత్రం" అని చెప్పబడియున్నది. భరతఖండమునందు అనేకవేల సంవత్సరకాలముగా గాయత్రీమంత్రము ఉచ్చరించబడుచువచ్చినది. అందువల్ల దేవతలకు ఆ మంత్రముచే తమను ఆహ్వానించుచున్నారు అను సంగతి వాడుకబడియున్నది. దేశమునకు అంతయు గాయత్రీపఠనమువల్ల శాంతికలుగును. ఈ మంత్రము ముఖ్యముగా నీలకంఠ సమూహ దేవతలను గుమికూర్చి తెచ్చును. ఈ మంత్రము సూర్యపరము నిజమే. జ్ఞానదృష్టితో చూచువారికి ఈ మంత్రపఠనమువలన కలుగుప్రయోజనము కనబడునట. సూర్యునుండి ఒకతేజస్సు శుక్లవర్ణముకలిసిన హేమవర్ణముగలదై జపముచేయువారిని ఆవరించునట. శుక్లవర్ణముతో హేమవర్ణముకలిసి ఆ రెంటితో నింద్రనీలవర్ణముకూడ కలిసికనబడునట. (ఈ అర్థము ధ్యానశ్లోకమునందున్నది). గాయత్రీ తేజస్సుయొక్క కిరణములు సూర్యుని కిరణములవలెనే లెక్కలేనన్నివిగా నుండునట. అందువల్ల లెక్కలేని జనులను ఆవరించగలదట. గాయత్రీ మహామంత్రముయొక్క మాహాత్మ్యవర్ణనను ఇంతటితో చాలించుట యుక్తము అని తోచుచున్నది. మంత్రములనుగురించి ఈగ్రంథమందు ఇంతకంటెనధికముగ వ్రాయనుద్దేశములేదు.

జీవన్ముక్తులు లోకమును పరిపాలించుచున్నారని చెప్పబడియె. ఆ సందర్భమునందు మంత్రోచ్చారణ కొంతసహాయకారి అనియు చెప్పబడియె. మంత్రముల విషయమునందును గాయత్రీ మహా

మంత్రమునుగురించి యుక్తమైనంతమట్టుకును విపులముగా చెప్పబడి యె. గాయత్రీమంత్ర జపమువల్ల ఏవిధములైన తేజస్సులు ఉద్భవించి లోకమును కాపాడునుఅను విషయమునుగురించి కూడ చెప్పబడియె. జీవన్ముక్తుల పైకి లోకమును కాపాడుటకై తపస్సుచేయుచుండువారు కొందరు. కపిలావతార సందర్భమునందు శ్రీమద్భాగవతమునందు చెప్పినట్టు కపిలమహామునిగారు "ఆస్తే యోగం సమస్థాయ" అని యోగమునందున్నారనియు "త్రయాణా మపి లోకానా ముప శాంత్యై సమాహితః" ముల్లోకములయొక్కయు ఉపశాంతికొరకై తపస్సుచేయుచున్నారు అనియు చెప్పబడియె. కపిలమహామునివలె అనేకులు తపస్సుచేయుచుండువారు. బదరికాశ్రమము, నైమిశారణ్యా మువెుదలగు క్షేత్రములయందు తపస్సుచేయుచు లోకశాంతిని ఇచ్చు మహనీయులు లెక్కకెక్కనన్నిమంది ఇప్పటికిని తపస్సుచేసి వారితపస్సువల్ల జనించు శాంతిని పోరుపోసిపెట్టుచుందురు. కొందరు ఆధికారికపురుషులు ఆ శాంతి అనురాశికి అధికారులుగానుండి దేశదేశ ములు, జనాంగములు ఇట్టివారికి వారికి అక్కరఉన్నట్టు శాంతిశక్తిని పంచిపెట్టుచుందురు. ఇట్లు లోకమును పాలించు జీవన్ముక్తసమాజము ఉన్నది కనుకనే లోకము ఈ మాత్రము క్షేమముగానున్నది. వై రాగ్యమును సంపాదించి నివృత్తిమార్గమునుచేరి అందులోనును విహం గమార్గమును అవలంబించువారు త్వరగా జీవన్ముక్తు లగుదురు. వారు ముందు ఒకానొకపుడు ఆధికారికవర్గమునుచేరి ఎచ్చటికి ఏకాలము నందు తమ అధికారియగు శ్రీ సనత్కుమారులు పొమ్మని నియ మింతురో అచ్చటికివెళ్లి ఆ యా ఉద్యోగములను నడుపుచుందురు.

కాబట్టి మనవంటివారును సర్వజీవాత్మైక్యభావమును ప్ర యోజనముగా గల జ్ఞానమార్గమునందు చరించుచు అందులో విహంగమార్గమును చేరి శ్రీ సనత్కుమారులవారి భృత్యవర్గము నందు పాల్గొని కృతార్థులగుదుమని కోరుచు ప్రయత్నము చేయు చుండవలయును.

విహంగమార్గమునందు కొన్ని అసందర్భములు గలవు. ఈ మార్గమునందు జీవన్ముక్తులు గురువులవారై యుందురు. సాధారణ

గురువులు ఎరుగని రహస్యములు జీవన్ముక్తులకు తెలిసియుండును. శిష్యుడు ఏ అంశకు చేరినవాడు అని తెలిసి మంత్రముల ఉపాసనలు మొదలగువాటిని నియమింతురు. అందువలనకలుగు ఇబ్బంది యేమి అని విస్మయపడవచ్చునుగదా. సాధారణ నివృత్తిమార్గమునందు “మధులుబ్ధో యథా భృంగః పుష్పాత్ పుష్పాంతరం వ్రజేత్ । జ్ఞానలుబ్ధః తథా శిష్యః గురోః గుర్వంతరం వ్రజేత్ ॥ అని ఒక గురువునొద్ద కొంతనేర్చికొని మరికొంత తెలిసికొనగోరి మరియొక గురువునొద్దకు శిష్యుడు పోవును. ఇందువల్ల ఆ మార్గమునందు చాల ప్రత్యవాయము కానరాదు. ఆ మార్గము “క్షురస్య ధారా నిశితా” అని కత్తిమీదిసాము కాదు. కనుక చెరుపు ఉండదు. విహంగ మార్గయాత్ర కత్తిమీది సామే అగును. కనుకనే “ఏకగురూపాస్తి రసంశయః” అని సూత్రము ఏర్పడియున్నది. “న దేయం పర శిష్యేభ్యః దేయం శిష్యేభ్య ఏవ చ” అనియు “లబ్ధ్వా సుగురుం సమ్యక్ న గుర్వంతర మాశ్రయేత్” అనియు విధివాక్యములు శాస్త్రములయందు గలవు.

శ్రేయస్సునుకోరిన శిష్యుడు గురూపసత్తిచేయు సమయము నందు “మంత్రాగమాది చా న్యత్ర శ్రుతం నాథే నివేదయేత్ । గుర్వాజ్ఞయా తత్ గృహీయాత్ త దనిష్టం వివర్జయేత్ ॥ ఇతర గురువులయొద్ద నేర్చుకొనిన మంత్రములు మొదలగువానిని గురువుల వారికి సమర్పించి వారు అనుజ్ఞయిచ్చిన మంత్రములనే జపించ వచ్చును. వారు అనుమతి నొసంగనివాటిని వదులుకొనవలయును. గురుదేవులవారు నిరాకరించు మంత్రములు హేయములుగా నుండవు. కాని ఈ శిష్యునికి శ్రేయోదాయకములు కావు. కనుకనే గురుదే వులవారు ఒప్పుకొనలేదు.

విహంగమార్గమందుకూడ గుర్వంతరములను కోరువారిని మంత్రాంతరములను ఉపాసనచేయువారిని కొందరిని చూచియున్నా ము. అది తప్పు అని స్పష్టముగా చెప్పబడియున్నది. ఫలావాప్తి యుండదుగాని కీడు కలుగలేదు. శ్రద్ధ అను సాధనమును సరిగా నభ్యసించినవారు మంత్రాంతరములను గుర్వంతరములను కోరరు.

ఇట్లు అతిజాగరూకతతో ప్రవర్తించవలయును. లోకసేవ మనసా వాచా కాయములచేత తప్పక నడుపుచుండవలయును. ఇదే జ్ఞానమార్గమునందు నిష్ఠ.

ప్రతి మనుష్యుడును సత్త్వరజస్తమోగుణముల త్రివృత్కరణముయొక్క కోట్లానుకోట్ల విధములైన భాగములలో ఏదో ఒక భాగమునకు చేరినవాడు. త్రివృత్కరణము అనగా

రజస్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।
రజ స్సత్త్వం తమ శ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా ॥

కొందరియందు రజోగుణము ఇతర రెండుగుణములను మించియుండును. అట్లే మరికొందరియందు తమోగుణము మిగిలిన రెండు గుణములను మించియుండును. అదేవిధముగా ఇతరులయందు సత్త్వగుణము మిగిలిన రెండుగుణములను మించియుండును. ఇట్లు పెనగొనుటవల్ల అనేకకోట్లభాగములు ఏర్పడవచ్చును. ఒక్కొకరును, ఒక్కొకవస్తువును ఇట్టి త్రివృత్కరణభాగములలో నొకటికి చేరియుండుట పెద్దరహస్యము. మనుష్యులవలెనే మంత్రములుకూడ సూక్ష్మ, సుసూక్ష్మ, సూక్ష్మాతిసూక్ష్మ, సూక్ష్మతర త్రివృత్కరణ తరగతులకు చేరియుండును. ఇదేవిధముగా ధారణాయోగముకూడ త్రివృత్కరణమునకు చేరియుండును. ఇందువల్లనే మంత్రములకును ధారణలకును సిద్ధారితరగతులు ఏర్పడియున్నవి. సిద్ధారితరగతులు అనగా పరస్పరస్నేహము, విరోధము. కొందరిస్వభావమునకు భ్రూమధ్యభాగమున ధారణ అనుకూలము. కొందరికి హృత్పుండరీకధారణ మంచిది. ఈ రహస్యములను తెలిసిన గురువులవారేకదా మనకు కావలయును. గురువులయొక్క పాండిత్యమును జ్ఞానమునుకూడ వైద్యులలోవలె భేదములుకలిగియుండును. కాబట్టి శిష్యునితరింపజేయు ప్రతిగురువును ఇంతకుముందు శిష్యుడు ఏయే మంత్రములను ఉపదేశముపొందియుండునో, ఏయే ఉపాసనలుచేసియుండునో ఆ వివరములను తెలిసికొని అట్టి వాటిని అంగీకరించుటయో వర్జించుటయో చేయవలసియుండును. ఇందువల్లనే ఏకగురున్యాయము ఏర్పడి

నది. గురువులవారి అహంభావమువల్ల ఏర్పడిన భావనకాదు, శిష్యుని శ్రేయస్సుకుగా ఏకగురూపాస్తిన్యాయము ఏర్పడినది.

శ్రీ గురుదేవులవారికి భవరోగవైద్యులుఅని యొకపేరు. “ఆనంద మానందకరం ప్రసన్నం జ్ఞానస్వరూపం నిజబోధయుక్తం। యోగీంద్ర మీడ్యం భవరోగవైద్యం శ్రీమద్గురుం నిత్యమహం నమామి॥ అను శ్లోకమునందు భవరోగవైద్యులుఅని చెప్పబడియున్నది. భౌతికశరీరమునకు రోగముప్రాప్తించినపుడు ఔషధసేవ చేయుచు దానికితగిన పథ్యమును అనుష్ఠించినపుడే ఆరోగ్యసిద్ధి కలుగును. ఆ విధముగా భవరోగముయొక్క నివారణకావలెనంటే అనేక నిబంధనలకు లోబడి ఉపాసనమొదలగు వాటిని తప్పక ఆచరించవలయును. ఇది కఠినముకాదు. పైనచెప్పిన ఏకగురూపాస్తిమొదలగు నిర్బంధసహితమైనను విహంగమార్గము ఆచరించతగినదే యని నా అభిప్రాయము. పరమాత్మయొక్క అంశమైన జీవాత్మ తన మూలపురుషుడైన ఈశ్వరునివలెనే అపారశక్తికలదిగానున్నది. మోహముఅను చీకటి నివారణకాగానే జ్ఞానముఅను వెలుతురు ప్రకాశించును. సూర్యునికప్పియున్న మేఘములు తెరప ఇయ్యగానే సహస్రాంశులైన సూర్యుడు ప్రకాశించురీతిగా జీవాత్మయొక్క అపారశక్తి ఎన్నటికిని తగ్గదు. కనుక “అంత ర్నిరంతర మనింధన మేధమానే మోహాంధకారపరిపంథిని సంవి దగ్నౌ” శరీరమునందు ఎల్లపుడును సమిత్తులుమొదలగు వంటచెరుకులు లేకనే వెలుగుచుండెడిదిని మోహాంధకారములకు విరుపుగా ప్రబలుచుండునదియునగు సంవిత్తుఅను అగ్నియందు సకల అంతరాయములను హోమముచేసి అనగా నాశముచేసి జీవాత్మ (ఉపాసకుడు) తన నైజశక్తిచే ఉపాసనను జరిపి విహంగమార్గముయొక్క లక్ష్యమైన జీవన్ముక్తిని సంపాదించి ఆధికారికపురుషవర్గమునందుచేరి లోకమును కాపాడుటకు హర్షముగలవాడుగా నుండవలయును.

కనుక ఉపాసకుడు

ఆపత్సు సంపత్సు భవాభవేషు శాంతైవమజా హర్షవిషాదసంవిత్।
సామ్యా దహంభావవిదా విముక్తా యథాస్థితం తిష్ఠ విలీయమానః॥

ఓ రామా నేనుచేసిన సౌమ్యములైన ఉపదేశముల బలమువల్ల అహం భావమును వదిలి సంపత్తులు కలిగినపుడుగాని విపత్తులు సంభవించి నపుడుగాని ఏమణ హర్షము విషాదము మొదలగువాటికి లోబడకయే ఉప్పొంగకయు కృశించకయు నిన్ను నీవు తెలిసికొనియుండుము. ప్రతికారణమునకును కార్యము ఒకటి సిద్ధముగానున్నది అను నమ్మకముతో ఉపాసన అను కారణమును బలపరుచుకొనుచు జీవన్ముక్తి అను కార్యమును శిష్యుడు ఎదురుచూచుచు హర్షముతో నుండవలయును.

ఓం శ్రీ గురుదేవాయ నమః. బ్రహ్మవిద్యా సభాపతి అని ప్రసిద్ధికెక్కిన శ్రీ సనత్కుమారులవారికి నమస్కారములు.

ద్విషడ్భుజం షణ్ముఖ మంబికాసుతం !
కుమార మాదిత్య సమాన తేజసం ।
వందే మయూరాసన మగ్నిసంభవం ।
సేనాపతిం దేవ మభీష్ట సిద్ధయే ॥

కనకకుండల మండిత షణ్ముఖం ।
వనజరాజ విరాజిత లోచనం ।
నిశితశస్త్ర శరాసన ధారణం ।
శరవణోద్భవ మీశసుతం భజే ॥

శ్రీ కృష్ణార్పణమస్తు





Printed by A. K. Sitarama Shastri, at the Vasanta Press, Adyar, Madras